భక్తిరస

# శతకసంపుటము



చెన్నపురి:
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే
ప్రకటితము.
1926.

# ప్రకాశకుల విజ్ఞప్తి

సహృదయులారా!

ఆంధ్రవాఙ్మయమునఁ బేరెన్నికగన్న శతకములను విషయములనుబట్టి విభాగములు గావించి సంపుటములుగఁ బ్రచురింపఁ దలంచి యనేకశతకములను ముద్రితాముద్రితముల నార్జించి శుద్ధప్రతులు పీఠికలు వ్రాయించి సిద్ధపఱచితిమి. శ్రీయుత గురుజాడ అప్పారావుగారిద్వారా మాయుద్యమమును విని శ్రీవిజయనగర సంస్థానాధీశ్వరులగు మీర్జా శ్రీరాజా శ్రీపూసపాటి విజయరామగజపతి మహారాజా మన్నెసుల్తాన్ బహదర్ వారు కాగితములవ్యయము భరించి శతకసంపుటముల ప్రచురణమునకుఁ దోడుపడుదుమని వాగ్దాన మొనరించి మమ్ము సర్వవిధములఁ బ్రోత్సహించి మాయుద్యమముపై సానుభూతిఁ జూపిరి.

కాని, శతకకవులచరిత్రము వ్రాయుచు శ్రీవంగూరు సుబ్బారావుగారు మాయొద్దనుండి శతకప్రతులు దీసికొని తిరుగ నొసంగక యెన్నిపర్యాయములడిగినను ఇదిగో అదిగో యని మాకీయకపోవుటచే సంకల్పించిన శతకసంపుటప్రచురణమునకు శ్రీవిజయనగర మహారాజావారి తోడ్పాటుపొందుటకు అంతరాయముకలిగినది. వ్యయప్రయాసములకు లోనై వ్రాయించినప్రతులు గైకొని పని

ముగిసినను తిరుగ నాసంగకపోవుటకేగాక వంగూరు సుబ్బారావుగారు కీర్తిశేషులగుటకుఁ గూడ విచారించి మరల మొదలెత్తి చిరకాలముక్రిందట సంకల్పించిన శతకసంపుటప్రకటన మిప్పటికి సాగించితిమి. క్రమముగ వేలువేలుసంపుటములుగ భక్తి, శృంగార, నీతి, మతవిషయశతకములతో నింకఁ గొన్ని సంపుటములను బ్రచురింపనున్న మాయుద్యమమున కాంధ్రమహాజనులతోడ్పాటవసరము.

ఈసంపుటమునందు ముద్రితాముద్రితశతకములు రమారమి 20 సమకూర్చితిమి. ఇందలి యముద్రితశతకము లన్నియుఁ బ్రచురణార్థము మాకొసంగుటయేగాక శతకములనన్నింటిని సంస్కరించి విపులములగు పీఠికలువ్రాసి శ్రీ శేషాద్రిరమణకవులు, శతావధానులు తోడ్పడుటచే నిప్పటి కీసర్వాంగసుందరమగు భక్తిరసశతక మొదటిసంపుటము ప్రచురింపఁ గలిగితిమి.

ఆంధ్రమహాజనుల యాదరణ ప్రోత్సాహములఁ బట్టి కడమసంపుటములనుగూడఁ ద్వరలోఁ బ్రచురించుటకుఁ బ్రయత్నింప నున్నారము.

తండయార్పేట,
చెన్నపురి.
1-3-1926.

ఇట్లు,
వావిళ్ల, రామస్వామి శాస్త్రులు
అండ్ సన్స్.

# విషయసూచిక

# పీ ఠి క.

ఈవృషాధిపశతకమును వీరశైవమతస్థాపకుఁడగుబసవేశ్వరుని లీలల నభివర్ణించుచు నాంధ్రకవులలోఁ బేరెన్నికగన్న పాలకుఱికి సోమనాథమహాకవి రచించెను. ఇందు వర్ణింపఁబడిన బసవేశ్వరుఁడు నందీశ్వరునియంశమువలన నొకపుణ్యదంపతుల కుదయించి పసితనముననే సమస్తవిద్యాపారంగతుఁడై యుపనయనాదిబ్రాహ్మ్యధర్మము లుల్లంఘించి సంగమేశ్వరాలయమున నీశ్వరసాక్షాత్కారమునొంది వీరశైవమతప్రచారము చేయ బయలువెడలి స్వప్రతిభాతిశయమువలనకల్యాణపురరాజ్యము పరిపాలించు బిజ్జలునివద్ద మంత్రిగాఁ బ్రవేశించి మతాభివృద్ధిఁ జేయసాగెను.

బిజ్జలుఁడు జైనుఁడగుటవలన బసవేశ్వరునకు బిజ్జలునకుఁ ద్వరలో విరోధము పొసంగెను. పిదప బసవేశ్వరుఁడు మతాభినివేశపరవశులగు జంగముల సహాయముచే బిజ్జలుని జంపించి జైనుల నిర్మూలముగావింపఁజేసి వీరశైవమతము ప్రపంచమున సాట బయలువెడలెను. బసవేశ్వరుని సమకాలికులలో అల్లమప్రభువు, చెన్నబసవన్న, మల్లికార్జునపండితారాధ్యులు మిగుల సుప్రసిద్ధులు. మల్లికార్జునపండితారాధ్యులశిష్యుఁడే యీపాలకుఱికి సోమనాథమహాకవి.

సోమనాథకవి యాంధ్రసంస్కృత కర్ణాట భాషలలో నుత్తమగ్రంథములు పెక్కురచించెను. అన్నియు మతవిషయికములే. ముఖ్యముగ బసవేశ్వరుని లీలావతారాదులను బసవపురాణములోఁ గొనియాడి దానితోఁ దనివినొందక పిదప నీశతకమును రచించి తనయప్రతిమానభక్తిని లోకమునకుఁ దెలుపుకొనెను. సోమనాథుఁ డీశతకమునఁ దనకవితను పెక్కుతెఱంగుల నలంకరించెను "బసవన్న దండనాయకునకు" అను సోమనాథుని పద్యపాదమువలన బసవేశ్వరుఁడు రాజకీయముగఁ గూడ సుప్రసిద్ధుఁ డనుట విశ్వసనీయము.

సోమనాథకవి కాకతీయరుద్రదేవునికాలమున నుండెను. ఇతనినిఁ దరువాతిశైవకవులు దైవస్వరూపముగా భావించినటుల గ్రంథాదికమువలనఁ దెలియుచున్నది. ఈశతకమువలన సోమనాథుని నిరర్గళకవితాధారయు సుప్రసిద్ధులగు వీరశైవమతనిర్మాతలచరిత్రములు బసవేశ్వరుని దైవలీలలు కవికిఁగల బహుభాషాపరిచయము సువ్యక్తము కాఁగలదు. కవి క్రీ. శ. ౧౧౯౦. ప్రాంతమున గ్రంథరచనమొనరించుచు సుప్రసిద్ధుఁడై యుండెను. ఇతఁడు నిజాము రాష్ట్రములోని ఓరుగల్లుచెంతగల పాలకురికిలో సిద్ధినొందెను. కాన నితఁడు నిజామురాష్ట్రకవి.

నందిగామ. శేషాద్రిరమణకవులు.

3

పాలకురికి సోమనాథకవివిరచిత

# వృషాధిపశతకము



ఉ. శ్రీగురులింగమూర్తి సువిశేషమహోజ్జ్వలకీర్తి
సత్క్రియో,ద్యోగకళాప్రపూర్తి యవధూతవు
సద్భవజార్తి పాలితా,భ్యాగతసంశ్రితార్థికవిపండి
తగాయకచక్రవర్తి దే,వా! గతి నీవె మాకు
బసవా! బసవా! బసవా! వృషాధిపా. 1

చ. ప్రమథవిలోల భక్తపరిపాల ధురంధరశీల సంత
తా,స్తమితసమస్తదేహగుణజాల! సుఖప్రదలీల
లింగజం,గమమహిమానుపాలగతకాలసమంచిత
నాదమూలదే,వ మముభరింపుమయ్యబసవా...

ఉ. అప్రతిమప్రతాప సముదంచిత నాదకళాకలాప
దీ,ప్తప్రమథస్వరూప శివభక్తగణాత్మగతప్రదీప
ధూ,తప్రబలేక్షుచాప విగతప్రకటాఖిలపాప లిం
గత,త్త్వప్రద నీవె దిక్కు బసవా... 3

ఉ. భక్తిరసాభిషిక్త భవపాశవితానవిముక్త జంగ
మా,సక్త దయానుషక్త తనుసంగతసౌఖ్యవిరక్త

సంతతోద్యుక్త గుణానురక్త పరితోషితభక్త
శివైక్యయుక్త ప్రశస్త్యక్తమ నీవె దిక్కు బసవా.

ఉ. శత్రులతాలవిత్ర గుణజైత్ర భవాబ్ధివహిత్ర
జంగమ,క్షేత్రవిచిత్రసూత్ర బుధగీతచరిత్ర శిలా
దపుత్రసత్పాత్ర విశుద్ధగాత్ర శివభక్తికళత్ర
శరణ్య మయ్య భాస్వత్త్రిజగత్పవిత్ర బసవా...

ఉ. త్ర్యక్షసదృక్షసంచితదయాక్షశివాత్మకదీక్షసత్ప్రి
సాదాక్ష ప్రతాపశిక్షితమహాప్రతిపక్ష మహో
క్ష భూరిక,ర్మక్షయదక్ష జంగమసమక్షమభక్తిప
రోక్ష లింగ త,త్త్వక్షము నీవె దిక్కు బసవా...

ఉ. అక్షయభక్తిపక్ష బసవాక్షర*పాఠకకల్పవృక్ష
రు,ద్రాక్షవిభూతివక్ష ఫలితార్థముముక్ష శివప్ర
యుక్తఫా,లాక్ష కృపాసమంచితకటాక్ష శుభాశు
భపాశమోక్ష త,త్త్వక్షము నీవె దిక్కు బసవా.

ఉ. ఆర్యవితానవర్య భువనాధికశౌర్య యుదాత్తస
త్పదా,చార్య యవార్యవీర్య బుధసన్నుతచర్య
విశేషభక్తిధా,త్పర్య వివేకధుర్య పరిపాలితతుర్య
శరణ్యమార్యదు,ర్వార్య యనూనధైర్య బసవా.

ఉ. తజ్ఞజితప్రతిజ్ఞ యుచితప్రమథానుగతజ్ఞ నమ్ర
దై,వజ్ఞకళావిధిజ్ఞ బలవచ్ఛివభక్తిమనోజ్ఞ ధూత

---

* సాధక.

శ్రాప్రజ్ఞసునాదపూరితరసజ్ఞ తృణీకృతపంచయజ్ఞ
సర్వజ్ఞ శరణ్య మయ్య బసవా... 9

ఉ. క్షీణజనప్రమాణ యశికృత్తకుయంత్రకఘోణ
జంగమప్రాణ విసర్జితప్రసవబాణ సమంచితభక్తి
యోగసంత్రాణ కళాప్రవీణ శివధర్మరహస్యధురీ
ణ దత్తనిర్వాణ శరణ్య మయ్య బసవా... 10

ఉ. గానరసప్రవీణగతకాలవితాన సమస్తభక్తసన్మాన
మహాకులీన యసమానచరాచరరూపభేదసంధా
నజితాభిమాన తనుధర్మవిహీన మహాప్రధాన దే
వా ననుఁ గావుమయ్య బసవా... 11

ఉ. లింగమయాంతరంగ గురులింగపదాంబుజభృంగ
సత్ప్రసాదాంగ కృపాపరిస్ఫురదపాంగ విముక్త
భుజంగ జంగమోత్తుంగ జితాభిషంగ గతదు
ష్కృతభంగ మదీయలింగనిస్సంగడ మేఁజుమయ్య
బసవా... 12

ఉ ఉత్తమభక్తివృత్త భజనోత్సుకచిత్త యుదాత్త
చిత్సుఖాయత్త క్రియాప్రమత్తనిఖిలాగమవేత్త
గుణోపయుక్తసద్వృత్త ప్రసాదభోగసముదీర్ణ
విశేషసుఖప్రమత్త సర్వోత్తమ నీవె దిక్కు బస
వా... 13

ఉ. దేహజవైరివాహ శివదీపితదేహ సుఖప్రవాహ

ని,ర్మోహావినమ్రసంయమిసమూహా లసద్గుణగేహ
సంతతో, త్సాహ నిరీహ జంగమవితానదయావి
హితావగాహ ని,ర్వ్యాహము నీవె దిక్కు బసవా.

ఉ. న్యాసఫలానివాస దరహాసముఖప్రతిభాస దత్త
కై, లాస విశేషజంగమవిలాస శివైక్యసమాస
నిర్జితా, యాస సమస్తభక్తహృదయాంబుజనిత్య
నివాస ధిక్కృత, వ్యాస శరణ్యమయ్యబసవా...

ఉ. రాగపరోపభోగ గతరాగ విధూతభవాదిరోగ
ని, ర్యాగ మహానురాగ బహిరంతరనిష్ఠితయోగ
సత్క్రియో, ద్యోగ యకర్మయోగ శివయోగ
సమగ్రసుఖాతిభోగ దే,వా గతినీవె మాకు బస
వా... 16

ఉ. శీలలతాలవాల యపశిష్టభవప్రతికూల లాలితో,
త్తాల గుణానుకూల శివధర్మమతప్రతిపాల నిత్య
స, ల్లీల యశోవిశాల చరలింగసుఖోదయకాల
జియ్య దే, వా లలిఁ బ్రోవుమయ్య బసవా...

ఉ. కామితభక్తిభామ గతకామ మహాగణసార్వభౌ
మ ని, స్సీమ యశోభిరామ సవిశేషవిముక్తిల
లామ సద్గుణ, స్తోమ శివైక్యధామ సుఖదుఃఖవి
రామ ప్రమోదసీమ దే,వా మముఁ గావుమయ్య
బసవా... 18

ఉ. సాధితజన్మబాధ గతసర్వనిషేధ *ఘాతాపరాధ
దు, రోద్భధకళానిరోధ పరిపోషితశాంభవవేధ
వర్జిత,క్రోధ నిరాకృతాఖిలవిరోధ శివైక్యసుబోధ
యీాభవ, వ్యాధికి నీవె మందు బసవా... 19

ఉ. శ్రీవిలసత్ప్రభావ †ప్రవిశిష్టపరాజితసర్వదైవ స,
ద్భావయుతస్వభావ శివతత్త్వవిశిష్టమహానుభావ
యం, హోవనదావ పాలితమహోద్ధతశైవ
విభుండ వీవ దే, వా వరదానశీల బసవా... 20

ఉ. ఆద్య సమర్పితాఖిలపురాతనభక్తగణానువేద్య
సం, పాద్యగుణానవద్య యనుభావశివాంకితగద్య
పద్య ని, ర్భేద్య గణైకవేద్య యురరీకృతవాద్య
భవాదిరోగస, ద్వైద్య శరణ్య మయ్య బసవా.

ఉ. నాదకళావినోద యభినందితవేద హ్రాతాపవాద
సం, పాదితభక్తిమోద బుధవందితపాద చిరప్ర
మోద యా,స్వాదితసుప్రసాద యవిషాదశిలా
దసుతావిభేద దే,వా దయఁ జూడు మయ్య
బసవా... 22

ఉ. కాయగుణావిధేయ జితకాయ వినమ్రజగన్ని
కాయయా,మ్నాయవచోఽప్రమేయయసమాన
సమంచితగేయ భక్తిధా, రేయ సదానపాయ

---

* జితాన్యగాథ. † వ్రత.

సుచరిత్రసహాయ జితాంతకాయ దేవా యొడ
యండ వీవ బసవా... 23

ఉ. స్వీకృతభక్తలోక యవశీకృతకర్మశివాపదూక
యూ, రీకృతసద్వివేక యురరీకృతజంగమభక్తి
శూక దూ, రీకృతదుష్టపాక యధరీకృతవేదవిరు
ద్ధబౌద్ధచా, ర్వాక శరణ్యమయ్య బసవా... 24

ఉ. నిత్య యుదాత్తసత్య యతినిశ్చలజంగమభృత్య
సజ్జన,స్తుత్యకృపాకటాక్ష పరిశోభితచైత్య మహే
శభక్తిసం,గత్యభిరామసత్య గురుకార్యపరాయణ
కృత్య వర్జిత, వ్రాత్య శరణ్యమయ్య బసవా...

ఉ. ధన్య మహావదాన్య గతదైన్య విధూతజఘన్య
భక్తిచై, తన్య గుణైకమాన్య హతదర్పకసైన్య
నిరస్తమాతృకా, స్తన్య జితారిఘోరభవజన్య
శరణ్యము చిత్సుఖాత్మభా, వాన్య శరణ్య
మయ్య బసవా... 26

ఉ. చర్వితశృంగగర్వ గుణసంపదఖర్వ యపూర్వగీ
తగాం, ధర్వ దిగంతపూర్ణ సముదాత్తయశఃకృత
కర్ణపర్వ యం, తర్వనిష్ఠశర్వ విదితస్ఫుర
ణాంచిత *దర్వకావుమో, పర్వఘనప్రపాద
బసవా... 27

* దర్పకోటమా పర్వఘనప్రపాద, పర్వఘనప్రపాద.

ఉ. ఖ్యాత దయాభిజాత విపదంబుధిపోత యజాత
తత్త్వవిని, శ్రేత వినీత భక్తిపరిణేత మనోరథదాత
జంగమ, స్తోత ముముక్షుగీత పరిశోభితనీతిస
*మేత సద్గుణ, వ్రాత శరణ్యమయ్య బసవా...28

ఉ. మారమదాపహార సుకుమారశరీర గణప్రసా
దవి, స్తార వృషావతార సముదారవిహార †నమ
ద్దయాపరి, ష్కార శుభప్రకార యవికార మహా
జగదేకవీర దు, ర్వార శరణ్యమయ్య బసవా...

ఉ. దేశికజన్మదేశ యవిదేశ యనావృతపాశ సంహృ
త,క్లేశ మహాప్రకాశ కృతకిల్బిషనాశ దయాని
వేశ నం, దీశనికాశ జంగమసమీహితకారిగు
ణావకాశ దే,వా శరణియ్యవయ్య బసవా...30

ఉ. ఉద్ధతభక్తసమృద్ధ వినుతోత్తమసిద్ధ పరీతజంగమ,
శ్రద్ధ సదాత్మశుద్ధ గుణరాజిసమృద్ధ విముక్తపా
శసన్నద్ధ మహాప్రసిద్ధ యగుణత్రయబద్ధ శరణ్య
మయ్య భా, స్వద్ధతచిత్ప్రబుద్ధ బసవా... 31

ఉ. నందితభక్తబృంద యవినాశిరదాంశుముఖార
విందa †సా, నంద వినీతికంద కరుణామకరంద

* సముద్దయా. † యానందవిలీయమానకరుణా.

రణోపలాలిత, స్కంద యుదాత్తభక్తితరుకంద
యశోజితకుంద నాకరా, ద్వందిత నీవె దిక్కు
బసవా... 32

ఉ. లౌల్యపరాయణాత్మగుణలౌల్య యమూల్య పదో
పయుక్తని,ర్మాల్య వినీతికల్య యసమానదయా
రసకుల్య నిత్యనై,ర్మల్య యమూల్య దుష్టజనమా
నసశల్య పదాబ్జలబ్ధకై, వల్య శరణ్య మయ్య
బసవా... 33

చ. గురుపదపద్మసద్మ యవికుంఠితజంగమశీలఖేల సు,
స్థిరమృదుపాదమోద సముదీర్ణవిశేషమహత్వత
త్త్వని, ర్భరభుజశౌర్యధుర్యపరిరంభితభక్తికళత్ర
గోత్రమ, ద్వరద శరణ్య మయ్య బసవా...34

చ. భువనహితార్థతీర్థ భవభూరుహశాతకుఠారధా
ర గౌ, రవసముదాత్తవృత్త యనురాగరసా
మృతసారపూర శాం, భవమయవేదబోధ శివభ
క్తహృదబ్జవికాసభాస దే, వ వరద కావుమయ్య
బసవా... 35

చ. వినుతనవీనగాన గుణవిశ్రుతభక్తవిధేయ కాయ
య, త్యనుపమగణ్యపుణ్య నయనాంచల*దూర
భవోపతాప స, ద్వినయవికాసభాస సముదీర్ణశి

---

* మారమదోపతాప...భావసముదీర్ణవిశాలశివైక్యపాల.

వైకసుఖైకపాళ దే, వ నను భర్తింపుమయ్య
బసవా... 36

ఉ. అంచితభక్తియుక్త యసహాయవిశృంఖలవీరపూ
ర ని, శ్చంచలశైవభావ శ్రితజంగమపాదకిరీట
కూట హ్రా, త్సంచితసత్త్వతత్త్వ దురితవ్రజ
శైలకదంబశంబ ని,ర్వంచక నీవెదిక్కు బసవా.

ఉ. నిర్గతధర్మకర్మ యవినీతపునర్భవయంత్రతంత్ర దు
ర్మార్గవిహీనయాన గుణమాన్య మహావృష
*సామ్య సౌమ్యప, ద్వర్గవిరక్తసక్త మదడంబర
వర్జితవేషభూష నీ, వర్గము నేఁజుమయ్య
బసవా... 38

చ. సరసవచస్క నిర్మలయశస్క శివైక్యమనస్క
భక్తహృ, త్సరసిజగేహ క్లృప్తభవదాహ దయా
పరివాహ చిత్సుఖో, త్తరనిజశిల్ప భక్తపరతల్ప
మహావృషకల్ప మన్ననో, వరద శరణ్య మయ్య
బసవా... 39

చ. హరసమసౌఖ్య యాదివృషభాఖ్య పురాతన
ముఖ్య తత్త్వవి, త్పరిషదుపాస్య వీతగుణదా
స్యత్రిలోకనమస్య తార్కికో, త్కరజయశౌండ
దీర్ఘభుజదండ మహాగుణషండ మన్ననో, వరద
శరణ్య మయ్య బసవా... 40

---

* సైన్యధన్య.

చ. వరగుణదీప్ర భక్తజనవప్ర తృణీకృతవిప్ర
తాత్త్వికాం, కురపదపద్మ భక్తిరసగుంభ నిరా
కృతదంభ సద్గుణ, స్ఫురితవిశిష్ట శాంతగుణపుష్ట
నిరస్తనికృష్ట మన్మనో, వరద శరణ్య మయ్య
బసవా... 41

ఉ. లింగనిరూఢ సంచితవిలీఢ పరాక్రమగాఢ
మానసా, సంగివృషాంక నిర్గళితశంక నిరస్తక
ళంక సంతతా, భంగురపుణ్య శీలమణిపణ్య త్రిలో
కవరేణ్య దేవ నీ, వంగడమేఁజుమయ్య బసవా.

చ. ఉరుతరభాగ్య సన్మహితయోగ్య జగత్త్రయ
మృగ్య పాపసం, హరణసమర్థ నమ్రచరితార్థ ల
సద్గుణసార్థభావభా, స్వరనయసాంద్ర కీర్తిజితచం
ద్ర వివర్జితతంద్ర మన్మనో, వరద శరణ్య మయ్య
బసవా... 43

చ. విరచితశుద్ధసాళగన వీనమృదుస్వరమంద్రమధ్య
తా, రరుచిరదేశిమార్గమధురస్వరగీతసుధాతరం
గిణీ, తరలతరంగజాలసముదంచితకేళివిలోల
సంగమే, శ్వర గతినీవె నాకు బసవా... 44

చ. అసమసదాన్యమాన్య ప్రణుతార్య యవార్యర
సజ్ఞ తజ్జ్ఞ దు, ర్వ్యసనవిదూర శూర గణవంద్య
యనింద్య యమాఢ్య యాఢ్యభ, క్తిసుఖసమృద్ధ

వృద్ధ చిరదీప్తిపవిత్రచరిత్రపాత్ర న్నా, పసిఁ గని
ప్రోవుమయ్య బసవా... 45

చ. అసమశిలీముఖస్ఫురదహంకృతికర్తన కర్మకర్మ
ఠా, భ్యసనధురీణవిభ్రమ గణాధిపపాదసరోజసం
తత, ప్రసృమరసౌరభోరుమకరందకసిక్తవనక్రి
యాకళా, వ్యసన శరణ్యమయ్య బసవా... 46

చ. అసదృశవిస్ఫురద్గుణదృగంచల కల్పితసృష్టిపాల
న, గ్రసరకళాకలాప ఘనకౌశలఖేలన లింగమూ
ర్తి మూ, నసకలనావశీకరణనైపుణ తత్పరశీల
జంగమ, శ్వాపన శరణ్యమయ్య బసవా... 47

చ. ప్రమథగణాధినాథ సముపాసనభాసుర పార్వతీ
మనో, రమరమణీయహృత్కమలరాజితనవ్యప
తంగ సౌరభ, భ్రమరవిలోలతామధుకరాయితది
వ్యశరీర సత్ప్రభా, నమహిత నీవెదిక్కు బసవా.

ఉ. కంపళితాత్మయంత్రితవికర్తనశీల మరీచిమన్మనో,
మందవిహారవిస్ఫురితమధ్యమయాన చిదంబరేం
దుని, ష్యందసుధారసానుభవ సంతతదివ్యశరీర
యోగిరా, డ్వందిత నీవె దిక్కు బసవా... 49

ఉ. ఖ్యాతయశప్రపూరితజగత్త్రితయాయ నమో
నమో మహా, పాతకసూతకఘ్నపదపద్మయుగా
య నమోనమో సము, ద్ద్యోతవృషాయ తే యను

చు నుత్సుకతఁ బ్రణుతింతు సంయమి, వ్రాతశర
ణ్యామయ్య బసవా... 50

ఉ. ఆప్తగణప్రవిష్టసకలార్తిహరాయ నమోనమో
సుఖా, వాప్తికరస్మితాంచితకటాక్ష దయాయ
నమోనమో సముద్దీప్తగుణాయ తే యనుచు దీన
గతిఁ బ్రణుతింతు నిన్ను ని, రాప్తజగత్ప్రప
పంచ బసవా... 51

ఉ. కల్పితలింగజంగమసుఖస్ఫురణాయ నమోనమో
యసం,కల్పవికల్పమార్గకథితప్రథితాయ నమో
నమో గుణా, కల్పవరాయ తే యనుచు గౌరవ
లీల నుతింతు నిన్ను న,స్వల్పతరప్రభావ బస
వా... 52

ఉ. తర్జితదుష్కృతాయ భవతాపనికృంతనకల్మషా
యభ,క్త్యార్జితమానసాయ సుగుణోత్తమరత్న
కరండకాయ తే, ఆర్జితసత్క్రియాయ సదయా
య నమోయని సన్నుతింతు నా,వర్జితభక్తలోక
బసవా... 53

ఉ. చూర్ణితమన్మథాయ పరిశోభితభస్మవిలేపనాయ
సం, పూర్ణమనోరథాయ గతపూర్వభవాశ్రిత
వర్తనాయ తే,వర్ణనిరాసకాయ సశివాయ నమో
యనిసంతతంబు ని,న్వర్ణన సేయువాఁడబసవా...

ఉ. హృన్నలినే స్మరామి భవదీయపదద్వితయంభవా
టన, స్విన్నతనుశ్రమాపహ మశేషజగత్ప్రణు
తం మదీశ ని,ష్పన్న దయానిధే యనుచు సం
స్కృతభాష నుతింతు సిన్నువి, ద్వన్నుతనామ
ధేయ బసవా... 55

చ. పరమనె యన్నె యాండవనె పన్నగతానె యనా
థనాథనే, పెరియవనే పుళిందవనె పేరుడయా
నెపిరానెయప్పనే, తఱనురియయ్యనే యనుచు
ద్రావిడభాష నుతింతు మన్మనో,వర కరుణా
విధేయ బసవా... 56

చ. హసుళెయరెన్న రక్షిసువు దారయలెన్న వనీత
నెందు మ,న్నిసువుదు నిమ్మడింగెరగ నిమ్మప్రసా
దియె నిమ్మదాత్మ వే,కసిగతి యంచుభక్తి నినుఁ గ
న్నడభాష నుతింతు షడ్గుణ,శ్వాసన పురాతనాత్మ
బసవా... 57

ఉ. దేవపరీతుమ్హీ చగురు దేవమణూనుతరీతుమ్హీ చగో,
సావితరీతుమ్హీ చతుమచాచప్రసాదచమ్హీ కృపా
కరా, హేవరదా యటంచునుతియించెద నిన్ను
ను నా రెభాసదే, వా వినుతార్యలీల బసవా...

చ. అనయముఁ జేతులందు భవదంఘ్రిసరోజయు
గం నమామి నై, మ్మనమున సంస్మరామి యను

మాటల నిన్ వరివస్కరోమ్యహా? ష్మనుచు మణి
ప్రవాళమున నంకన సేయుదు భక్తలోక హృ,
ద్వనజవిహారలోల బసవా... 59

చ. అరళుగిరిప్రసాదముదయానె భవద్గుణవర్ణసల్పి
నా,శౌరువనినేస్మరామి సురయేశ్వరు రేగణవర్య
యంచుని, ట్లరుదుమణిప్రవాళమునసంకనసేయు
దు నిన్ను మన్మనో, వరకరుణావిధేయ బసవా.

ఉ. వాయువువొందు యీవిగతవావ అమాపరహం
బభౌ మహా, న్యాయవిధేయమీశతరి యన్య
నఖాణుకళాభిదంచువా, గ్దేయమణిప్రవాళమునఁ
దెల్లము నిన్ను నలంకరింతు దే,వా యమిబృంద
వంద్య బసవా... 61

చ. *ఖలుపొడతోలు చీతెయును పాఁపపెనల్ గిలు
పారుకన్ను వె,న్నెలతలఁజేఁదుకుత్తుకయు నిండిన
వేలుపుటేఱు పల్లువ్రూ,సలు గలతేనిలెంక వని
జానుఁదెనుంగున విన్నవించెదన్, వలపు మదిన్
దలిర్ప బసవా... 62

చ. తిరువడి నెమ్మనంబునను దేవ హృదీశ్వర కింపరీ
యతా, బరికరితంబురాణి నినుబాహిరిఁబోలుట

* శుద్ధాంధ్రము.

శాసితాహితా, వరద నెగిల్లెయంచు నిను బ్రస్తుతి
సేయుదుఁ బెక్కుభాషలన్, వరదవివేకశీల
బసవా... 63

ఉ. పాఁడువెదా మహారసదినంఘ్రియుగభ్రమగొండు
సద్గుణా, మాఁడువదర్చనంబిడె సమగ్రనుతి త్వ
యిసత్క్రియన్ దగన్, గూడ మణిప్రవాళ
మునఁ గోరి నుతింతును సంచితార్థముల్, పాడిగ
నివ్వటిల్ల బసవా... 64

ఉ. రుద్ర గణాదిరుద్ర నినిరూపితలింగ సుఖాదిస
ద్రయ, చ్ఛిద్ర దయాసముద్ర సవిశేషపరాక్రమ
వీరభద్ర యక్షుద్రజనావలీభవనిషూదనరౌద్ర
సముస్తభక్తదేవద్రుమ నీవె దిక్కు బసవా...

చ. ఇహపరసిద్ధ సిద్ధవృషభేశ్వర ఈశ్వరభక్త భక్త
వ్యాగ్రహనవిలోక లోకహితకారణ కారణజన్మ
జన్మదోషహరణదక్ష దక్షరిపుసన్నిభ సన్నిభ
రూప రూపవిగ్రహన శరణ్య మయ్య బసవా.

ఉ. సన్నుతజంగమాగమము స్వాతిజలంబులు భక్త
నిమ్నగం, జెన్నుగ నీదుచూడ్కు లనుచిప్పల
జొన్నలు ముత్తియంబులై, యున్న నొకయ్య
ముగ్గు నియమోన్నతి నిల్చినధన్యు నిన్ను శ,
శ్వన్నుతులన్ భజింతు బసవా... 67

ఉ. బల్లహుఁ డొద్ద నున్న నినుఁ బట్టణవీథులఁ జల్లల
మ్మఁజో, గొల్లతఁ జిరువాఱి కడుఁగూర్మి మెయిన్
బసవా యనన్ భువిన్, దెల్లఁగ నీకపట్టిన యతి
స్థిరసర్వగతైకభావ మ,గ్గల్లభ నీవె దిక్కు
బసవా... 68

ఉ. వేఁడినయిండజంగమము వెక్కసమందఁగఁ దత్స
భాస్థలి, న్నాఁడట నారికేల్వలువ నైజపుమా
నము దూలకుండఁగాఁ, బోఁడిమిఁ బట్టుపుట్ట
ములు ప్రోవులు పెట్టినపుణ్యమూర్తి నీ,వాఁడఁ
జూమయ్య జియ్య బసవా... 69

చ. అరయఁగసిద్ధరాము రజితాద్రిపయిన్ బసవాఖ్యు
విన్నఁజే,రరులున జంగమాజ్ఞ మెయి నారయ
నప్పుడు భక్తి పెంపుసొం, పరుదుగఁ బార్వతీశు
హృదయాంబుజకర్ణిక నత్తమిల్లు భా,స్వరుఁడగు
నీవె దిక్కు బసవా... 70

ఉ. వర్ణవిహీనుఁ డంచు ద్విజవర్గము దా గళమెత్తి
పల్కుడున్, వర్ణములెల్లఁ జూడ శివనాగయ
గారికరంబులందు స,ద్వర్ణుఁ డితండనా నమృత
ధారలు చూపినభక్తిరూఢ నీ,వర్ణము నేఁజూ
మయ్య బసవా... 71

ఉ. బిజ్జలునర్థమంతయును బ్రీతిగ జంగమకోటి కిచ్చె
నా, నజ్జగతీశ్వరుం డడుగ నక్షయబండరు వాక్షి
ణంబులో, నిజ్జగమెల్లఁ జోద్యపడ నిచ్చినలింగస
దర్థ నమ్రుని, వ్వజ్జన నీవె దిక్కు బసవా... 72

చ ఉరుశివయోగనిద్రమయియున్న తఱిఁ ఫణిహారి యోఁ
గుడుఁ, మఱచిచనంగ జంగమసమన్వితమై ము
నుబ్రాణమేగి యుద్ధురగతి వారు నచ్చుటయుఁ
దోడనెవచ్చిన జంగమాత్మ నీ,వరపుఁడ నేఁ జుమ
య్య బసవా... 73

ఉ. సంగయదేవుఁ డర్థి నొకజంగమమై చనుదెంచి
వేఁడను, ప్పొంగి లలాటలోచనము భోరున నద్ద
ముపట్టి చూపుడుఁ, జెంగి యగ్నశిఖ్యఁ డైన
శివుఁ జేకొని యార్చిన యప్రతర్క్య నీ, వంగడ
మేఁజుమయ్య బసవా.... 74

ఉ. కర్ణవతంసమీఁక పెనఁగఁ సతిచెక్కిలి ప్రేయుఁ
డుఁ మహా,తూర్ణతఁ జెంది జంగమము దోస్థనల
మెత్తిపసిండియాకు సం,పూర్ణనికృష్టభక్తిమెయిఁ
బొల్పుగ నిచ్చిన నిష్ప్రపంచ నీ, వర్ణము నేఁజు
మయ్య బసవా... 75

ఉ. శృంగిపురోగమాఖిలవిశేషవిషంబులు గూర్చి
మండుచుఁ, బొంగి భుగిల్లుభుగ్గు రనుభూరివిషా

గ్నినిష్ఠాదులార్తులై, చెంగి చనన్ శివార్పితము
చేసి భుజించినసుప్రసాద నీ,వంగడ మేఁజుమయ్యా
బసవా... 76

ఉ. చిత్తజవైరివిక్రమముఁ జెప్పకు చెప్పకు త్రావ
నోడి తాఁ,గుత్తుక నిల్పెనంచుఁ గడుఁ,గ్రూరతరం
బగు కాలకూటముల్, గుత్తుకబంటి గ్రోలిన య
కుంఠితవిక్రమ చక్రవర్తి భా,స్వత్తమ! నీవెదిక్కు
బసవా.... 77

ఉ. తంగెటిజున్ను ముంగిటినిధానము పండినకల్పవల్లి
ముం, గొంగునముత్తియం బనఁగఁ గూర్మిమనం
బునఁ దొంగలింపఁగా, జంగమకోటి కర్చనలు
సల్పుచు నున్నయగణ్యపుణ్య నీ,వంగడ మేఁజు
మయ్య బసవా... 78

ఉ. భీమగజంబు డీకొనిన బిట్టరఁజంపుఁడు బిజ్జలేం
ద్రుఁడు,ద్దామతఁ దక్కి మ్రొక్కుటయుఁ దత్కరి
నెత్తినవిక్రమోద్ధతుం, డామడియాలుమాచ
నకు నగ్గల మైనమహానుభావ నా,స్వామివి నీవె
దిక్కు బసవా... 79

ఉ. శంక దలిర్ప నెంతయు వెసన్ బరదైవపతంగకో
ట్లకున్, బింకముతోడ ఫాలతటభీమవిలోచన
వహ్ని నేర్చునా, శంకరదాసిదేవునకు సద్భటుఁ

డంచు నుతించు నిన్ను నీ,వంకకుఁ ద్రిప్పు మయ్య్య
బసవా... 80

ఉ. వేఁడులు నూఱటంచు శ్రుతు లెన్నఁగ శ్రీగిరి
మీఁద నాఱునూ,ఱేఁడులు సంచరించు సకలే
శ్వరదేవరమాదిరాజు నా, నేఁడలనూఱుమన్న
భువి నిష్ఠురకాలమహోగ్రదృష్టి క్రో,వ్వాఁడుల
ణంపు మయ్య్య బసవా... 81

ఉ. సూత్రము దప్పి గొత్తై గుడిఁ జొచ్చిన మిండ
నిఁజంపి సాఁటిగా, నో త్రిపురాంతకా యనుచు
నోయని పిల్చిన యల్ల*సవ్యశః, పాత్రుఁడు కిన్నర
య్యకును బ్రాణసఖుండగునిన్నుఁగొల్తు దే,వా
త్రిజగత్పవిత్ర బసవా... 82

ఉ. ఒక్కఁడె రుద్రుఁడన్న శ్రుతులొల్లక ప్రేలువు
రాణభట్టులన్, వ్రక్కలుసేసి తత్తనువువావిరిఁ
†బ్రువ్వులుగాఁగఁజూచునా, కక్కయగారిబిడ్డఁడ
నఁగా నుతికెక్కినన్నిఁ బూన్తు మ,ద్వాక్కలి
కాసమూహి బసవా... 83

ఉ. డంభమయాన్యదర్శనవిడంబనుఁ డష్టమదాపహారి
యా, శుంభదుదాత్తకీర్తి యగుచోడలదేవరబా
చిరాజు వి,స్రంభసఖుండ వీ వని ప్రశంస యొ

* నాదయా. † పురువుశబ్దమున కిది పూర్వరూపము.

నర్తు జగత్పవిత్ర వి, శ్వంభర శంభుమూర్తి బ
సవా... 84

ఉ. దీప్రము నీమహామహిమ దివ్యము నీమహనీయ
విక్రమం, బప్రతిమంబు నీచరిత మాద్యము నీని
జరూప మంచు నల్లప్రభుం డర్థితోడ నుపలా
లన సేయఁగ నొప్పుచున్న దే,వా ప్రణుతింతు
నిన్ను బసవా... 85

ఉ. మేదురభక్తి నీశ్వరుఁడు మెచ్చఁగ జిహ్వయె పళ్లె
రంబుగా, నాదటఁ బ్రాఁచియంబలి సమర్పణ చేసి
పొగడ్త కెక్కునా, మాదర చెన్నలింగము
కుమారుఁడ నిన్ను భజింతు సంతతా, స్వాదిత
సుప్రసాద బసవా... 86

ఉ. బల్లిదుఁడై గణాధిపుల పాదజలంబులు కట్టెమో
పుపైఁ, జల్లికడానిగావుడును జంగమకోటికిఁ
బంచియిచ్చుచుఁన్, మొల్లపుభక్తిఁ బేర్కొనిన
మోళిగమారయ కూర్మిబంట మ, వల్లభ నీవె
క్కు బసవా... 87

ఉ. భీకరరుద్ర నేత్రశిఖఁ బెద్దఁగఁ జేయఁగ వీరభ
ద్రుసు, ద్రేకగజంబునా నితరదేవతలన్ బడఁదాఁ
కునుద్ధతుం,డాకలికేతబ్రహ్మయకునర్మిలి భృత్యుఁ

డ నిన్నుఁ గొల్తు దే, వా కరుణింపుమయ్య
బసవా... 88

చ. పసిగమెయిన్ * వృషాధిపుని ప్రాణము జంగమ
కోటి ప్రాణముల్, వసలక యెత్తుచున్ భువన
మాన్యచరిత్రతఁ బేజఁల్లునమ్మసిడిగ చౌడరా
యనికి మున్నిటిభృత్యుఁడ నిన్భజింతు నన్నసిగొ
ని ప్రోవు మయ్య బసవా... 89

ఉ. ఎన్నఁగజంగమంబుఁ దనయింటికినెప్పుడు వచ్చు
నప్డు దాఁ, గన్నము వెట్టి తెచ్చి యధికంబగు నర్థ
ము వానికిచ్చు నాఁ,కన్నడబ్రహ్మసంయమికి గాది
లిభృత్యుఁడ నైననిన్ను శ, రణ్యుఁడులన్ భజిం
తు బసవా... 90

ఉ. ఆసురవృత్తిఁ జూపరుభయంపడి మ్రొక్కఁ బ్రసా
దవహ్నిచే, భూసురులింపులన్నియును బొగ్గుల
ప్రోఁకలు సేయుభూతసం, త్రాసుల బిబ్బబాచ
యల దాసి యనన్ విలసిల్లు సద్గుణా, వాస శ
రణ్యమయ్య బసవా... 91

ఉ. సుంకపుఁబైఁడి భక్తులనుఁ జూఱలు విడ్వఁ బసిం
డిగ్రాఁగులన్, శంకరుఁ బూఁటవెట్టి నరనాయకు
చేతను మ్రొక్కుఁ గొన్నయా, సుంకరబంకిదేవు

* గణాధిపుల.

నకు సూనుఁడ వైనప్రసాది దేవ నీవంకకుఁ బ్రి
య్యమయ్య బసవా... 92

ఉ. దివ్యవిమానపంక్తి దివిఁ దేజరిలన్ రజతాద్రికిన్
జగ,త్సేవ్యను గాఁగ మున్ను దనచే మృతిఁబొం
దు మృగాలిఁ బుచ్చు సం, భావ్యుఁడు తెన్నుబొమ్మ
యకుఁ బ్రాణసఖుండగు నిన్నుఁ గొల్తు దే,వావ్య
సనాదిదూర బసవా... 93

ఉ. చెన్నగు ప్రాణలింగరతిచేఁగ ప్రసాదము పుట్టిని
ల్లు న, త్యున్నత భక్తినీపు శివయోగ సమగ్రత
కల్మియైన మా, యన్నకు సాదిచెన్నబసవన్నకుస
ద్గురుఁ డైననిన్ను శ,శ్వన్నుతులన్ భజింతు
బసవా... 29

చ. అడరఁగఁ గల్లుచేసి రుచిరాన్నము లాదట నంది
యిచ్చుచోఁ,గడిఁగడి నందుకొంచు నతికాంతి
మెయిన్ శివుఁ డారగింపఁ గా,నడిసనుభక్తుఁ డా
సురియ చౌడయగారిప్రసాది దేవ నీ,వడుగఁ జూ
మయ్య జియ్య బసవా... 95

ఉ. జంగమ *మారగింపక విషంబును మీఁకు నన
ష్టమంచుఁ దా, నుంగల నారగించిన సముద్ధత
భక్తియుతుండు సత్ప్రసా, దాంగుఁడు శృంగి

*మారగింపఁగ.

బొప్పయకు నగ్గల మైనమహానుభావ! నీ,వంగడ
మేఁ జుమయ్య బసవా... 96

చ. కొటితను లేఁత పత్తిరియు గొడ్డునఁ బాలును
రేయి జంగమం, బడిమడి వేఁడినన్ బడసి యా
క్షణమాత్రన యిచ్చినట్టి యా, మొఱటదవంక
దేవునకు ముద్దుతనూజుఁడ వైననిన్ను నే,వఱలఁ
గఁ బ్రస్తుతింతు బసవా... 97

చ. అనయము భక్తులీడ్యకు లటంచును వేదములా
ద్విజోత్తముల్, విన నుతియింపఁ గుక్కఁ జదివిం
చినహాలినహాల్లికల్లిదే, వునకు ననుంగువాఁడ వని
యుత్సుకతన్ నుతియింతు భక్తహృ, ద్వనజవి
హారలోల బసవా... 98

ఉ. భక్తునిమ్రింగఁ జంప మును భర్గునకున్ జిరుతొం
డనంబికిన్, యుక్తమెయంచు వారిపయి నొక్క
ట నుద్ధతి ఘంటవ్రేసి యు, ద్రిక్తతనొప్పఁగా న
లరు దిట్టహలాయుధు కట్టనుంగ ప్ర, శ్యక్తమ
నీవెదిక్కు బసవా... 99

చ. ధరసురులింగమూర్తి ధ్వజదండముగా మలగచ్చ
తోఁక(?)శ్రీ, కరముగ భక్తికిం బడగఁగా శివు
గర్భముఁ జొచ్చి పొల్చుమా,యరియమరాజు

గారి పెరమాప్తుఁడ వైనమహానుభావ నీ, వరపుఁ
డ నేఁజుమయ్య బసవా... 100

ఉ. దండితవాది యై శివుఁడె దైవము గాకని కన్ను
లిచ్చి తా,నిండుమనంబుతోడ నెడ నిద్దపుఁగన్ను
లు దాల్చి పొల్చు మా,పండితమల్లికార్జునుఁడు
ప్రస్తుతి సేయఁగ నేర్చు నిన్ను నె,వ్వండు
నుతింప నేర్చు బసవా... 101

చ. వసుమతిఁ బేరుకొన్న నరువత్తురు ముప్వురి కూర్మి
బంట పో, డసులసుతుండ తేరసుల దక్కినభృ
త్యుఁడ వీరలాదిగా నెసఁగు మహానుభావులకు
నెల్ల ననర్గళమైనభక్తిన, న్నసిగొని ప్రోవుమ
య్య బసవా... 102

చ. బసవనిధానమా బసవభవ్యనిధీ బసవామృతాం
బుధీ, బసవమహానిధీ బసవభర్మగిరీ బసవామర
ద్రుమా, బసవమహాబలీ బసవబంధురవా బస
వోల్లసన్మణీ, వసిగని ప్రోవుమయ్య బసవా...

ఉ నాయొడయండ నావిభుఁడ నాహృదయేశ్వర
నామనోరమా, నాయిలువేల్ప నావరుఁడ నాగు
రులింగమ నాదుజంగమా, నాయధినాథ నావర
దనన్నుఁ గృపామతిఁ బ్రోవుమయ్య దే,వా యమి
బృందవంద్య బసవా... 104

ఉ. నోరికి వచ్చినట్టు నిను నూఱువిధంబులఁ బ్రస్తుతింతు నే, నేరుతు నేరఁ బొమ్మనక నీపయి నొచ్చెములేనిమచ్చికన్, గారవమంద మత్ప్రిణుతిఁ గైకొనఁగాఁ దగు గౌరవంబునన్, వారనికూర్మిపేర్మి బసవా... 105

చ. బసవఁడు ప్రీతిఁ గైకొసియె భక్తిమెయిన్ రచియించె సోముఁడున్, బసవపురాణ మంచు మునుఁ బ్రస్తుతిసేయుదు రట్టుగాన నీ,యసమదయాధురీణతకు నంకిలిపాటు ఘటిల్లకుండ నన్, బసఁగొనిబ్రోవుమయ్య బసవా... 106

చ. (?)సురవరమల్ల మల్లలిత సూత్రసుధాంబుధి ఖేలఖేలసం, గరకలకంఠ కంఠమణి నాయకభీమ భుజంగ జంగమ, స్థిరతరనాథ నాథకసిధీకృతరూప విరూపసమ్మతా, వరకరుణాబ్ధి ప్రోవు బసవా... 107

చ. సురవరపూజ్య పూజ్యగుణశోభిత శోభితరూపరూపవి,స్ఫురతరశీల శీలగణపుంగవ పుంగవసత్త్వ సత్త్వసం, వరపరవాద వాదభయవర్జితపాపవిచార చార యీ,శ్వరసమ నీవె దిక్కు బసవా బసవా బసవా వృషాధిపా. 108

చ. అకుటిలి లింగజంగమ సమగ్రదయాకలితప్రసా
ది పా, లకురికి సోమనాథుఁ డతిలౌల్యమునన్
బసవన్నదండనా, యకునకు *నొప్ప నీశతక మ
ర్పణచేసె †నలిన్ బఠించువా, రికి వినువారికిన్
గలుగు శ్రీయును నాయువు భుక్తి ముక్తి
యున్. 109

వృషాధిపశతకము సంపూర్ణము.

---

* నీకు. † ధరన్.

# పీ ఠి క.

చెన్నమల్లుసీసములను సుప్రసిద్ధకవియగు పాలకురికి సోమనాథమహాకవి రచించెను. ఈకవి సంస్కృతాంధ్రములలో నిరర్గళముగాఁ గవితజె ప్పుటలో నేర్పరియేగాక శైవమత మాంధ్రదేశ ములో వ్యాప్తికిఁదెచ్చిన వారిలో నొకఁడు. తొలుత సోమనాథుఁడు, ఉత్తమరాజువారను కౌండిన్యసగో త్రులగు నియోగులశాఖలోనివాఁడై వేదవేదాం గాదులు సమస్తశాస్త్రములు నభ్యసించి మతావేశ పరవశుఁడై వీరశైవమునఁ బ్రవేశించి దీక్షధరించెను.

సోమనాథుఁడు బసవేశ్వరునకుఁ గొంచెమా వల కాకతీయరాజ్యమును రుద్రదేవచక్రవర్తి పరి పాలించుకాలమున సుప్రసిద్ధుఁడై యుండెను. బస వేశ్వరుని దైవముగా భావించి యాతనిమహత్త్వము నకు ముగ్ధుఁడై బ్రాహ్మ్యమునువదలి శైవజంగమైన వారిలో బసవనిగుణకీర్తనలచేఁ గవితను బునీతము గావించినవారిలో సోమనాథుఁడే యాద్యుఁడు. బస వేశ్వరునిలీలలను వృషాధిపశతకమునందును బసవ పురాణమునందును సోమనాథుఁడు ప్రశంసించియు న్నాఁడు. ఇతఁడు పశ్చిమచాళుక్యులకడ సేనానిగా నుండి యంత్యమున శ్రీశైలముఁజేరి గురుమల్లికార్జు నపండితారాధ్యులవారిని బసవేశ్వరుని మేనల్లుఁడగు

చెన్నబసవని స్తుతించుచు చెన్నమల్లు సీసపద్యములు గావించెననీ ప్రజాముఖమున వినుచున్నారము.

సోమనాథుఁడు జీవసమాధి కేగుచు భూబిలమున కేర్పఱచిన ముప్పదిరెండు మెట్లను దిగనెంచి యొక్కమెట్టు దిగునపు డొకపద్యముచొప్పున ముప్పదిరెండుపద్యములు రచించినటుల శైవులుకొందఱు చెప్పుచున్నారు. సోమనాథకవి సిద్ధిపొందిన స్థలము పాలకురికి నిజామురాష్ట్రమున ఒరంగల్లునకు మూఁడామడలదూరములో నున్నది. సిద్ధిపొందినచోట నొకశివాలయముగట్టి శివభక్తులు పూజాదికములు ఉత్సవములు సలుపుచున్నారు. సోమనాథుని చెన్నమల్లుసీసము లచటియుత్సవాదులలో నేఁటికిఁ బ్రచారములో నున్నవి.

ఈకవిజీవితముప్రసాధిపశతకపీఠికలో వ్రాసితిమి. కవికాలము క్రీ. శ. ఇతనిశైలి పాండిత్యము ధారాశుద్ధి ప్రశంసనీయములు. చెన్నమల్లుసీసములు పూర్వముద్రితప్రతిలో దుష్టముగానుంటచే లిఖితప్రతుల సహాయమున సంస్కరించి నూతనపద్యములు చేర్చి సాధ్యమగునంతవఱకు నిర్దుష్టముగావించితిమి. ఫలశ్రుతినిగూర్చియుఁ బద్యానుక్రమణికనుగూర్చియుఁ గలపద్యము లిందుఁ జేర్చితిమి.

నందిగామ
1-1-25

ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు, శతావధానులు.

31

శ్రీ రస్తు.

సాంబశివాయ నమః.

పాలకుఱికి సోమనాథమహాకవిప్రణీత

# చెన్నమల్లుసీసములు.

---

భక్తస్థలము.

సీ. శ్రీగురులింగసంచితకృపోన్నతిఁ జేసి
కంటి జంగమపాదకమలసేవ
జంగమలింగప్రసన్నత్వమునఁ జేసి
కంటిఁ బ్రసాదసుఖంబు నొందఁ
దత్ప్రసాదప్రబోధస్థైర్యమునఁ జేసి
కంటి సర్వాంగప్రకాశభక్తి
భక్తిసౌభాగ్యానుభవపూర్తిమైఁ జేసి
కంటి జీవన్ముక్తి కడమలేక
ఆ. యింక నేమికొఱఁత యేల నీకాశింపఁ
బాడియాడి దైన్యపడి భజించి
మెచ్చి పొగడిరేని మీఁదనొందెడిఫలం
బెన్న నున్న దెట్లు చెన్నమల్లు. 1
సీ. *అకట నాప్రమథులరాయనియేగాక
నీ వున్నచోటు మున్నెవ్వఁ డెఱుఁగు

---

* అకటా ప్రమథుల.

పాటిగా నన్నేలు భక్తులారా యని
కాక యెవ్వండు నీఘనత నెఱుఁగు
తెలుపుమా శ్రీగురుదేవుఁడా యనికాక
యిచట నీపేరు దానెవ్వఁ డెఱుఁగు
లెస్సపోనాచరలింగమా యనికాక
యిట్టివాఁ డనుచు నిన్నెవ్వఁ డెఱుఁగు
ఆ. వారినగరిలెంకవాఁడ నేగలిగితిఁ
గాన నీకుఁ బ్రాపు గలిగెఁ గాక
యితరు లెవ్వ రెఱుఁగ రిట్లెఱింగియుఁ బెద్దఁ
జేయవేల నన్ను చెన్నమల్లు. 2

సీ. ఆనందమలర లింగార్చన జేయక
గుడుచుట పాపంబు గుడుచునట్లు
అర్చకుండయ్యు లింగానర్పితము గోరి
ముట్టుట యన్యంబు ముట్టినట్లు
లింగప్రసాదంబు జంగమవిముఖుఁడై
కొనుట యేమేనియుఁ గొనినయట్లు
జంగమహితుఁడయ్యు సరిపాకభేదంబు
సేయుట ద్రోహంబు సేసినట్లు
ఆ. అనుపురాతనోక్తి కావంతయును దొట్రు
పడనిశుద్ధభక్తి పదము ప్రాణ

పదముగాఁ జరించు భక్తలింగంబులఁ
జేర్పవయ్య నన్నుఁ జెన్నమల్లు. 3

సీ. మేరువ శోఁకుచో భేరుండ మనువాయ
సము బూనియే తనుచ్ఛాయ చేయు
రసము సంధిల్లుచో రజతాదిలోహప్ర
భావంబు లరసియే పసిఁడి చేయు
సూర్యుండు వ్యాపించుచో నగ్రజాంత్యజా
తుల నేరుపఱచియే వెలుగుఁ జేయు
సురపతివర్షంబుఁ గురియుచో సస్యతృ
ణాంతరం బరసియే యలరఁజేయు

ఆ. ప్రాణనాథ నాదుభక్తినిశ్శేషంబు
పట్టిచూడ నీకుఁ బాడియగునె
యిన్నియేల నీమహేశ్వరత్వము వెల్తి
చేసికొనఁగ నేల చెన్నమల్లు. 4

సీ. కాలఁ దన్నిననోర్తు కడఁగి యేనడుగులఁ
బడిన నెత్తవు పక్షపాతి దగునె
ఆలపూజలుగొందు మేలిపుష్పంబులఁ
బూజింపనన్నవబోధ తగునె
కోరి ప్రసాదంబు గొందు నేముట్టక
ర్పించినఁ గొన విట్టికించ తగునె
మేలవుఁగబ్బముల్ మెత్తునా సంస్తుతుల్
వినియును విన వవివేకి తగునె

ఆ. వారు నడచినట్లు వచ్చునే నడువని
పునిచినట్లు తప్పకుండఁ జూచి
కొందుగాని నాదుగుణవిశేషతకల్మి
యెన్నఁగలదె నీకుఁ జెన్నమల్లు. 5

సీ. *పూజింప నలయింపఁ బుణ్యపాపంబులు
వివరించిచూడ నీయవియె కావె
తలఁపింప మఱపింపఁ దద్గుణదోషంబు
లరసిచూడంగ నీయవియె కావె
యాడింప నోడింప నాహెచ్చుకుందులు
రవణించిచూడ నీయవియె కావె
వలపింప సొలపింప నిలసుఖదుఃఖంబు
లవి యెన్నిచూడ నీయవియె కావె

ఆ. నామనోవిభుండ నాస్వామి సకలమై
తనృకర్త సూత్రధారిచేతి
బొమ్మకున్నదయ్య యిమ్మహి నీయిచ్చ
చెప్పనేల వేయి చెన్నమల్లు. 6

సీ. నిలుపవే ప్రాణంబు నీయందుఁ బెరసి సం
పూర్ణమై దేహంబు పొందు విడువ
సలుపవే మదినిచ్ఛ నిరతంబు నీభక్త
చిద్గోష్ఠి దవిలి దుశ్చింత లుడుగఁ

---

* పూన్పింప మాన్పింప-పా.

గొలుపవే సర్వాంగగుణములు నీభక్త
పదమందు లీనమై భ్రాంతి దక్క
మెలుపవేయింద్రియంబులుగూడ నీప్రసా
దంబును దవిలి *తత్పరత నిలువ
ఆ. ప్రాణనాథ భక్తపరతంత్ర మత్కాయ
సన్నిహితమహాప్రసాదమూర్తి
యిందు లేల నీకు నుండ నాయందిమ్ము
చేసికొనవె చాలు చెన్నమల్లు. 7

సీ. భజియించు కేవలభక్తిముక్తికిఁ దాన
యునికియు మనికినై తనరెనేని
చను శీలసంబంధసంపన్నతకుఁ దాన
గతియును మతియునై క్రాలెనేని
సంగతంబుగఁ బ్రాణలింగంబునకుఁ దాన
యొడలుప్రాణంబునై యుండెనేని
సంతతబాహ్యప్రసాదంబునకుఁ దాన
రూపును రుచియునై చూపునేని
ఆ. వేయియేల యతనివిమలానుభవసౌఖ్య
మున్నఁ జాలదెట్టు లెన్నఫలము
నట్లుగాన నీమహాభక్తియుక్తులఁ
జేర్పవయ్య నన్నుఁ జెన్నమల్లు. 8

---

* పూర్వంబు మఱవ-పా.

సీ. నెపమునఁ బ్రాణంబు నీయందుఁ బ్రిదిలిన
యప్పుడె మృతినొందఁ డయ్యెనేని
కలనైననిలచిన నిలుకడ చలియింప
నప్పుడ రూపకుం డయ్యెనేని
యించుకంతయు మతి నితరభావముసోఁక
నప్పుడు కని వ్రాలఁ డయ్యెనేని
అణుమాత్రమైన లింగానర్పితము సోఁక
నచ్చోటఁ దెగఁజూడఁ డయ్యెనేని
ఆ. భక్తిమాటలాడ ఫలమేమి వెండియు
మజ్జనంబు చేయ లజ్జగాదె
యట్లుగాన నీమహాప్రసాదానూన
సిద్ధి కేవలంబె చెన్నమల్లు. ౭౨

సీ. లింగ నీభక్తులలీల వీక్షించుచో
నొడలెల్ల కన్నులై యుండెనేని
దేవ నీభక్తులఁ దివిరి కీర్తించుచో
నొడలెల్ల జిహ్వలై యుండెనేని
జియ్య నీభక్తాంఘ్రిసేవ యొనర్చుచో
నొడలెల్ల చేతులై యుండెనేని
అయ్య నీభక్తమాహాత్మ్య మాలించుచో
నొడలెల్ల వీనులై యుండెనేని
తే. స్వామి భవదీయభక్తిప్రసాదముక్తి
యుక్తి నొడలెల్ల నోళ్లనై యుండెనేని

అట్టిభక్తుల *లింగదివ్యాంఘ్రియుగళ
 శేఖరులఁ †జేర్చి రక్షించు చెన్నమల్లు. 10

సీ. నీరూపు నీరేఖ నీయన్ను నీచెన్ను
 నీపెంపు నీసొంపు నీచలంబు
నీమూర్తి నీస్ఫూర్తి నీశాంతి నీకాంతి
 నీలాగు నీబాగు నీవిధంబు
నీబల్మి నీకల్మి నీయురుల్ నీసిరుల్
 నీనెఱి నీగుఱి నీమెఱుంగు
నీనల్వు నీచెల్వు నీలలి నీలులి
 నీరీతి నీభాతి నీస్థిరంబు
ఆ. తనువునందుఁ గుదురుకొని కనుఁగవ వెళ్లఁ
 బాఱి మదిఁ బెనంగి ప్రాణముగను
 నీవయై చరించు నీమహాభక్తులఁ
 జేర్పవయ్య నన్నుఁ జెన్నమల్లు. 11

సీ. అతులితపరమశివాచారసారస
 న్మార్గంబు గతియును మతియు నేని
రాజితగురులింగపూజనోత్సవమేళ
 నంబు పదము పదార్థంబు నేని
సంతతసముచితసత్కాయజంగమ
 భక్తియు శ్రీయు సంపదయు నేని

---

* మహిత. † శేఖరులఁ జేర్పవే నన్ను.

బాహ్యాంతరార్పితగ్రాహ్యప్రసాదంబు
లాయుష్యమును భవిష్యంబు నేని
తే. భక్తిసద్గోష్ఠిముదితవిస్ఫారసుఖము
భుక్తియును ముక్తియును నేని భక్తుఁ డతఁడు
అట్టిభక్తులమహితదివ్యాంఘ్రియుగళ
శేఖరులఁ జేర్పవే నన్నుఁ జెన్నమల్లు. 12

సీ. అవగుణంబులు తనయందుఁ బరీక్షించు
కావనిపుచ్చు సద్భావకులను
సద్గుణంబులు భక్తజనులం దనుష్ఠించి
శరణని మ్రొక్కెడు సజ్జనులను
దొరకినయట్లు సంతోషించి విగతాంగ
భోగులై చను మహాపూరుషులును
సకలసుఖంబులు జంగమార్పణఁ జేసి
వెండియుఁ దనియని పండితులను
ఆ. దన్నుమఱచి భక్తతతిఁ గొనియాడు ని
గర్వులను గుణోపకారమతుల
శుద్ధభక్తిరతుల సిద్ధప్రసాదులఁ
జేర్పవయ్య నన్నుఁ జెన్నమల్లు. 13

మహేశ్వరస్థలము.

సీ. సర్వేశుఁ డనఁజాల సర్వాత్ముఁ డనఁజాల
సర్వగతుం డనఁజాలఁ జాల

హరుఁ డనఁజాల మూర్ధాంగుఁ డనంజాలఁ
జర్మాస్థిధరుఁ డనఁజాలఁ జాల
శశిమౌళి యనఁజాల సర్వాంగుఁ డనఁజాల
నీలగళుం డనఁజాలఁ జాలఁ
మూర్తి నాఁజాల నమూర్తియు ననఁజాల
సాధ్యపదం బనఁజాలఁ జాలఁ
ఆ. ప్రాణనాథునందు భక్తైక్యతనునందు
లింగమందు గురుపుజంగమందుఁ
గందునట్లు వినుతి గావింతు సేవింతు
నిన్ను మదిఁ దలంతు చెన్నమల్లు. 14

సీ. కరమర్థి నీకు శృంగారంబుగాఁ బూజ
సేయుదుఁ గాని యాశింప ఫలము
వేడుకతోడుత విభవార్థముగ నుతుల్
సేయుదుఁ గాని యాశింప మెప్పు
తగిలి నీకు సుఖార్థముగఁ బదార్థార్పణ
సేయుదుఁ గాని యాశింప రుచుల
లాలితంబుగ నీకు లీలార్థముగ భక్తి
సేయుదుఁ గాని యాశింప ముక్తి
తే. నీవు పూజాఫలార్థివే నిష్ఫలార్థి
నీవు కీర్తిప్రియుండవే నిష్క్రియుండ
సకలసుఖభోగి వీవె ప్రసాదముక్తి
సన్నిహితుఁడను నీబంటఁ జెన్నమల్లు. 15

సీ. చూడ్కి నీలోఁ జూచి చూడంగవలవదే
   వినికి నీవినికిగా విననఁగవలదె
నెఱిదాళకటమున్న గుఱిచేయవలవదే
   నడుపు నీవెంబడి నడువవలదె
రుచులు నీజిహ్వను రుచియింపవలవదే
   చేత నీచేయిగాఁ జేయవలదె
తలఁపు నీలోనుండి తలఁపంగవలవదే
   పలుకు నీముఖమందుఁ బలుకవలదె
ఆ. యంత్రధారిచేతి జంత్రమున్నటుల నీ
   వాడినట్లు దేహ మాడవలదె
అట్లుగాన నీమహాప్రసాదానాన
   సిద్ధి కేవలంబె చెన్నమల్లు. 16

సీ. జైమినికృతపూర్వమీమాంసకులు చతు
   ర్థ్యంతంబు దా దైవ మని గుఱించి
కర్త లేఁడని కర్త కర్మంబె యని 'స్వర్గ
   కామో యజే' త్తను కర్మకాండ
భాట్టశాస్త్రంబను భాష్యంబుసేయు భ
   ట్టాచార్యలింగమ ట్లంతరింపఁ
బోరి మహిమ్నమునముఖరయతి మోహాయ
   జగతా మనుచు నున్నశాస్త్రమతము
తే. నడచెఁ గావున తత్త్వమహత్త్వశక్తిఁ
   దగిలి మీమాంసకులముక్కుఁ బగులఁ గోసి

నట్టిభక్తుల వేదవేదాంతసార
శేఖరులఁ జేర్పవే నన్నుఁ జెన్నమల్లు. 17

సీ. సంకీర్ణలౌకికాచారవర్జితుఁడేని
విధినిషేధక్రియావివశుఁ డెట్లు
విధినిషేధక్రియావిరహితవర్తిలే
యుభయకర్మఫలప్రయుక్తు లెట్లు
ఉభయకర్మఫలోత్తరోద్వ్యక్తులేనియు
స్వర్గాదిలోకప్రచారు లెట్లు
స్వర్గాదిలోకప్రచారదూరగులేని
స్తన్యపానక్రియాసక్తు లెట్లు
ఆ. అట్లుగాన లౌకికాచారదూరులఁ
బరమభక్తిరతులఁ బాత్రయుతుల
నతుల తత్త్వయుతుల నట్టిమహాత్ములఁ
జేర్పవయ్య నన్నుఁ జెన్నమల్లు. 18

## ప్రసాదస్థలము.

సీ. కాయంబు నింద్రియోత్కరమును నర్పించి
సంధిల్లు కాయప్రసాది యేని
ప్రాణంబు సత్క్రియాపదమును నర్పించి
సాధించు ప్రాణప్రసాది యేని
శబ్దంబు దచ్ఛబ్దసౌఖ్యంబు నర్పించి
శబ్దించు వచనప్రసాది యేని

గమనంబు గమనసంగతియును నర్పించి
చననేర్చు గమనప్రసాది యేని
తే. తలఁపులను జేష్టలను నర్పితంబుఁ జేసి
సంచరించు వ్యాపారప్రసాది యేని
అట్టి సర్వసంపూర్ణమహాప్రసాద
సన్నిహితులను జేర్పుమీ చెన్నమల్లు. 19
సీ. సన్మనోభావంబు సంధిల్లుటరిదియే
తగిలి ప్రసాదమై తలపులడర
భక్తిసుభాషల భాసిల్లుటరిదియే
కలయ ప్రసాదమై పలుకులడర
విమలభక్తక్రియాంగము చెల్లుటరిదియే
వరలు ప్రసాదమై వ్యాప్తి దనర
చిరతరాంతశ్శుద్ధి దొరకొను టరిదియే
గూఢప్రసాదమై కోర్కులడర
ఆ. ఇంద్రియముల గెల్చు టెట్లరిదియె సమ
స్తాంగములు ప్రసాద మై చెలంగ
అట్లుగాన నీమహాప్రసాదానూన
సిద్ధి కేవలంబె చెన్నమల్లు. 20
సీ. తఱితఱి దలఁచుచో మఱలి నైనను ప్రబు
ద్ధతఁ బ్రసాదమె గాని తలఁపఁడేని
గడగడ వణఁకుచోఁ దడఁబడి నైనఁ జొ
ప్పడఁ బ్రసాదమె గాని పలుకఁడేని

గ్రక్కునఁ బొందుచోఁ గలలోనైన ని
ష్ములఁ బ్రసాదమెగాని ముట్టఁడేని
సరినేగుచోఁ గాలుజాతీయైనను లెస్స
మీాప్రసాదమెగాని మెట్టఁడేని
ఆ. సొలసి యింద్రియముల సొగియించుచోఁ బ్రాణ
మరుగునప్పుడైన నవికలత్వ
సావధానియె సీయాప్రసాదిఁ గూడ (?)
జేర్పవయ్య నన్నుఁ జెన్నమల్లు. 21
సీ. సర్వగతైకభాస్వన్మహాలింగంబు
నిత్యసర్వాఁగసన్నిహితుఁ జేసి
తనువునందున్న స్వతంత్రలింగంబు నె
క్కొన మనోభావంబుకొనకుఁ దెచ్చి
సన్మనోభావత జను నిష్టలింగంబు
ప్రాణపదంబున భరితుఁ జేసి
ప్రాణసంచితుఁ డగు ప్రాణలింగంబును
దనలోన నిడుకొని తాను జూచి
ఆ. బయలు నొడల మనము ప్రాణభావంబున
లోను వెలియుఁ దన్నుఁ దాను మఱచి
లింగగతిఁ జరించి లింగలింగైక్యుల
జేర్పవయ్య నన్నుఁ జెన్నమల్లు. 22
సీ. కనువిచ్చుకనుదృష్టి కనుమూయఁ గనుఁగవ
వెలుఁగుచు లింగంబు వేల్లుబాఱఁ

దలఁచుతలంపున నిలుచుసుఖంబున
నెక్కొన లింగంబు పిక్కటిల్ల
సోకుఁడుతనువున సొగయుప్రాణంబునఁ
బసిగొని లింగంబు ప్రజ్వరిల్లఁ
బలుకుడుపలుకులఁ బలుక నీముఖమున
బరిగొని లింగంబు భరితముగను
ఆ. తగిలి మిగిలి క్రియలఁ దానయై లింగంబు
నిమ్ముకొని నిరంతరమ్ము నట్లు
నుల్లసిల్లు లింగయోగానుభవులను
జేర్పవయ్య నన్నుఁ జెన్నమల్లు. 28

## ప్రాణలింగస్థలము.

సీ. కాయంబునందు నీడ బాయకుండినలీల
ప్రాణంబునందునఁ బాయఁడేని
వెలయ జాగ్రదవస్థఁ దలఁచిన యమ్మాడ్కి
యలరు స్వప్నావస్థఁ దలఁచెనేని
వెలుపలిదృష్టుల వీక్షించువిధమున
భావంబునందునఁ బదిలుఁడేని
బాహ్యార్పణంబునఁ బరవశుఁ డైనట్టి
మానసార్పితసావధాని యేని
ఆ. నతనిఁ జెప్పనొప్పు ననిశంబు నతనిసాం
గత్య మొప్పు నతనిగన్న నొప్పు

నట్లుగాన నీమహాభక్తియుక్తులఁ
జేర్చి బ్రోవు నన్నుఁ జెన్నమల్లు. 24

## శరణస్థలము.

సీ. చేసిన నుపచారి చేయమి సోమరి
ఫలము గోరక చేయు భక్తిపరుఁడు
పొగడినఁ బ్రౌఢుండు పొగడమి మూఢుండు
నిరవెఱ్ఱి పొగడఁ గవీశ్వరుండు
వలెనన్న సంసారి వలదన్న నిర్మోహి
వలదనర్పితమన్న బహుప్రసాది
తలఁచిన సువిధాని తలఁపమి యద్వైతి
తన్ను మఱువఁ దలఁపఁ దత్త్వవిదుఁడు
ఆ. అట్లుగానఁ దద్జ్ఞులగుమహాభక్తుల
సరస లింగకవులసత్ప్రసాద
రతులఁ బరమతత్త్వయుతుల మహాత్ములఁ
జేర్పవయ్య నన్నుఁ జెన్నమల్లు. 25

సీ. ఏదెసఁ జూచిన నాదెస లింగంబు
దృక్కులవెంబడి తేజరిల్లు
ఎక్కడఁ జూచిన నక్కడ లింగంబు
మునుఁగుచు నిలుచుచు మూర్తిఁగొనక
ఎచ్చోటఁ జూచిన నచ్చోట లింగంబు
మనమునఁ జిట్టాడుచును బెనంగు.

ఎమ్మెయిఁ బొందిన నమ్మెయి లింగంబు
దనువునందునఁ దొట్రుకొనుచుఁ దనరు
తే. తివిరి పలుకుల లింగంబు తీఁగసాగఁ
దొడరిపలుకుల లింగంబు ముడివడంగ
నతిశయిల్లెడు పరమలింగానుభవులఁ
జేర్చి రక్షింపవే నన్నుఁ జెన్నమల్లు. 26

సీ. తనువెల్ల నీప్రసాదమె గాని పొందదే
పునరాగతము మాన్పు మనఁగనేల
మనుచు సద్భక్తుల మఱిగాని యొల్లదే
బ్రతికింపుమని దైన్యపడఁగనేల
ప్రాణముల్ నినుగాని భజియింపకుండదే
యపవర్గ మిమ్మని యడుగనేల
విషయముల్ నినుగాని వేధింపకుండవే
యవగుణంబులఁ జేర్పు మనఁగనేల
ఆ. యెఱుక నిన్నెగాని యెఱుఁగదే సద్భక్తి
యొసఁగు మొసఁగు మనుచుఁ గొసరనేల
కోర్కి నిన్నెగాని కోరదే మఱియొండు
విన్నపంబులేల చెన్నమల్లు. 27

సీ. కనుమాయఁ దెఱచు నీకన్నులవెంబడి
వినుచుండు వినఁడు నీ వీనులందు

స్వాదించు మోదించు నీదు నాలుకయందు
గంధించు నొాగయు నీఘ్రాణమందు
స్పర్శించుఁ బాయు నీసర్వాంగములయందుఁ
దలఁపించు తలఁచు నీతలఁపులందు
గమనించు నిలుచు నీగమనాగమములందు
భాషించు మాను నీభాషలందు
ఆ. నీడబోలు తాను నీడనై బాహ్యాంత
రప్రవర్తనముల నీప్రసాద
సౌఖ్యమునను బొదలు ముఖ్యప్రసాదులఁ
జేర్పవయ్య నన్నుఁ జెన్నమల్లు. 28

సీ. నీవె కర్తవటన్న నిక్కంబు భక్తుండు
తానన్న నుభయకర్మానుగతుఁడు
నీకె యన్నను సదా నియతప్రసాదాంగి
తనకన్న నింద్రియతత్పరుండు
నిన్ను నెఱింగిన నేనైనశరణుండు
తన్ను నెఱింగినఁ దామసుండు
నీవు తానన్నను నిజము లింగైక్యుండు
తాను నీవనిన నద్వైతవాది
ఆ. కాన కాయకర్మగతిమతిశబ్దచై
తన్యభావములను దన్ను మఱచి
లింగగతి చరించు లింగలింగైక్యులఁ
జేర్పవయ్య నన్నుఁ జెన్నమల్లు. 29

## ఐక్యస్థలము.

సీ. ధర 'నవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ'
యనుకర్మయోగంబు నవహసించి
యేదియు లేక 'జ్ఞానాదేవ మోక్ష'మఁ
జ్ఞానయోగంబు హాస్యంబుజేసి
వదలక 'యాత్మనా మిద మగ్రజే'త్తను
ధ్యానయోగంబును నాశ్రయించి
* తగవెంచఁ 'బూజ్యా యథామవాయం'బను
భక్తియోగంబుచే బాగుగాను
ఆ. జేవ పొదలు పరమశివయోగసుఖసుధా
శరధి మఱచి తన్ను జగము మఱచి
లింగగతిచరించు లింగలింగైక్యులఁ
జేర్పవయ్య నన్నుఁ జెన్నమల్లు. 30

సీ. కరుగనబోసినకరణి సమస్తాంగ
ములు నిండి నీలోన మూర్తిగొనఁగ
గండరించిన భాతి గలయు ప్రాణంబున
నెలకొని నీరూపు నిగ్గుదేర
అచ్చునొత్తినయట్లు నంతరంగంబున
నెలకొని శృంగార మెలమి మిగులఁ

* తగ 'పచ పూజ్యో యథాహ్యాహం' బనుభక్తియో
గంబు ముక్తికిఁ జేగఁగాక, తివిరి.

జిత్తరించినభాతి చేష్టలు దవిలిన
యాకారరేఖ సముంచితముగ
ఆ. బ్రాసుజేవబలియు మాడ్కి సందడి తన్ను
నెఱుఁగఁ దెలిపి లేక కలఁకపడక
నీవయై చరించు నీమహాభక్తులఁ
జేర్పవయ్య నన్నుఁ జెన్నమల్లు. 31

సీ. భక్తస్థలంబునఁ బదమూఁడు మాహేశ
పదమున నైదు నేర్పడఁ బ్రసాద
పదమున మూఁడు మత్ప్రాణలింగికి నాల్గు
శరణస్థలంబున నరయ నైదు
నైక్యస్థలంబున కలవడ రెండను
షట్స్థలవిజ్ఞానసరణి యొప్పి
తీతిని ముప్పదిరెండు సీసపద్యంబులు
సరసోక్తిగాఁ బాలకురికి సోమ
తే. నాథుఁ డనవొర్పు నారాధ్యనవ్యమూర్తి
యఖిలవేదపురాణశాస్త్రార్థవిదుఁడు
వీరశైవసభాయోగ్యవిదితముగను
జెన్నమల్లేశుప్రీతిగాఁ జెప్పె నిట్లు. 32

---

సీ. నలి ప్రాణలింగంబునకు భూమి మోవని
కొలనిజలంబులు జలకమార్చి

పుట్టని చెట్టునఁ బుట్టిన కెందమ్మి
    పుష్పంబుఁ గోయక పూజఁజేసి
అడరి యుష్ణముగాని యగ్నిలోన దశాంగ
    మిడక ధూపపుఁదావు లిచ్చు పేర్చి
తొడరి దీపముగానితునియలు ముడిపెట్టి
    నీలనెత్తకయ నివాళినిచ్చి
ఆ. రసముగాని యోగిరము గూడ నడ్డించి
యర్పణంబు లోన నలరెనేని
శీలవంతుఁ డతఁడు సిద్ధంబు నన్నట్టి
శీలవంతుఁ జేర్పు చెన్నమల్లు.

సీ. శ్రీగురు నకట వాసిగఁ గాలదన్నిన
    మేరువానందంబుఁ జేరుపూజ
విలుపవే భజియించు నెపమున లింగని
    నీరూపు నతులితనిరవగుణము
సర్వేశు కదునర్థి పర్విసచూడ్కి-ని
    సంకీర్ణజైమినిసాటికాయ
తరితరి సన్మనోనిరతికాయమునందుఁ
    గనువిచ్చుడును సర్వగతమనంగ
తే. చెలఁగి నలి ప్రాణలింగంబుఁ జేసి ననుప
నీవ కర్తవు తనువెల్ల నిర్మలముగ
నేదెసను జూచి కనుమూయ మోద మెసఁగ
ధర నవశ్యంబు కలపున వెలపులేక.

క. చెనమల్లేశ్వరుపేరిట
సునిశితముగఁ బాలకుఱికి సోమేశుఁడు దా
ఘనభక్తి వెలయఁ జెప్పెను
చెనమలు సీసంబు లనఁగఁ జెలఁగ ధరిత్రిన్.

క. ఈసీసము లేవేళను
భాసురముగఁ బఠనసేయుభక్తుల కిలలో
వాసిగ భుక్తియు ముక్తియు
నాసర్వేశ్వరుఁ డొసంగు ననవరతంబున్.

క. పదమూఁడునైదుమూఁడును
పదపడి నాల్గైదు రెండుపద్దెంబులు దా
విదితభక్తాళిషట్ప్నల (?)
మది వెలయఁగవలయుఁ జెన్నమలుసీసంబుల్.

సమాప్తి.

---

53

# పీఠిక.

ఈశతకమును యథావాక్కుల అన్నమయ్య శా. శ. 1164 కు సరియగు (క్రీ. శ. 1242) శుభకృత్సం వత్సరమున రచియించినటుల 130, 133, 142 పద్యములంబట్టి తెలియుచున్నది. ఈతఁడు కాలమునుబట్టి తిక్కన సమకాలికుఁడుగాఁ జూపట్టుచున్నాఁడు.

ఈతఁడు వీరశైవుఁడు. దూదికొండ సోమేశ్వరారాధ్యులవారిశిష్యుఁడు. అమోఘకవితాధారాసంపన్నుఁడు. గ్రంథమువలన నీతనికులగోత్రాదులను గురుతింపవీలుకలుగదు. ఈశతకము కవి తానుస్వయముగాఁ జెప్పుకొన్నటుల (చూ. ప. 133) భక్తిరంజనముగ, తత్త్వప్రకాశముగ, చిత్రార్థబంధురముగ, శ్రోత్రానందకరముగ నుండె ననుట కెట్టిసంశయము లేదు. కవిత నిర్దుష్టముగ నున్నది.

ఈతనిగుఱించి యాంధ్రసాహిత్యపరిషన్ముద్రిత ప్రతి పీఠికయందు,

"యథావాక్కుల అన్నమారాధ్యుఁ డాత్రేయ సగోత్రోద్భవుఁడు, యజుశ్శాఖాధ్యాయి, గోదావరీ తీరవాసి, రాజమహేంద్రవరమునకు సమీపమున నున్న పట్టెస మనుగ్రామమందు వెలసిన వీరభద్రేశ్వ

రస్వామి యీాయనకు నిలువేలుపు. ఈ మహనీయుఁ డొకప్పుడు శ్రీశైలయాత్రకు వెడలి శ్రీమల్లికార్జున స్వామిని సేవించి తిరిగివచ్చుచుఁ బల్నాడుతాలూకాలో జెట్టిపాలెముదాపునఁ గృష్ణాతీరమందు విశ్వామిత్రాశ్రమ మనఁబడు సత్రశాల యనుపుణ్యస్థలమున శ్రీమల్లికేశ్వరస్వామిని సేవించుచుఁ గొంతకాలముండి యచ్చటనే యీసర్వేశ్వరశతకమును రచించెను. ఒక్కొక్కపద్య మొక్కొక్కతాటియాకుపై వ్రాసి యాయాకును గృష్ణలో వైచి యది ప్రవాహమున కెదురీఁదివచ్చెనా దానిని దీసి సూత్రమున నెక్కించెద. అట్లేయాకైన రాక క్రిందికిఁ గొట్టుకొనిపోయెనా యప్పుడే నాశిరము ఖండించికొనియెద నని శపథము చేసి మెడకుగండకత్తెరవైచుకొని యాకుల మీాఁదఁ బద్యముల వ్రాసి నీళ్లలో విడిచిపెట్టఁగా నవి తిరిగి వచ్చుచుండినవి. కొంతసేపటికి "తరులం బువ్వులు పిందెలై యొదవి" అను 87-వ పద్య మెదురుగారాక కొట్టికొనిపోవుటఁ జూచి కంఠమును గత్తిరించికొనుట కుద్యమించుచుండఁగా నొక పసులకాఁపరి "నా కొకతాటియాకు దొరకినది చూడుఁ" డని యిచ్చి యదృశ్యుఁడయ్యెను. కవి యాయాకును జూడఁగా దానిపై దానువ్రాసినపద్యమునకు మాఱుగా వేఱొక 88-వ పద్య ముండుటఁ జూచి యిది స

ర్వేశ్వరకృతమని గ్రహించి యాపద్యమును సూత్ర
మున కెక్కించి తాఁ జేసికొన్న నియమముప్రకార
మున నే శతకమును బూర్తిచేసి కొంతకాలమునకుఁ
బిదప నాసత్రశాలయందే సిద్ధిఁబొందె" నని గలదు.

ఇయ్యది శైవభక్తిరసోద్బోధకమయి హృదయంగమ
ముగానున్నది. ఇం దచ్చటచ్చట ప్రౌఢములగు కల్ప
నలు గలవు. ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రకటిం
చినప్రతియందు లోపము లనేకములున్నందున నిర్దు
ష్టముగ ఈశతకమును ప్రకటించినారము.

ఇట్లు,
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీ ర స్తు.

యథావాక్కుల అన్నమయ్యకవివిరచిత

# సర్వేశ్వర శతకము.

---

శా. శ్రీకంఠుం బరమేశు నవ్యయు నిజశ్రీపాదదివ్య
ప్రభా, నీకోత్సారితదేవతానిటలదుర్నిత్యాక్షర
ధ్వాంతుఁ జి,త్ప్రాకామ్యాంగు నపాంగమాత్ర
రచిత బ్రహ్మాండసంఘాతుఁ జం,ద్రాకల్పుం బ్రణు
తింతు నిన్ను మది నాహ్లాదింతు సర్వేశ్వరా. 1

మ. ఒకమా టీసకలంబు నీమయముగా నూహించు
చు న్వెండి యొ,క్కొకమా టింతయు నీవు గా
వనుచు నే యుక్తిం బ్రశంసింప నే,రక వేదం
బులు చిక్కువడ్డ వనినం బ్రవ్యక్తమై యుండు
భా,వకుఁ డై నీనిజరూప మిట్టి దన నెవ్వం డోపు
సర్వేశ్వరా. 2

శా. జ్ఞానాతీతుఁడ వైననీమహిమఁ బ్రజ్ఞం బూని
తర్కించు టజ్ఞానాంగం బగు నైననుం దమయ
థాశక్తిం బ్రశంసించి దివ్యానందస్థితిం బొందు
వారిం గని భక్త్యావృత్తి ని న్నెట్టివాఁ, డైనం

ప్రస్తుతిసేయుచుండుఁ దనచే నైనంత సర్వే
శ్వరా. 3

మ. అమితాంభోజభవాండభాండనిలయం బైయుం
డు నీయంతరం,గముప ట్టెంతయొ దాని కింక
బహిరంగం బెట్టిదో సూక్ష్మత, త్త్వము దా నంత
కుమీఁద నేమివిధమో తా నిట్టి నీపెంపుమా,
ర్గము నీకైన నచింత్య మెట్లొరుఁ డెఱుంగం
జాలు సర్వేశ్వరా. 4

మ. ఇన విఘ్నేశ్వరమాతృకాద్రుహిణ బ్రాహ్మీ
స్కంద దుర్గారమా, వనితాధీశ్వర భైరవుల్
బలిసి భాస్వద్భక్తిసంయుక్తి నీ,కనిశంబుం బరివా
రభృత్యనికరం బై రన్న ని న్నింకఁ గొ,ల్వనివా
రెవ్వరజాండభాండములలో వర్ణింప సర్వేశ్వరా.

శా. ఏపారంగ •నజాండభాండనికరం బేరూపులోఁ
బుట్టి యు,ద్దీపించు న్మఱి రూపు లెల్ల సమసు ప్తిం
బొంది యేరూపులో, లోపించుం గలయంగ
నంతటికిఁ దా లోనై విజృంభించి యే,రూపం
బవ్యయ మై వెలుంగు నది నీరూపంబు సర్వే
శ్వరా. 6

మ. జలజాతప్రభవాండబుద్బుదము లశ్రాంతంబు
నుం బుట్టుచుం, గలయం గ్రాఁగుచునుండు

నీపృథులలింగస్ఫారగర్భాబ్ధిలో,పలఁ దద్బుద్బుద
గర్భవాసులు హరి బ్రహ్మాదిదేవాలియుం, గలదే
వారికినీమహత్త్వమెఱుఁగంగాశక్తిసర్వేశ్వరా.

మ. భవదున్మేషవిజృంభణంబు పరికింపంగా సరోజాత
సం,భవుజన్మంబు భవన్నిమేష మమితబ్రహ్మాండక
ల్పాంతమై,రవసంక్షోభిత మన్నఁ దక్కిన భవ
త్ప్రారంభభూరిక్రియా, నివహం బెవ్వరు నేర్త
రిట్టి దని వర్ణింపంగ సర్వేశ్వరా. 8

మ. పవనుం డై హిమధాముఁ డై యనలుఁ డై పా
నీయ మై యాత్మ యై, రవి యై యంబర మై
మహీవలయ మై రమ్యాష్టమూర్తిక్రియన్,
భువనాండంబులు లక్షణాంగములుగాఁ బుట్టించు
నత్యద్భుతో, త్సవలీలావిభవంబుతోడ భవదా
జ్ఞాశక్తి సర్వేశ్వరా. 9

మ. జలజాతప్రభవాండభాండములు దుశ్చారిత్రులం
జాత్రులం, జెలువై యుండ యథాప్రమాణము
లుగా శిక్షింప రక్షింప ని,శ్చలలీలం బ్రభవించు
రాజు భవదాజ్ఞాశక్తిఁగా కింతవ,ట్టొలమిం జేకొని
నిర్వహింప మఱి రా జెవ్వండు సర్వేశ్వరా. 10

శా. జ్ఞానజ్యోతి విజృంభమాణముగ నోజన్ విష్ణువి
ధ్యాది దే,వానీకాత్మదశావళిం దవిలి నీ వారంగ

వారిం గళా,జ్ఞానప్రౌఢులఁజేయుటన్ వెలయఁగా
సర్వజ్ఞశబ్దంబు దా, నీనామాంకముగా విధించు
నిగమానీకంబు సర్వేశ్వరా. 11

మ. సురల న్మర్త్యసమూహిగా మనుజులన్ శోభిల్లు
బృందారకో,త్కరముంగా ఘను నల్పు నల్పుని
ఘనుంగాఁ బుణ్యపాపాలిచేఁ, దిరుగ న్రైవెదుదు
నీమహామహిమ ప్రీతిం బద్మజాండంబునం, దర
యన్ జీవుల నింద్రజాలములుగా నాడించు
సర్వేశ్వరా. 12

మ. ఘనుఁడై యేచి దశాననుండు బలిమిం గైలాస
శైలేంద్ర మెత్తినఁ దద్దానవనాథుఁ ద్రొక్క
నతఁ డర్థి న్మ్రొక్కినంగాచి ప్రాక్తన శౌర్యాధికుఁ
జేసె దుష్టు నణఁపంగా శిష్టు రక్షింప రం,జనతో
నెప్పుడు వేచియుండు భవదాజ్ఞాశక్తి సర్వే
శ్వరా. 13

మ. తమకం బెత్తిన నాత్మజం గడు మదాంధవ్యాప్తి
నేకాంతప,క్షమునం దెవ్వరుఁ గానకుండఁ గవ
యంగాఁ బోయి నీబాణఘా, తమునం బద్మభవుం
డు బ్రెస్సె ననినం దాఁ దప్ప వర్తించి లో,కమునం
దెవ్వరి కింక నిన్ను నెఱుఁగంగా వచ్చు సర్వే
శ్వరా. 14

మ. పలుజన్మంబులఁ గూడఁబడ్డ భవకుంభద్ఘోరదు
ష్కర్మరాసులుపైఁ గూలి సమస్తజీవులు వెసన్
శోషించుచు న్బెద్దదుర్బలు లై చిక్కిన దద్భవా
పహరణార్థం బొప్పఁ బద్మోద్భవ, ప్రళయం
బొక్కొకమాటు సేయుదు తుదిన్ భావింప
సర్వేశ్వరా. 15

మ. సుమహాత్పద్మభవాండపంక్తుల లయక్షోభప్ర
తాపంబుతోఁ, నిమిషార్థంబునఁ గ్రాఁచి పెంపెసఁగు
నీనేత్రానలజ్యోతి య,య్యుమమీనాంకజలంధర
త్రిపురదైత్యాలి న్విజృంభించి భస్మముగాఁ
జేయుట నిశ్చయింప నిదిదా శౌర్యంబె సర్వే
శ్వరా. 16

మ. అతిదక్షుం డగుదక్షుఁ డీజగములో యాగంబు
సల్లక్షణ, స్థితిగాఁ జేయుచునుండి మిమ్ము మదిను
ద్దేశింపమిఁ జేసి తాహతుఁ డయ్యెం దుది నట్టి
కార్యములుఁ బొందైయుండునే కర్తసమ్మతితోఁ
జేయని దుర్మదుండు మనునే భావింప సర్వే
శ్వరా. 17

మ. జగతీచక్రము పాదఘట్టన నదృశ్యం బై ప్రవ
ర్తింపఁగా, గగనం బంతయు బాహుమండల
సమగ్రవ్యాప్తులం దద్భుతంబుగ ఘూర్ణిల్ల నజాం

త్యవేళల సముద్భూతాంగహారావళుల్, నిగు
డం బొంగి నటింతు తాండవమహానృత్యంబు
సర్వేశ్వరా. 18

మ. అమరేంద్రాబ్జభవాళి కెన్నఁ దుది నీవాడిం బ్ర
సాదింప న, ర్థము సిద్ధించుచు నుండుఁగాని సుర
మాత్రుం గోరిన స్వీరికా, ర్యము సిద్ధింప దనేక
మార్గములఁ బ్రారంభించిరే నిశ్చయా,ర్థముగా
నీవ సమస్తకర్త వగుటం దర్కింప సర్వేశ్వరా.

మ. అమరంగా స్ఫుటభక్తినాటకము భాషాంగక్రి
యాంగాభిర, మ్యముగాఁ జూపినమెచ్చి మీరిల
బలే యన్నంతకుఁ బోనిగే, హములఁ రూపు
లు పన్నుకొంచును నటుండై వచ్చి సంసారరం,
గములోనం బహురూపమాడు వెలయంగా జీవి
సర్వేశ్వరా. 20

శా. శ్రీవత్సాంకు రమావిశేషతయు వాక్శ్రీనాథుచా
తుర్యముల్, దేవాధీశ్వరు వైభవోన్నతియు నా
తిగ్మాంశు తేజంబు శ్రీ,దేవీనందనురూపవిభ్రమము
చింతింపంగ నీభక్తిస,ద్భావాత్మం డగుపుణ్య
మూర్తికిఁ దృణప్రాయంబు సర్వేశ్వరా. 21

మ. ఇల సద్భక్తులపాదధూళిపటలం బేమర్త్యఫాలం
బునం, జిలుకు న్వాఁ డపవర్గనాథుఁ డనిన సిద్ధం

బుగా వారిని,ర్మలహస్తార్పితభూతిఁ బ్రీతి నొస
లారం బూయు విశ్వాసికిన్, ఫల మూహించి
విధించి యెవ్వరికిఁ జెప్ప న్వచ్చు సర్వేశ్వరా.

మ. పలుతీర్థంబులఁ గ్రుంకుకంటె మహిలో భక్తాం
ఘ్రిపానీయముల్, తలమీఁదం జిలికించుకొన్న
శుచితీర్థం బాడ భారంబు త, త్ఫల మత్యల్పము
భక్తపాదయుగళాంభస్స్పర్శనిర్భర మై, యల
రున్ శాశ్వతభుక్తిముక్తిఫలదం బై యుండు
సర్వేశ్వరా. 23

మ. రమణన్ భక్తసమగ్రదర్శనము తీర్థశ్రేణి తద్గో
ష్ఠి తీ, ర్థము తద్దివ్యదయావలోకనము తీర్థం బెన్నఁ
గా నిట్టి జం,గమతీర్థాంబుధి నోలలాడక వివేక
భ్రష్టులై పోయి లో, కములోఁ దీర్థములంచు
నేఱులు సొఱంగా నేల సర్వేశ్వరా. 24

మ. కమనీయం బగుసర్వతీర్థములు లింగం బున్న చో
మూర్తిమం, తములై యొప్పుచునుండు లింగ
మును దాత్పర్యంబుతో భక్తగా, త్రములం
దెప్పుడు నుండుఁగాన మహిలోఁ దత్త్వార్థమూ
హింపఁ దీ,ర్థములం దెల్లను దివ్యతీర్థము భవద్భ
క్తుండు సర్వేశ్వరా. 25

మ. ధరణిం దీర్థము లాడుకంటె నతిమోదం బొప్ప

యజ్ఞంబులం, బరగం జేయుటకంటె సువ్రతము
లొప్పన్ వేదశాస్త్రార్థత, త్పరుఁడై యాదటఁ
జల్పుకంటె మది నుత్సాహించి నీభక్తిమ, త్పురు
షశ్రేష్ఠులఁ బూజసేయుట మహాపుణ్యంబు సర్వే
శ్వరా. 26

మ. భవదీయామలతత్త్వనిర్ణయకళా ప్రఖ్యాతసద్భ
క్తవుం, గవగోష్ఠీ సుఖవార్థిలోనఁ గడువేడ్కం
దేలినం గాక యీ, భువిలోఁ దీర్థజలంబులం గడ
గినం బోనేర్చునే ఘోరదు, ర్భవసంఘాకలితా
త్మతామసమహాపంకంబు సర్వేశ్వరా. 27

మ. ధరణిం బ్రాక్తనభక్తనిర్మితమహాస్థానంబు లై
యొప్పు శ్రీ, గిరిముఖ్యం బగు దివ్యతీర్థములు
భక్తిం జూచిరే వారిదు, స్తరదోషంబులువాయు
నన్న మఱిసాత్త్విక భక్తులం జూచినం, బరమార్థం
బుగఁ బాయదే నరులపాపం బెల్ల సర్వేశ్వరా.

మ. కని సద్భక్తుల కంత నంతఁగడు వేడ్కన్ హృత్ప్రి
ణామంబు సే, సినమాత్రం జెడు సర్వదోష
ములు తచ్ఛ్రీపాదము ల్ముట్టి మ్రొక్కిన సర్వాం
గసమగ్రశుద్ధి యగుభక్తిన్ వారికిం బ్రీతిచేసినఁ
ద్వద్దివ్యదయావలోకనఘనశ్రీలొందు సర్వేశ్వరా.

మ. జలజాతప్రభవాచ్యుతాదులు మదిం జర్చించి

చర్చించినీ,కలరూ పారయ లేక చిక్కులఁబడం
గా నిన్ను హాస్తార్పితా, మలకవ్యాప్తికిఁ దెచ్చి
యేర్పఱచి సంబంధించి చేకొన్న భక్తులశౌర్యం
బుపమింప నెవ్వఁడు సమర్థుం డింక సర్వేశ్వరా.

మ. అమరన్ భక్తగణాత్మమధ్యమము లింగావాస
మీలింగ మ, ధ్యమముం బద్మభవాండభాండ
నిలయంబై యుండుటన్ భక్తితృ, ప్తిమహాలింగ
ము తృప్తియై మహిమ నుద్దీపించుఁ దల్లింగతృ,
ప్తిమహత్త్వంబున నీసమస్తమును దృప్తిం బొం
దు సర్వేశ్వరా. 31

మ. అనురాగంబున నిన్నుఁజూచుఁ దలపోయన్
జొక్కుఁ గాంక్షించు వర్ణనసేయం దమకించు
సిగ్గు విరియన్ బ్రార్థించు శోషించు నం,తనెదన్
ధ్యానము దాల్చుఁ దన్ను మఱచుం దా నీద
శావస్థలం, దనరంగా మది నిన్ను డక్కఁ గొను
సద్భక్తుండు సర్వేశ్వరా. 32

మ. ఎలమిన్ భక్తుఁడు వక్రుఁడై నడిచెనే నేపారఁగా
దానికిం,గలుషింపంగలహింపఁగింకిరిపడంగా దెట్టి
చోనైననిర్మలగంగాపృథులప్రవాహ మరయం
బ్రస్ఫూర్తిఁ దానెన్నివం,కలుగాఁ బాఱిన దాని
నొందు వలుకంగాఁ జన్నె సర్వేశ్వరా. 33

మ. సికతాభాసము నీకుఁ జేసి మదిలోఁ జెన్నొంది
క్రీడించు బాలకు లింద్రాధికు లన్న నీగుడు
లతిశ్లాఘ్యేష్టకాష్ఠాదులన్, సుకుమారంబుగ
నెత్తి భూతలములో శోభిల్లువంశప్రదీపకు సౌ
భాగ్యము మానమెవ్వారికిఁ జెప్పవచ్చు సర్వే
శ్వరా. 34

మ. భవదభ్యర్చనవేళలన్ భవుల సంపద్భావింతు
లన్ దీనమా, నవులన్ విద్విషులన్ భవాతురుల
సన్మానించుటల్ సౌఖ్యము,ఖ్యాతిహాఁగేచ్ఛలు నీ
మహాత్త్వములు నిత్యానంద మూహించుచో,
భువి నీభక్తుల కాత్మలో విరసము లుత్పత్తించు
సర్వేశ్వరా. 35

మ. కరుణం జేకొని రేని రౌరవపదగ్రస్తాత్ము దేవేం
ద్రుఁగాఁ, బరగం జేయుదు రాత్మలో నలిగిరేఁ బర్జ
న్యనారౌరవా,త్కరపంకప్రవిలీనకీటకముఁగాఁ
గల్పింతు రన్నట్టిచో, నరయన్ భక్తులశక్తియె
ట్లు గుఱిసేయ న్వచ్చు సర్వేశ్వరా. 36

మ. రమణీయక్షితిపాలుఁ డింద్రుని చతుర్మాసక్రమా
యుష్యుఁడా, యమరేంద్రుం డజునాడికాద్వయ
మువాఁడా బ్రహ్మ యుష్మన్నిమే, షమువాఁడం
చును వీరినెల్ల నగు నీసాలోక్య సామీప్యసత్త

మరాజ్యస్థితిపట్టభద్రుఁ డగుసద్భక్తుండు సర్వే
శ్వరా. 37

మ. ప్రకటింపంగ సమస్తపాతకములం బాపంగ నీపూ
జయం,దొకపుష్పాంశము చాలు నన్న మహిలో
నూహింపఁగా నీపదా,ర్చకు లేమార్గమునందు
శుద్ధులు మదిం జర్చింపఁ దద్దుర్గుణ, ప్రకరంబె
న్నెడివాఁడు లోకములలోఁ బాపిష్ఠి సర్వేశ్వరా.

మ. తమతేజంబుఁ దృణీకరించుచు సముద్యత్తేజు
లై మీఁదిలో, కములందుఁ జరియించు నీయ
చలభక్తశ్రేష్ఠులం జూచి నె,య్యమునం దారును
దద్విధంబునను ని స్సర్చింప నూహించి మ, ర్త్య
మునం బుట్టఁగ వాంఛసేయుదు రమర్త్యశ్రేణి
సర్వేశ్వరా. 39

మ. అమరన్ భక్తుల కెల్ల నీవహృదయం బైయుం
డుట న్వారి సౌ,ఖ్యము నీసౌఖ్యము వారికూ
ర్మియు సమగ్రం బైననీకూర్మి త,త్త్వము భావిం
పఁగ వారికోపము భవత్ప్రఖ్యాతరౌ,ద్రప్రభా,వ
ముదా వారలవాక్యనిర్ణయము నీవాక్యంబు
సర్వేశ్వరా. 40

మ. అవనిం బెన్నిధి భాగ్యహీనునకుఁ బ్రత్యక్షంబు
గాకప్డు డొం,డవ భాండాకృతిఁ దాల్చి మాఁ

టువడి మాయావృత్తి నున్నట్లు దా, భవదీయ
ప్రతిబింబమూర్తి యగుసద్భక్తుండు సంసారదు
ర్వ్యవయసాయాత్ముల కెల్లఁ గేవలనరుండై తోఁ
చు సర్వేశ్వరా. 41

మ. క్షితిపై శ్వేతమునీంద్రుఁ జంప నలుకం గీనాశుఁ
డేతెంచి నీ, యతికోపోజ్జ్వలనాహుతి న్మడిసెఁ
దథ్యం బేకనిష్టాసమ, న్వ్రతులం జేకొనిభక్తవత్సలుఁ
డవై నీ వెప్పుడు న్గావఁగాఁ, బ్రతిపక్షావలి కెట్లు
వారి దెసఁ జేరన్వచ్చు సర్వేశ్వరా. 42

శా. కింకం దన్ను నదల్చి చక్రమునఁ దాఁ గృష్ణుం
డసి నైవ్రేచినం, బొంకం బొప్పఁగ దానిఁ దుత్తు
ఱుముగాఁ బోఁదట్టి యుప్పొంగె ని,శ్శంకాత్ముం
డు దధీచి శాశ్వతులు నీసద్భక్తు లూహింపఁగా,
సంకల్పప్రభవప్రతాపవనభాస్వద్దావసర్వేశ్వరా.

మ. ఘటదుగ్ధంబులు వేఱుగాక వెలయంగా నెంత
తోడంటి న,న్నటదుగ్ధాంబుధి వేఱనే జగము
లోనల్పుండు దుస్సంగతిం,జటులాత్ముం డగుఁగా
క యెయ్యెడల నీసద్భక్తుఁ డేకార్యము, త్కట
మై తాఁకిన నన్యచిత్తుఁ డగునే తర్కింప సర్వే
శ్వరా. 44

మ. సతి వేడ్కం దనప్రాణవల్లభునితో సంయోగమర్థిం

ధుఁగా,కతనిం బ్రార్థనసేసి సొమ్ముగొనిపో నర్హుఁ
డునే భక్తుఁడీ,తీతి నీభక్తియ వేఁడుఁ గాక మ
తి నీశ్రీపాదము ల్గొల్చి కు, త్సితకామ్యార్థము
లొండు వేఁడుకొనునే చింతింప సర్వేశ్వరా. 45

మ. భ్రమరధ్యానము దాల్చి కీటకము సద్భావాది
సంయుక్తిఁ దా, భ్రమరంబై ఖగవీథి నాడు నని
నన్పాటించి నిన్నాత్మ నె,య్యముతో ధ్యానము
సేయుమర్త్యుఁడును నీయట్లే పరవ్యోమత, త్త్వ
మునం దవ్యయలీల నుండు టరుదే భావింప
సర్వేశ్వరా. 46

మ. అమరశ్రేణులకు న్సుధామయకళౌఘాత్మీయసా
రంబు ర,మ్యముగాఁ గ్రోలఁగ నిచ్చి తా నొక
కళామాత్రాంగుఁడై యున్న చం, ద్రమునింజూచి
జగమ్ము మ్రొక్కు గతినారన్ భక్తపూజావిధి,
క్రమభాంగకృశుఁ జూచి మ్రొక్కుదురు లోకం
బెల్ల సర్వేశ్వరా. 47

మ. చెదరం బాలు దశప్రభంజనములన్ శిక్షన్ సు
షుమ్నంబునం, గుదియంబట్టి చలింపకుండ శశి
నర్కుం గట్టి భాస్వన్మన,స్సదనస్థానమునందు ని
న్నెలమి సంస్థాప్యంబు గాఁ జేసి తా,హృదయా
నందరసాబ్ధిఁ దేలు శివయోగీంద్రుండుసర్వేశ్వరా.

మ. వెలి వీక్షించిన నీస్వరూపమె మహావిస్పష్టమై
యాత్మలో,పలభావించిన నీస్వరూపమె మహా
ప్రవ్యక్తమై దృష్టులం, దలఁపం జేకొని యున్న
నీయచలితధ్యానంబునం జేసి తాఁ,గలనైన న్నివ
యోగి తన్ను జగముం గానందు సర్వేశ్వరా. 49

మ. భవదాకారమె కాంచు నీస్తవకదంబశ్రేష్ఠసద్వా
క్యముల్, చెవులార న్వినుు నిన్నె చెప్పు మది
దుర్నీలేంద్రియాటోపదు, ర్వ్యవసాయాత్ములఁ
గాంచుచో వినెడిచో వర్ణించుచోఁ జీఁకునుం,
జెవిటి న్మూఁగయు నై చరించు మహిం నీశీలుండు
సర్వేశ్వరా. 50

మ. అతిలాలిత్యముగా నహర్నిశము నిన్నర్చింపఁగా
వచ్చు, నస్వతంత్రుఁడై యుండఁగవచ్చు నెల్లకళ
లం బ్రౌఢుండు గావచ్చు వా,క్పతి గా నైనను
వచ్చుఁగాని మతి నీభక్తుండు గారాదు సుస్థితి
గా నీదయలేనిమానవునకుం జింతింప సర్వే
శ్వరా. 51

మ. భవికిన్ భక్తి మహత్త్వ మంకురితమై పాటిల్ల
భక్తుండు వాం,ఛమాత్రుం డగుభక్తి పుష్పిత
ముగాఁ దద్భక్తుఁ డాత్మేశుఁడై,సవిశేషస్థితిఁదోఁ
చు భక్తిసఫలోత్సాహంబునుం బొందఁగా, నవి

కల్పస్థితి నంత భక్తుఁడును నీవైయుండు సర్వే
శ్వరా. 52

మ. సుముఖుండై శివయోగి మోదము మదిన్ శోభి
ల్లఁ జేకొన్న భిక్షము విప్రోత్తమకోటిభోజనస
దృక్షం బన్న సౌభాగ్యయోగముసం దారయ
నమ్మహామహుఁడు వేడ్కం గోరి యారోగిణం
బమరం జేసినపుణ్య మెట్లు గుతిసేయ న్వచ్చు
సర్వేశ్వరా. 53

శా. ఎచ్చో నీపదభక్తుఁ డుండు మది నింపెక్కం బ్ర
యత్నంబుతో, నచ్చో నీవనిశంబు నుండుదు
త్వదీయధ్యానచిన్మూర్తులై, యచ్చో సన్మునులెల్ల
నుండుదురు మంత్రాంగాక్షరాయుక్తులై, య
చ్చోఁ దీర్థము లెల్లనుండు నిది వేదార్థంబు స ..

శా. సత్యం బెప్పుడుఁ దప్పఁడేనియు దురాచారుం
డు గాఁడేని యహంకృత్యం బేమఱఁడేని దుర్జనుల
గోష్ఠిం బొందఁడే భక్తసాంగత్యం బాదటఁ బా
యఁడేని మదన గ్రస్తుండు గాఁడేని నీభృత్యుం
డాతఁడు మూఁడులోకములలోఁ బెంపొందు
సర్వేశ్వరా. 55

శా. పెంపం దల్లియుగుణ రుజాపటలదుష్పీడావిధి
క్షోభ వారింపన్ వైద్యుఁ డగుం గుమార్గవి

ధులం గ్రీడింపఁ బోకుండ శిక్షింపఁగ బల్లిదుఁ
డైనతండ్రి యగుచుఁ శ్రీమంతుఁగా నెంత
యుఁ, సంపద్వృద్ధి యొనర్చు దాతయగు నీసద్భ
క్తి సర్వేశ్వరా. 56

మ. ఉరుసంసారగజేంద్ర గ్వ్రకళనవ్యాఘప్రతాపోగ్ర
కే, సరిదుష్పాపశరీరబంధవిపులత్క్ష్మాజవ్రజచ్ఛేదవి
స్ఫురితక్రూరకుఠారధారదురితప్రోద్భూతజీమూ
తదు, స్తరసంఘాతవిఘాతమారుతము నీ సద్భక్తి
సర్వేశ్వరా. 57

మ. అరివీరప్రకరంబు భీకరతరంబై తాఁకుచో సింహ
సిం, ధురశార్దూలవ్యాఘోరగాదిభయము ల్దోఁచెం
చుచో ఘోర (రోగ) దు, స్తరసంసారవికార
వేదనలు మీఁదం బర్వుచో వజ్రపం, జరమై చే
కొని తన్ను నెత్తుకొను నీసద్భక్తి సర్వేశ్వరా.

మ. కమలాప్తుం డుదయించఁగా ననలనక్షత్రక్షపాధీ
శతే, జము లెల్లం బెంపుబాసి పోవుగతి నీసద్భక్తి
భావంబు చిత్తములోనం బ్రభవింపఁగా నితర
మంత్రధ్యానతద్దేవతా, క్రమమాయాపటలంబు
లన్నియును వీఁకం గ్రాఁగు సర్వేశ్వరా. 59

మ. చటులప్రాయగుణేంద్రి, యాత్ములను వాంఛావృ
త్తి నీభక్తిసం, స్ఫుటమై యుండదు భక్తితత్పరు

లకుం బో ల్పొందఁగాఁ జిత్త ము,త్కటదుష్టేం
ద్రియవర్గతామసపరిగ్రస్తంబుగా దెట్లు చీఁ,కటి
కిం దిగ్మమరీచికింగలదె సాంగత్యంబుసర్వేశ్వరా.

మ. బలవంతుండును దుర్బలుండును మహాప్రౌఢుండు
మూఢుండునుం,గులహీనాత్మకుఁడుః మహాకు
లజుఁడుః గ్రూరుండు శాంతాతిని, శ్చలచిత్తుం
డును నొక్కరూప మది నీసద్భక్తిచిత్తంబులో,
పల వర్ధిల్లిన మీఁద నేవిధమునః భావింప
సర్వేశ్వరా. 61

శా. కామోద్రేకవిజృంభణంబును సమగ్రక్రోధముః
లోభముః, వ్యామోహంబు మదంబు మచ్చర
ము దీవ్రం బైనపంచేంద్రియో,ద్దామాటోపము
గ్రాఁచి పెం పెసఁగు తత్త్వజ్ఞానికిం గాక తా సా
మాన్యాత్ములకేల నూలుకొను నీసద్భక్తి స...

మ. ఉరుపక్షంబులు వచ్చునంతకు నిరుద్యోగంబున
న్వృక్షకో,టరమధ్యంబున నుండుపక్షిగతి నిష్ఠం
గూరి (డి) నీభక్తి వి,స్తర మాత్మం బ్రభవించు
నంతకును నీసంసారకారాగృహాం,తర గేహంబున
నుండి జీవుఁ డతివంతం బొందు సర్వేశ్వరా. 63

శా. లింగారాధన జంగమార్చనము లోలిః భక్తి
కంగంబు ప్రా,ణాంగవ్యాప్తియు నై స్ఫురించు

నిది తత్త్వార్థం బగుం గాన నా,యంగాభ్యర్చన
జంగమాహితకరుం డై చేసినందాశవ(?), శృంగా
రం బగు వానిభ_క్తి మదిఁ జర్పింపంగ సర్వే
శ్వరా. 64

మ. ధరణిం గర్మవిధానభ_క్తి విభవద్ధ్యానో_త్తమజ్ఞాన
ముల్, వరుసం జేర్కొన నాల్గుయోగములు త
_త్త్వం బెందు నీభ_క్తి వి,_స్తరబాహ్యాక్రియ లెల్లఁ
బొల్లు లగుటం దద్భ_క్తియోగంబు తాఁ,బరగం
దక్కనమూఁడుయోగములకుం బ్రాణంబు సర్వే
శ్వరా. 65

మ. అమరంగా ధన మిచ్చి కాతురు మహీయఃప్రీతిఁ
బ్రాణంబుఁ బ్రాణము నర్థంబును నిచ్చి కాతు
రభిమానంబు న్విశేషించి మా,నముఁ బ్రాణం
బును నర్థము న్నొసఁగి సన్మానంబుగా ను_త్తమో,
_త్తమచారిత్రులు భ_క్తిఁ గాతురు ప్రమోదం
బంది సర్వేశ్వరా. 66

మ. అనుబద్ధేంద్రియభూతవర్గము యమాద్యష్టాంగ
మంత్రోరుసా,ధన నుచ్చాటనసేసి పాపి గురు
సద్వాక్యప్రకాశో_త్తమాం, జనదృష్టిం బరికించి
యేర్పఱిచి వాంఛం గోరి సాధించి చే,కొను
చిన్మా_ర్తికిఁ గాని భ_క్తినిధి గీల్కొ దెందు స...

మ. కనకం బందు ఘనీభవించిన కళంకం బెల్ల సువ్య
క్తిగా, ననలాస్యంబునఁ గ్రాఁగిపోవుగతి జీవాత్మం
బ్రవేశించి చేకొని వర్తించిన దుర్మలత్రయపరి
క్షోభంబు నీభక్తిచే, తను బాపంబడుఁ గాని వే
ఱొకటిచేతం బోదు సర్వేశ్వరా. 68

మ. అమరంగా గురుమంత్రకార్ముకమునం దాత్మాస్త్ర
మష్టాంగయో, గమహాముష్టి వివేకియేయుటయుఁ
దత్కాండం బజాఁడాదిత, త్త్వములెల్ల న్వడి
గ్రుచ్చి పాఱి భవదుద్యత్సాక్ష్యకైవల్యల, క్ష్య
మునం దద్భుతశక్తితోడఁ గమియంగా నాటు
సర్వేశ్వరా. 69

మ. తనరం గాయపవిత్రమందు హృదయస్తంభాభి
సంస్థానమై, చను నీధ్యానపటంబు నూల్కొలిపి
భాస్వద్భక్తివాతాహతి, న్వినుతజ్ఞానపథంబు చే
కొని సముద్వేగంబునన్ జీవుఁ డీ, ఘనసంసార
మహార్ణవంబుఁ గడువంగాఁ బాలు సర్వేశ్వరా.

మ. అకలంకస్థిరభక్తి మొన్నెగయ సిన్నశ్రాంతముం
జూచి పా, యకపూజించు మహామహుండు భవద
భ్యర్చ్యుం డగుంగాక దా, సకలేచ్ఛావిషయంబు
లం బొరయుచుం జాపవ్రతం జేయు నా, బకవే
షార్చన లేల నిన్ను సొగయింపం జాలు స...

మ. సముదోఁ(రో)త్సాహసుఖాభిలాషలును నీసంసా
రమాయావినో, దములు స్స్వర్గఫలాపవర్గఫలచి
త్తభ్రాంతులుం బ్రాజ్యరా, జ్యమహాకాంక్షలు
నెన్ని చూడ నివి నీసద్భక్తి కత్యంతరా, యము
లై మాటికి మాటి కడ్డుపడుఁ గామ్యశ్రేణి సర్వే
శ్వరా. 72

శా. మోహధ్వాంతములో మునింగినమహామూ
ఢుం డతిభ్రష్టుఁడై, సోహం బంచుఁ దొడంగి నీకుఁ
గడు దూరాత్ముం డగుంగాని దుస్సాహంకార
గుణంబు మాని మది సొంపారంగ సద్భక్తి దా,
సోహం బన్న భవత్పదార్చకుఁడు నీవైయుండు
సర్వేశ్వరా. 73

శా. చావంబుట్టుచుఁ బుట్టఁ జచ్చుచు మహాచండాల
సంసారపా, రావారంబునఁ గూలి తాఁ జెడుట
కుం బ్రవ్యక్తిగా నాత్మలో, నేవం బొందక
యేను నీ వనుట తా నేజ్ఞానమో శ్రీమహా, దేవా
యిట్టికుతర్కముం గలదె చింతింపంగ సర్వే
శ్వరా. 74

మ. రసికుండై భవదంఘ్రిపద్మయుగ మారాధించుచో
దుర్మద, వ్యసనాటోపము చిక్కులంబొరయుచు
న్వర్తించుచున్నట్టిపా, లసుపూజావిభవం బదొ

ష్పునె మహీ౯ లక్షింప నారంభముం, గసవ్రం
బెంచినచేనియట్లఁ దలఁపంగా మీఁద సర్వే...

మ. అమితోత్సాహము నంది నీకుఁ దనసర్వార్థంబు
లుం గూర్చి నే, మముతో నిచ్చుటకంటె శౌర్య
గుణసామర్థ్యంబునం జేసి ప్రాణము నీ కిచ్చుట
కంటె దుస్తరభవోన్మాదంబు మర్దించి చిత్తము
నీ కిచ్చుట పెక్కుభంగుల మహౌదార్యంబు
సర్వేశ్వరా. 76

మ. ఘనవైరిప్రకరంబుఁ దాఁకి యనిలో ఖండించు
కంటె౯ మృగేం, ద్రుని జేపట్టుటకంట దిగ్గజ
ముతో ద్రోపాడుకంటె౯ మహా, శనిఁ దా
ప్రేయుటకంటె ఘోరభవదుశ్చారిత్రవారించి రం,
జనతోఁ జిత్తము శిక్షసేయుట మహాశౌర్యంబు
సర్వేశ్వరా. 77

మ. అమితామోదనవప్రసూనముల నిస్సర్పించుచో
గద్యపద్యము లూహించి నుతించుచో వివిధగీత
వ్రాతము ల్పాడుచో,నమృతాహారము లిచ్చుచో
నిపుణుఁడై యాటాడుచో నందుఁ జిత్తము సద్భ
క్తియె నీవు చేకొనుపదార్థంబెల్ల సర్వేశ్వరా.78

మ. కడుఁ జిత్రంబుగఁ జేయఁగా నొాఱి సురంగం
బయ్యేనే ఖడ్గమం,దిడకున్నం జెదురూ పదేమి

కొఱ దానిం బెక్కుపాటింపఁగా,నొడ లెబ్బంగు
లనోపునే నియతితో నూహించి ని న్నాత్మలో,
నిడకున్నం జనురూపు లేమికొఱ తా నీక్షింప
సర్వేశ్వరా. 79

మ. జ్వరసంతాపవిశోషితాంగుఁడు సుధాసంకాశది
వ్యాన్నపా,నరసశ్రేణి భుజింప రోయుగతి నున్మా
దేంద్రియధ్వాంతదు, స్తరసంసారమదప్రమత్తుఁ
డు మహాసౌఖ్యోత్సవం బైనమీ,చరణారాధన
యందు బుద్ధిఁ జొనుపం జాలండు సర్వేశ్వరా.

మ. కలయం గాష్ఠయుగంబుఁ గూర్చి తరువంగాఁ
బుట్టి తత్సాధనం,బుల రెంటిన్ దహియించువ
హ్నిగతిఁ దాఁ బొల్పొందఁ గాయంబు సం,ధిల
సత్కర్మముతో మథింపఁగ భవచ్ఛిద్భక్తిసద్వహ్ని
యు,జ్జ్వలమై కాయముఁ గర్మముం జెఱుచుఁ ద
త్త్వం బెన్న సర్వేశ్వరా. 81

మ. స్థిరబుద్ధిం దనసొమ్ము భక్తవరసుక్షేత్రంబునన్
బీజమై, పరగంగా వెదపెట్టి మీఁద నతిసంప
న్నుం డగుంగాక దా, నరిషడ్వర్గముపాలుసేసి
భవమాయాగ్రస్తుఁ డై యిచ్చ నె,వ్వరి వేఁడం
జనువాఁడొకో విషయదుర్వ్యాపారిసర్వేశ్వరా.

శా. కాయం బన్నది వారిబుద్బుదసదృక్షం బందు

రూపింప లే,బ్రాయం బన్నది శారదాంబుదతటి
త్ప్రాయంబు సంపత్సుఖ,శ్రేయం బన్నది మాయ
యిట్లైటేఁగియుఁ జీఘ్రించె నీధ్యానసం,స్థాయీ
భావనఁ బొందఁ డేమిటికయో సంసారి సర్వే...

మ. భవదీయస్థిరభక్తి లబ్ధియు భవద్భక్తైకగోష్ఠియు
వెరా, త్సవలీలావిభవంబు నీయచలితధ్యానాను
మోదంబులౌ,నివి నిత్యస్థితు లారయంగ విధి దే
వేంద్రాదిభూతాఖిలో, త్సవభోగస్థితు లెల్ల మిథ్య
లవి తత్త్వం బెన్న సర్వేశ్వరా. 84

మ. తనుయుక్తి స్భవదంఘ్రిపంకరుహాసద్భక్తుండు పా
పంబుచే,సినఁ బుణ్యం బగు భక్తిహీనుఁడు శ్రుతు
ల్చెప్పట్టి పుణ్యంబుచే,సినఁ బాపం బగు దీని కింత
యును జర్చింపంగఁ జండీశ్వరుం,డును దక్షుండు
ను సాక్షు లెన్న నగరాట్కోదండ సర్వేశ్వరా.

శా. ప్రారంభించి చకోరపోతము మహీయజ్జ్యోత్స్న
యం దుత్సవ,శ్రీరంజిల్లుచు సోలుచుండుగతి నా
చిత్తంబు నీదివ్యశ్రీం,గారధ్యానమునం దహర్ని
శముఁ జొక్కంజేయవే దేవ శ్రీ,గౌరీలోచనన ర్త
కీనటనరంగస్థాన సర్వేశ్వరా. 86

మ. తరులం బుష్పలు పిందెలై యొదవి తత్తజ్జా
తితోఁ బం డ్లగుఁ,హార మీపాదపయోజపూ

జితములై యత్యద్భుతం బవ్విరుల్, కరులా నశ్వ
ములా ననర్ఘమణులోఁ గర్పూరమా హారమా,
దరుణీరత్నములోఁ బటీరతరులోఁ దథ్యంబు సర్వే
శ్వరా. 87

మ. ఒకపుష్పంబు భవత్పదద్వయముపై నొప్పంగ
సద్భక్తిరం, జకుఁడై పెట్టిన పుణ్యమూర్తికిఁ బునర్జ
న్మంబు లే దన్నఁ బా, యక కాలత్రితయోపచా
రముల ని న్నర్చించుచుండ్ బెద్దనై, స్థిరుఁడై
యుండెడువాఁడు నీ వగుట దాఁజిత్రంబె సర్వే
శ్వరా. 88

శా. ఆనందంబును బొందినప్పుడును న (న్నాచారచ
ర్యాది) త్యాశ్చర్యకార్యార్థ భా, వానీకంబులు
దోఁచునప్పుడును రోగాపాయ దుఃఖాతుర,
గ్లానింబొంది చరించునప్పుడును సత్కార్యంబున
న్నీవు నా, ధ్యానంబం దుదయింపుమయ్య దివిజేం
ద్రస్తుత్య సర్వేశ్వరా. 89

శా. నానాశాస్త్రసముచ్చయాగమపురాణప్రౌఢు లై
తత్త్వవి, జ్ఞానధ్యానసమాధివిద్య లతివిస్పష్టంబు
గా నేర్చిరే, దా నీనేర్పుల నెల్లనొప్పదు భవత్స
ద్భక్తివిద్యాసమా, ధానప్రస్ఫుటశక్తి నీకరుణచే
తంగాని సర్వేశ్వరా. 90

మ. ప్రకటింపంగ మదీయచిత్తమది దాఁ బంచేంద్రి
యోద్వృత్తమై, ప్రకటప్రాప్తిని బోలుఁగాని
మఱి నీపాదాబ్జసంసేవనం,బొకవేళ న్భజియింప
నొల్లదు నిజం బూహింప నెట్లన్న నీఁ,గకు దుర్గంధ
ముగాక సహ్యంబగునే కస్తూరి సర్వేశ్వరా. 91

మ. మలినాంగుం డగుటేమికష్టము మనోమార్గంబు
నీభక్తిని,ర్మలసౌభాగ్యవిధానదీపశిఖయై రంజిల్ల
దే భూషణో,జ్జ్వలదేహుం డగుటేమి తేజము మ
నోవ్యావృత్తిదుర్మోహచం,చలదుష్కర్మతమంబు
వీడఁబడునే చర్చింప సర్వేశ్వరా. 92

మ. ఇల నాచిత్తము యోగసాధనలయం దీఁదాడఁ
గాఁ గొంతని,శ్చలతం జేరఁగవచ్చు లేక తన
వాంఛావృత్తిఁ బోనిచ్చినం, బలుపై నీ దెసఁ జేర
దట్టి దకటా భావించినంగాక కే,వలసంబోధన
నేల నిల్చు ఋజువై వర్తిల్లి సర్వేశ్వరా. 93

మ. ఉదకం బింకిన లావుదూలివడిఁ దా నుష్ణింపఁగా
రొంపిలోఁ,గదలంజాలని మీను వానగురియం
గ్రమ్మెక్కి పెన్నీటిలోఁ, బొదలం గన్నవిధంబు
న న్భవముతోఁ బొర్లాడుమర్త్యుండు దా,హృద
యాబ్జంబున నిన్ను నిల్పఁ గనునే యింపొంద
సర్వేశ్వరా. 94

మ. భవదీయార్చనసేయుచోఁ బ్రథమపుష్పం బెన్న
సత్యంబు రెం, డవపుష్పంబు దయాగుణం బతి
విశిష్టం బేకనిష్ఠాసమో, త్సవసంపత్తి తృతీయపు
ష్ప మది భాస్వద్భక్తిసంయుక్తి యో, గవిధానం
బవిలేనిపూజలు మహిం గైకోవు సర్వేశ్వరా.

మ. అమరేంద్రాద్రిశరాసనంబు హరి దివ్యాస్త్రంబు
భూమండలం, బమరంగా రథ మర్కచంద్రులు
తదీయాంగంబు లై యొప్పఁ జి, త్రమె నీకుం
బురలక్ష్య మేయునెడ నుద్యద్భాతి నత్యల్పకా,
ర్యములం దైనను దా మహోఘనము నీయత్నంబు
సర్వేశ్వరా. 96

మ. దివిజేంద్రత్వముఁ బద్మజత్వము జగత్సేవ్యస్థిరా
నర్గళో, త్సవరూపం బగు కేశవత్వమును నీసద్భ
క్తి సంవృద్ధిలో, లవమాత్రస్థితు లెన్న భక్తిజని
తోల్లాసావనోద్యత్సుఖో, ద్భవసౌభాగ్యపుమా
న మెవ్వరికిఁ జెప్పన్వచ్చు సర్వేశ్వరా. 97

మ. పరమార్థంబుగ నామనంబున భవద్భక్తిప్రభావం
బు వి, స్తరమై పుట్టదు పుట్టినం బ్రబల దంతం
గొంతవర్ధిల్లెనే, విరసంబై యటమీఁదఁ జిక్కవ
డుఁ దా వేవేగ నెట్లన్న న, స్థిరుఁడంగాన జడుం
డఁగాన బకవేషింగాన సర్వేశ్వరా. 98

శా. శ్రీకంఠాయ నమోనమో నతసురజ్యేష్ఠాయ
రుద్రాయ లిం, గాకారాయ నమోనమో విగత
సంసారాయ తార్క్ష్యచం, ద్రాకల్పాయ నమో
నమో దురితసంహారాయ తే యంచు ని, న్నా
కాంక్షం బఠియించుమానవుఁడు నీవై యుండు
సర్వేశ్వరా. 99

మ. భువనోత్పత్తి విధించుచో భవుఁడవై పాల్పొం
దఁగా దాని ను, త్సవలీలం బ్రభవించుచో
మృడుఁడవై సర్వంబుఁ గల్పాంతభై, రవసంక్షోభ
నటించుచో హరుఁడవై త్రైగుణ్యశక్తిం దుదిన్,
శివనామాంకముఁ దాల్చు నీమహిమ దాఁ జిత్రం
బు సర్వేశ్వరా. 100

మ. కులశైలంబులు పాదువెల్లగిలి దిక్కూలంబునం
గూలినం, జలధుల్మేరల నాక్రమించి సముదం
చద్భంగి నుప్పొంగినన్, జలజాతప్రియశీతభా
నులు యథాసంచారముల్దప్పినం, దలఁకం డుబ్బఁ
డు చొప్పుఁ దప్పఁడు భవద్భక్తుండు సర్వే
శ్వరా. 101

శా. శూలస్థాపితుఁడై నమానవునకున్ శూలంబు
దుర్వారవా, త్యాలిం గంపము నొందకుండుట
సుఖంబై తోఁచు మాడ్కిన్ భవా, భీలజ్వా

లలఁ గ్రాఁగుమానవునకున్ బింబాధరల్ హారవ,
స్త్రాలంకారము లించుకించుక సుఖంబై తోఁచు
సర్వేశ్వరా. 102

శా. ఆకాశానలచంద్రసూర్యపవనూనాత్మాంబువిశ్వం
భరా, ప్రాకామ్యాంచితమూర్తిభేదముల నీబ్ర
హ్మాండనానాఘటా, నీకప్రాకటజీవభావవిలసన్నిర్మా
ణకర్మాద్భుతా, స్తోకశ్రీకరమూర్తి వై నెగడు
నీస్థూలంబు సర్వేశ్వరా. 103

మ. అతివాఙ్మానసమై యజాండనిలయంబై యాది
మధ్యాంతవ, ర్జితమై నిర్గుణనిష్కలంకపదమై
(శీలోత్తమాధ్యాత్మ) సిద్ధాంత మధ్యాత్మసం,
యుతమై కోటిరవిప్రకాశయుతమై యోంకార
మంత్రాదిసం, స్తుతమై యెంచ నచింత్యమై
వెలుఁగు నీసూక్ష్మంబు సర్వేశ్వరా. 104

మ. అజుఁడై సృష్టియొనర్చు రాజసమునం దండంబు
గాఁ దా నథో,క్షజుఁడై వర్ధిలఁజేయు సాత్త్వి
కము సంప్రవ్యక్తిగా గోపతి, ధ్వజుఁడై సంహా
తి సేయుఁ దామసమునం దత్సర్వముం జూడఁగా,
నిజవిస్ఫూర్తి వెలుంగుఁ దుర్య మగుచున్
నీయాజ్ఞ సర్వేశ్వరా. 105

మ. సకలాధీశ్వరపట్టభద్రుఁడవు భిక్షాగామి వత్యంత

శాం, తకళాత్ముండవు రౌద్రమూర్తి వతిసౌంద
ర్యాంబికాసంగమా,ధికలోలుండవు దివ్యయోగివి
మదిం దెల్లంబుగా నెట్టివా,రికిఁ దా శక్యమె నీని
జం బరసి చర్చింపంగ సర్వేశ్వరా. 106

మ. భవదుఃఖార్ణవయానపాత్రముపరబ్రహ్మాంబుయో
గీంద్రహృ, ద్భవనప్రస్ఫురితప్రదీపము లయ
ధ్వాంతార్కబింబం బతి, శ్రవణానందకరంబు
సన్మునిగణస్వాధ్యాయసారంబు మీ,శివనామాం
కము భక్తపుంగవసదాసేవ్యంబు సర్వేశ్వరా.

మ. అణిమాద్యష్టగుణప్రసిద్ధులు త్రిలోకారాధ్యు లు
ద్యద్వచో,మణికోటిప్రతిమప్రభాపటలులున్మాదేం
ద్రియధ్వాంతభీ, షణదైత్యేంద్రవినాశకారణమ
హాశౌర్యోన్నతు ల్లోకర,క్షణదక్షుల్ వినుతింప
నీప్రమథసంఘాతంబు సర్వేశ్వరా. 108

మ. సకలాధీశ్వరులై గణాధిపతులై సర్వజ్ఞులై నిత్యు
లై,యకలంకాత్మకులైమహామహిములై యంభో
జగర్భాండర, క్షకులై యుండుదు రెల్లవారును
భవత్సత్కృక్తి నానాగణా, ధికలీలావిధి నంతరంగ
ముల వర్తింపంగ సర్వేశ్వరా. 109

మ. అమరేంద్రాబ్జభవాచ్యుతాదులకు నీయాజ్ఞాప్ర
భావం బలం, ఘ్యము నీకుఁ భవదీయభక్తమ

పాదాబ్జాపంబు నుదస్యత్ప్రిథా, పము లోకంబు
లలో నలంఘ్య మగుట న్వర్ణింపఁగా నీమహా
త్త్వముకంఠెం గడుఁ జెల్లు భక్తులమహాత్త్వం
బెన్న సర్వేశ్వరా. 110

మ. శివసాహిత్యులసత్కరస్థలము కాశీక్షేత్ర మా
హాస్తదే, శవిశాలోన్నతశాఖ లారయఁగఁ బంచ
క్రోశ మాపాణిసం, భవశోభాన్వితచిత్రరేఖలు
మహాభాగీరథీతీర్థముల్, శివలింగం బలవిశ్వనా
థుఁ డరయఙ్ సిద్ధంబు సర్వేశ్వరా. 111

మ. వరుసం బైకొని పచ్చుకర్మముల ము న్వారించి
మాయామలఁ, జ్వరము ల్గూల్చి యపారఘోరత
రసంసారాబ్ధి లంఘించి భీ, కరసూత్రాంగవిచిత్ర
కంచుకము వీఁకంబుచ్చిపోవైచి తాఁ, బరమవ్యో
మము సొచ్చునీయచలసద్భక్తుండు సర్వేశ్వరా.

మ. పరమార్థం బగుతత్త్వ మారయఁగ నీపాదాబ్జ
సద్భక్తుఁ డొ,క్కరుఁడుం దక్క సరోజజాద్యమ
రసంఘాతంబులో నెల్లఁ దా, నెరయం గాచికొ
నంగఁజాలరు మహానిర్భీతుఁడుఙ్ లేఁ డతి, స్ఫు
రణం గాలుఁడు దన్ను వేచి పడిఁ గొంపోనుండ
సర్వేశ్వరా. 118

మ. తనచారిత్రముతత్త్వవేత్తలగుభక్తశ్రేణి వర్ణిం

షంగాఁ,దనచిత్తంబుభవత్పదస్మరణచేతన్నిన్నుమె
ప్పింపఁగా, ననుకూలస్ఫుటనిష్కలంకబహిరంగా
భ్యంతరంగస్థితి, న్వినుతిం బొందిన తజ్ఞుఁడీజగ
ములో నీ మెచ్చు సర్వేశ్వరా. 114

మ. క్షితి నత్యుగ్రతపంబునందు జఠరాగ్నిం గ్రాఁగఁ
గానేల మీ,స్మృతిభక్తిస్థితిఁ బూజసేయువహనీయ
త్వంబు తాఁ జాలదే, ప్రతిపక్షాలి నడంప రోగభ
వదుర్వారంబు వారింప న, ద్భుతసౌభాగ్యముఁ
బెంప దివ్యసుఖముం బొందింప సర్వేశ్వరా.115

మ. శివవాక్యస్ఫురితాక్షరద్వయ సత్కృజ్జిహ్వాప్రదేశా
త్ముఁడై, భవదుఃఖాంబుధి దాఁటు నన్న మతి
దత్పంచాక్షరీమంత్ర ము,న్సలీలం గడు శుద్ధుఁ
డై జపము వాంఛంజేయు భాస్వద్గుణా,ర్ణవసౌ
భాగ్యముమాన మెవ్వఁడికఁ గాని న్వచ్చు సర్వే
శ్వరా. 116

మ. అరిషడ్వర్గబలంబులో మలసి మాయావృత్తి
నాయం దతి, స్ఫురణం జేసినవాఁడు మోహముఁ
డతనిఁ బోఁద్రోచి నీభక్తితోఁ,బరగం గూర్చి
వివేకిఁ జేసి నెరయం బాటించి నాయం దధీ,శ్వరుఁ
డై యుండఁగదయ్య కాప్యకుధరవ్యాపార
సర్వేశ్వరా. 117

మ. అమలామ్నాయవిధిప్రబోధము లసంఖ్యాతంబు
లైయుండు నాగమమార్గోత్తమమంత్రతంత్రము
లసంఖ్యాతంబు లైయుండుఁ దత్క్రమము ల్నా
కవి యేల నీవు మెఱయంగా నిన్ను సద్భక్తి
యోగమునం గొల్చి జయింపఁజేయు మిదె
మత్కామ్యంబు సర్వేశ్వరా. 118

శా. ఏదేశంబున నేదిశాముఖమునం దేయూర నే
వాడ మీపాదాభ్యర్చనసేయునిర్మలుఁడు సద్భ
క్తుం డొకం డుండెనా, యాదేశంబును నాదిశా
ముఖమును న్నాయూరు నావాడ గంగాదిస్నా
ననదీప్రవాహాఫలదంబై యుండు సర్వేశ్వరా.

మ. ఒనరం జిత్తము శుద్ధిలేనినరుఁ డుద్యోగంబునం
గోరి చేసినపూజావిభవంబు సువ్రతములు
శీలంబులు న్మంత్రసాధనముల్ తీర్థములుం దపం
బులును మీఁదం జెట్టవాఁ డభ్యసించినశస్త్రాస్త్ర
కళానిభంబు లగుఁ జర్చింపంగ సర్వేశ్వరా. 120

మ. క్రమసంయుక్తి మనంబు బుద్ధియు నహంకారం
బుఁ జిత్తంబు నాయమలాంతఃకరణంబు నక్షర
చతుష్కావాప్తిగాఁ దీర్చి పంచమవర్ణంబుగ
నాత్మఁ గూర్చి కడువాంఛ యోగి పంచాక్షరీ,

సుమహాన్మంత్రముతోడ నైక్యపదవిన్ శోభిల్లు
సర్వేశ్వరా. 121

మ. భవదీయాననపంచకంబువలనం బంచాక్షరశ్రేణి
యుద్భవమై తత్పదవర్ణపద్ధతుల శుంభత్పంచ
భూతంబులు, †ద్భవనంబై యఖిలంబుఁ బుట్టెను
లసత్పంచాక్షరీమంత్ర మీ, భువనాండంబులఁ
దల్లియై శుభములం బొందించు సర్వేశ్వరా.

మ. పటుశాస్త్రాగమదృష్టి నివ్విధమునన్ భావించి
వీక్షించి యుద్భటవృత్తిన్ భవదీయభక్తినికర
బ్రహ్మాండకుండైన నా,పట లోఁ గాచుకొనంగ
వచ్చు విదితోద్దండప్రతాపోత్కట,స్ఫుటకోపా
నలమూర్తియై యముఁడు కొంపోకుండ సర్వే
శ్వరా. 123

మ. కలవారై మతిమంతులై రసికులై గంభీరులై
ధీరులై, లలనామన్మథులై సముజ్జ్వలవచోలాలి
త్యులై నిత్యులై, బలవిభ్రాజితులై యశోభరితు
లై భాసిల్లుభాగ్యోదయుల్,తొలిజన్మంబులమిమ్ముఁ
గొల్చిన మహాత్ముల్ వారు సర్వేశ్వరా. 124

మ ఖలులై యాచకులై విరుద్ధవికటాకారాంగులై
పంగులై, బలహీనాతురులై రుజాపటలతాపచ్ఛ

† ద్భవమై యీయాయఖిలంబు.

న్నులై ఖిన్నులై, చలనాందోళితచిత్తులై మలి
నులై జాఘన్యులై శూన్యులై, యిలజన్మింపుదు
రాత్మ నిన్నిడనివా రీక్షింప సర్వేశ్వరా. 125

శా. ఏయేవేళల నేవయస్సున నరుం డేభూమి నేయూ
రిలో, నేయేకర్మము నాచరించు నశుభం బేని
న్శుభం బేని దా, నాయావేళల నావయస్సున
నరుం డాభూమి నాయూరిలో, నాయాకర్మ
ఫలంబుఁ జెల్లఁ గుడుచుఁ దా నొంద సర్వే
శ్వరా. 126

శా. ఆడం బోయినచోట బాలురు వినోదార్థంబు
పాషాణముల్, గూడం బెట్టి శివాలయం బనుచుఁ
బేర్కొన్నంతటం జేసి వా, రాడం బోయి సురాంగ
నాకలితదివ్యారామచింతామణి, క్రీడాశైలవిహా
రులై వెలయుటల్ గీర్తింతు సర్వేశ్వరా. 127

శా. కానీ దారసమన్వితుండు మిగులంగానీఁడు కంద
ర్పునిన్, గోనీ మానవకోటిలో మరులు పైకో
నీఁడు మోహంబునున్, రానీ రాజితరాజ్యవైభ
వము పై రానీఁడు గర్వంబునున్, లో నీవైనమ
హాత్ముఁ డన్యమునకున్ బోనీఁడు సర్వేశ్వరా.

మ. తమలింగార్చనకంటె జంగమము సౌందర్యంబు
గాఁ గొల్చు టు, త్తమభక్తస్థితి లింగజంగమ

ముల న్నానమ్యంబుగాఁ జేత మ,ధ్యమభక్తస్థితి
లింగపూజ నధికుండై జంగమోపాసనా, కుముఁ
డై యుండుట భక్తియం దది కనిష్ఠత్వంబు సర్వే
శ్వరా. 129

శా. శాకాబ్దంబులు వార్ధిషట్కపురజిత్సంఖ్యం బ్రవ
ర్తింప సు,శ్లోకానందకరంబుగా మహిమతో
శోభిల్ల సర్వేశ్వర, ప్రాకామ్యస్తవమొప్పఁ జెప్పె
శుభకృత్పూర్వక్షవర్షంబునన్, శ్రీకంఠార్పితమై
వసుంధరపయిం జెన్నొంద సర్వేశ్వరా. 130

మ. అభిరమ్యంబుగ దూదికొండ మహనీయారాధ్య
సోమేశ్వర, ప్రభుకారుణ్యవసంతసంజనిత (మత్ప
ద్య) మదావాక్యప్రసూనావళి,న్విభవం బొప్పఁగఁ
గూర్చియెంతయు లసద్విఖ్యాతి సంపత్సుఖ, ప్ర
భవంబైన భవత్పదద్వయము నారాధింతు సర్వే
శ్వరా. 131

శా. ఏ నిన్నే శరణందు బాంధవులు గానీ యెల్ల
వారుం బగే,కానీ మృత్యువు తల్లక్రిందువడనీ
కాలుండు గీవెట్టనీ, నానాకర్మచయంబు గింజు
కొననీ నాకేమి నేరాజనిం, తే నీచాఁటున దాఁ
గియున్నపుడు భీతే యింక సర్వేశ్వరా. 132

శా. ధాత్రిన్భక్తజనానురంజనముగాఁదత్త్వప్రకాశం

బుగాఁ, జిత్రార్థాంచితశబ్దబంధురముగా సేవ్యం
బుగా సజ్జన,శ్రోత్రానందముగా శుభాంచితము
గా శోధించి సర్వేశ్వర,స్తోత్రం బన్నయచెప్పె
నిజ్జగములో శోభిల్ల సర్వేశ్వరా. 133

శా. బాలుం డాడెడుమాటలెల్ల నుపమింపం దం
డ్రికిం బ్రౌఢభా,వాలాపంబులకంటె మించుగతి
నే నజ్ఞానభావంబునం, దాలోచించి రచించినట్టి
కృతి యింపారంగ నీకు న్మహా,లాలిత్యస్తుతికంటెఁ
గైకొనుఁగదా శ్లాఘ్యంబు సర్వేశ్వరా. 134

మ. పరమార్థంబుగఁ దత్త్వము న్నెఱుఁగ నొప్పం
దీర్చి దెందంబు నీ, కరుణాస్థానముఁ జేర్పలేక తన
వంకం బాఱిపోనిచ్చిరే, నరకాబ్ధిం బడవైచుఁ ద
త్క్షణములోనం గానఁ దత్త్వఙ్ఞమం, బరయం జి
త్తము శూకలాశ్వము నిభంబై యుండు సర్వే
శ్వరా. 135

మ. భవదంఘ్రి ద్వితయార్చనంబును బవత్ప్రఖ్యా
తసద్భక్తవుం, గవగోష్ఠీవిభవంబు నీవిమలసూక్ష్మ
ధ్యానయోగంబునా, నివిసంపూర్ణసుఖంబు లెన్న
మఱిదేవేంద్రాదిభూతాఖిలో, త్సవసంబంధములె
ల్ల దుష్టినతులు తథ్యం బెన్న సర్వేశ్వరా. 136

మ. సమయోద్దిష్టసహస్రపంకరుహపూజాపూరణార్థం

బునే,త్రము విష్ణుండు సుభ_క్తి యేర్పడ భవత్పా
దంబు లర్చించిచ,క్రము నీచేఁ గొని దైత్యకోటి
ననిలో ఖండించెం దా నీపద,క్షమతా సేవ సమ_స్త
దేవతలకు న్స_త్త్వంబు సర్వేశ్వరా. 137

మ. అమర న్వేదపురాణశా_స్త్రములు మున్నా కాంక్షఁ
ద_త్త్వప్రభే,దముఁ లూహింపఁగ నేరవన్న మఱియా
త_త్త్వంబు లెట్లన్న ను,_త్తమసంతోష మెఃకోరు (ని
న్నెపుడును) నేని నరుఁడుత్సాహించినీ(భ_క్తిను)
భ_క్తస,_త్తమసంతోష మొనర్చునే నతఁడుత_త్త్వ
జ్ఞుండు సర్వేశ్వరా. 138

మ. అమితోద్యద్భవదీయత_త్త్వము మహీయస్తోత్ర
వాణీవిలా,సములై యొప్పు సమ_స్తవేదములు
శా_స్త్రశ్రేణియుఁ దివ్యవి,భ్రమవాదంబులు నె
న్నిచూడ నివి నీపంచాక్షరీమంత్రభా,వములై
యుండు సమ_స్తలక్షణముల న్వర్ణింప సర్వే
శ్వరా. 139

శా. సంకీర్ణాకలితాక్షరత్రయము భాస్వన్నాదబిందు
క్రమా, లంకారద్వితయంబుతోఁ గలిసి లీలన్
దివ్యయోగీంద్రహృ,త్పంకోద్భూతములందురూ
ఢమగుచుం బంచాక్షరీమంత్రమ, య్యోంకారా
త్మక మా లసన్మునిగణం బూహింప సర్వేశ్వరా.

మ. అమలజ్ఞానవికాసభాసురతనయ్యష్టాంగపూ
జావిధి,క్రమయోగంబుల నిన్ను నెల్లపుడు జోకం
గొల్వంగా నేల ని,క్కము నీభక్తులగోష్ఠి చాలుఁ
గడువీఁకన్ ఘోరసంసారదుః,ఖము లెల్లం బెడ
వాపి నిన్ను వెలయంగాఁ జూపు సర్వేశ్వరా.141

మ. జయశక్తి న్రవిచంద్రతారకముగాఁ జల్వన్
యథావాక్కులా, న్వయసంజాతుఁడు నన్నమా
ర్యుఁ డవని న్వర్ణించి నీసత్కథా, క్రియసంబోధ
ననీదుభక్తినిమహాన్వర్ణితవిశ్రాంతిగా,భయవిభ్రాం
తులులేకయీశతకముం బ్రఖ్యాతి సర్వేశ్వరా.

సర్వేశ్వరశతకము సంపూర్ణము.

# తొలిపలుకు.

ఆంధ్రభాషయందుఁ బ్రాచీనగ్రంథములు పెక్కులు నామమాత్రావశిష్టములైనవి. కొన్ని మాఱుమూలల నణఁగిపోయినవి. ఈశతకరాజము నట్లే ఇంతవఱకు మాఱుమూలఁ బట్టియుండినది. ఇదియు సమగ్రముగాఁ దోఁపదు. ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున రెండుమాతృకలుగలవు. వానిలో నొకట దాదాపు 110 పద్యములును మఱియొకట 40 పద్యములునుగలవు. వానిలో నీశతకకర్తవిషయము కానరాదు. ఈక్రిందనుదహరింపఁబడిన పద్యగద్యములవలన దీనికర్త కొడుకగు త్రిపురాంతకుఁడుగాఁ దెలియవచ్చుచున్నది.

*"మ. అతులప్రక్రియ నీఱురాయకవి యయ్యల్రాజు సత్పుత్రుఁ
డంచితభక్తిం ద్రిపురాంతకుండు విరచించెన్ గ్రొత్తప
ద్యంబులన్, శతకం బొక్కటి దీని నీవు కొని యాచంద్రా
ర్కముల్ నిల్పు పర్వతకన్యాసుత! యొంటిమిట్టరఘువీరా!
జానకీనాయకా!"

"గద్యము. ఇది శ్రీమదొంటిమిట్ట రఘువీరశతక నిర్మాణకర్తృ

---

* ఈపద్యము తంజాపుర పుస్తకభాండాగారమున నున్న మాతృకలో గలదు.

బగదేకఖ్యాతిధుర్యాయ్యల్రాజు తిప్పయమనీషి పర్వతాభిధా
నపాత్ర........"  రామాభ్యుదయము.

ఈకవి రామాభ్యుదయకర్త యగు రామభద్రకవికి ముత్తాత యని వీరేశలింగముపంతులుగారు వ్రాసియున్నారు. అది సరియని తోఁపదు. తిప్పయమనీషిపర్వతాభిధాను లన్నదమ్ములు కావచ్చును. ఇట్లయినచో రామభద్రకవి కీతఁడు పెత్తాతయగును. ఈతఁడు శ్రీకృష్ణదేవరాయల కించుకపూర్వుఁడగును.

ఈత్రిపురాంతకుఁడు కర్ణాటరాజుల యాస్థానమున సత్కారము లొందినటుల ఆకర్ణాటకమండలాధిపతిచే నాస్థానమధ్యంబులో నాకావ్యంబులు మెచ్చఁజేసితివి అను శతకస్థపద్యములవలనఁ దెలియుచున్నది. ఇతఁ డేనృపునిచే సత్కరింపఁబడెనో తెలియరాదు. కవి శ్రీగిరిప్రాంతమున నుండియుండును. ఎఱ్ఱాప్రగడ వ్రాసిన నృసింహపురాణములోని పద్యమునందలి భావము నీ కవి సంగ్రహించియున్నాఁడు.

చ. మృగమదచందనాద్యనుపమేయసుఖోచితసారవస్తువుల్
తగఁ గఫవాతపైత్యకలితంబగు కీడులప్రోకయైన యా
యగుణశరీరముం గడిసినంతన దుష్టతఁ బొందు మేలుఁ గీ
డుగ నొనరించు నీముఱికిడొక్కమనంబున నమ్మఁబాడియే.
(చూడుము ప 32 ద్యము.)

శ్రీరామస్తుత్యాత్మకము లైన యిందలిపద్యములు మిగుల రసవంతములు. ఎల్లకడల వ్యాపించి ప్రసిద్ధి కెక్కినవి. శ్రీకృష్ణరాయల యాస్థానమునఁ బ్రసిద్ధుఁ డగురామభద్రకవి ప్రశంసించుట యీశతకప్రఖ్యాతిని వెలయించుచున్నది. నేఁటివ్యాకరణములకు సరిపడనిప్రయోగములు కొన్ని యిందుఁ గలవు. భారతభాగవతములయందలి పద్యములరచనముతో సరివచ్చినపద్యములు కొన్ని యిందుఁ గలవు. ఇంకను దీనియందలి గుణవిశేషములఁ జదువరులే తెలియఁగలరు. ఇట్లనేకప్రాచీనగ్రంథములను వ్యయప్రయాసములను లెక్కింపక ముద్రించి విద్యాభిమానులకు సులభసాధ్యములుగఁ జేయు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగా రెంతయుఁ బ్రశంసార్హులు.

గన్నవరపు సుబ్బరామయ్య.

౧౧

శ్రీ ర స్తు.

అయ్యల్రాజు త్రిపురాంతకకవివిరచిత

# ఒంటిమిట్ట రఘువీరశతకము.

---

శా. శ్రీకల్యాణగుణాభిరామ విబుధశ్రేణీకిరీటద్యుతి,
వ్యాకీర్ణాంఘ్రిసరోరుహద్వయసహస్రాక్షస్తుతా!
యచ్యుతా, నాకుం బ్రాపును దాపు నీవె యగు
చున్ నన్నేలుమీ రామభ,ద్రా కారుణ్యసము
ద్రధీర రఘువీరా జానకీనాయకా! 1

శా. ఆకర్ణాటకమండలాధిపతిచే నాస్థానమధ్యంబులో,
నాకావ్యంబులు మెచ్చఁ జేసితివి నానారాజులుం
జూడఁగా, నీకుం బద్యము లిచ్చుచో నిపుడు
వాణీదేవి నాజిహ్వకున్, రాకుం డెట్లు వసించుఁ
గాక ర... 2

శా. నీకేలన్ దృణ మందివైవ నదియున్ నిర్ఘాతపాత
క్రియన్, గాకాకారవికారదానవుని లోకా
లోకపర్యంత మీ, లోకంబుల్ పదునాల్గు త్రిప్పి
నది కాలు న్నోపఁగానీక యా, రా కాకుత్స్థకులా
గ్రగణ్య ర... 3

మ. సకృపాలోకన నందగోపునితనూజాతుండవై గొ
ల్లవై, సకలక్షోణులు నేలినాఁడ వట మించం
గశ్యపబ్రహ్మ గన్నకుమారుం డన మిన్నుముట్టి
కుఱుచై నాఁడేలయాలీల నేరక దానంబులు
వేఁడుకొంటి ర... 4

మ. సకలామ్నాయములన్ బఠించుఫల మబ్జాతాక్షు
నామంబులం, దొక టేదైనఁ బఠింపఁ గల్గు నటు
వంటుత్కృష్టపుణ్యప్రవర్తననామంబులు చక్ర
పాణికి సహస్రంబుల్ సహస్రాభ మర్కకులా
నీశుభనామ మౌర ర... 5

శా. కొంకన్ గారణ మేమి ధర్మములు పెక్కుల్
చేసి మర్త్యుండు నీ,వంకన్ జిత్తము నిల్ప లేక
పెఱత్రోవల్ ద్రొక్కినన్ సర్వమున్, బొంకై
(పోవు)తూలు కురంగనేత్ర తగునోముల్ వేయు
నున్ నోఁచి తా,ఱంకాడంగఁ దొడంగినట్లు ర.

శా. ఆగౌరీశ్వరకీర్తనీయుఁడగుని న్నర్చింపఁగా లేనివా,
రోగుల్గాక నిజానయోగు లయినన్ యోగ్యాను
సంధానులే, మాగుర్వాజ్ఞ యథార్థ మాడితిని
నీమంత్రంబె మంత్రంబురా, రాగద్వేషవిదూర
ధీర ర... 7

మ. జగముల్ మూఁడు సృజింపఁ బ్రోవఁ బిదపన్ సం

హారముఁ జేయఁగాఁ, ద్రిగుణాకారముఁ దాల్చి
నట్టివరమూర్తి వాసుదేవాచ్యుతా, నిగమస్తు
త్య పవిత్రగాత్ర నృహరి నీలాభ్రవర్ణా మహా,
రగతల్పా జనకల్పభూజ ర... 8

శా. నీచారిత్రము చెప్ప నద్భుతమగుఁ నీనామసంకీ
ర్తనం, బాచండాలున కైన మోక్షమొసఁగుఁ
హత్యాదిదోషంబులఁ, వేచింపుఁ విదళించుఁ
ద్రుంచుఁ దునుముఁ వేఁటాడు నంటంబడుఁ,
రాచుం ద్రోచు నడంచు నొంచు ర... 9

శా. తేజం బొప్పఁగ నీవె కావె మొదలఁ ద్రేతా
యుగాంత్యంబునఁ, రాజై పుట్టితి వింక నీకలి
యుగాంత్యంబందునఁ రౌతవై, వాజిందోలివిరో
ధులం దునుమ దేవా నీవ యొండెవ్వఁడా, రా
జుఁ రౌతును నీవె కావె ర... 10

శా. గాజుంబూస సురేంద్రనీలమణిఁగాఁ గల్పించు
చందంబునఁ, బాజుంజర్మముమీఁది(బే)జేగడ
పాఁజల్ బంగారు చేసేగతిఁ, నాజన్మంబుఁ బవి
త్రభాజనముగా నన్నేలరా యేలరా, రాజీవాక్ష
కృపాకటాక్ష ర... 11

శా. నాజన్మాంతరవాసనావశమునఁ నాపాలిభాగ్యం
బునఁ, నాజాడ్యంబులు పోవుకాలముతఱిఁ

నాపుణ్యపాకంబునన్, ఈజన్మంబున నిన్నుఁ గొ
ల్వఁ గలిగెన్ హీనుండఁ గా నింక నే, రాజన్
నాకెదు రెవ్వరుర్వి ర... 12

శా. నేఁటం దీటై ననేకజన్మములనుండేనన్ను వెంటా
డుచున్, వాటంబై చనుదెంచుపాపములు శ్రీవ
త్సాంక నీవంక నీ, పాటల్ పాఠము సేయువారికి
మఱేన్ బాపంబులం బాపుఁ గన్నాటాధీశ్వర
యొంటిమిట్ట ర... 13

మ. పటునిర్ఘాతకఠోరనాదము ఘనబ్రహ్మాండభాండం
బు బి, క్కటిలం జేయుచు వచ్చునప్పు డితరుల్
గాండీవినామంబు లె, న్నుట మే లందురు వైష్ణ
వుల్ తలఁప రన్యం గోర యొంతంతదు, ర్ఘట
ముల్ వచ్చిన నిన్నె కాక ర... 14

మ. కొడుకు ల్బ్రహ్మలు కూఁతు రీశ్వరశిరఃకూటం
బుపైఁ గాపురం, బుడురాజుం దినరాజుఁ గన్ను
లహిరా జయ్యాలమంచంబు నీ, పడఁతుల్
శ్రీయు ధరిత్రియున్ సవతు చెప్పన్ పేరు? నీ
కన్యు లా, రడిమర్త్యు ల్గనలేరు కాక ర... 15

మ. వడిమీఱంగ నమోఘమై నిగుడునీవాలమ్ము
వాలమ్ముఁ దాఁ, కెడునంచున్ మెడ యొడ్డినన్
జమరిపైఁ గీల్కొన్న కారుణ్య మే, ర్పడ మున్నె

సినయమ్ము వేతెయొకనారాచమ్మునం ద్రుంచి పే,
ర్పడి తౌరా విలుకాండ్రలోన ర... 16

మ. చెడుగన్ గష్టుఁడ దుష్టచిత్తుఁడఁ బరస్త్రీలోలుఁ
డన్ బాలుఁడన్, జడుఁడన్ మూఢుఁడఁ గొండె
కాఁడను దురాచారి న్నిషేధాత్ముఁడన్, గడుసన్
గాకరిఁ గల్లగుల్లఁ గపటిన్ గర్వి న్ననుం గావు
మూ,ఱడి యున్నాఁడను నీవె దిక్కు రఘు...

మ. అడిగేవిద్యకు లోను చేసితివి నన్నావంతయున్
వంతలే, కడియాసల్ గొనుచుం దురాత్మకుల నే
నర్థింపుచున్నాఁడ నెన్నఁడు రక్షించెదు నీవు
నన్ను బలె నెన్నంబేదవా యేలయా,ఱడిఁ బెట్టె
వు రమావిహార ర... 18

మ. ప్రణుతింపన్ మృతదేహముఁ జూచి బ్రదికింపన్
బ్రహ్మరుద్రుల్ మరు,ద్గణనాథాదులు నోప రద్భు
తము గాఁగ న్నిదుభృత్యుండు లక్ష్మణుప్రాణం
బులు దెచ్చెఁ జచ్చినతఱిన్ సంజీవనీప్రక్రియన్,
రణభూభాగములోనఁ దానె ర... 19

శా. ఏతాత్పర్యముగల్గి కొల్చెదవురా యేనేలని న్నెం
తురా,నీతో నాకుఁ బనేమిరా యనక మన్నింపం
దగున్ నన్ను నీ,చేతన్ మోక్షముగన్నవారి వి
ననా చిత్రంబుగా నిర్జరా,రాతిన్ దాటిఁగిరాతుఁ
దొల్లి ర.... 20

శా. దాతల్ త్రాతలు దల్లిదండ్రులు మఱిన్ దైవంబు లాప్తుల్ చెలుల్, ఖ్యాతిన్ భక్తిగనవారు చుట్టములు మీపాదాలమీఁదాన నా,దాతల్ త్రాతలు తల్లిదండ్రులు మఱిన్ దైవంబు లాప్తుల్ చెలుల్, ఖ్యాతిల్ సర్వము నీవె కావె ర... 21

మ. శ్రుతిపాథోధి మథించి శాస్త్రమహిమ లోన్వేధించి యష్టాదశ,స్మృతులాలించి మహేతిహాసకథలుం జింతించి తారొక్కన,మ్మతమై సన్మును లాచరించినమహామార్గంబు నీసేవదు,ర్మతు లీమార్గమునుఁ గానలేరు ర... 22

మ. మతి నూహింపరు కొందఱీసుకృత మేమార్గంబునందున్న దు,గ్రతపోధ్యానము సామగానము దీర్ఘస్నానముల్ దానముల్,గ్రతుసంధానము నేల నేలఁ దులసిం గర్వాయ్యెనో యూరనీ,ప్రతిమ ల్లేవా నమస్కరింప ర... 23

మ. సుతు లంచున్ హితు లంచు బంధుజను లంచు న్దల్లులు న్దండ్రులున్, సతులున్ బౌరులు నంచు నెంచుకొనుచున్ సంసారమోహాబ్ధిలో,గతజన్మంబులఁ దేలుచున్ మునుఁగుచున్ గర్వించి యేని న్ననా,రతముం గొల్వనిమోస గల్గె ర....

మ. క్షితిలోఁ దాము బ్రహ్మసృష్టికిఁ బునస్సృష్టిన్

వినిర్మించియుఁ, గ్రతువిఘ్నం బొనరించు దాన
వుల వీఁగం దోలఁగాలేక నాఁ,డతిబాలుఁ నినుఁ
దోడు తోడుకొని పోఁడా గాధిసూనుండు నీ,
ప్రతివీరాగ్రణి యెవ్వఁడింక ర... 25

మ. క్షితిలో నల్పులమీఁదఁ జెప్పినకృతుల్ ఛీ! ఛీ!
నిరర్థంబులై, మతికిం బాత్రము గావు మేఁకమెడ
చన్నుల్ నేతిబీఱాకులుఁ, వితతప్రౌఢిమ నీకుఁ
జెప్పినకృతుల్ వేదాలు శాస్త్రాలు భా,రతరామా
యణముల్ తలంప ర... 26

శా. సంతానంబును బారిజాతకమహీజాతంబు మందా
రముఁ, జింతారత్నముఁ గామధేనువు సుధాసిం
ధూత్తమంబుఁ మదిఁ,జింతింపఁ సరిగావు నీకు
విజయశ్రీధామ యోరామ య,శ్రాంతత్యాగ
వివేకపాక ర... 27

శా. ఏదైవాలవరాలకంటె సులభంబెవ్వానికైనఁ దు
దిఁ, నీదాత్మత్వము చెప్పఁ గ్రొత్త శరణంటేఁ
గాతు వింతేల నీ, పాదాంభోజరజంబు ఱాతిక
యినఁ బ్రాణంబు లీఁజాలు నా,రా దిక్పూరితకీ
ర్తిహార ర... 28

శా. విందుఁ వేదపురాణశాస్త్రముల గోవిందుఁ
ముకుందుఁ హరిఁ, విందుఁ వేల్పునునైన భ

క్తసులభున్ విశ్వంభరున్ సచ్చిదానందున్
నందుఁడు కన్నచిన్నిశిశువున్ నాపాలిపాపాలిఁ
బా,యందోలేనరసింహు నిన్ను ర... 29

శా. సందిన్ బూసలలోన నీకవచరక్షామంత్రరాజం
బుఁ జెం,పొందన్ వ్రాసి ధరించినాతఁడు రిపు
వ్యూహంబులో నైన నే,కందుం బొందక వజ్ర
పంజరములోఁ గాఁపున్న చందానఁ బా,యందో
లున్ బగవారినార ర... 30

మ. వృథగా దెవ్వఁడు నిన్నుఁగొల్చినఁ గృపన్ వీక్షిం
చి వాఁ డేమనో, రథముల్ వేఁడిన నట్లె సేయు
దువుగా రక్షావిధేయుండవై, కథ గా దీవచనం
బు నిక్కమటులం గాదేని మున్నేల సారథివై
తర్జును లేరుఁ దోల ర... 31

మ. ఘనసారంబును లోనికిం గొనిన శ్రీగంధంబుఁ
బైఁబూసినన్,దినమున్ మర్దనజేసినన్ గడిగినన్
దృష్టంబులోనన్ దొలం,గనిదుర్గంధము నైజ
మిూముఁటికిఁడొక్కల్ నమ్మి ని న్గొల్వనే,రనిమూ
ఢాత్ముల నేమి చెప్ప ర... 32

మ. ఇనుమూ ఆశ్రితు నిల్వ వాడ వినుమూ క్షేమా
టయున్ సాయకం, బినుమా ఆహవభూమిఁ
బూన విదిగా కింకొండు మేలంచు నీ,వినుమా

త్సీదురితాంధకారపటలం బేరీతి వీక్షింతు వు,గ్ర
నిశాటాంతక రామభద్ర ర... 33

మ. మును నా కెన్నఁడు వేదశాస్త్రపఠనంబుల్ రిత్త
తీర్థాటనం,బును దానంబును జేయఁబోను సతతం
బుఁ నిన్ను సేవించి కీ,ర్తన చేసేమతి లేదు దా
నమున కర్థంబల్ప మింకెట్లు బో,రన నాదుష్కృ
తముల్ తొలంగు ర... 34

మ. మును నా కెన్నఁడు దోసముల్ గలవు నామ్రా
లఁ భయంబందకే, మనినఁ గాలునిపోటుబం
టులిఁక నన్నా పేరు నా పేరు పె,ట్టినవానిఁ బర
లోకదూరుఁడని పట్టెదెట్లు పొండంచుబో,రన
రమ్మా యిపు డడ్డగింప ర... 35

మ. అనఘుం డైనదశాశ్వమేధకృతపుణ్యస్ఫూర్తి నీ
కొక్కమా,టు నమస్కారము సేయఁ గల్గునని
విందుఁ యాగధర్మంబులుఁ, గొనసాగుం జన
నంబు లొక్కమఱి నీకుఁ మ్రొక్కనేనిఁ బున,
ర్జననం బేది తలంచిచూడ ర... 36

మ. దనుజారిజ్వలనాంతకా సురసముద్రస్వామివా
యుత్రిలో, చనమిత్రాభవసూర్యసోమధరణీ
జాతాంబుజాతద్విష,జ్జననాంగిరసశుక్రభానుతన
యస్వర్భానుకేతుప్రన, ర్తనముల్ నీవిభవం
బులౌర ర... 37

మ. కనుఁగొన్నప్పుడె గుప్పఁడే కుజనులన్ గాలుం
డు కాలుండు ఖాం,డనుచున్ రౌరవనారకాగ్ను
లఁబడన్ హత్తించి యయ్యగ్నులన్, మునుఁ
గంజాలఁ బరేతరాజునకు నన్నొప్పింపఁగాఁబోకు
ము, గ్రనిశాటాంతక రామభద్ర ర... 38

మ. నిను సేవించెదనంచుఁ గోరుకొని యుండేవా
నికిన్ బూర్వకర్మనిమిత్తంబు(నఁ గల్గుకష్టములు
వేమాయింప)నీవడ్డమౌ,నని చెప్పంబడు ద్రౌపదిం
గరిని బ్రహ్లాదున్ధ్రువున్మున్ను బో,రన రక్షిం
చుట కల్గా లేదా ర... 39

మ. అనిశంబున్ నినుఁ గొల్చుమానవులు ప్రాణాం
తంబునన్ రోగబా,ధనిమిత్తంబున రామరామ
యనుచున్ వాక్రువ్వ లేకుండినన్, జననాథా
గ్రణి నీవు వారిరసనాస్థానంబున న్నిల్చి బో,రన
రామా యనిపింతు వౌర ర... 40

మ. ఇనవంశోత్తమ వేదశాస్త్రములలో నేవింటి
నేవింటివాఁ,డను నీకుం బ్రతిగాఁడు నీకుఁ గల
బంట న్నన్ను రక్షింపు కా, లునిబాట్లన్ విదళిం
పఁగావలయు నాలోనుండుమీ మెందుమీ,అ
నమోఘాస్త్రమువిల్లుఁ బూని ర... 41

మ. జననాథాగ్రణి నిన్నుఁ గొల్చునతఁ డాచండా
లుఁడైనన్ బునర్జననం బొందక ముక్తిఁ గాంచు

నొనరన్ సద్భక్తుఁడైనన్ దుదిన్, జనుఁ జండాల
కులంబులోన నుదయించం గోరి నీనామక్, ర్తన
సేయన్ నిరసించెనేని ర... 42

మ. జనకుం డెవ్వఁడు నీకు నీకడుపులో సర్వంబు
నుండంగ నీ,యునికిస్థానము దుగ్ధవార్ధి నడుమన్
యోగీంద్రహృద్గేహ యే,మని వర్ణింపుదు నీమ
హాత్త్వముల సర్వైశ్చర్యముల్ పుణ్యవ, ర్తన
రాజన్య యశోవిహార ర... 43

మ.జనకుం డా జనకుండు నీసతికిఁ గౌసల్యా యహ
ల్యాఘ,మోచన నిన్ గాంచినతల్లి పంక్తిరథుఁడా
సర్వేశ మీతండ్రి యే, మినిమిత్తంబున నుద్భ
వించితి[1]వా నమ్మేనెట్లునీపుట్టువు,క్రనిశాటాంతక
రామభద్ర ర.... 44

మ. హనుమంతుం డొకయబ్ధి దాఁటునని యేలా
ప్రస్తుతుల్ సేయఁగా, దనుజారాతి భవత్పదా
బ్జములు హృత్పద్మంబునన్నిల్పునా,ఘనపుణ్యుండు
భవాంబురాసులు తృణీకారంబుగా దాఁటు భో,
రన దానింతయుఁ గొంకులేక ర... 45

శా. నీపాదోదక మక్షులం దదుముకొంటిన్ గొం
టి నాలోనికిన్, నీపళ్లెంబు ప్రసాదముం గుడిచి

1 వి నెమ్మిన్నిట్టు లీపుట్టువు.

తిగా నీపేరునుం బెట్టితిగా, నీపెన్ముద్రలుదాల్చి
తిగా భుజములగా నీవింక న న్నేగతిగా,బ్రాపై ప్రో
చెదొకాని పూని ర... 46

మ. తపముల్ చేసినఁ బోనిపాపములు మంత్రంబుల్
సమర్థంబుగా, జపముల్ చేసినఁ బోనిదోషము
నదీస్నానంబునం బోనిఘో, రపుకర్మంబులు వా
యు నొక్కమతి శ్రీరామా యనేమాట కర్ణపు
టం బించుక సోఁకెనేని ర... 47

శా. కంపింతుగా మును దండధారికిని మర్త్యాయంబు
వీక్షించి శం,కింపగా గారణ మేమి నాకిఁక నినుగా
గీర్తింపుచున్నాఁడ బల్, దుంపల్ గట్టినఘోర
పాపములసంధు ల్గోసివేసేతటిగా, అంపం బైనది
నీచరిత్ర ర... 48

శా. నీమంత్రంబు సదా సదాశివుఁడు పత్నీయుక్తుఁ
డై కాశిలో, నేమంబొప్ప జపించునంచు [1]శ్రుతుల
న్నిగా నిన్నెవర్ణింపఁగా, నేమా నిన్ను నుతించు
వార మయినగా నేనేర్చిన ట్లెన్నెదగా, రామా
రాఘవ రామభద్ర ర... 49

శా. నీమంత్రంబు జపించుమానవులకుగా నిశ్శ్రేయ
మౌనర్థముల్, హేమంబు ల్గోడుగుల్ తురంగ

1 శ్రుతులు న్నిన్నెన్ని.

ములు మత్తేభంబు లాందోళికల్, గ్రామంబుల్
నగరంబులుఁ విభవముఁ రాజ్యంబులుఁ రత్న
ముల్, రామారత్నము లేమిలెక్క ర... 50

శా. గోమేధాధ్వరమశ్వమేధశతముల్ గోదానభూ
దానముల్, హేమాద్రుల్ తిలపర్వతంబులుసువ
ర్ణేభాశ్వదానంబులుఁ, నీమంత్రం బగునక్షరద్వ
యము[1] నే నీపుణ్యముంబోలవో, రామారాఘవ
రామభద్ర ర... 51

శా. గోమాంసాశని మద్యపాని సగరిఁ గొండీఁడు
చండాలుఁడుఁ, హేమస్తేయుఁడు సోదరీరతుఁ
డుఁగూడేకావశిఁ భుక్తిఁగాం, చేమూఢాత్ముఁడు
లోనుగాఁగలుగుదుశ్శీలాత్ము లైనఁ దుదిఁ,
రామా యన్నను ముక్తిఁ గాంత్రు ర... 52

శా. ఏమీ పాతకులార మాపురికి రా రీవుట్టునం
దున్నత, శ్రీమైఁ బోయెద రెందుకన్న జమునిఁ
గ్రేఁగన్నులఁ జూచుచుఁ, రామయ్యా యిఁక
నంచు పల్కి యపవర్గస్వర్గముం జొత్తురో, రామ
య్యా! నినుఁ గొల్చువారు ర... 53

శా. స్వామిద్రోహిని తమ్ముఁడెట్లు ఘనరాజ్యంబెల్ల
నీవిచ్చు టె, ట్లామాటల్ విని కాదె నిన్ను నడి

1 పాం దేపుణ్యముం.

గేయాసక్తి నాకున్న దొం, డేమిఁక పల్మలు వేస
రింప కిఁక నీ వీరాదె నీసీమలో, గ్రామం బొక్కటి
చాలు నాకు ర... 54

శా. మామాయంచును మామయంచు నెపుడున్
మాయల్లుఁ డుద్యద్గతిన్, హేమాద్రిప్రతిమాన
మైన హరువిల్లేవిల్లు మోపెట్టఁగా, సామర్థ్యం
బున [1]మేటి యీతఁ డనుచున్ సత్వంబె వర్ణిం
పుదున్, రామా రాఘవ రామభద్ర ర... 55

మ. కమరం గ్రాఁగినలోభివానితలపున్కన్ గుక్క
మాంసంబు మ, ద్యముతో వండుకొనితిన్న మాలఁ
డయినన్ దత్పాపకర్మంబులన్, యమకూపంబుల
లోపలం బడఁడు జిహ్వాగ్రంబునన్ రామమం,
త్రముఁ జేర్చొన్నను నొర ధీర ర... 56

మ. యమకూపంబులలోపలం బడి మహాదైన్యంబు
నున్ బొందకుం,డ ముదంబారఁగ నన్నుఁ బ్రోచి
కరుణన్ సాయుజ్య మిమ్మీ తుదిన్, క్రిమిరూపుం
దనరూపుగాఁ జెనిచి రక్షింపన్ విచారించునా,
భ్రమరంబుంబలెఁ బాపదూర ర... 57

మ. మమకారంబున సార్వకాలమును నీమంత్రంబు
వాక్రుచ్చుడెం,దము నాకుంగలుగంగని మ్మటుల

---

1 వీఁడు మేటి యని నీసత్వంబు వర్ణింతు నో.

నైనన్ మృత్యువక్త్రమ్ము దూ, ఱము నిన్నున్
మతి దూఱ మంత నపవర్గస్వర్గమార్గంబు దూ,
రము గాకుండును మాకుఁ జేర ర... 55

మ. తమగర్వంబున వారు మూఢులగుచున్ దైవంబు
మంత్రంబు తం, త్రములన్ వీడఁగ నాడుచున్
దిరుగు నిర్భాగ్యుల్ మహారాజులై, మము నూ
రింపఁగ నేము నిన్నెఱిఁగి నీమంత్రం బెఱింగిన్
దరి, ద్రమతిన్ వేడఁగఁబోవు టెట్లు ర... 59

మ. హిమధామప్రతిమానకాంతియుతులై యింద్రాది
దిక్పాలకుల్, తములన్ స్తోత్రముసేయ నుం
దుదురు నీదాసానుదాసుల్ సుర,ప్రమదాపల్లవ
పాటలాధరసుధాపానాదికేళీవిహా, రములన్
మీఱుచు మీరుచూడ ర... 60

శా. మిమ్ముం గొల్వఁ దలంచి పాపముల నెమ్మిం జూఁ
పినా నింక నే,నెమ్మిన్ సౌఖ్యముఁ బొందువాఁడ
నగుచున్ నీమూర్తి భావించెదన్, రమ్మా వీని
తలంపు మేలని కృపన్ రక్షింప నాలోనికిన్,
రమ్మా నన్నుఁ గృతార్థుఁజేయ ర... 61

మ. ప్రమదారత్న మహాత్మ్య గౌతమునిశాపప్రాప్తిఁ
బాషాణరూ, పముతోఁ బెక్కుయుగంబు లుం
డఁగ హరబ్రహ్మాదులుం బాపలే, నిమహాపా

పముఁ బాపనోపినది కా నీపాదరేణుప్రకా, రము
నేనేమని సన్నుతింతు ర... 62

శా. నాయజ్ఞానముఁ బాపుమంచు మదిలో నానాప్ర
కారంబులన్, గూయం గూయ నదేమిరా యన
వు నీకున్ మ్రొక్కనా కుక్కనా, ఛీ యం చేటికి
రోఁతగించెదవు నీచిత్తంబు రాకుండినన్, బ్రాయ
శ్చిత్తము నాకు నెద్ది ర... 63

మ. నియమంబొప్ప ననేకజన్మములనుండిన్ దాఁచు
కొన్నట్టిసం,చయదోషంబులు మాటమాత్ర
మునఁ గొంచుం బోవుచోరత్వ మెం,న్నియుపా
యంబుల నభ్యసించినవిరో నీనామముల్
వేయు నా,రయలీల న్వివరించుటట్లు ర... 64

శా. తారుణ్యోదయ యొంటిమిట్టరఘునాథా! నీకు
నేఁ బద్యముల్, నూఱున్ జెప్పెద నూరఁ బేరు
వెలయన్ నూత్నంబుగా నంత నా, నోరుం
బావన మౌను నీ కరుణఁ గాంతున్ భక్తిన [1]న్నం
దఱున్, రారమ్మందురు గారవించి ర... 65

శా. చీరన్ దీయకు చన్నుగుబ్బలపయిన్ జీకాకుగాఁ
గాకుగా, జేరన్ దీయకు మందబోయఁ డిదె వచ్చె
ప్రొద్దు రావద్దురా, జారల్ మేనుల జారలం గవ

---

1 స్నెహ్వరున్.

యు కృష్ణా ఏకపత్నీవ్రత, ప్రారంభం బిపు డేల
నీకు ర... 66

మ. తిరునామంబు ధరింపఁడేని నొసలన్ దిక్కారితం
బైననీ, వరనామంబుఁ దలంపఁడేని మదిలో
వాంఛించి నీపాదపం, కరుహ శ్రీతులసీదళోద
కముఁ ద్రాఁగండేని వాఁ డేఁటి నే,ర్పరి వైకుంఠ
పురంబుఁజేర ర... 67

మ. శరణం బన్నను మాటమాత్రమున విశ్వద్రోహి
తోఁబుట్టుకున్, గరుణాపూర్ణవిలోకనం బొదవ
లంకా రాజ్యసింహాసన, స్థిరపట్టం బొనరించినాఁడ
వఁట యేదేవుండు నీసాటి యు,ర్వరలోనన్ భ
వరోగదూర ర... 68

మ. పరనారీకుచకుంభపాలికలపైఁ బాదాబ్జయుగ్మం
బుపైఁ, గరమూలంబులపైఁగపోలతటిపైఁగంఠం
బుపైఁ గొప్పుపైఁ, బరువుల్ వాతెదునాతలం
పులు మిమున్ భావింపఁగాఁజేసిస,ర్వరసాధీశ్వర
నన్నుఁ బ్రోవు ర... 69

మ. నరకుల్ గ్రాఁగినయిన్పకంబముల నంటంగట్టఁగాఁ
గొట్టఁగాఁ, బొరలం బొర్లఁగఁ గక్కుటాలఁ
గొని వీఁపు ల్గోయఁగాఁ బ్రేయఁగా, నరకావాసుల
లోన నుండుదురు నీనామంబు వర్జించిదు,ర్మరణం
బుల్గని చన్నవారు ర... 70

మ. పురసంహారునిచాపముఀ జివురుదంబుఀ ద్రుంచి
పోవైచినఀ,పరశూదగ్రభుజుండు పోవిడుచునే
భంజించుఁగాకంచు నిష్ఠురముల్ పల్కిన భార్గ
వుఀ నిజబలాటోపంబు వారించి నిర్భరశాంతం
బునఁ గాచితౌర ర... 71

మ. స్మరసంహారుఁడు గౌరిఁ బొత్తున భుజింపఀ బిల్వ
నే రాను శ్రీ, హరినామంబులు వేయు నెన్న
దను నిత్యం బైననో మన్న నో,యరవిందానన వే
యునేమిటికి రామా యన్నను౦ జాలు మం, త్రర
హస్యంబుఁ దలంతు నేను ర... 72

శా. బాలత్వంబునఁ గొంతకాలము వృథాపాపంబు
దుర్బుద్ధి నై,చాలం జవ్వనమందు గర్వమతినై సం
సారినై దుష్క్రియా, జాలభ్రాంతిఁ జరింతుఁ
గాని నినుఁ గాంతుం గొల్వలేనయ్యో హా,రాళం
బైనది చింత వంత ర... 73

శా. సాలగ్రామశిలాశిలోచ్చయగయాస్థానప్రయాగ
స్థలుల్, పోలఀ జూచెద నంచుఁ బోవఁ దలఁ
తుఀ బోలేను మీదాసులఀ, బోలే నన్నను
బుద్ధిపుట్ట దిఁక నేఁ బుణ్యాత్ముఁ డౌ టెట్లు హా,
రాళం బైనది చింత వంత ర... 74

మ. కొలువంజాలక మాన. నీనుతులు పెక్కుల్ -

సేయుటల్ మానసినిఁ, దలఁపఁ జాలకమానసినిఁ
గలసి నీదాసాదివర్గంబుతోఁ, నిలువంజాలకమా
ననేఁగడపటఁ నీనామములు విన్నవా,రలకుఁ
గల్గును మోక్షలక్ష్మి ర... 75

మ. తలఁపఁ జిత్రము మీమహత్త్వములు మీదా
సుల్ మహాభాగ్యవం, తులు త్రైలోక్యమునఁ
బదస్థులు ధ్రువుం డుండుఁ నభోమండలిఁ, బలి
పాతాళమునఁ విభీషణుఁడు భూభాగంబునఁ
బద్మజ,ప్రలయం బైనను బోవ రౌర ర... 76

మ. చెలఁగఁ మర్త్యులు వేఁగి లేచి తమచేసే వెల్లఁ
బాపంబు లీ,కలుషంబుల్ బెడబాయు వేదిగతి
యింకఁ ద్రోవ యొండెద్ది పు,ర్వులగుంటం బ
డఁబోకయుండ దయనేర్పఁ బుద్ధియుఁ గల్గు
వా,రలు నీసేవకు లౌట లెస్స ర... 77

మ. కలకాలంబు వ్రతంబులుఁ దపములుఁ గావించి
యన్యు ల్తుదిఁ, గలకాలంబును బోలె నిర్జ
రపురీకాంతాకుచాలింగనం, బులఁ గొన్నాళ్లను
భుంచి క్రమ్మఱ నిలం బుట్టెదినే మెచ్చ ని,ర్మలము
క్తుల్ నినుఁ గొల్చి కాంతు ర... 78

మ. నిలువెల్లఁ బులకాంకురంబు లొదవఁ నీపాద
తీర్థంబుతోఁ, దులసీవర్ణ మొకించుకంతఁ గొనినఁ

దోషాలు ఖండింపఁగాఁ, బోలపాకుల్ దినఁ గాన
నంబులఁబడన్ బోనేలమోఁతుంబుకూ,రలను న్నా
రల నేల గల్గు ర... 79

మ. చెలువం బొప్ప సువర్ణముద్రలితరుల్ చెల్లించు
టేక్రొత్తకా, కలనీముద్రలు చూడఁ జెల్లుబడి
చక్రాలంచు వేయించుమమం, డలనాథాగ్రణి క్రొ
త్త నీబలిమి నానావర్ణపుం దోలుము, ద్రలు చె
ల్లించితి విందు నందు ర... 80

మ. ప్రళయాపాదితకాలమృత్యు[1]నిభ యీరాకాసి
రాగా వా,దులు వారింపఁగ[2]నోప వింక నెటుచో
త్తున్ నొత్తుఁ గాకన్న సం, చలితున్ గౌశికుఁ
గాచి తాటకను శస్త్రజ్వాలచేఁ ద్రుంచిదో, ర్బల
శక్తిన్ విలసిల్లి తౌర ర... 81

మ. చిలుకన్ ముద్దులు చిల్కఁ బల్కుతతి రాజీ
వాతీ యొక్కర్తు ని,చ్చలు నోరాఘువ రామరా
మయనినన్ సాలోక్యసామీప్యముల్, కోలఁదు
ల్మీఱఁగ నిచ్చినాఁడవట నీకున్ బిడ్డవే రెడ్డవా,
రలపుణ్యంబున కెద్ది మేర ర... 82

మ. ఇల నిన్నున్ దొలుబాముసం దలఁపనై తీజన్మ
మందైన నా, తలఁవు ల్మీపదపంకజంబులపయిన్

1 నగు నా. 2 నేర.

దాపింతు నే నింక బి, డ్డలలోఁ జెట్టులలోన
నంబువులఁ బుట్టం బుట్టఁగా నోపఁగ, ర్గలతాబం
ధముఁ బాపుమయ్య ర... 83

మ. ఇల నీమీఁదను జాల భక్తిగలవాఁ డేచెట్టవాఁ
డైన నే, ఖలుఁడైనన్ మది నుత్తమోత్తముఁ
డగున్ గాదన్నఁ గొంగిడ్చెదన్, దెలుప న్నిల్చిన
నాఁడుకొన్న పరవాదిన్ గెల్చెదన్ వేదశా,స్త్ర
లసద్వాక్యనుతప్రతాప ర... 84

శా. దేవా! నాదొకవిన్నపంబు గల దేదీ యంటివా
వింటివా, త్రోవన్ దండధరుండు దుర్గతులకై
త్రోవన్ విచారించునో, యేవిఘ్నం బొనరించు
నో యెఱుఁగరా దా ముక్తికిన్ బోవుచో, రావే
వెంబడి నింత నంత ర... 85

శా. గోవం దొల్తటిజన్మకాలముల నీకుం బంటఁ
గా నైతిఁ గాం, చీ వక్రంబులెకాక నాకు నివి
లక్షింపంగ జన్మంబులా, చావుం బుట్టువు మా
న్పుకోవలయు నీజన్మాన నీవాఁడనై, రావా నాపు
ది కింకనైన ర... 86

శా. చావు ల్మర్త్యులకెల్లఁ గల్గుటలు నిస్సందేహము
ల్దేహముల్, చేవ ల్గల్గిననాఁడె శ్రీగిరి గయా
శ్రీ వేంకటాహోబిల, గ్రావప్రాంతములందుఁ జేర

వలెఁ జేరంబోవ కేలబ్బు నా, ర్యావాణీస్తుత మో
హనలక్ష్మి ర... 87

శా. త్రోవన్ మానవుఁ డొంటిఁ బోవుతఱి నీస్తో
త్రంబు వాక్రుచ్చినన్, నీవుం దమ్ముఁడుఁ దోడు
వత్తురఁటె కా నెయ్యంబు తియ్యంబుగా, నీవం
టాప్తుండు నిన్నుఁ బోలుహితుండున్ నీవంటిభ
క్తప్రియ, ప్రావీణ్యుండును లేఁడు చూడ ర...

మ. నవనీతంబుల కేల పాటెవపురా నాయన్న రా
యెన్న రా, యివి దూత్యంబులు గాఁగ గోపికలు
నీయింటన్ బదార్థంబు లై, య్యవి లేవంచు
వచించునమ్మకడ కొయ్యం జేరు నీచేయు మా, రవి
నోదంబులు నేఁ దలంతు ర... 89

మ. వివిధ బ్రహ్మాలయంత్యకాలముల నేపీనిల్వ వావే
ళలన్, ధ్రువుఁడుండుండు విభీషణుండు బలియుం
డున్ వారు నీదాసులై, నవిశేషంబునఁ గాక త
క్కొరుల కుండంబోలు నే యింద్రరు, ద్రవిరించి
స్తుతశౌర్యసార ర... 90

మ. చెవి నీనామము విందునో యని కడున్ శంకించి
కర్ణంబులన్, రవము ల్మీఱినఘంట లంట నిడి ఘం
టాకర్ణుఁ డే తేరఁగా, నవి చూచే వర మిచ్చినాఁ
డవఁటనీయంఘ్రిద్వయీసేవక, ప్రవరున్ గాచుట
యేమిలెక్క ర... 91

మ. రవిసూనుఁ బరిమార్చి యింద్రసుతునిఁ రక్షిం
చినాఁ డందునో, రవిసూనుం గృప నేలి యిం
ద్రసుతుఁ బోరం ద్రుంచినాఁ డందునో,యివి నీ
యందును రెండునుంగలవు నీకేదిష్టమౌనోకదా,
రవివంశాగ్రణి తెల్పవయ్య ర... 92

శా. దోషంబు ల్కులపర్వతంబులకొలందుల్ గల్గినన్
గల్గనీ, మీసంకీర్తనశబ్దమాత్రమున భస్మీభూత
ముం జేయఁగా, త్రాసు ల్కోటిసహస్రముల్
గలిగి యెత్తఁ రానికార్పాసపుఁ, రాసు ల్సోఁ
కిన నిప్పువోలె ర... 93

మ. కసుమాలం బగుదేహి పుట్టువుల నీకష్టంబులం
బాసి దీప్యసుకాయం బొనరింతు వెవ్వఁడునినుఁ
వాక్రుచ్చినఁ యోగిమా, నసగేహంబులనుండి
లోహము సువర్ణచ్ఛాయగాఁ జేయఁగా, రసవా
దంబులు నేర్చి తౌర ర... 94

మ. పసులం గాచినగొల్లవాఁడ వనుచుఁ భావింతు
నెంతుఁ మదిఁ, ముసలిప్రాయమువాఁడ వైతి
వనుచుఁ మూర్తిత్రయాకారునిఁ, పసుధాధీ
శ్వరు నెంతు నిక్క మెఱుఁగఁ సర్వాపరాధిఁ
గృపా, రసపాథోనిధి కావుమయ్య ర... 95

మ. పిసిడిం జూచి మహాప్రదాత యనుచుఁ బీభ

త్సకుతాన్వంగునిన్, బ్రసవాస్త్రప్రతిమానరూపుఁ
డనుచున్ బందన్ బ్రియంబంద శ, త్రుసమూ
హాంతకుఁ డంచు నెప్పుడు నరస్తోత్రంబుఁ గావిం
చు నీ, రసుఁడన్ నిన్ను నుతింప నేర ర... 96

మ. బహురూపాలు ధరించుకొంచును గ్రియాభా
షాంగము ల్పుట్టఁగా, బహుకాలంబులనుండి
యాడితి నీకన్ బ్రాల్మాలి నట్లయ్యెడిన్, దహలం
బెట్టక చాల్పురే యనుము నీత్యాగంబు నే నొ
ల్లనా, గ్రహాసై తేయమదాపహార ర... 97

శా. మోహావేశ జనించె నాకు నిది యేమోకాని
యీజన్మమం, దక్షీణోదయ ముక్తి కెవ్వఁడొడ
యం డాపుణ్యునిం జెప్పెదో, దశాఃస్తుత నీవె
కర్తవయినన్ దక్కల నీవే ననున్, రక్షింతో
యెఱుఁగంగఁ జెప్పు ర... 98

మ. అక్షీణప్రతిమానదానవిభవాహంకార పారీణ
యో, రక్షోదైత్యమదాపహారవిబుధత్రైలోక్య
సంరక్షకా, దక్షధ్వంసవధూటికావినుత నీదాసా
నుదాసుండ నన్, రక్షింపంగదవయ్య నీవు ర...

మ. చదువు ల్దొంగిలి సోమకాసురుఁడు భాషాభర్త
కూపెట్టఁగా, నుదధుల్ సొచ్చిన వానిఁబట్టుటకు
నుద్యోగించి మత్స్యంబవై, యదరంటన్ రిపుఁ

క్రుంచి వేదములు తేవా దేవ శాండిల్యనా,రద
శౌండిన్యసుతప్రతాప ర... 100

*మ.దనుజాధీశులు నిర్జరాధిపతులుఀ దామందలుఀ
మందరఀ, ఘనసత్వంబున నెత్తివైచి జలధిఀ గ
ర్వంబుతోఁ ద్రచ్చుచోఁ, మునుఁగం బారక
యుండఁ గచ్ఛపమవై మున్నీటిలో నుండు వ,ర్త
నమే నాత్మఁ దలంచుచుండ ర... 101

మ. ధర కల్పాంతమునఀ గరంగఁబడి పాతాళంబులో
[1]నంటినఀ, దొరయఀ దొల్లిటియట్లుగా నిలుప
నుద్యోగించి క్రోడంబవై, పోరి నబ్భూతల మె
త్తినట్టిఘనదర్పుఀ నిన్ను భావింతు ని,ర్ఘరకారు
ణ్యనిరూఢ చిత్త ర... 102

మ. వడుగా నీవడుగ న్నెఱుంగ విట నల్పం బైనవా
సంబు న, న్నడుగఀ వచ్చితి వన్నఁ గన్గొని బలీం
ద్రా నాకు నీవిచ్చుమూఁ, డడుగు ల్మూఁడుజగంబు
లందుఁ గొనవా [2]యాద్యంతముల్ మాట మా,
ర్పడ నాడే [3]మతికాఁడ వౌర ర... 103

*మ.అమరుల్ రాక్షసనాయకుల్ కడఁకతో నత్యంతగర్వంబు
నఀ, దమసత్వంబున మందరాచలముచేఁ ద్రచ్చంగ నం
భోధిలో, రమణఀ దద్గిరి మోచి కాచినజగత్ప్రాణుండ
వూర్మావతా,రమనంగా మఱి నీవె కావె ర...

1 ఁజొచ్చినఀ. 2 యత్యంతముఀ. 3 ముడికాఁడవౌదు.

శా. ఏతాఁగాక మురాంతకుండు గలఁడా యెందైన నిందైన నీ,† చేతల్మానుమటంచుఁ దండ్రి సుతుని న్‌స్తంభంబులోఁ జూపరా, చూతా మన్న నృసింహరూపమున నచ్చో నుండవా చెండవా, రాతిం బోలినదైత్యు మేను ర... 104

మ. సమరక్షోణులఁ బాఱఁబాఱఁగ జరాసంధాదులన్ ద్రుంచి చం, డమదాభీలుని ధేనుకాసురుని చట్టల్చీరి ముష్టిప్రహా, రములన్ ముష్టికు నా ప్రలంబదనుజున్ మ్రందించి తా రేవతీ, రమణాకారముఁ దాల్చి యొప్పార ర... 105

మ. నిను నారాయణమూర్తిఁ గాఁ దలఁచుచున్ నీదండ నాదండకా, వనవాచంయము లెల్లఁ జేరి కొలువన్ వారిం గృపన్ జూచుటల్, వనధిం గట్టుట రావణుం దునుముటల్ వర్ణింతు రామావతా, రనిరూఢాకృతి నిన్ను నోర ర... 106

మ. అమరారాతివధూటికారమణుల న్నశ్వత్థనారాయణ, ద్రుమముం గౌఁగిటచేర్పఁ జేసి వ్రతము ల్త్రాలించి బుద్ధావతా, రమునన్ రుద్రసహాయుమై త్రిపురముల్ మ్రగ్గించి తా కౌర ధీ, రమునిస్తుత్యయశోవిహార ర... 107

---

† చాఁతల్.

మ. కలికాలాంతమునన్ గిరాతజనముల్ గర్వించి చంచత్కిరా,తులనెల్లన్ విదళింపుచున్ గృత యుగద్యోతంబుఁ గావింప నిం, పలరన్ గల్కివి గాఁగనున్న హరిని న్నశ్రాంతముంగొల్చువా,రలు పుణ్యాత్ము లగణ్యశూర రఘువీరా జానకీనాయకా. 108

ఒంటిమిట్ట రఘువీరశతకము

సంపూర్ణము.

---

# పీ ఠి క.

---

దేవకీనందనశతకము రచనాక్రమము కవితా ధారఁ బట్టిచూడఁ బూర్వకవికృతమని తోఁచును. ఇందలి పద్యములు శ్రీకృష్ణభగవానుని లీలావిహారాదికములను గొండాడుచు విష్ణుమహిమాదికములఁ బ్రశంసించుచు మృదుమధురపదగుంఫనములతో సుకుమారములగు సమాసములతో నలరారుచున్నవి. ఇందలి కృష్ణలీలావర్ణనములలోని పద్యములు శ్రీకృష్ణకర్ణామృతము ననుసరించి వ్రాయఁబడినవి విశేషించి కలవు. దృష్టాంతమున కొకదానిని జూపుచున్నారము.

ఉర్వ్యాం కోపి మహీధరో లఘుతరో దోర్భ్యాం ధృతో లీలయా
తేన త్వం దివి భూతలేచ సతతం గోవర్ధనోద్ధారకః
త్వాం త్రైలోక్యధరం వహామి కుచయో రగ్రే న తద్గణ్యతే
కింవా కేశవ భాషణేన బహునా! పుణ్యై ర్యశో లభ్యతే.

ఈశ్లోకము ననుసరించి వ్రాయఁబడిన పద్యమీశతకమున 15-వ సంఖ్యలో నున్నది. ఇటులె కొన్నిపద్యములు భక్తిరసప్రతిపాదకములగు శ్లోకములకు ఛాయలుగాఁ గానుపించుచున్నవి. ఇందలి ప్రతిపద్యము కదళీపాకములో సుకుమార

సమాసకల్పితమై యుంటచేఁ బఠనయోగ్యముగ నున్నది. శతకమున 100 పద్యములు మాత్రమె కలవు. ఫలశ్రుతి తెలుగుపద్యము కందపద్యముగ నున్నది. కవిచరిత్రముగల పద్యము స్తుతివిషయిక పద్యములు లోపించి యుండునని తోఁచుచున్నది. శతకమువలన మాత్రము గ్రంథకర్తను నిరూపింప వీలు చిక్కదుగాన, సాధనాంతరము లన్వేషించి గ్రంథకర్తృనామము కాలము తెలిసికొనఁ బ్రయత్నింపుదము.

జక్కనకవి విక్రమార్కచరిత్రమునఁ గృతిపతివంశావతారముఁ జెప్పుకొనుచుఁ గృతిపతితండ్రి యగు జన్నమంత్రి నీవిధముగాఁ బ్రశంసించి యున్నాఁడు.

సీ. పరమహృద్యంబైన పద్యశతంబున
దేవకీతనయుఁ విధేయుఁ జేసె
... ... ... ... ...
హారితమునివంశరత్నరత్నాకరేంద్ర
చంద్రుఁడై యొప్పు సిద్ధయజన్నమంత్రి.

దీనివలన దేవకీతనయశతకము రచించినది హారితసగోత్రుఁడగు జన్నమంత్రియనియు నతఁడు దేవరాయ మహారాయల యాస్థానమున మంత్రిగ

నున్నటులఁ దెలియుటచే క్రీ. శ. ౧౮౨౨-౧౮౪౦ లోఁగనుండియుండుననియుఁ దలంప వీలుకలుగుచు న్నది. ఇతరాధారములు లభించువఱకు దేవకీనందన శతకమురచనా కాలము గ్రంథకర్తృనామము పై నిర్ణయముతో సరిపుచ్చుకొనవచ్చును. ఈశతక మున వ్యాకరణదోషములు గనుపట్టుచున్న వి.

అయినను అప్పకవివంటి లాక్షణికుఁడు ఇం దలి పద్యములు ఉదాహరణమునకుఁ దీసికొనుట వలన నీశతకప్రశస్తి యప్పకవికాలమునకె సుప్ర సిద్ధముగా నుండె ననుటకు సంశయము లేదు. లిఖిత ప్రతి యొకదానిలో నీశతకము కవిరాక్షసుఁడు వ్రాసినటులఁగలదు. కవిరాక్షసుఁడేజన్న య్యకవియో యాబిరుదనామ మెవరిదో యెఱుంగ వీలుకాదు. మఱియు నాపద్య మొకప్రతియందే గానవచ్చుట వలన నెంతవఱకు విశ్వసనీయమో యెఱుంగనయితి గాదు.

ఈ శతకమును నిర్దుష్టముగా ముద్రించి యాంధ్రదేశీయుల కందించిన వావిళ్లవారి ప్రయత్న ము ప్రశంసాపాత్రము.

నందిగామ
1-1-25

శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

శ్రీ కృష్ణాయ నమః.

వెన్నెలకంటి జన్నయ్యామంత్రికృత

# దేవకీనందనశతకము



శా. శ్రీకైవల్యరమాధినాథ నిను నర్థిం గీర్తనల్ జే
సి కా,దా కంజాతభవేంద్రనారదశుకవ్యాసాంబ
రీషార్జునుల్, నీకారుణ్యముఁ గాంచుటల్ వసుమ
తిన్ నేనెంతధన్యుండనో, నాకున్ జేకురె నట్టి
భాగ్యములు కృష్ణా దేవకీనందనా. 1

శా. శ్రీవైకుంఠనివాస గోత్రధర లక్ష్మీనాథ గోపా
ల లీ,లావిర్భావ పతంగవాహ యదువంశాంభో
ధిచంద్రోదయా, నీవే దిక్కని యున్నవాఁడను
దయన్ వీక్షించి రక్షించవే, నావిజ్ఞాపన మాల
కించు మది కృ... 2

శా. శ్రీరామావసుధాకళత్రములపైఁ జెన్నొందుపా
దాబ్జముల్, గారామారఁగఁ జూచి శేషఫణి
దాఁ గౌతూహలంబొప్పఁగా, క్షీరాంభోనిధిఁ బ
వ్వళించి యమరుల్ సేవింపఁగా నొప్పుని, న్నా
రాధింతు మదీయచిత్తమునఁ గృ... 3

శా. నీడల్ దేఱెడు చెక్కుటద్దములతో నిద్దంపుఁ గెమ్మోవితో, కూడీకూడని చిన్ని కూఁకటులతో గోపార్భకశ్రేణితో, క్రీడాయమునానదీతటీరమండలముతో వేడ్కన్ వినోదించుచున్నాఁడా శైశవమూర్తి నేఁ దలఁతుఁ గృ... 4

శా. అందెల్ చిన్నిపసిండిగజ్జియలుమ్రోయన్ మేఖలాఘంటికల్, క్రందై మ్రోయఁగ రావిరేక నుదుటన్ గంపింప గోపార్భకుల్, వందారుల్ గన వెన్నముద్దలకునై వర్తించుమీ బాల్యముం, జందంబా దివిజుల్ నుతించుటలు కృష్ణా దేవకీనందనా. 5

శా. వేదోద్ధారకుఁగా సుధాప్రభవుఁగా విశ్వంభరావాహుఁగా, నాదావిర్భవుఁగాఁ ద్రయీవటువుఁగా వర్ధిష్ణుతాయుష్యుఁగాఁ, గోదండాశుగపాణిఁగా బలునిఁగా ఘోరవ్రతచ్ఛేదిఁగా, నాదిబ్రహ్మముఁగాఁ దలంతు మదిఁ గృ... 6

మ. అమరుల్ మ్రొక్కులచే మునుల్ నుతులచే నార్యుల్ మహానిష్ఠచే, సమరోత్సాహజనుల్ పునశ్చరణచే సాధుల్ దయాబోధచే, నమితోదారకళాఢ్యు లక్షణలచే నధ్యాత్మ్యులైక్యంబుచే, సమతం గాంచిరి మీపదాబ్జములు కృ... 7

మ. జపముల్ సేయఁగ నేర నీమమున నిచ్చల్పూజ
సేయంగలే, నుపవాసవ్రతభక్తిచొప్పెఱుఁగ
వేదోక్తక్రమస్థుండఁగా, నపరాధంబులు నాయె
డం దఱచు నే నజ్ఞాని నెబ్భంగులన్, జపలుం డం
చు నుపేక్ష సేయకుము కృ... 8

మ. సుకరంబై సురసేవ్యమై సులభమై సువ్యక్తమై
యుక్తమై, ప్రకటంబై పరమార్థమై ప్రమదమై
ప్రద్యోతమై పథ్యమై, యకలంకామృతమై య
మోఘతరమై యానందమైయందమై,సకలంబులన్
భరియించు మీమహిమ కృ... 9

శా. కొండల్వెంటికవీశ్వరుల్ శతకము ల్గూర్పంగఁ
గోటానకో, ట్లుండన్ నీవును జెప్పఁబూనితి వదే
మో యంటివా వింటివా, వందే నేర్పులఁ బెక్కు
రీతుల రుచుల్ వర్తింపవే శకముల్, దండిన్
నామన వాలకింపు మదిఁ గృ... 10

శా. చన్నే నిన్నును బాలుఁగాఁదలఁచి యిచ్చంబూత
నా కాంతదాఁ, జన్నుల్నిండఁగఁ జేఁదుఁబూసికొని
యాచన్బాలు నీకిచ్చినం, జన్నుంబాలకు లో
నుగాక యసురన్ సాధించియాయింతికిన్,సన్నన్
ముక్తి యొసంగి తీవు భళి! కృష్ణా దేవకీనందనా.

మ. విలసిల్లన్ పదియాఱువేలసతులన్ వీక్షించి వా

రిండ్లలో, పల వర్తించుచు నుండి వీటఁ గలగో
పస్త్రీలనెల్లన్ గడుం, బలిమిన్ బట్టి రమించినాఁ
డవు భళీ ప్రాజ్ఞుండ వీవాదు భూ,స్థలి నీవేకద శాం
టదేవరవు కృ.... 12

మ. పొలుపొందన్ నడిరేయిఁ గుక్కుటరవంబుల్
చూపి గోపాలకా, వళి విభ్రాంతులఁ జేసి మంద
లకు నై వారేగఁ దత్కామినీ, కలనాయత్న
ము తాము చూడగతులం గావించి నీకీర్తి రచ్చ
ల కెక్కెం గడుగొయ్య దేవరవు కృ... 13

మ. అనిరుద్ధాచ్యుత యీశ కేశవ ముకుందాధోక్ష
జోపేంద్ర వా, మన దామోదర చక్రపాణి
హరి రామా శౌరి శార్ఙ్గి జనా, ర్దన పీతాంబర
భక్తవత్సల నమో దైత్యారి వైకుంఠ వా, స నృ
సింహాంబుజనాభ ప్రోవు ననుఁ గృ... 14

మ. ఇల గోవర్ధన మెత్తితీ వనుచు బ్రహ్మేంద్రాదు
లెంతో నినుం,బలుమారున్నుతులొప్పఁజేసెదరు
పద్మాక్షా కుచాగ్రంబునం, జులక న్నెత్తినరాధ
నెన్న రిదిగో పొంపొంద సత్కీర్తి ని,శ్చలపుణ్యం
బునఁ గాక చొప్పడునె కృ... 15

శా. మాళిం బింఛపుదండ యొప్పగ నటింపంగాను
శృంగారపున్, శ్రీ లెంచంగను పిల్లఁగ్రోవిరవ

ముఁ జేకోలముం జెక్కుచుఁ, గేలఁ మెచ్చొ
నరింపఁ గోపకులతోఁ గ్రీడారసస్ఫూర్తినీ,వాలం
గాచువిధంబు నేఁ దలఁతుఁ గృ... 16

శా. పెచ్చుల్ ప్రేలుచుఁ బిల్లఁగ్రోవిరవముఁ బెం
పొందఁగాఁజొక్కుచుఁ, నిచ్చల్ నిన్ను భజింప
గోపగణముఁ నిత్యోత్సవక్రీడమై, నిచ్చల్
మచ్చికముచ్చటచ్చుపడఁగా హెచ్చించి కీర్తించి
నీ, సచ్చారిత్రము విన్నఁ బుణ్యమగుఁ గృష్ణా
దేవకీనందనా. 17

మ. లలనాకుంచితవేణియుం దడవ మొల్లల్ జాఱి
కస్తూరికా, తిలకంబుం గఱఁగంగ లేఁతనగవుఁ
దీపింప నెమ్మోమునఁ, దళుకుల్ చూపెడి
చూపు లుల్లసిల నానారీతులఁ వేణుపుష్కల
నాదంబుల పెంపుఁ జూపుదువు కృ... 18

మ. కలకాంచీమణికింకిణీమధురనిక్వాణంబు మంజీర
మం, జులరావంబును గొంతకొంత వినవ
చ్చెఁ బట్టలేనైతి నం, కిలి నిద్రించుట మోస
పుచ్చె హితవాగ్గేయుండు నేఁడంచు ని, చ్చలు
మీశౌర్యము లెంచు గోపతతి కృ... 19

మ. కలనైనఁ నగినైనఁ గోప మెసఁగంగా నైనమీ
నామ న్నిర్మలవర్ణద్వయ మెవ్వరేఁదలఁచినం బా

పౌఘము ల్వాయు నుజ్జ్వలభాస్వప్రతిమానచం
డకిరణవ్రాతాహతిం జీకటుల్, చలనం బంది
తొలంగుచందమునఁ గృ... 20

మ. నిను నెవ్వాఁడు దలంచు నీమహిమ వర్ణింపంగ
నెవ్వాఁడు నేర్చునఁబూనుఁ గా నినుగొల్చునట్టిఘ
నుఁ డాపుణ్యాత్ము లోకైకమాన్యునిఁగా ధన్యు
నిఁగా వివేకనిధిఁగా సుదర్శ్గుణాంభోధిఁగా, నని
శంబుం గొనియాడఁ గోరుదురు కృ... 21

శా. శీలంబుఁ గులముఁ గా వివేకనిధి లక్ష్మీకాంతవక్ష
స్థ్సలిఁ, హాళిం బాయకయుండు కాముకుఁడవై
హంకారవృత్తిఁ గా సదా, స్త్రీలోలుండన రాధతోఁ
బెనఁగుట ల్చిత్రంబులు న్నాకనీ, జాలం బేమని
సన్నుతించెదను కృ... 22

శా. శ్రీలక్ష్మీధవ రుక్మిణిం గలసి కూర్మిఁ గా మిత్రవిందా
సునం, దాలోలాక్షులఁ గూడి జాంబవతి సత్యా
లక్ష్మణాభద్రలఁ గా, కాళిందిఁ గా మరుకేళిఁ దేల్చితివి
శృంగారాంగగోపాంగనా, జాలంబుఁ గా దనియిం
తు వౌర తుదఁ గృష్ణా దేవకీనందనా. 23

శా. ముద్దు ల్గూల్చినలాగొ వేగ మనిలో మన్నించి
గాండీవికిఁ గా, బుద్ధుల్ సెప్పినలాగొ మోదరస
ముప్పొంగఁ గా యశోదమ్మకుఁ గా, ముద్దుల్గా నటి

యించులాగో వరుసన్ మువ్వేళలన్ వేడుకన్,
చద్దు ల్మెక్కి రహించులాగొ ధరఁ గృ... 24

మ. చరణాబ్జంబులు వీడ్వడన్ నిలిచి యోజన్
ధట్టిలోఁ బిల్లఁగ్రోల్, కర మొప్పారఁగ నుంచి
యింపొదవఁ జంకన్ గోల నందిచ్చి బ,ల్యుర్వరుగో
పాలురుజుట్టునుంగొలువ వేల్పుల్ గ్రుక్కిళుల్మ్రిం
గఁగాఁ,నరయం జల్ది భుజింపవే యడవిఁ గృ... 25

మ. మెఱుఁగు ల్దేఱుమహేంద్రనీలనిభ మౌ మేనన్
సమీపాటగో, ఖురనిర్ఘాతధరాపరాగలవపంక్తు
ల్గప్పఁగా నొక్క చేఁ, బురిగోలొక్కటఁ బాలకుండఁ
గొనుచుం బోల్పొంద గోదుగ్ధనాం,తరవర్తిష్ణుఁడ
వైననిన్ గొలుతుఁ గృ... 26

శా. ఆధివ్యాధిహరంబు జన్మమరణవ్యాపారదుష్క
ర్మదు,ర్బాధావ్యాప్తినివారణంబు సతతస్ఫూర్జజ్జ
గద్రక్షణో,న్మేధాయుక్తము భక్తవాంఛితఫలా
నీకప్రథానైకదీ,క్షాధౌరేయము నీమహామహి
మ కృ... 27

శా. హాలాహాలశిరోధిమాలినయనో ద్యద్భీమధూమ
ధ్వజ,జ్వాలాక్షీలకరాళరూక్షవిషనిశ్వాసోష్ణకృ
ష్ణానదాం,భోలీలాస్పదకాళియస్ఫుటనటద్భోగా
గ్రమధ్యంబునన్, హేళిన్ దాండవమాడు నిన్
దలఁతు గృ... 28

మ. తినదే చెట్టున నాకు మేఁక గుహ గొందిం
బాము నిద్రింపదే, వనవాసంబునఁ బక్షులున్
మృగములున్ వర్తింపవే నీటిలో, మునుకల్ వే
యవెమత్స్యకచ్ఛపములున్ మోక్షార్థమౌ ముక్తి
కిన్, మనసే మూలము నీదుభక్తులకు కృష్ణా దేవ
కీనందనా. 29

శా. వింటిం గొంతగ మీమహత్త్వమును నుర్వీన్
దర్శనప్రాప్తిచే, ఘంటాకర్ణుని నుగ్రసేనతనయుం
గైవల్యతేజంబు ని,న్నంటంజేయవెమాటమాత్ర
మున నిట్లాశ్చర్యమున్ బొందఁగా, నంటం బొం
దనివేల్పు నిన్ గొలుతుఁ గృ... 30

మ. విలసత్కావ్యకళాధురీణతలు తద్విజ్ఞాను లైన
ట్టివే, త్తలకుం గా కవి యేల మూర్ఖులకు గాథల్
జెందు భాగీరథీ,దళితాంభోరుహషండమండితమ
రందగ్రాసమాధుర్యవాం,ఛలు జోత్కేఁగల కేల
తేంట్లగతి కృ... 31

మ. చతురంభోధిపరీతభూవలయ రాజానేకకోటీరరం,
జితమాణిక్యవిరాజమానపద రాజీవుండు ధర్మాత్మ
జుం, డతికారుణ్యముచేత మత్స్యపతికో లొవ్వాసిం
పఁడే నీదుళ్లా,శ్వితకారుణ్యముగల్గునంతకును కృ.
మ. శుకమద్గౌతమకణ్వకుత్సజమదగ్నోన్యదంకశాండి

ల్యశో, నకపారాశరకశ్యపత్రిఘటజాహ్వేంద్ర
ప్రభూతత్రియం, బకకంజోద్భవనారదాదిముని
వ్రాతప్వంకేజసౌమ్యత్రిపా, నకృపాసాగర నీకు
మ్రొక్కెదను కృ... 33

మ. వివిధోగ్రస్థవనప్రచండబలవిద్వేషావనీనాయకో,
త్సవభంజీకృతశాలి యర్జునుఁడు దోస్సత్త్వుండు
మత్స్యావనీ, ధవుగేహంబున నాట్యశాలధరియై
తా నిల్చె డే నన్ముని, స్తవ నీసత్కృప గల్గునంత
కును కృ... 34

మ. బలభేదిన్నలయించి ఖాండవవనిన్ భస్మంబు
గావించి ము,న్నెలమిన్ దైత్యులఁద్రుంచి యొక్క
టిశివున్నిర్జించి కౌరవ్యులన్, బలి గావించి కిరీటి
బోయలను గోపస్త్రీల నొప్పింపఁడే, యల నీతే
జము నీవు గైకొనినఁ గృష్ణా దేవకీనందనా. 35

మ. ఇలఁ దద్వైరిన్నృపాలఫాలఫలక (?) ప్రత్యగ్రరక్త
చ్ఛటా, కలితోదారగదావిజృంభణభుజాగర్వుం
డు భీముండు కు, క్కలకుం జాపఁడె యేక
చక్రపురిభిక్షావేళయుష్మత్సము,జ్జ్వలకారుణ్యము
గల్గునంతకును కృ... 36

మ. అతిసౌందర్య సమగ్రధైర్య ఘనశౌర్యస్ఫూర్తి
యున్ కీర్తియు,న్నతులప్రాభవరేఖయున్ గలిగి

చోద్యంబెన్నఁగా ఘోటకప్రతతిం దిద్దఁడె
నిత్యముఁ నకులుఁ డేపారంగ నీసత్కృపన్,
సతమై రాజ్యము గల్గునంతకును గృ... 37

మ. బకదైతేయమహాబలున్ సమరభూభాగంబునన్
వాయుపుత్రకుఁ డీల్గించిన నేకచక్రపురివారల్
మెచ్చి యింటింట వంతకము ల్బెట్టెరిగాని భిక్ష
యనుమాటన్ మాన్పలేరైరి యంతకు వారల్
గొంటఁ తేమి చాలుటకుఁ గృ... 38

మ. గహనావాసములోన నన్నలకుఁ దా గారాబు
తమ్ముండునై విహరించేతటి భావికాలగతి నన్వే
షించుచున్ శౌర్యసంగ్రహుఁడై యావులఁగాచె
మత్స్యపురిలోఁ గర్మానుగుణ్యక్రియ, నృహదేవుం
డతిధైర్యమార్గమునఁ గృ... 39

మ. వినుతానేకతురంగవారణరథోర్వీనాథదివ్యన్నికే,
తనచక్రధ్వజచామరద్రఢిమతోఁ దథ్యాత్ముఁడా
నానుయోధనుఁ డేకాకియుఁ బాదచారియు
నునై దర్పంబు వోనాడి పోయెను మిమ్మెట్టుఁ
దలంచి చూడకయ కృ... 40

శా. రక్షింపం దగువీరుఁ డెవ్వఁ డగు నీరాజుల్
వృథా తేజులే, మోక్షశ్రీ యొసఁగన్ విభుం డెవఁడు
శ్రీమోహకృతిన్ దేవతల్, రక్షోధ్యక్ష శుభప్ర

థానగరిమన్ రాజిల్లురాజేంద్రులున్, సాక్షాద్భ్రి
ష్మాము నీవె ధన్యులకుఁ గృష్ణా దేవకీనందనా. 41

మ. కొలిచేరన్ వగలేకనే యడిగితే కోపించు టీలే
కనే, చెలువం బెచ్చుట కోటనే విభవముల్
చేకూరుటల్ రూకనే, బలవంతుం డగుమూఁకనే
సతిచెడున్ ప్రాణేశుపైఁగోకనే, జలదశ్యామలశం
ఖచక్రధర కృ... 42

మ. బలశౌర్యోన్నతి శత్రులం గెలిచి సప్తద్వీపవిశ్వం
భరా,స్థలి నేలించి సమస్తవైభవములన్ దీపించి
దిక్పాలకా,వళి కీర్తింప మెలంగునైషధుఁడు దా
వర్తింపఁడే తొల్లి వం,టలవాఁడై ఋతుపర్ణుచెంగ
టను కృ... 43

మ. ధరలో గోళకుఁ డైనపాండునికళత్రం బందు
వేర్వేఱ నే, పురకున్ బుట్టినపాండునందనులు
దివ్యశ్లేచ్ఛ వర్తింపఁ, దచ్చరితం బంతయు భార
తం బని ప్రశస్తం బయ్యె నీనామసం,స్మరణప్రౌ
ఢిమఁ గాదె యాఘనత కృ... 44

మ. క్రతువుల్ నూఱొనరించి యింద్రపదవి న్గర్వించి
యింద్రాణికై, ధృతిఁదూలన్ మరుఁడేఁచఁగా న
హుషుఁ డద్దేవేంద్రుభోగానుసం, గతిగాఁ గోరిన
కుంభసంభవుఁడు గిన్కన్ దిట్టినన్ జెందఁడే, సత
తంబున్ వెనుబాముచందమును గృ... 45

మ. ఘనులన్ నీచుల నీచులన్ ఘనుల సత్యాగాఢ్యులన్
దుష్క్రియా, జనితోద్యోగుల నర్థవంతులను
భిక్షాయుక్తులన్ భిక్షులన్, ధనికవ్రాతముగా నొన
ర్చుచును నిత్యంబున్ మహాగారుడం, బనినందించు
వినోదరాయ హరి కృ... 46

శా. శ్రీలక్ష్మీధవ వాసుదేవ వరరాజీవాక్ష పద్మాసన,
వ్యాళాధీశ్వర శర్వషణ్ముఖ శుకాద్యస్తోత్రసత్పా
త్ర గో, పాలానీకముఖాబ్జభాస్కర కృపాపాథో
ధి నన్ గావు మా, ర్థాలంకార మయూరపింఛ
ధర కృష్ణా దేవకీనందనా. 47

మ. పతులు న్నేవురు నెన్నఁగాఁ గలిగి భూపాలాం
గనానీకముల్, సతతంబున్ గనుసన్నలన్ మెలఁగు
చైశ్వర్యంబుతో నుండి తా, నతిభక్తింజని యా
సుధేష్ణకును జేయం బూనదే ద్రౌపదీ, సలియాశ్చ
ర్యము నీవిలాసములు కృ... 48

శా. మీసామర్థ్యము గల్గునంతకును నెమ్మిన్ బాండు
సూనుండు నా, యాసం బొంది మహాద్భుతంబుగ
విరాటాధీశుపట్టంబులో, గ్రాసోపాయము లేక
భిక్ష మడుగన్ గాషాయముంబూని సన్యాసం
బున్ ధరియింపఁడే యచటఁ గృ... 49

మ. విరటుం గొల్చినవాఁడునొక్కఁడిలఁ బృథ్వీనాథు

లన్ గూల్చి సం,గరభూమిన్ ఘనవైరివీరతతుల
న్గారించుచున్ ద్రుంచి యి,ద్ధరకు న్నగ్రజు రాజుఁ
జేసియు తుదిన్ దా నీకృపంబాయఁడే,సరిపోదే
భువి నింద్రసూనుధృతి కృ... 50

మ. అమరు ల్బద్మజువ్రాఁతదాఁటియిపుడొక్కబ్దంబు
పెద్దయ్యెదు, ర్దమదోర్దండపటుప్రతాపనిజసంరం
భామరానీకవి,క్రమదుర్వారగజాసురప్రళయమిం
కం జేయుఫాలాక్షునిన్, సమరక్షోణి జయించె
నర్జునుఁడు కృ... 51

శా. ఆమూరిరాత్మకులైనపాండవుల బాహాశక్తియున్
ధాత్రి వి,ర్వక్రంబయ్యెదునట్లుజేతు ననుచున్
వాత్సల్య మింపొంద నా,శక్రాత్మోద్భవు తేరిపై
దురమునన్ సారథ్యముం జేసితో,చక్రీ నీమువి
కోలకున్ జయము కృ... 52

శా. గంభీరంబుగ రాయబారగరిమన్ గౌంతేయుకా
ర్యార్థమై, శుంభల్లీలల ధార్తరాష్ట్రసభలో
సొంపార తద్వాక్యము,ల్సంభాషింపఁగ వారవ
జ్ఞ దలఁపన్ సర్వంబు నీవైనచో,శంభుండే యె
ఱుఁగున్ భవన్మహిమ కృష్ణా దేవకీనందనా. 53

శా. ఏలావిద్యలు సొంపు రూపవిభవం బేలా కులీన
త్వమున్, శీలత్వంబును నేల యేఁటికి వచశ్రీ

యేల బాహాబలం,బేలా చాతురి మీకృపాగ
రిమ నిక్షేపంబు లేకుండినన్, జాలిం బొందినం
గల్గునే సిరులు కృ... 54

శా.సర్వజ్ఞుండును సర్వలోకగురుఁడున్ సర్వంసహా
నాథుఁడున్,సర్వేశుండును సర్వసాధకుఁడునా
సర్వేశ నీమూర్తిదా,సర్వంబు న్గలిగించు పెంచు
నణంచున్ సుదేహమేలాస్మృతుల్, 'సర్వంవిష్ణు
మయంజగ' త్తనఁగ కృ... 55

మ. పుడమిన్ బెద్దలబోటివారి నడుగం బోరాదె
చోద్యంబు పాల్కడలిన్ గల్గినముద్దరాలు గలు
గంగాఁ బూర్వకాలంబునన్, పొడవెల్లన్ గడు
తగ్గి దానవునితో బొంకైనమాటాడి మూఁడ
డుగు ల్నేలను వేఁడఁగాఁ జనవు కృ... 56

శా.రంగత్ప్రౌఢిమ భార్గవుం గెలిచి కౌరవ్యుల్ భ
యం బంద వీరాంగంబుం ధరియించి జీవము
సతంబై యుండ వర్తించు నా,గాంగేయుండు
శిఖండిచేతఁ దెగ నీకారుణ్యముం దప్పియుం,డం
గా మృత్యువుఘాటి కోపుదురె కృ... 57

శా.అకూరస్థితి నుండఁగా వలయురాజాస్థానమ
ధ్యంబునన్, వక్రింపం బనిలేదు ధర్మమునకై వ
ర్తింపఁగాఁ బోయినన్, శుక్రాచార్యుని కన్నుఁ

బో నడఁచవే సూటిన్ గుశాగ్రంబునన్, జక్రి
నీకరపంకజాతమున కృ... 58

మ. వరసౌందర్యవివేకధైర్యనయధీ వాత్సల్యధారే
యుఁ డీ,ధరణీనాయకరత్న మందు మహితార్థం
బాశ్రితశ్రేణికిన్,స్థిరసామ్రాజ్యవిభుత్వ మాధుర
వునికిన్ దేజంబు గా నిచ్చి తా,సరణిన్ మిాకృ
ప గల్గువాఁ డగుట కృష్ణా దేవకీనందనా. 59

శా. ధారాపూర్వముగాఁగ సంయమికి సప్తద్వీపము
ల్ సూనృత, ప్రారంభంబున నిచ్చి చేతితడియా
అన్ లేక వర్తింపఁడే, శారీరార్థముగొంచు భి
క్షువు హరిశ్చంద్రుండు యాగాదిసం,చారుం
డిందు మనండె తొల్లి హరి కృ... 60

మ. పటుబాహాబలసత్త్వవైఖరుల దిక్పాలుల్ ప్రశం
సించునం,తటివాఁడయ్యుఁద్రిశంకునందనుఁడు కాం
తారత్నమున్ విక్రయిం, చుటలున్ నీమహిమం
బుచేతఁ గద యిట్లాశ్చర్యమే మర్త్యు లెం,తటి
వారైనను నేమిచేసెదరు కృ... 61

మ. తనశౌర్యోన్నతి యుగ్రసాధనముగా దాక్షాయ
ణీశున్ శివున్, దనరన్ మెచ్చఁగఁజేసి లోకము
జయస్తంభంబుగావించియున్,మును దాఁ జేసిన
కర్మవార్ధిఘనమై ముంపం గడుంబాలుచేఁ,జనఁడే
దుర్మతి విక్రమార్కుఁ డిల కృ... 62

మ. తెగువన్నిర్జరులన్ జయించుచు మదోద్రేకం
బునన్ గావలో, మృగనేత్రన్ ధరణీతనూజ న
సుమ త్సైచ్ఛంగఁ దాఁ దెచ్చి నె,వ్వగలం బెట్టి
విధిప్రయత్నమున నిర్వంశంబుగా రాముచే, జగ
తిం గూలఁడె యాదశాననుఁడు కృ... 63

మ. పరనారీహరణం బొనర్చినమహాపాపాత్ముఁ డా రా
వణుం,డరయన్నా తనితమ్ముఁడై నదనుజుండత్యంత
సద్భక్తితో, శరణన్నం దయఁ జూచి యగ్రజుని
రాజ్యం బిచ్చి రక్షింప వా,సరణిన్ నీపదభక్తి
యే ఘనము కృ... 64

మ. వెఱచైనన్ మఱచైనఁ గార్యముతఱిన్ వేసా
రుచున్నైన యా, దరమొప్పైనను మాయనైన
నృపతుల్ దండింపఁగా నైననున్, బరిహాసంబున
నైన మిమ్ము నుడువన్ బ్రాపించుపుణ్యాత్మకుల్,
నరకావాసముఁ జేర రాఘనులు కృష్ణా దేవకీ
నందనా. 65

మ. నొసటన్ గన్నులఁ గట్టి వేల్పు సతి నెంతో భక్తి
తోఁ జూడఁగా, నిసుమంతైన భయంబులేక తల
మీఁ దెక్కి స్నదట్లుండ నీ,వసుధన్ భర్తలు
స్త్రీల కెవ్వరయినన్ వశ్యాత్ములై మట్టులే,కస మి
యశ్రీం దల కెక్కి కుందుదు రె కృ... 66

మ. కరితో దోమ మృగేంద్రుతో నరుఁడు బంగారంబు
తోఁ గంచు భాస్కరుతో మిణుగురుబుర్వు కల్పకము
తోఁ గానుంగు రత్నాకరేశ్వరుతో నూషరప
ల్వలంబు నురుశేషస్వామితో మిత్తయుక్, సరి
యైనన్ సరి మీకు దైవములు కృ... 67

మ. సుతలోకప్రతిసృష్టి నిర్మలకళానూత్నాబ్జగర్భున్
మహాప్రతిభున్ గౌశికుఁ గుక్కమాంసము భు
జింపం జేసి మాలాతనిన్, బలిమాలింపవె చండ
చండతరశుంభత్త్వంబు పల్మాఱు నాశతఁ బొం
దింపవె దేవ దేవమయ కృ... 68

మ. వరభోగాధ్వరదానధర్మగుణముల్ వర్జించి తృ
ష్ణారతిన్, నరులత్యంతము మూఢలోభమతులై
నారీరతిం గూర్పఁగాఁ, దరముం గానిధనంబు త
స్కరవరుల్ ధాత్రీశులుం జేకొనున్, సరఘువ్రాత
ము జేర్చు తేనెక్రియన్ కృ... 69

మ. ఖలవాక్యప్రతిపాలకుల్ పరధనాకాంక్షుల్ పర
స్త్రీరతుల్, కులధర్మౌఘనిబద్ధచిత్తులు నయాకూ
పారపారంగతుల్, కలుషుల్ రాజులువారి సేవకు
లకెల్లం గల్గు నత్యంతనిశ్చలసౌఖ్యంబులు ని ష్ఫ
జింపఁగను కృ... 70

శా. బొంకు ల్లక్షలు నిత్యసంభరితసంభోగారతుల్

దుర్మదా, హంకారంబులు కోట్లసంఖ్యయగు మో
హంబా యనంతంబు దు,ష్పంకాభార మపారమి
న్ని గలభూపవ్రాతసర్పావళిని, శ్శంకం బ్రాజ్ఞులు
చేరం బోవుదురె కృష్ణా దేవకీనందనా. 71

శా. చీమల్ పుట్టలు పెట్టుచుండ నవి విస్తీర్ణంబు
గావించినన్, పాముల్ జేరినరీతి లోభిజనసంప
న్నార్థరాసుల్ వృథా,భూమీపాలుర పాలుగాక
చనునా పుణ్యంబులే లోల్లరో, సామాన్యంబు
ధనాధినాథులకుం గృ... 72

మ. అదనం బ్రొద్దుటిసీడచందమున నిచ్చల్ ప్రక్కి
దుష్టాత్మసం,పద పెంపై ధరనిల్వదించుకయుసౌభా
గ్యప్రభాభాసిరై, పోదలున్ మాపటినీడకై వడి
భవత్పూజావిధేయజ్ఞుండై, సదయుండై నను లేమి
జేకురునె కృ... 73

శా. కీడున్ మేలును వచ్చుం గర్మవశతన్ క్రీడాగ
తిన్ జోకలై, యోడల్ వచ్చును బండ్లు నో
క్కోడధరన్నొక్కప్పుడున్ బండ్లపై, నోడల్ నాం
గద దేశకాలగతి శీతోష్ణంబు లీరీతి నే,జాడన్
వచ్చును దుఃఖసౌఖ్యములు కృ... 74

శా అంతశ్శత్రుల గెల్వలేరు మమతాహంకారము
ల్మానలే,రంతే మూర్ఖము వీడలేరు భవదీయాంఘ్రి

ద్వయీచింతనా, చింతారత్నముఁ గానలే శిల
ను దుశ్చిత్తుల్ వృథా వేదవేదాంతంబుల్ చదు
వంగ నేమి యగుఁ గృ... 75

శా. నానావేదపురాణశాస్త్రముల నానందింపఁగా
నిత్యమిం, పౌనార్యుల్వినుతింప ధార్మికరహస్యం
బుల్విన స్వచ్ఛునా, నా నామాంకభవద్వివేకుల
కము న్నాశ్చర్యమే సత్వరా, జ్ఞానాధిక్యముగాని
ముక్తిగని కృ... 76

శా. గట్రాలన్ బలుకానలన్ గుహల గంగాసింధు
దేశంబులన్, వట్రాతావుల దేహమెల్లఁ జెద
రన్ వర్తించినన్ మేరువున్, చుట్రా దేబది
మార్లు మెట్టినమనశ్శుద్ధుండు గాకుండినన్, చట్రా
వానిప్రయాస మంతయును గృష్ణా దేవకీనందనా.

శా. గంగాజన్మపదాబ్జమందు నభిషేకంబు ల్సదా
గాంచెదన్, అంగారార్చనచేసి పారణము
నన్ నర్చింతు నంభోధరా, శృంగారాధిపకౌ
స్తుభాభరణ యేశృంగారముల్ జేతు మీా, కంగీ
కారము గాఁగ నాతరమె కృ... 78

మ. అతిమోహాంధులఁ బాపకర్ముల మహాహంకా
రులన్ దోషదూషితులన్ గర్వితదుర్విచారులఁ
బ్రశంసింపం †బ్రశంసింపఁగా, తిపర్యాప్తిదినంబు

† ప్రపంచవ్యవ, స్థితపర్యాప్తిదినంబు లేగి.

లొంది త్రిజగద్విఖ్యాతయుష్మత్సము, న్నతసేవా
భిముఖుండనైతి నిట కృ... 79

మ. పలుమాఱుల్ ఇహభోగకాంక్షసభలన్ పాండి
త్యముల్ సే,యువా,రలయజ్ఞానము మాన్పఁగాఁ
గలరె యెట్టైనన్ బ్రకాశించుకో, మలదీపాలి
తొలంగఁ ద్రోయునె భవన్మాయాంధకారంబు
న్వు,జ్జ్వలితానందమయస్వరూపయుత కృ... 80

శా. ఉర్విం బాఱుమహానదీజలము లాయూరూరునం
దెల్లఁ గూ, డురుఘోషంబున వంకలైకలియఁగా
యోగ్యంబులైనట్లు మీ,స్మరణన్ నానుడువుల్
సదాశుభములై సంపూజ్యముల్ గా భవ,చ్చర
ణంబుల్ మది నిల్పి కొల్చెదను కృ... 81

శా. బాలక్రీడలఁ గొన్నినాళ్లు పిదపన్ భామాకు
చాలింగనా, లోలాభ్యున్నతిఁ గొన్నినాళ్లు మఱి
యిల్లుల్ ముంగిలిం గొన్నినా, ళ్ళీలీలన్ విహ
రించితిన్ సుఖఫలం బెందేనియున్ లేదుగా,చా
లన్ నీపదభక్తిఁ జేసెదను కృ... 82

మ. మతిలోమిన్నఁదలంచుపుణ్యుఁడిలఁదామాయన్
స్వదారాదుల, న్వేతలం బొర్లఁడు భాగ్య
వంతుఁ డగుటీవిన్, దివ్యమృష్టాన్నసం,గతిలోనా
తుజనుండు భిక్షము నొసంగన్ నేర్చునే శూల

భృచ్ఛతురాస్యప్రముఖామరప్రణుత కృష్ణాదేవ
కీనందనా. 83

శా. అన్నంబైనను దక్రమైన దగుతోయంబైన
నభ్యాగతుల్, దన్నాశించిన నేమియు న్నిడక
యేధర్మంబునుం జేయ కే, మన్న న్నారకయుందు
జీవశవమర్త్యశ్రేణి యిద్ధాత్రిలో,చన్న న్నేమగు
నేమగుల్ గలుగఁ గృ... 84

శా. ప్రారబ్ధానుభవంబు దీఱ కపవర్గప్రాప్తిలేదం
డ్రుగా, క్షీణశ్రేష్ఠు లనంతకోటులిఁక నైతే వారి
కర్మంబులుల్, ప్రారబ్ధంబులు గావె ముందఱకు
నోభాజ్ఞ సైరించి నా,ప్రారబ్ధంబులఁ దీర్పవే
కరుణఁ గృ... 85

శా. శ్రీజన్మప్రభుశావిశేషుఁ డగురాజేంద్రుండు ధీపా
లనా, జ్ఞాజాగ్రత్త్వనిదానకీర్తియుత రత్నాలత్ష
ణాధీశుఁడై, రాజిల్లుల్ బహుకష్టుఁడైన ధరసా
మ్రాజ్యంబు బాలింపుచో, నైజంబై తగునా
విశేషములు కృ... 86

మ. సమరద్వేషుల సంగరాంగణమునన్ సాధించి సా
మ్రాజ్యసౌ,ఖ్యముఁ దాఁగాంచి సహించి చొప్పడు
వివేకప్రాజ్ఞాగ్లాంచుభూ,రమణశ్రేష్ఠుఁడు తావకా
నుచరుఁడై రాణించు శిక్షించు దు,ష్టమతి భ్రష్ట
మదాంధశత్రువుల కృ... 87

మ. విగతక్లేశులు వీతకిల్బిషమయుల్ విజ్ఞానవిద్యా
నిధుల్, నిగమార్థజ్ఞులు నిశ్చలవ్రతయుతుల్
నిర్వ్యాజనిష్ఠాయుతుల్, సుగుణుల్ సూనృతవర్త
నుల్ శుభకరుల్ శుద్ధాంతరంగుల్ శుభుల్,
జగతీమండలి నీదుసేవకులు కృ... 88

శా. దీనుల్గల్గిన నీదురక్షణగుణాధిక్యంబు రాణించు
నా, దీనుం డెవ్వఁడు లేఁడు నీదుకరుణాదృష్టిక్
గృతార్థుల్ జుమీ, నేనే దీనుఁడ నన్నుఁ బ్రోవు
శరణంటిం దన్ముఖోదీర్ణను, జ్ఞాన శ్రీకరమూర్తి
నమ్మితిని కృష్ణా దేవకీనందనా. 89

శా. పాత్రాపాత్రవివేకము ల్మనసె పాపం బెచ్చె
ధర్మంబునున్, మిత్రఘ్నత్వము కల్లలాడుటయు
స్వామిద్రోహముం గొండెమున్, ధాత్రిం బూ
జ్యములయ్యె సజ్జనులచందం బెట్లు రక్షించెదో,
సత్రాజిత్తనయామనోరమణ కృ... 90

మ. అరయన్ *శంతనుపుత్త్రుపై విదురుపై నక్రూరు
పైఁ గుబ్జపై, నరుపై ద్రౌపదిపైఁ గుచేలకునిపై
నందవ్రజస్త్రీలపైఁ, బరఁగం గల్గు భవత్కృపారస
సము నాపైఁ గొంత రానిమ్ము మీ, చరణాబ్జంబుల
నమ్మినాఁడ హరి కృ... 91

* చందనగంధిపై.

మ. అనుకూలాన్విత యైనభార్యయును ధర్మార్థంబు
లై నట్టినం, దనులుల్ సజ్జను లైనసోదరులు నె
న్నంగల్గు సంపత్క్రియా, ఘనుఁడై నట్టి మహాను
భావుఁడె భవత్కారుణ్యదృగ్జాలభా, జనుఁ డప్పు
ణ్యుని జూచినన్ శుభము కృ... 92

మ. శరణాగత్యనురక్తి? భక్తి జనరక్షాసత్కృపానే
వ్యసత్కరుణాపూరసుధారసంబు గలశృంగారం
రంబు మీమూర్తియుం,దరణోపాయ మెఱుంగ
లేని కలుషాధారుల్ ననుం దాపక, స్మరణా
ధీశునిం జేయు మ్రొక్కెదను కృ... 93

మ. ప్రలయాభీలకరాళదావదహనప్రజ్వాల మబ్జో
ధరా ! జ్వాలానాకారము డాల్ప దానియెదు
టన్ సంతప్తసంతాపవాం, ఛలు దివ్యుల్మునులుం
గృశాస్యులగుచుం జల్లార్పఁగాలేక ని,చ్చలునీపా
దములే భజించెదరు కృ... 94

మ. మొఱయాలింపవొ మానమున్నిలుపవో ముల్లో
క మేలింపవో, మఱిదీ యంచును వెంటనేతిరు
గవో మన్నింపవో యందుమో,కరినో ద్రౌపదినో
సురాధిపతినో గాండీవినో యెవ్వఁడన్, ధరనిన్
గొల్చినవారిలో నొకఁడ కృష్ణా దేవకీనందనా.

మ. కుటిలారాతినిశాటకోటికదళీకూటాటవీభంజనో,

ద్భటమత్తద్విపకేళిలోలము సముత్పాదీణ్యదై
త్యాంగనా, స్ఫుటముక్తామణిరత్నహారతిలకా
పుంజాదిలూనక్రియా, చటులజ్వాలము నీసుదర్శ
నము కృ... 96

మ. కులిశానేకసహస్రకోటినిశిత క్రూరోరుధారాము
ఖా, కలితార్చిఃప్రభవ ప్రభావ త్రిజగత్కల్యాణ
సంధాయిన్రై, విలసిల్లుఁ భవదీయచక్ర ముఖ
లోర్వీభారనిర్వాపణో, జ్జ్వలనిర్వాహపరాక్రమ
క్రమణ కృ... 97

మ. అతికాకోలకరాళకాళియ కఠోరాశీవిషావిర్భవ,
క్షితినోనాటిన నాఁటిపాటు తలఁపఁ శంకించి
యుంకించె దా, సతతోద్వర్తులవర్ణసర్వభయ
దాంచత్పింఛచూడావతం, సతయుం గారుడకేత
నోద్ధృతియు కృ... 98

శా. నక్రోదగ్రతఁ బ్రాణవాయువులు మేన న్నిల్వఁగా
నోప వో, చక్రీ నఁ దయ గావు మన్న కరుణఁ
జాజ్వల్యచక్రంబుచే, నక్రంబుం దెగఁ జూచి
కాచితిగదా నాగంబు వేగంబునఁ, శక్రాద్యా
మరవందితాంఘ్రియుగ కృ... 99

మ. కరి నేలింది వాళ్ళక్కి ద్రౌపదికి కోకల్ మెచ్చి యి
చ్చింది ద, బ్బఱ కాకాసురునిం గటాక్షమునఁ

జేపట్టిం దబద్ధం బహో, శరణన్న ౯ బగవాని
తమ్మునికి రాజ్యం బిచ్చుట ల్కెల్ల యి, త్తతి నన్నే
లిన నిక్క మీకథలు కృష్ణా దేవకీనందనా. 100

క. ఈకృష్ణశతక మెప్పుడు
పైకొని విన్నట్టివారు వ్రాసినవారల్
చేకొని పఠించువారలు
శ్రీకృష్ణునికరుణ కలిగి చెలఁగుదు రెలమిన్. 101

*మ. సదయస్ఫూర్తికళల్ ఘటించు కవిరత్నశ్రేష్ఠుఁ
డుత్సాహియై, పదివేల్పద్యములందు నూటపదిస
త్పద్యంబులర్పించె నీ, పదనీరేజములందు దివ్యత
టినీపాథఃప్రపూర్ణాభిము, ఖ్యాదయ౯ గాంచిన
దౌట మీకరుణ కృష్ణా దేవకీనందనా.

దేవకీనందనశతకము
సంపూర్ణము.

---

* అడయారు లైబ్రరీలోని పుస్తకపాఠము.

# పీఠిక.

---

ఈనారాయణశతకము గేయముగఁ బూర్వకవి యెవరో రచించెను. ఇందలి గేయము పదలాలిత్యముతోఁ గూడికొని చదువుకు ననుకూలమగు మృదుశైలిలోఁ బండితపామరరంజకముగా నున్నది. ఇందలి రచనసందర్భము, కవితాప్రౌఢి, విషయసంగ్రహణముఁ బరిశీలింప నీగ్రంథకర్త సంస్కృతాంధ్రములలో విద్వాంసుఁడనియు శిశుబాలబోధకై వేదాంతభావములను బదములలో నిముడ్ప సంకల్పించి యీపొత్తమును రచించెనని తోఁచుచున్నది. "సూక్ష్మములో మోక్ష" మన్నటుల ఈశతకము మిగులఁ జిన్నదైనను అద్వైతసంప్రదాయానుకూలము లగు తత్త్వరహస్యములను సుబోధముగ నెఱింగించుచున్నది.

మొదట మానవుఁడు యుక్తాయుక్తజ్ఞానశూన్యుఁడై స్వేచ్ఛగ సంచరించి విషయాదిసౌఖ్యములనుభవించి విసుఁగొంది తత్త్వవిచారమునకుఁ దొరకొనుట సహజముగాన, కవియుఁ దొలుత స్వేచ్ఛావర్తనను దానఁగలకష్టములు దెలిపి పిదప నీశ్వరతత్త్వనిరూపణ మొనరించుఁ బ్రపంచసృష్టి నెఱుంగఁ

జేసెను. తరువాత క్రమముగ నిందు మానవజన్మసందర్భము, బాల్యకౌమారయౌవనాద్యవస్థలు, పిదప గురూపదేశమువలన మోక్షధర్మములు గ్రహించు విధము, మనోహరముగ వర్ణింపఁబడెను.

ఇందు భగవద్గీతాది వేదాంతగ్రంథములలోఁ బ్రతిపాదింపఁబడిన తత్త్వరహస్యములు సుబోధములగు తేటతెలుఁగుమాటలతో వివరింపఁబడుటచే వేదాంతశాస్త్రానుభవము స్వయంకృషితో నార్జింపనెంచిన స్త్రీబాలుర కిది యనుకూలముగ విషయప్రవేశమునకు సులభమార్గముఁ జూపుచున్నది.

చిదచిదీశ్వరభావములు, మాయాస్వరూపము, దృగ్దృశ్యములు, ప్రకృతిస్వరూపము, తత్త్వములు, పంచీకరణము, గురుశిష్యధర్మములు లోనగుమహత్తరవిషయము లింత సులభమగుశైలిలో గేయముగ వ్రాసి ప్రాకృతజనులు తరించు త్రోవఁ జూపినగ్రంథకర్త ప్రశంసాపాత్రుఁడు.

శతకమువ్రాసిన కవిపేరుగాని కాలముగాని గుఱుతింప నాధారములు కానరావు.

నందిగామ.
1-1-25.

ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

శ్రీ ర స్తు.

# నారాయణశతకము.

---

శ్లో. నమామి నారాయణపాదపంకజం
వదామి నారాయణనామ నిర్మలమ్,
భజామి నారాయణతత్త్వ మవ్యయం
కరోమి నారాయణపూజనం సదా.

శ్లో. ఆలోడ్య సర్వశాస్త్రాణి
విచార్య చ పునఃపునః,
ఇద మేకం తు నిష్పన్నం
ధ్యాయే న్నారాయణం సదా.

శ్రీరమాహృదయేశ్వరా
భక్తజనచిత్తజలరుహాభాస్కరా
కారుణ్యరత్నాకరా
నీవె గతి కావవే నారాయణా. 1

పాపకర్మములఁ జేసి
నరకకూపములఁ బడఁజాల నికను
నీపాదభక్తి యొసఁగి
యొక్కదరిఁ జూపవే నా...

దానధర్మములఁ జేయ
నేర నీదాసులను బొగడనేర
నా నేరములఁ దలఁపక
దయచేసి నన్నేలు నా.... 3
ఆన యించుక లేకను
దుర్భాష లాడు నాజిహ్వయందు
నీనామచతురక్షరి
దృఢముగా నిలుపవలె నా... 4
ఒకటి పరిశుద్ధి లేక
నాజన్మ మకట వ్యర్థం బాయెను
అకలంక మగుమార్గముఁ
జూపవే సకలేశ నా... 5
వేఁగి లేచినది మొదలు
సంసారసాగరంబున నీఁదుచు
నీగుణము లొకవేళను
తలఁపఁగదె మేలనుచు నా... 6
లోకవార్తలకు మరిగి
కరమొప్ప మీకథల విననేరను
ఏకరణి భవజలనిధి
తుదముట్ట నీఁదుదును నా... 7
ఇల మనుజజన్మ మెత్తి
సుజ్ఞాన మించుకంతయు లేకను

కలఁక జెందెడుచిత్తముఁ
 స్వచ్ఛంబుగాఁ జేయు నా... 8
ఎంతపాపాత్ముఁ డైన
 మిముఁ దలఁచి కృతకృత్యుఁ డౌను పుడమి
నింతపరుసము సోఁకిన
 లోహంబు హేమమౌ నా... 9
కామాంధకారమునను
 పెక్కుదుష్కర్మములఁ జేసి నేను
నీమఱుఁగుఁ జొచ్చినాను
 నామీఁద నెనరుంచు నా... 10
సమయ మయినపుడు మిమ్ముఁ
 దలఁచుటకు శక్తి గలుగునో కలుగదో
స్మరణతోఁ దలఁతు నిపుడె
 నాహృదయకమలమున నా... 11
ఆటలన్నియు అంకులు
 నే నాడు మాటలన్నియు బొంకులు
పాటింప నింతకైన
 నున్నదే పాపంబు నా... 12
వావి దప్పినవాఁడను
 దుష్క్రియావర్తనుఁడ నగుదు నేను
పావనునిగాఁ జేయవే
 నను పతితపావనుఁడ నా... 13

దేహామే దృఢ మనుచును
  తెలిసి నే మోహాబద్ధుఁడ నగుచును
సాహాసంబునఁ జేసితి
  నే గురుద్రోహంబు నా... 14
ఎన్నిజన్మము లాయెనో
  నేఁటి కెందెందు జన్మించినానో
నన్ను దరిజేర్పఁ గదవే
  యిఁకనైన నాతండ్రి నా... 15
యమకింకరులఁ దలఁచిన
  నాగుండె ఝల్లుమని యనుచున్నది
యమునిబాధల మాన్పను
  మాయప్ప వైద్యుఁడవు నా... 16
అరయ కామక్రోధముల్
  లోభంబు మోహామదమత్సరములు
తఱుఁగ వెప్పుడు మనసున
  నిన్నెపుడు దలఁచెదను నారాయణా. 17
ఆశాపిశాచి బట్టి
  వైరాగ్యవాసనలఁ జేరనియదు
గాసి పెట్టుచు నున్నది
  నే నేమి సేసెదను నారాయణా. 18
తాపత్రయంబు జెంది
  చాలపరితాప మొందెను చిత్తము

నీపాదముల నమ్మిన
చల్లనై నిలువఁగల నారాయణా. 19
చింతాపరంపరలచేఁ
జిత్తంబు చీకాకుపడుచున్నది
సంతోషమునఁ గూర్పవే
దివ్యప్రసాదమును నా... 20
ప్రాయమెల్లను బోయెను
ఆశ లెడఁబాయఁజాలక యున్నవి
మాయాప్రపంచ మేల
చేసెదవు మాయయ్య నా... 21
శరణుఁ జొచ్చినవాఁడను
నేఁ జేయుదురితముల నపహరించి
పరమపద మొసఁగఁగదవే
యింకనైనఁ బరమాత్మ నా... 22
సంకల్పములు పుట్టిన
కర్మవాసనల దృఢముగఁ జేయవు
సంకటము నొందించకే
నను సత్యసంకల్ప నా... 23
ఒకవేళ నున్నబుద్ధి
యొకవేళ నుండ దింక నేమిసేతు
విశదంబుగాఁ జేయవే
నీవు నాచిత్తమున నా... 24

నెట్టుకొని సకలజీవ
　కోటులను నోట భక్షించినాను
పొట్టకొఱకై నీచుల
　సేవించి రట్టయితి నా... 25
నేను బుట్టినది మొదలు
　ఆహారనిద్రలకె జనెఁ గాలము
పూని యెప్పుడు సేయుదు
　నీపదధ్యానంబు నా... 26
ప్రొద్దు బోవక యున్నను
　వేసరక పొరుగిండ్ల తిరుగుఁ గానీ
బుద్ధిమాలిన చిత్తము
　నీయందు పొందదే నా... 27
ఎన్నివిధములఁ జూచిన
　నిత్యమును హృదయమున మిము మఱువక
యున్నంతకన్న సుఖము
　వేఱొక్కటున్నదే నా... 28
లాభలోభముల విడిచి
　యిహపరము లనుఫల మ్మాసింపక
నీభక్తు లైనవారు
　ధన్యు లై నెగడెదరు నా... 29
ముందు నీసృష్టి లేక
　సచ్చిదానందస్వరూపంబును

పొంది భేదము నొందక
బ్రహ్మమై యుండువఁట నా... 30
కాలత్రయాబాధ్యమై
మఱి నిరాకారమై యుండుకతన
జాలఁగాఁ దత్త్వజ్ఞులు
తెలియుదురు సత్తనుచు నా... 31
జ్ఞానస్వరూపమునను
నాజడమె జడపదార్థములనెల్లఁ
గానఁగాఁ జేయుకతనఁ
జిత్తంచ్రు ఘనులు నిను నా... 32
సుఖదుఃఖముల రెంటిని
వేఱగుచు సుఖరూప మైనకతన
నఖిల వేదాంతవిదులు
ఆనంద మండ్రు నిను నా... 33
గుణ మొకటి యైనలేని
నీయందు గుణమయంబైన మాయ
గణుతింపఁ గనుపట్టెడు
దర్పణము కైవడిని నా... 34
అందు ప్రతిబింబించిన
చిత్సదానందసముదాయ మెల్లఁ
జెందు నీశ్వరభావము
త్రిగుణసంశ్లిష్టమయి నా... 35

సత్త్వంబు రజము తమము
ననుమూఁడు సంజ్ఞలను క్రమముతోడ
తత్త్వజ్ఞు లేర్పరింప
తద్గుణత్రయములను నా... 36
ప్రకృతినీయందు లీన
మయియుండి వికృతిఁ జెందిన పేర్లను
సకలప్రపంచ మిటులఁ
గనుపట్టె నకలంక నారాయణా. 37
మీరు సంకల్పించిన
యట్టిప్రకారమును జెందు మాయ
ఆరూఢి వివరించెన
నవ్విధం బప్పయ్య నారాయణా. 38
పంచభూతములు మనసు
బుద్ధియును ప్రకటాహంకారంబును
నెంచంగ నాయెమాయ
యిదిగా ప్రపంచంబు నారాయణా. 39
భూతపంచకతత్త్వసం
ఘాతమునఁ బుట్టె నంతఃకరణము
ఖ్యాతిగా నందుఁ దోఁచె
చిత్తు జీవాత్మాయె నారాయణా. 40
వెస మనోబుద్ధిచిత్తా
హంకారవృత్తు లంతఃకరణము

ప్రచురించు నవి నాలుగు
తత్త్వరూపము లాయె నా... 41
భౌతికరజోగుణమును
నేకమై ప్రాణంబుఁ బుట్టించెను
వానిభేదములచేత
పంచభావము లాయె నా...... 42
అలరు ప్రాణ మపానము
వ్యానం బుదాన యానోదానముల్
తెలుప నీసంజ్ఞ లమరి
వాయుతత్త్వము లొప్పు నా... 43
ప్రత్యేక భూతసత్త్వ
గుణములను పరఁగ బుద్ధీంద్రియములు
సత్త్వమున జనియించెను
తత్త్వపంచక మగుచు నా... 44
చెవులు చర్మము కన్నులు
జిహ్వా నాసికము పేరులచేతను
తగిలి బుద్ధీంద్రియముల
విషయసంతతి దెలియు నా... 45
భౌతికతమోగుణమున
విషయములు తలుచుగా జనియించెను
శబ్దకస్పర్శరూప
రసగంధనామములు నా... 46

తాదృశరజోగుణమున
 జనియించె నరశకర్మేంద్రియములు
ఐదుతత్త్వము లగుచును
 కర్మనిష్ఠాదులకు నా... 47
వాక్పాణిపాదపాయూ
 పస్థలను వానిపే ళ్లమరుచుండు
పక్వాహ్వయములకుఁ దెలియు
 నీవిధము పరమాత్మ నా.... 48
పలుకు పనులును నడుచును
 మలమూత్రముల విడుచు నీయయిదును
వెలయ కర్మేంద్రియముల
 విషయములు నలినాక్ష నా... 49
పరఁగఁ జంద్రుండు బ్రహ్మ
 క్షేత్రజ్ఞుఁ డిరవొందు రుద్రుండును
వరమానసాదులకును
 అధిపతులు వివరింప నా... 50
అరయ దిక్కులు వాయువు
 సూర్యుఁడును వరుణుండు నశ్వినులును
పరగ శ్రోత్రాదులకును
 అధిపతులు పరికింప నా... 51
అనలుఁ డింద్రుఁడు విష్ణువు
 మృత్యువును అలప్రజాపతియుఁ గూడి

యొనర వాగాదులకును
అధిపతులు పరికింప నారాయణా. 52
పంచీకృతం బాయెను
ఆభూతపంచకము ప్రబలి సృష్టి
పంచీకృతముచేతను
స్థూలరూపము లాయె నా... 53
పదియింద్రియములు మనసు
బుద్ధియును ప్రాణంబు లైదు గూడి
పదియేడు తత్త్వములును
సూక్ష్మరూపము లాయె నా... 54
స్థూలసూక్ష్మములు రెండు
కలుగుటకు మూల మగు నజ్ఞానము
లీలకారణ మాయెను
జీవులకు నాలోల నా... 55
ఈమూఁడు దేహములకు
విశ్వంబు నెల్లప్రకటం బాయెను
నామరూపముల చేత
లోకైకనాయకుఁడ నా... 56
కొన్ని మ్రానున బుట్టును
గ్రుడ్లలోఁ గొన్ని తనువులు బుట్టును
గొన్ని ధరణినిఁ బుట్టును
చమటలను గొన్ని హరి నా... 57

ఈచతుర్విధభూతము
  లందుఁ గడు హెచ్చుమానవజన్మము
నీచ మని చూడరాదు
  తథ్యమే నిర్ణయము నా... 58

ఈజన్మమందె కాని
  ముక్తి మఱి యేజన్మమందు లేదు
చేజేతఁ దనుఁ దెలియక
  మానవుఁడు చెడిపోవు నా... 59

చేతనాచేతనములు
  బుట్టుచును రోఁతలకు లోనగుచును
ఆతంక పడుచుండును
  కర్మముల చేతనుఁడు నా... 60

సకలయోనులఁ బుట్టుచు
  పలుమాఱు స్వర్గనరకములఁ బడుచు
నొకట నూఱటఁ గానక
  పరితాప మొందితిని నా... 61

వెలయ యెనుబదినాలుగు
  లక్షయోనులయందుఁ బుట్టి గిట్టి
అలసి మూర్ఛలఁ జెందుచు
  బహుదుఃఖములచేత నా... 62

క్రమముతో మనుజగర్భ
  మునఁ బడుచుఁ గర్మవశగతుఁ డగుచును

అమితముగ నచ్చోటను
గర్భనరకమునఁ బడు నా... 63
ఈశ్వరాజ్ఞను బుట్టిన
తెలివిచే హృదయమునఁ దలపోయుదు
విశ్వమున తనుబొందిన
పాట్లెల్ల వేర్వేఱు నా... 64
చాలు ఛీ యిఁక జన్మము
ఇఁక పుట్టు చాలు శ్రీహరి భజించి
మేలుఁ జెందెద ననుచును
జింతించు నాలోన నా... 65
ప్రసవకాలమునఁ దల్లి
గర్భమునఁ బాదుకొని నిలువలేక
వసుధపయి నూడి వడిన
తెలివిచే వాపోవు నా... 66
చనుబాలు గుడిచి ప్రాణ
ధారణను నిఁక మూత్రమలములోను
మునిఁగి తేలుచు నుండును
దుర్గంధమునఁ దేలు నా... 67
బాలత్వమున బిత్తరై
నలుగడలఁ బాఱాడు సిగ్గు లేక
పాలుపడి యౌవనమున
విషయానుభవ మొందు నా... 68

ముదిమి వచ్చినవెనుకను
    సంసారమోహంబు మానకుండ
తుద నేగు కర్మగతులఁ
    బొందుటకు ముదమేమి నా... 69

అజ్ఞాన లక్షణములు
    ఇటువంటి వని విచారించి నరుఁడు
సుజ్ఞానమునకుఁ దగిన
    మార్గంబు చూడవలె నా... 70

వేదాంత వేది యైన
    సద్గురుని పాదపద్మములు జెంది
ఆదయానిధికరుణచే
    సద్బోధ మందవలె నా... 71

ఏవిద్య కైన గురువు
    లేకున్న నావిద్య పట్టుపడదు
కావునను అభ్యాసము
    గురుశిక్ష కావలెను నా... 72

గురుముఖంబున విద్యలు
    ఎన్ని గైకొనిన భావజ్ఞానము
చిరతరాధ్యాత్మవిద్య
    నభ్యసింపఁగ లేఁడు నా... 73

అనపేక్షకుఁడు సదయుఁడు
    వేదాంతనిపుణుఁ డయ్యాచార్యుఁడు

ద్వారకు టపరూప మపుడు
గుఱుతైన గుఱి యొప్పు నా... 74
అట్టిసద్గురుని వెదకి
దర్శించి యామహాత్ముని పదములు
పట్టి కృతకృత్యుఁ డౌను
సాధకుఁడు గట్టిగా నా... 75
యొగి సాధనములు నాల్గు
గలనరుఁడు ముఖ్యాధికారి యగును
తగినయుపదేశమునకు
యోగసాధకులలో నా... 76
ఇది నిత్య మిది యనిత్యం
బనుచుఁ దనమది వివేకించు టొకటి
అదను నిహాపరసుఖములు
కోరనిది యిది యొకటి నా... 77
ముదముతో శమదమాది
షట్కసంపద గలిగియుండు టొకటి
విదితముగ ముక్తిఁ బొందఁ
గాంక్షించు టది యొకటి నా... 78
ఈనాల్గు సాధనముల
నధికారి యై నిజాచార్యుఁ జేరి
నానాప్రకారములను
శుశ్రూష నడుపవలె నా... 79

ఉల్లమునఁ గాపట్యము
లవమైన నుండనీయక నిరతము
తల్లి దండ్రియు దైవము
గురు వనుచుఁ దలఁపవలె నా... 80

తనువు ధనమును సంపద
గురునిష్ఠా మ్మని సమర్పణము చేసి
యెనసి తత్పరతంత్రుఁడై
నిత్యమును మెలఁగవలె నా... 81

ఏనిష్ఠ గురునిష్ఠకుఁ
దీటుగా దీప్రపంచంబునందు
మానసము దృఢముఁజేసి
యలరవలె మానియై నా... 82

ఇట్టి శిష్యుని పాత్రత
వీక్షించి హృదయమున కారుణ్యము
నెట్టుకొని బ్రహ్మవిద్య
గురుఁ డొసఁగు నెయ్యముగ నా... 83

బ్రహ్మంబు గలుగఁగానే
యేతత్ప్రపంచంబుఁ గలిగియుండు
బ్రహ్మంబు లేకున్నను
లేదీప్రపంచంబు నా... 84

ఈవిధంబున నాక్తుల
బ్రహ్మసద్భావంబుఁ గలుగఁజేసి

భావగోచరముఁ జేయు
చిత్స్వరూపములెల్ల నా.... 85
ఆబ్రహ్మాండదె పుట్టు
విశ్వంబు నాబ్రహ్మమందె యుండు
ఆబ్రహ్మమందె యణఁగు
నదె చూడు మని చూపు నా... 86
అది సచ్చిదానందము
అది శుద్ధ మది బుద్ధ మది యుక్తము
అది సత్య మది నిత్యము
అది విమల మని తెలుపు నా... 87
అదె బ్రహ్మ మదె విష్ణువు
అదె రుద్రుఁ డదియె సర్వేశ్వరుండు
అదె పరంజ్యోతి యనుచు
బోధించు విదితముగ నా... 88
భావింప వశము గాదు
ఇట్టి దని పలుక శక్యంబు గాదు
భావంబు నిలుపుచోట
అది తాను పరమాను నా... 89
అది మాయతోఁ గూడఁగ
శివుఁ డాయె నదియె విద్యను గూడఁగ
విదితముగ జీవుఁ డాయె
నని తెలుపు వేర్వేఱ నా... 90

శివుఁడు కారణశరీరి
　　కార్యంబు జీవుఁ డాలక్షణములు
ద్వివిధముగఁ దెలియు మనుచు
　　బోధించు వివరముగ నా... 91
అరయ నిరువదినాలుగు
　　తత్త్వంబులై యుండు నంద మగుచు
కరతలామలకముగను
　　బోధించు క్రమమునను నా... 92
కారణము కార్య మగుచు
　　వ్యవహారకారణాఖ్యత నుండును
ఆరూఢి బ్రహ్మాండము
　　పిండాండ మని తెలుపు నా... 93
అయిదుభూతములు నింద్రి
　　యములు పది యంతరంగములు నాల్గు
ఐదువిషయములు తత్త్వ
　　సంఘాత మని తెలుపు నా... 94
స్థూలసూక్ష్మాకృతులును
　　కారణముతో మూఁడు తెఱఁగులగును
నీల మగు నందు నమరు
　　అని తెలుపు లాలించి నా... 95
వెలసి పంచీకృతములు
　　అగుభూతములకుఁ బుట్టినది తనువు

స్థూలంబు నది యనుచును
బోధించు దయతోడ నా... 96
ఐదు నయిదింద్రియములు
ప్రాణంబు లయిదు మనసును బుద్ధియు
పాదుకొని సూక్ష్మమందు
బోధించు ప్రకటముగ నా... 97
గాఢ మగు నజ్ఞానము
ఈరీతిఁ గారణశరీర మగును
మూఢులకు వశముగాదు
తెలియవిను మోదమున నా... 98
ఈమూఁడు తనువులందు
తానుండి యీతనువు తా మనుచును
వ్యామోహపడుచుండును
జీవుండు వరుసతో నా... 99
కలలేక నిద్రించును
కలఁ గాంచి కడు మేలుకొనుచుండును
కలకాల మీజీవుఁడు
త్రివిధములఁ గలిగియును నా... 100
ప్రాజ్ఞతైజసవిశ్వులు
తానె యీ పర్యాయముగ జీవుఁడు
ప్రజ్ఞఁగోల్పడి పొందును
సంసారబంధంబు నా... 101

మూఁడవస్థలకు సాక్షి
నైనట్టిమూలంబు తాఁ దెలిసినఁ
జూడు మని సన్మార్గము
తేటఁగాఁ జూపుచును నా... 102
నీవు దేహంబు గావు
ప్రాణంబు నీవుగా దింద్రియములు
నీవు గాదని తెలుపును
వేదాంత నియమమున నా... 103
అనిలతప్తంబు గాదు
జలమునను మునిఁగి తడిజెందఁబోదు
అనిలశుష్కంబు గాదు
నిరుపమం బని తెలుపు నా... 104
కామహంకార మిపుడు
చిత్తంబుగాఁ నీవె బుద్ధి నీవు
కావుమనసును సత్యము
సాక్షి వగు గట్టిగా నా... 105
దేహధర్మములు నీకు
తోఁచుటంతేగాని నిత్యముగను
మోహంబు మాను మనుచు
బోధించు ముఖ్యముగ నా... 106
ఎన్ని దేహములు జెడిన
నీవు చెడని యేకస్వరూపుఁడ వగుచు

చెన్నలరి యుందు విలను
తత్త్వప్రసిద్ధముగ నా... 107
అన్ని వేదాంతవాక్య
ములలో మహావాక్యములు నాలుగు
నన్ను నీశ్వరునిగాను
వర్ణించు నిక్కముగ నా... 108
ఉభయదృశ్యోపాధులు
కడద్రోసి పోక యయ్యాత్మ మిగులు
అభయముగ నిటు లెప్పుడు
చింతింపు మని తెలుపు నా... 109
జీవశివతారతమ్య
మున నైక్యసిద్ధి కానేర దనుచు
భావ సంశయము దీర్ప
కార్యార్థ పటిమచే నా... 110
నిర్వికారుఁడవు నీవు
నీయందె నిజమైనచందమునను
దోఁచు ప్రకృతివికారము
లని తెలుపు ప్రౌఢిచే నా... 111
సద్గురుం డీరీతిగా
బోధించు సరళితో వాచ్యార్థము
హృద్గతము జేసి యుండి
జగతి జీవింపుదును నా... 112

అని చింతనము జేయుచు
చిత్తమున తనివిఁ జెందుచు నెప్పుడు
కనుదమ్ములను మూడుచు
ధ్యానంబుగాఁ జేయు నా... 113

అపగతాఘకృత్యుఁడై
యీరీతి నభ్యాస మొనరించుచు
అపరోక్షసిద్ధి నొందు
బ్రహ్మంబు తానగుచు నా... 114

కందళితహృదయుఁ డగుచు
సచ్చిదానందస్వరూపుఁ డగుచు
సందర్శితాత్ముఁ డగుచు
నుండు నవికారతను నా... 115

అవ్యయానందపూజ్య
రాజ్యసింహాసనాసీనుఁ డగుచు
భవ్యాత్ముఁడై వెలసెను
పూజ్యసంభావ్యుఁడై నా... 116

నీవు సకలంబుగాని
యున్నదే నీకన్న వేఱొక్కటి
జీవుఁ డని వర్ణించుట
వ్యవహారసిద్ధికిని నా.... 117

చిలుకపలుకులు పలికితి
నాకేమి తెలియుఁ దత్త్వరహస్యము

వలదు నను నేర మెంచ
సాధులకు నలినాక్ష నా... 118

శరణు భక్తార్తిహారి
గురురూప శరణు సజ్జనరక్షక
శరణు దురితౌఘనాశ
శర ణిపుడు కరుణించు నా... 116

శ్లో. కాయేన వాచా మన సేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనావా ప్రకృతే స్స్వభావాత్,
కరోమి యద్య త్సకలం పరస్మై
నారాయణా యేతి సమర్పయామి.

నారాయణశతకము సంపూర్ణము.



# పీ ఠి క.

ఈశతకమును కంచెర్ల గోపమంత్రి రచించి భద్రాచలరాములవారి కంకితము గావించెను. ఇతఁడాత్రేయగోత్రుఁడు. లింగమంత్రికుమారుఁడు. ఆదిశాఖాబ్రాహ్మణుఁడు. భట్టరాచార్యులశిష్యుఁడనియుఁ దిరుమంత్రము పఠించుచుంటిననియు నూర్ధ్వపుండ్రముఁ బెట్టితిననియుఁ గవి చెప్పికొనియుండుటచే గోపమంత్రి వైష్ణవత్వము నొందినవాఁడని సువ్యక్తమగును. ఇందుల కనుకూలముగ ముకుందమాల, యామునాచార్యస్తోత్రము లోనగు వైష్ణవగ్రంథములలోని భావము లిందలిపద్యములలోఁ గానవచ్చుచున్నవి.

కంచెర్ల గోపమంత్రియే రామదాసు. గోపమంత్రి దానకాధేయులని ప్రశస్తివహించిన అక్కన్నమాదన్నగారలకు మేనల్లుఁడై తానిషా యని వ్యవహరింపఁబడు అబూల్ హసన్ కుతుబుషా గోలకొండ రాజ్యముపాలించుతఱి భద్రాచలప్రాంతమునకు తాహసీలుదారుగా నియోగింపఁబడెను. దొరతనమువారి ధనమును దేవాలయనిర్మాణమునకు వ్యయముచేసి శిక్షితుఁడగుటయు శ్రీరామానుగ్రహమువలన బంధముక్తుఁడగుటయు నాబాలవృద్ధ మెఱింగిన సుప్రసిద్ధకథయె.

రామభక్తివిశేషముచే రామదాసుఁడని పేరొందిన కంచర్లగోపన్నయే యీదాశరథీశతకమును రచించినటులు జనులు చెప్పుకొనుచున్నారు. కంచర్ల గోపన్నయే రామదాసనువిషయములో సందేహము లేదు ఇతఁడు కంభముమెట్టు చెంతగల నేలకొండపల్లి నివాసియని కొందఱు వినుకొండ చెంతగల కంచర్లనివాసి యని మఱికొందఱు చెప్పికొనుచున్నారు. నేలకొండపల్లి నివాసి యనుప్రవాదము చిరకాలశ్రుతము గ్రంథస్థమునై యున్నది. తానీషా క్రీ. శ. 1658-1687 వఱకు రాజ్యమేలియుంటచే రామదాసాకాలమునం దుండెననుట నిర్వివాదాంశము.

దాశరథీశతక కర్త తొల్లి ప్రబంధము వ్రాసి నరాంకితముగావించితి నని పశ్చాత్తాపపడుచున్నాఁడు. ఆగ్రంథ మేదో తెలియరాదు. రామునియందు హృదయము సర్వవిధముల లీనముగావించి తాదాత్మ్యమున నీశతకము వ్రాసినటులఁ దోఁచుచున్నది. ఇందలిపద్యములు మనోహరధారాశోభితములై భక్తిరసమును వర్షించుచున్నవి. తెలుఁగుబాసలో నిట్టిభక్తిరస ముద్బోధించుశతకము లరుదుగా నున్నవి. రామదాసు శతకము వ్రాయుచు గోదావరితీరమునఁ గూర్చుండి తాటాకుపై నొక్కొకపద్యము

వ్రాసి గోదావరిలో విడువసాగెననియు నేటి కెదు రీఁదివచ్చిన పద్యములనే సమకూర్చెనని ప్రజలు చెప్పుకొనుకథ శతకస్థపద్యములన్నియు నన్నిరత్న ములని తెలుపుటకుఁ బర్యాయపదము.

నేలకొండపల్లి రామదాసు నివాసమని విని మే మట రామదాసునిగూర్చి వారివంశీయులను గూర్చి విచారింపఁగా నచటివారు గృహస్థలముమాత్రము చూపి యావంశము నశించినటులఁ జెప్పియున్నారు. కంచర్ల శరభకవి యధ్యాత్మరామాయణములోని

తే. "కొండపల్లిని గొందఱు గొల్లపూఁడిఁ
గొంద ఱుండిరి తంజావు రందుఁ గొంద
ఱెలమి వసియించి ప్రబలిరి చెలువు మిగుల
మీఱి కంచర్లవంశంబువారు ధరణి."

అను పద్యమువలన కంచెర్లవారు నేలకొండపల్లె పూర్వము నివసించి రనుట విశ్వాసార్హమె. నూఱు సంవత్సరములకుఁ బైకాలమునందున్న తిరుక్కడ యూరి కృష్ణదాసు రామదాసుచరిత్రమును వ్రా యుచు నందు రామదాసుఁ డక్కన్నమాదన్నల మేన ల్లుఁడని చెప్పి

తో హా రా. శ్రీమించిన నెలకొండపల్లెలో
శిష్టజనులు పొగడఁగనూ

> కామాంబకు గోపన్న జనించెను
> కమలాక్షుని వరముననూ
> ఆత్రేయసగోత్రంబున కంచె
> ర్లాంధ్రులవంశమునన్
> పుత్రుఁ డగుచు లింగనమంత్రికిఁ దాఁ
> బుట్టెను గోపన్ననఁగన్.

అని వ్రాసియున్నాఁడు. ఇందలి వంశానుక్రమణిక దాశరథీశతకములోని కంచర్ల గోపన్నవంశానుక్రమణికకు సర్వవిధముల సరిపోవుచున్నది. నూటయిరువదిసంవత్సరములనుండి గ్రంథస్థమైయున్న కంచర్ల గోపన్న రామదాసు నొక్కఁడే యనుప్రవాదము రామదాసుఁడు నేలకొండపల్లి వాస్తవ్యుఁడను ప్రవాదము గ్రంథస్థములై యుంచుటవలన సత్యదూరములని తలంప వీలుపడదు.

రామదాసు దాశరథిశతకమునేగాక కొన్ని గేయములుగూడ రచించెను. అవి మనోహరమగు ధారతో భక్తిరసమును వర్షించుచు నాంధ్రదేశమునందలి యాబాలగోపాలముచేఁ బఠింపఁబడుచున్నవి. అన్నిఁటికంటె రామదాసకృతమగు దాశరథీశతకప్రశస్తి యాంధ్రలోకమున నిండియున్నది.

---

శ్రీరస్తు.

భద్ర్రాచలరామదాసకవికృత

# దాశరథిశతకము.



ఉ. శ్రీరఘురామ చారుతులసీదళదామ శమక్షమా
దిశృం, గారగుణాభిరామ త్రిజగన్నుతశౌర్యర
మాలలామ దు, ర్వారకబంధరాక్షసవిరామ జగ
జ్జనకల్మషార్ణవో, త్తారకనామ భద్రగిరిదాశరథీ
కరుణాపయోనిధీ. 1

ఉ. రామ విశాలవిక్రమపరాజితభార్గవరామ సద్గుణ,
స్తోమ పరాంగనావిముఖసువ్రతకామ వినీలనీరద,
శ్యామ కకుత్స్థవంశకలశాంబుధిసోమ సురారి
దోర్బలో, ద్దామవిరామ భద్రగిరిదాశరథీ కరు
ణాపయోనిధీ. 2

చ. అగణితసత్యభాష శరణాగతపోష దయాలస
ఝ్ఝరీ, విగతసమస్తదోష పృథివీసురతోష త్రిలో
కపూతకృ, ద్గగనధునీమరందపదకంజవిశేష మణి
ప్రభాధగ, ద్ధగితవిభూష భద్రగిరి దా... 3

ఉ. రంగదరాతిభంగ ఖగరాజతురంగ విపత్పరంపరో,
త్తుంగతమఃపతంగ పరితోషితరంగ దయాంతరంగ
స, త్సంగ ధరాత్మజాహృదయసారసభృంగ నిశా
చరాబ్జమా, తంగ శుభాంగ భద్రగిరి దా... 4

ఉ. శ్రీద సనందనాదిముని సేవితపాద దిగంతకీర్తిసం
పాద సమస్తభూతపరిపాలవినోద విషాదవల్లికా,
చ్ఛేద ధరాధినాథకులసింధుసుధామయపాద నృ
త్తగీ, తాదివినోద భద్రగిరి దా... 5

ఉ. ఆర్యుల కెల్ల మ్రొక్కి వినతాంగుఁడనై రఘునా
థభట్టరా, చార్యుల కంజ లెత్తి కవిసత్తముల న్వి
నుతించి కార్యసౌ, కర్య మెలర్ప నొక్కశతకం
బొనఁగూర్చి రచింతు నేఁడు తా, త్పర్యమునన్
గ్రహింపు మిది దా... 6

చ. మసకొని రేఁగుబండ్లకును మౌక్తికము ల్వెలపో
సినట్లు దు,ర్వ్యసనముఁజెంది కావ్యముదు రాత్ముల
కిచ్చితి మోసమయ్యె నా, రసనముఁ బూతవృత్తి
సుకరంబుగ చేకుఱునట్లు వాక్సుధా, రసములు
చిల్కఁ బద్యముఖరంగమునందు నటింపవయ్య
సం, తసమును జెంది భద్రగిరి దా... 7

ఉ. శ్రీరమణీయహార యతసీకుసుమాభశరీర భక్త
మం, దార వికారదూర పరతత్త్వవిహార త్రిలో
కచేతనో, ద్ధార దురంతపాతకవితానవిదూర ఖ
రాదిదైత్యకాం, తారకుఠార భద్రగిరి దా...8

చ. దురితలతాలవిత్ర ఖరదూషణకాననవీతిహో
త్ర భూ, భరణకళావిచిత్ర భవబంధవిమోచన

పూత్ర చారువి, స్ఫురదరవిందనేత్ర ఘనపుణ్య
చరిత్ర వినీలభూరికం, ధరసమగాత్ర భద్ర
గిరిదా... 9

చ. కనకవిశాలచేల భవకాననశాతకుఠారధార స,
జ్జనపరిపాలశీల దివిజస్తుతసద్గుణకాండకాండసం,
జనితపరాక్రమక్రమవిశారద శారద కందకుంద
చం, దనఘనసారసారయశ దా... 10

ఉ. శ్రీరఘువంశతోయధికి శీతమయూఖుఁడ వైననీ
పవి, త్రోరుపదాబ్జము ల్వికసితోత్పలచంపకవృ
త్తమాధురీ, పూరితవాక్ప్రసూనములఁ బూజ
లొనర్చెదఁ జిత్తగింపుమీ, తారకనామ భద్ర
గిరి దా... 11

చ. గురుతరమైనకావ్యరసగుంఫన కబ్బురమంది ము
ష్కరుల్, సరసులమాడ్కి సంతసిలఁజాలుదు
రోటు శశాంకచంద్రికాం, కురముల కిందుకాంత
మణికోటి స్రవించినభంగి వింధ్యభూ, ధరమున
జాలునే శిలల దా... 12

చ. తరణికులేశ నానుడులఁ దప్పును గల్గిన నీదునా
మస, ద్విరచిత మైనకావ్యము పవిత్రముగాదె
వియన్నదీజలం, బరుగుచు వంకయైన మలినా
కృతిఁ బాఱినఁ దన్మహత్త్వముం, దరమె గణింప
నెవ్వరికి దా... 13

చ. అజునకుఁ దండ్రివయ్యు సనకాదులకుం బరతత్త్వ
మయ్యు స, ద్ద్విజమునికోటికెల్లఁ గులదేవత
వయ్యు దినేశవంశభూ, భుజులకు మేటివయ్యుఁ
బరిపూర్ణుఁడవై వెలుఁగొందుపత్తిరా, ధ్వజ నినుఁ
బ్రస్తుతించెదను దా... 14

ఉ. పండితరక్షకుం డఖిలపాపవిమోచనుఁ డబ్జసంభ
వా, ఖండలపూజితుండు దశకంఠవిలుంఠనచండ
కాండకో, దండకలాప్రవీణుఁ డనుతావకకీర్తివ
ధూటి కిత్తుఁ బూ, దండలుగాఁగ నాకవిత
దాశరథీ కరుణాపయోనిధీ. 15

ఉ. ముప్పునఁ గాలకింకరులు ముంగిట వచ్చినవేళ
రోగముల్, గొప్పరమైనచోఁ గఫము కుత్తుక
నిండినవేళ బాంధవుల్, గప్పినవేళ మీస్మరణ
గల్గునో గల్గదో నాఁటి కిప్పుడే, తప్పకచేతు
మీభజన దా... 16

చ. 'పరమదయానిధే పతితపావననామ హరే' య
టంచు సుస్థిరమతులై సదా భజనసేయుమహా
త్ములపాదధూళి నా, శిరమునఁ దాల్తు మీరటకుఁ
జేరకుఁ డంచు యముండు కింకరో, త్కరముల
కానఁబెట్టు నఁట దా... 17

ఉ. దారుణపాతకాబ్ధికి సదా బడబాగ్నిభవాకులా

ర్తిని, స్తారదవానలార్చికి సుధారసవృష్టి దురంత
దుర్మతా, చారభయంకరాటవికిఁ జండకఠోరకు
ఠారధార నీ; తారకనామ మెన్నఁగొన దాశ
రథీ కరుణాపయోనిధీ. 18

చ. హరునకు నవ్విభీషణున కద్రిజకుం దిరమంత్ర
రాజ మై, కరికి నహల్యకుఁ ద్రుపదకన్యకు నార్తి
హరించుచుట్టమై, పరగినయట్టి నీపతితపావననా
మము జిహ్వపై నిరంతరము నటింపఁ జేయు
మిఁక దా... 19

ఉ. శ్రీరమ సీత గాఁగ నిజసేవకబృందము వీరవై
ష్ణవా, చారజనంబు గాఁగ విరజానది గౌతమిగా
వికుంఠము, న్నారయ భద్రశైలశిఖరాగ్రము
గాఁగ వసించి చేతనో, ద్ధారకుఁ డైనవిష్ణుఁ
డవు దా... 20

ఉ. కంటి నదీతటంబుఁ బొడగంటిని భద్రనగాధివా
సముం, గంటి నిలాతనూజ నురుకార్ముకమార్గణ
శంఖచక్రముల్, గంటిని మిమ్ము లక్ష్మణునిఁ గంటిఁ
గృతార్థుఁడ నైతి నో జగ, త్కంటకదైత్యనిర్ద
ళన దా... 21

చ. హలికునకుఁ హలాగ్రముల నర్థము సేకుఱు
భంగి దప్పిచే, నలమటఁ జెందువానికి సురాప

గలో జల మబ్బినట్లు దు, ర్మలినమనోవికారినగు
మర్త్యుని నన్నొడంగూర్చి నీపయిం, దలంపు
ఘటింపఁజేసితివి దా... 22

ఉ. కొంజక తర్కవాద మనుగుద్దలిచేఁ బరతత్త్వ
భూస్థలిన్, రంజిలఁ ద్రవ్వి కన్గొనని రామనిధాన
ము నేఁడు భక్తిసి, ద్ధాంజనమందు హస్తగతమ
య్యెభళీయనఁగా మదీయహృ, త్కంజమునన్
వసింపుమిఁక దా... 23

ఉ. రాముఁడు ఘోరపాతకవిరాముఁడు సద్గుణకల్ప
వల్లికా, రాముఁడు షడ్వికారజయరాముఁడు సా
ధుజనావనవ్రతో, ద్దాముఁడు రాముఁడే పరమ
దైవముమాకని మీయడుంగుగెం, దామరలే
భజించెదను దా... 24

ఉ. చక్కెరమాని వేముఁ దినఁజాలినకైవడి మాన
వాధముల్, పెక్కురు బక్కదైవముల వేమఱు
గొల్చెదరట్లు కాదయా, మ్రొక్కిన నీక మ్రొక్క
వలె మోక్షు మొసంగిన నీవ యీవలెం, దక్కి
నమాట లేమిటికి దా... 25

ఉ. రా కలుషంబులెల్ల బయలం బడఁ ద్రోచినమా
కవాటమై, దీకొని ప్రోచు నిక్కమని ధీయుతు
లెన్నఁ దదీయవర్ణముల్, గైకొని భక్తిచేనుడు

వఁ గానరు గాక విపత్పరంపరల్, దాఁకొనునే జగజ్జనుల దా... 26

ఉ. రామ హరే కకుత్స్థకులరామ హరే రఘురామ రామ శ్రీ, రామ హరే యటంచు మదిరంజిల భేకగళంబులీల నీ, నామము సంస్మరించినజనంబు భవం బెడఁ బాసి తత్పరం, ధామనివాసులౌదు రఁట దా... 27

ఉ. చక్కెరలప్పకున్ మిగుల జవ్వనికెంజిగురాకుమోవికిం, జొక్కపుజుంటితేనియకుఁ జొక్కిలుచుం గనలేరు గాక నేఁ, డక్కట రామనామమధురామృత మానుటకంటె సౌఖ్యమా, తక్కినమాధురీమహిమ దా... 28

ఉ. అండజవాహ నిన్ను హృదయంబున నమ్మినవారిపాపముల్, కొండలవంటివైన వెసఁగూలి నశింపక యున్నె సంతతా, ఖండలవైభవోన్నతులు గల్గక మానునె మోక్షలక్ష్మికై, దండ యొసంగకున్నె తుద దా... 29

ఉ. చిక్కనిపాలపై మిసిమిఁజెందినమీఁగడ పంచదారతోఁ, మెక్కినభంగి నీవిమలమేచకరూపసుధారసంబు నా, మక్కువపళ్లెరంబున సమాహితదాస్యమనేటిదోయిటన్, దక్కె నటంచు జుఱ్ఱెదను దా... 30

చ. సిరులిడ సీత పీడ లెగఁజిమ్ముటకున్ హనుమంతుఁ డార్తిసో, దరుఁడు సుమిత్రసూతి దురితంబులు మానుప రామనామముం, గరుణ దలిర్పమ్మానవులఁగావఁగఁబన్నినవజ్రపంజరో,త్కరము గదా భవన్మహిమ దా... 31

చ. హలికులిశాంకుశధ్వజ శరాసనశంఖరథాంగకల్పకో,జ్జ్వలజలజాతరేఖలను సాంకములై కనుపట్టుచున్న మీ, కలితపదాంబుజద్వయము గౌతమపత్నికొసంగినట్లు నా,తలఁపునఁ జేర్చి కావఁ గదె దా... 32

చ. జలనిధిలోన దూఁటి కులశైలము మీటి ధరిత్రిఁ గొమ్మునం, దలవడ మాటి రక్కసుని యంగము గీటి బలీంద్రు నిన్ రసా,తలమున మాటి పార్థివకదంబముఁ గూల్చినమేటి రామ నా,తలఁపున నాటి రాఁగదవె దా... 33

ఉ. భండనభీముఁ డార్తజనబాంధవుఁ డుజ్జ్వలబాణతూణకో, దండకళాప్రచండభుజతాండవ కీర్తికి రామమూర్తికిన్, రెండవసాటిదైవ మిఁక లేఁ డనుచున్ గడగట్టి భేరికా, డాండడడాండడాం డనినదంబు లజాండము నిండ మత్తవే, దండము నెక్కి చాటెదను దా... 34

చ. అవనిజకన్నుదోయితొగలందు వెలింగెడుసోమ
జానకీ, కువలయనేత్రగబ్బిచనుఁగొండల నుండు
ఘనంబ మైథిలీ,నవనవయౌవనం బనువనంబున
కుఁ జ మదదంతి వీవె కా, తవిలి భజింతు నెల్ల
పుడు దా... 35

చ. ఖరకరవంశజా విను మఖండితభూతపిశాచఢా
కినీ, జ్వరపరితాపసర్పభయవారక మైనభవత్ప
దాబ్జవి, స్ఫురదురువజ్రపంజరముఁ జొచ్చితి
నీయెడ దీనమానవో, ద్ధరబిరుదాంక మేమఱకు
దాశరథీ కరుణాపయోనిధీ. 36

ఉ. జుఱ్ఱెద మీకథామృతము జుఱ్ఱెద మీపదకంజ
తోయముఁ జ, జుఱ్ఱెద రామనామమున జొబ్బి
లుచున్నసుధారసంబు నే,జుఱ్ఱెద జుఱ్ఱుజుఱ్ఱుఁగరు
చుల్ గనువారిపదంబుఁ గూర్చవే, తఱ్ఱులతోడి
పొత్తిడక దా... 37

ఉ. ఘోరకృతాంతవీరభటకోటికి గుండెదిగుల్ దరి
ద్రతా, కారపిశాచసంహరణకార్యవినోది వికుం
ఠమందిర, ద్వారకవాటభేది నిజదాసజనావళి
కెల్లప్రొద్దు నీ,తారకనామ మెన్నుకొన దాశ
రథీ కరుణాపయోనిధీ. 38

ఉ. విన్నప మాలకించు రఘువీర నహిప్రతి లోకమం
దునా, కన్నదురాత్మఁడుం బరమకారుణికోత్తమ

వేల్పులందు నీ,కన్న మహాత్ముఁడుం బతిత కల్మష
దూరుఁడు లేఁడు గాన వి,ద్వన్నుత నీవె నాకు
గతి దాశరథీ కరుణాపయోనిధీ. 39

ఉ. పెంపను దల్లివై కలుషబృంద సమాగమ మొంద
కుండ ర,క్షింపను దండ్రివై మెయి వసించుద శేం
ద్రియరోగముల్ నివా,రింపను వెజ్జ వై కృప
గుతించి పరంబుఁ దిరంబు గాఁగ స,త్సంపద
లీయ నీవె గతి దాశరథీ కరుణాపయోనిధీ. 40

ఉ. కుక్షి నజాండపంక్తు లొనఁగూర్చి చరాచరజం
తుకోటిసం,రక్షణ సేయుతండ్రివి పరంపర నీతన
యుండనైన నా,పక్షము నీవు గావలదె పాపము
లెన్ని యొనర్చినన్ జగ,ద్రక్షకకర్తవీవెకదదా...

ఉ. గద్దరియోగి హృత్కమల గంధరసానుభవంబుఁ
జెందుపె, న్నిద్దపుగండు దేఁటి ధరణీసుతకౌఁగి
లిపంజరంబునన్,ముద్దులుగుల్కురాచిలుకముక్తి
నిధానమ రామరాఁగదే,తద్దయు నేఁడు నాకడకు
దా... 42

ఉ. కలియుగమర్త్యకోటి నినుఁ గన్గొనరానివిధంబొ
భక్తవ, త్సలత వహింపవో చటులసాంద్రవిపద్ద
శవార్ధిఁ గ్రుంకుచోఁ, బిలిచినఁ బల్కవింతమఱపే
నరు లిట్లనరాదుగాక నీ, తలఁపున లేదె సీతచెఱ
దా... 43

చ. జనవర మీకథాళి విన నైపక కర్ణములందు
ఘంటికా, ధ్వనదవినోదముల్ సలుపునీచునకుఙ్
వర మిచ్చినావు ని, న్ననయము నమ్మికొల్చినమ
హాత్ముల కేమి యొసంగెదో సనం, దనసుత మా
కొసంగు మది దా... 44

ఉ. పాపము లొందువేళ రణపన్నగభూతభయజ్వరా
దులం, దాపద నొందువేళ భరతాగ్రజ మిమ్ము
భజించువారికిం, బ్రాపుగ నీవుc దమ్ముc డిరుపక్క
యలం జని తద్విపత్తిసం, తాపము మాన్పి కా
తురంట దా... 45

చ. అగణితజన్మకర్మదురితాంబుధిలో బహుదుఃఖవీ
చికల్, వెగిపడ నీఁద లేక జగతీధవ నీపదభక్తి
నావచేc, దగిలి తరింపఁ గోరితిc బదంపడి నాదు
భయంబు మాన్పవే, తగ దని చిత్తమం దిడక
దా... 46

ఉ. నే నొనరించుపాపము లనేకము లైనను నాదుజి
హ్వాకుం, బౌనక మయ్యె మీపరమపావననా
మము దొంటిచిల్క రా, మా ననుcగావు మన్నc
దుదిమాటకు సద్గతిc జెందెcగావునన్, దానిధరిం
పc గోరెదను దా... 47

చ. పరధనముల్ హరించి పరభామల నంటి పరాన్న
మబ్బినన్, మురిపము కాని మీంచనగు మోస మె

అంగదు మానసంబుదు, స్తర మిది కాలకింకరగ
దాహతిపా ల్పడనీక మమ్ము నే, తఱి దరిఁ జేర్చి
కాచెదవో దా... 48

ఉ. చేసితి ఘోరకృత్యములు చేసితి భాగవతాపచా
రముల్, చేసితి నన్యదైవములఁ జేరి భజించిన
వారిపొందు నేఁ, జేసిననేరముల్ దలఁచి చిక్కు
లఁ బెట్టకు మయ్య యయ్య నీ, దాసుఁడనయ్య
భద్రగిరిదా... 49

చ. పరులధనంబుఁ జూచి పరభామలఁ జూచి హరిం
పఁ గోరుమ, ద్దురుతరమానసం బనెడు దొంగను
బట్టి నిరూఢదాస్య వి,స్ఫురితవివేకపాశములఁ
జుట్టి భవచ్చరణం బనేమరు, త్తరువునఁ గట్టివే
యఁగదె దా... 50

చ. సలలితరామనామజపసార మెఱుంగను కాశికా
పురీ, నిలయుఁడఁ గాను మీచరణనీరజరేణుమ
హాప్రభావముం, దెలియ నహల్య గాను జగతీ
వర నీ దగుసత్యవాక్యముం, దలఁపఁగ రావణా
నుజునితమ్ముఁడఁ గాను భవద్విలాసముల్, తలఁచి
నుతింప నాతరమె దా... 51

ఉ. పాతకులైనమీకృపకుఁ బాత్రులు కారె తలంచి
చూడఁ జ, ట్రాతికిఁ గల్గె బావన మరాలికి రాజ్య

సుఖంబు గల్గెదు,ర్జాతికిఁ బుణ్యమబ్బెఁ గపిజాతి
మహత్త్వమునొందెఁగావునఁ, దాతవయెట్టి
వారలకు దా... 52

ఉ. మామకపాతకవ్రజము మాన్ప నగణ్యము చిత్ర
గుప్తుఁ డే, మేమని వ్రాయునో శమనుఁ డేమి
విధించునో కాలకింకర, స్తోమ మొనర్చుటేమొ
విన జొప్పడ దింతకుమున్నె దీనచిం,తామణి
యెట్లు గాచెదవొ దా... 53

ఉ. డాసినచుట్టమా శబరి దాని దయామణి నేలి
నావు నీ,దాసునిదాసుఁడా గుహుఁడు తావకదా
స్యమొసంగినావు నేఁ, జేసినపాపమావినుతి సేసినఁ
గావవు కావు మయ్య నీ, దాసులలోన నే నొ
కఁడ దా... 54

ఉ. దీక్ష వహించి నాకొలఁది దీనుల నెందఱిఁ గాచి
తో జగ,ద్రక్షక తొల్లి యాద్రుపదరాజతనూజ
తలంచినంత నే, సాక్షియ మైనవల్వ లిడి తక్క
ట నామొఱ చిత్తగించి ప్ర,త్యక్షము గావ వేమి
టికి దా... 55

ఉ. నీలఘనాభమూర్తి వగునిన్నుఁ గనుంగొనఁగోరి
వేఁడినఁ, జాలము సేసి దాఁగెదవుసంస్తుతి కెక్క
నరామనామ మే, మూలను దాఁచుకోఁగలవు

ముక్తికి బ్రాపది పాపమూలకు, ద్దాలము గాదె
మా యెడలదా ... 56

చ. వలదు పరాకు భక్తజనవత్సల నీచరితంబు వమ్ము
కా,వలదు పరాకునీబిరుదు వజ్రమువంటిది కావ
కూరకే, వలదు పరాకు నాదురితవార్ధికిఁ దెప్ప
వుగా మనంబులోఁ, దలఁతుమెకా నిరంతరము
దా... 57

ఉ. తప్పు లెఱుంగలేక దురితంబులు సేసితి నంటి నీ
వు మా, యప్పువు గావుమంటి నిఁక నన్యులకుఁ
నుదుకంట నంటి నీ, కొప్పిద మైనదాసజను లొ
ప్పినబంటుకు బంట నంటి నా, తప్పులకెల్ల నీవె
గతి దా... 58

చ. ఇతఁడు దురాత్ముఁడంచుజను లెన్నఁగనాఁఅడిఁగొం
టి నేనపో, పతితుఁడనంటి నోపరమపావనమూ
ర్తివి నీవు గల్గనే, నితరుల వేఁడ నంటి నిహా మి
చ్చిన నిమ్ము పరం బొసంగుమీ,యతులిత రామ
నామమధురాక్షరపాళి నిరంతరంబు హృ, ద్గత
మని నమ్మి కొల్చెదను దా... 59

ఉ. అంచిత మైననీదుకరుణామృతసారము నాదుపై
నిఁ బ్రో, క్షించినఁ జాలు దాన నిరసించెద నా
దురితంబు లెల్లఁ దూ,లించెద వైరివర్గ మెడలిం

చెదఁ గోర్కుల నీదుబంటనై, దంచెదఁ గాల
కింకరుల దా... 60

చ. జలనిధు లేడు నొక్కమొగిఁ జక్కికిఁదెచ్చె శరం
బు వాలి నిం, పలరఁగఁజేసె నాతిగఁ బదాబ్జప
రాగము నీచరిత్రముల్, జలభవాదినిర్జరులు
సన్నుతి సేయఁగ లేరు గావునం, దలఁప నగణ్య
మయ్య యిది దా... 61

ఉ. కోఁతికి శక్యమా యసురకోటుల గెల్వను గెల్చెఁ
బో నిజం, బాతని మేన శీతకరుఁ డౌట దవానలుఁ
డెట్టివింత మా, సీతపతివ్రతామహిమ సేవకు
భాగ్యము మీకటాక్షముల్, ధాతకు శక్యమా
పొగడ దా... 62

ఉ. భూపలలామ రామ రఘుపుంగవ రామ త్రిలోక
రాజ్యసం, స్థాపన రామ మోక్షఫలదాయక
రామ మదీయపాపముల్, వాపఁగదయ్య రామ
నినుఁ బ్రస్తుతి సేసెదనయ్య రామ సీతాపతి
రామ భద్రగిరి దా... 63

ఉ. నీసహజంబు సాత్త్వికము నీవిడిపట్టు సుధాప
యోధి ప, ద్మాసనుఁ డాత్మజుండు కమలాలయ
నీప్రియురాలు నీకు సిం, హాసన మిద్ధరిత్రి గొడు
గాకస మక్షులు చంద్రభాస్కరుల్, నీసుమతల్ప

మాదిఫణి నీవె సమస్తముఁగొల్చినట్టి నీ,దాసుల
భాగ్య మెట్టిదయ దా... 64

చ. చరణము సోఁకినట్టిశిల జవ్వనిరూపగు టొక్క
వింత సుస్థిరముగ నీటిపై గిరులు దేలిన దొక్క
టివింతగాని మీ, స్మరణఁ దనర్చు మానవులు
సద్గతిఁ జెందిన దెంతవింత? యీ, ధరను ధర్మాత్మ
జారమణ దా... 65

ఉ. దైవము తల్లి దండ్రి తగుదాత గురుండు సఖుం
డు నిన్నె కా, భావనసేయుచున్న తఱిఁ బాపము
లెల్ల మనోవికారదు, ర్భావితుఁ జేయుచున్నవి
కృపామతి వైనను గావు మీజగ, త్పావన
మూర్తి భద్రగిరి దా... 66

ఉ. వాసవరాజ్యభోగసుఖవార్ధిని దేలుప్రభుత్వ మ
బ్బినన్, ఆసకు మేర లేదు కనకాద్రిసమాన
ధనంబుఁ గూర్చినం, గాసును వెంటరాదు కని
కానకచేసినపుణ్యపాపముల్, వీసరపోవనీవు పది
వేలకుఁజాలుభవంబునొల్ల నీ,దాసునిగాఁగ నేలి
కొను దా... 67

ఉ. సూరిజనుల్ దయాపరులు సూనృతవాదులలుబ్ధ
మానవుల్,వీరపతివ్రతాంగనలువిప్రులుగోవులు
వేదముల్ మహీ, భారముఁ దాల్పఁగా జనులు

పావన మైనపరోపకారసత్కార మెఱుంగలే
రకట దా... 68

ఉ. వారిచరావతారమున వారిధిలోఁ జొరఁబాఱి
క్రోధవిస్తారగుఁ డైనయానిగమతస్కరవీరని
శాచరేంద్రునిం, జేరి వధించి వేదముల చిక్కెడలించి విరించికిన్ మహోదారతనిచ్చి తీవెకద
దా... 69

చ. కర మనురక్తి మంథరముఁ గవ్వముగా నహిరాజు
త్రాడుగా, దొరఁకొని దేవదానవులు దుగ్ధపయో
ధిమథించుచున్న చో, ధరము చలింప లోకములు
తల్లడ మందఁగఁ గూర్మమై ధరాధరము ధరించి
తీవె కద దా.... 70

ఉ. ధారుణిఁ జాపఁ జుట్టినవిధంబునఁ గైకొని హే
మనేత్రుఁడ, వార్ధిలోన డాఁగినను వానివధించి
వరాహమూర్తి వై, ధారుణిఁ దొంటికైవడిని
దక్షిణశృంగమునన్ ధరించి విస్తార మొనర్చి
తీవెకద దా... 71

చ. పెటపెట నుక్కుఁగంబమునభీకరదంతనఖాంకుర
ప్రభా, పటలముఁ గప్ప నుప్పతిలి భండనవీథి నృ
సింహభీకర, స్ఫుటపటుశక్తి హేమకశిపున్ విద
ళించి సురారిపట్టి నం, తటఁ గృపఁ జూచి తీవెకద
దా... 72

చ. పదయుగళంబు భూగగనభాగములన్ వెస నూని
విక్రమా, స్పద మగునబ్బలీంద్రు నొకపాద
మునం దలక్రింద నొత్తి మే, లొదవ జగత్త్ర
యంబుఁ బురుహూతునకియ్య వటుండవైనచి,
త్సదమలమూర్తి వీవెకద దా... 73

చ. ఇరువదియొక్కమాఱు ధరణీశుల నెల్ల వధించి
తత్కళే, బరరుధిర ప్రవాహమునఁ బైతృకతర్పణ
మొప్పఁ జేసి భూ, సురవరకోటికిన్ ముదము
సొప్పడ భార్గవరామమూర్తి వై, ధరణి నొసంగి
తీవెకద దా... 74

చ. దురమునఁ దాటకం దునిమి ధూర్జటివిల్ దును
మాడి సీతనుం, బరిణయ మంది తండ్రి పనుపన్
ఘనకాననభూమి కేగిదు, స్తరపటుచండకాండకు
లిశాహతి రావణకుంభకర్ణభూ, ధరములఁ గూల్చి
తీవెకద దా... 75

చ. అనుపమయాదవాన్వయసుధాబ్ధిసుధానిధి కృష్ణ
మూర్తి నీ, కనుజుఁడు గా జనించి కుజనావళి
నెల్ల నణంచి రోహిణీ, తనయుఁ డనంగ బాహు
బలదర్పమునన్ బలరామమూర్తివై, తనరిన వేల్ప
వీవెకద దా... 76

చ. సురలు నుతింపఁగాఁ ద్రిపురసుందరులన్ వరి
యింప బుద్ధరూ, పరయఁగఁ దాల్చితీవు త్రిపురా

సురకోటి దహించునప్పుడా, హారునకుం దోడుగా
వరశరాసనబాణముఖోగ్రసాధనో, త్కర మొన
రించి తీవెకద దా... 77

ఉ. సంకరదుర్గమై దురితసంకుల మైనజగంబుఁ జూచి
స, ర్వాంకషలీల ను త్తమతురంగము నెక్కి కరాసిఁ
బూని వీ,రాంకవిలాస మొప్పఁ *గలికాకృతి సజ్జన
కోటికిన్ విరా, తంక మొనర్చు దీవెకద దా. 78

చ. మనమున నూహాపోహణలు మర్వకమున్నె కఫా
దిరోగముల్, దనువుననంటి మేనిబిగి దప్పక
మున్నె నరుండు మోక్షసా,ధన మొనరింపఁగావ
లయుఁ దత్త్వవిచారముమానియుండుట, త్తనువు
నకున్ విరోధ మిది దా... 79

చ. ముదమున కాటపట్టు భవమోహమదద్విర
దాంకుశంబు సం, పదలకొటారు కోరుకులపంట
పరంబున కాది వైరుల, న్నదన జయించుత్రోవ
విపదబ్ధికి నావగదా సదా భవ, త్సదమలనామ
సంస్మరణ దా... 80

చ. దురితలతానుసారిభవదుగ్ఖకదంబము రామనా
మభీ, కరతరహేతిచేఁ దెగి వకావకలై చనకుండ
నేర్చునే, తరికొని మండుచుండుశిఖిఁ దార్కొ

* కలిక్యాకృతి యనుటకు కలికాకృతి యనెను.

నినఁ శలభాదికీటకో, త్కరము విలీనమై చన
దె దా... 81

చ. హరిపదభక్తినింద్రియజయాన్వితుఁడుత్తముఁడిం
ద్రియంబుల, న్మరుగక నిల్పనూఁదినను మధ్యముఁ
డింద్రియపారవశ్యుఁడై, పరఁగినచో నికృష్టుఁ
డని పల్కఁగ దుర్మతి నైననన్ను నా, దరమున
నెట్లు కాచెదవో దా... 82

చ. వనకరి చిక్కె మైనసకు వాచవికిం జెడిపోయె
మీను తా, వినికికిఁ జిక్కెఁ జిల్వ కనువేఁదుఱుఁ
జెందను లేళ్లు తావిలో, మనికి నశించెఁ దేఁటిత
రమా యిరుమూఁటిని గెల్వ నైదుసా, ధన
ముల నీవె కావఁ దగు దా... 83

చ. కరములుమీకు మ్రొక్కలిడఁ గన్నులుమిమ్మునె
చూడ జిహ్వమీ, స్మరణఁదనర్ప వీనులు భవత్క
థలఁ వినుచుండి నాస మీ, యఱుతను బెట్టు
పూసరుల కాసకొనం బరమార్థసాధనో, త్కర
మది చేయవే కృపను దా... 84

చ. చిరతరభక్తి నొక్కతులసీదళ మర్పణసేయు
వాఁడు ఖే, చరగరుడోరగప్రముఖసంఘములో
వెలుఁగుఁ సదాభవ, త్స్ఫురదరవిందపాదములఁ
బూజ లొనర్చినవారికెల్లఁ ద, త్పర మఱచేతి
ధాత్రిగద దా... 85

ఉ. భానుఁడు తూర్పునందుఁ గనుపట్టినఁ బావకచంద్ర
తేజముల్, హీనతఁ జెందినట్లు జగదేకవిరాజిత
మైననీపద, ధ్యానము సేయుచున్నఁ బరదైవ
మరీచు లడంగ కుండునే, దానవగర్వనిర్దళన
దా... 86

ఉ. నీమహనీయతత్త్వరస నిర్ణయబోధకథామృతా
బ్ధిలోఁ, దాముఁను గ్రుంకులాడక వృథా తను
కష్టముఁజెంది మానవుం, డీమహీ లోకతీర్థముల
నెల్ల మునింగిన దుర్వికారహృ,త్తామసపంక
ముల్ విడునె దా... 87

ఉ. కాంచనవస్తుసంకలితకల్మష మగ్నిపుటంబు వెట్టి
వా, రించినరీతి నాత్మ నిగిడించినదుష్కరదుర్మల
త్రయం, బంచితభక్తియోగదహనార్చిఁ దగుల్పక
పాయునే కన, త్కాంచనకుండలాభరణ దా...

ఉ. నీసతి పెక్కుకల్ములిడ నేర్పరి లోక మకల్మ
షంబు గా, నీసుత సేయు పావనము నిర్మితకా
ర్యధురీణదక్షుఁ డై, నీసుతుఁ డిచ్చునాయువులు
నిన్ను భజించినఁ గల్గకుండునే, దాసుల కీప్సితా
ర్థములు దా... 89

ఉ. వారిజపత్త్రమం దిడినవారివిధంబునవర్తనీయమం,
దారయ రొంపిలోనఁ దను నంటనికుమ్మరపుర్వు
రీతి సం, సారమునందు మెలంగుచు విచారగుఁడై

పరమొందఁగాదె స, త్కారమెఱింగి మాన
వుఁడు దా... 90

ఉ. ఎక్కడితల్లిదండ్రి సుతులెక్కడివారు కళత్ర
బాంధవం, బెక్కడ జీవుఁ డెట్టితను వెత్తినఁ
బుట్టుచుఁ బోవుచున్నవాఁ, డొక్కఁడె పాపపు
ణ్యఫలమొందిన నొక్కఁడె కానరాఁడు వే, ఱొ
క్కఁడు వెంటనంటిభవమొల్లనయా కృపఁజూడవ
య్య నీ, తక్కరిమాయలం దిడక దా.... 91

చ. దొఁగసినకాయముల్ ముదిమితోఁచినఁజూచిప్ర
భుత్వముల్సిరుల్, మెఱుపులుగాఁగఁజూచి మఱి
మేదినిలోఁదమతోడివారుముం, దరుగుటఁజూచి
చూచితెగునాయువెఱుంగకమోహపాశము, ల్ద
రుగనివారి కేమిగతి దా... 92

చ. సిరిగలనాఁడు మైమఱచి చిక్కిననాఁడు తలంచి
పుణ్యముల్, పొరిబొరిఁ జేయనైతి ననిపొక్కినఁ
గల్గునె గాలిచిచ్చుపైఁ, గెరలినవేళఁ దప్పిగొని
కీడ్పడువేళ జలంబుఁ గోరి త, త్తరమునఁ ద్రవ్వి
నం గలదె దా... 93

ఉ. జీవన మింకఁ బంకమునఁ జిక్కినమీను చలింప
కెంతయుం, దావున నిల్చి జీవనమె తద్దయుఁ
గోరువిధంబు చొప్పడం, దావలమైనఁ గాని

గుఱి దప్పనివాఁడు తరించువాఁడయా, తావక
భక్తియోగమున దా... 94

చ. సరసునిమానసంబు సురసజ్ఞుఁడెఱుంగునుముష్కరాధముం, డెఱిఁగి గ్రహించువాఁడె కొల నేక నివాసముగాఁగ దర్దురం, బరయఁగ నేర్చునెట్లు వికచాబ్జమరందరసైకసౌరభో, త్కరముమిళింద మొందుక్రియ దా... 95

ఉ. నోఁచినతల్లిదండ్రికిఁ దనూభవుఁ డొక్కఁడె చాలుమేటి చే, చాఁచనివాఁడు వేఱొకఁడు చాఁచిన లేదన కిచ్చువాఁడు నో, రాఁచి నిజంబ కానిపలు కాడనివాఁడు రణంబులోన మేన్, దాఁచనివాఁడు భద్రగిరి దా... 96

ఉ. శ్రీయుత జానకీరమణ చిన్మయరూప రమేశరామ నా, రాయణ పాహిపాహి యని ప్రస్తుతిఁజేసితి నామనంబునం, బాయక కిల్బిషవ్రజవిపాటనమందఁగజేసి సత్కళా,దాయిఫలంబు నాకియవెదా.

ఉ. ఎంతటిపుణ్యమో శబరియెంగిలిఁ గొంటివి వింత గాదె నీ,మంతనమెట్టిదో యుడుతమైని గరాగ్రనఖాంకురంబులన్,సంతసమందఁజేసితివిసత్కులజన్మము లేమిలెక్కవే,దాంతముగాదెనీమహిమ దా.

ఉ. బొంకనివాఁడెయోగ్యుఁడరిబృందములెత్తినచోటఁ జివ్వకున్, జంకనివాఁడె జోదు రభసంబున

సర్థికరంబు సాఁచినం, గొంకనివాఁడె దాత మిముఁ
గొల్చి భజించినవాఁడెపో నిరా, తంకమనస్కుఁ
డెన్నఁగను దా... 99

చ. భ్రమరము కీటకంబుఁగొని పల్వడిఝాంకరణోప
కారియై, భ్రమరముగా నొనర్చునని పల్కుటఁజేసి
భవాదిదుఃఖసం, తమసమెడల్చిభక్తిసహితంబుగ
జీవునివిశ్వరూపత, త్త్వమునధరించుఁ బేమరుదు దా.

చ. తరువులుపూచి కాయలగుఁ దత్కుసుమంబులు
పూజగా భవ, చ్చరణము సోఁకి దాసులకు సార
ములౌ ధనధాన్యరాసులై, కరిభటఘోటకాం
బర నికాయము లై విరజానదీసము, త్తరణ
మొనర్చుఁ జిత్ర మిది దా... 101

ఉ. పట్టితిభట్టరార్యగురుపాదములిమ్మెయినూర్ధ్వపుం
డ్రముం, బెట్టితిమంత్రరాజమొడిఁ బెట్టితినయ్య
మకింకరాళికిం, గట్టితిబొమ్మ మీచరణకంజములం
దుఁదలంపువెట్టిపోఁ, దట్టితిఁ బాపపుంజములదా.

ఉ. అల్లన లింగమంత్రిసుతుఁ డత్రిజగోత్రజుఁ డాది
శాఖ కం, చెర్లకులోద్భవుండనఁ బ్రసిద్ధుఁడనై భవ
దంకితంబుగా, నెల్లకవుల్ నుతింపరచియించితిగో
పకవీంద్రుఁడఁ జగ, ద్వల్లభ నీకు దాసుఁడను దా.

దాశరథిశతకము సంపూర్ణము.

---

# పీఠిక.

ఈనరసింహాశతకము రచించినకవి గోగులపాటి కూర్మనాథుఁడు. ఇతఁడు విశాఖపట్టణమండలనివాసి. *లక్ష్మీనరసింహాసంవాదము (పద్యకావ్యము) మృత్యుంజయవిలాసము (యక్షగానము) అను రెండుపొత్తములు లీకవి రచించినవి మేము చూచితిమి. కవి క్రీ. శ. 1750 ప్రాంతమునందుండి యుండును. ఇతని యితరగ్రంథములవలన నితఁడు ఆపస్తంబుఁడగు ముద్గలగోత్రుఁడనియు నాఱువేలనియోగియనియుఁ బెద్దింటి సంపత్కుమార వేంకటాచార్యులశిష్యుఁడని తెలియును.

ఆంధ్రదేశములో సింహాచలము సుప్రసిద్ధమగు నృసింహక్షేత్రము. తురకదండు ఆంధ్రదేశమునకు దాడివెడలి మార్గమధ్యమున నున్నగ్రామములఁ గాల్చుచు జనులఁ బీడించుచు సతులమానభంగము గావించుచు పొట్నూరు, భీమసింగి, జామి, చోడవరము లోనగుగ్రామములలోని దేవాలయముల రూపుమాపి సింహాచలము ముట్టడించెను. ఆలయమండపములలో గోహత్యగావించి బ్రాహ్మణాదులఁ బరాభవించి సతులయభిమానధనములు చూఱగొని తురక లెన్నియో దుండగములకుఁ బాల్పడిరి.

---

* దీనినే చోరసంవాదమని చెప్పుదురు.

కూర్మనాథుఁ డాసమయమున ధర్మసంరక్షణార్థము లెమ్మని సింహాద్రినారసింహస్వామిని చులుకు పలుకులతోఁ బ్రోత్సహించి, నిందించి, కటూక్తులాడి ఆలయము ముందేకపాదమున నిలిచి యఱువది యెనిమిదిపద్యములను రచించెను. తురక లీపేదబాపని లక్ష్యపెట్టక దురంతములు గావింపసాగిరి. కూర్మనాథుని పలుకు వాఁడికి నొచ్చి నృసింహస్వామి *కందిరీఁగల లెట్టెను లేపఁగా నది తురకలఁ గుట్టి నానావస్థలఁబెట్ట దిక్కుచెడి తలకొకదిక్కై నిలువ నీడలేక యవనులు పాఱిపోయిరి.

జనపరంపర చెప్పుకొను నీకథవిశ్వాసపాత్ర మనుటకు అఱువదియెనిమిదవపద్యము మొదలు "నీదు కరుణఁగంటి మిప్పుడు" "జయమయ్యె యవనరాట్సంతమసము బాసె" అని నృసింహుని కవి సంకల్పసిద్ధుఁడై ప్రశంసించుటయే దృష్టాంతము కాఁగలదు.

కూర్మనాథుకవి మృదుపదగుంభితము. ఇతని నుడి పొందికలో శిలలకైన జీవశక్తి గలిగించు నొకయమోఘశక్తి గలదు. లోపముల నెత్తిపొడిచి యచేతనమగు శిలావిగ్రహముచేఁ బనిగొన్న యీ కవిశక్తి ప్రశంసార్హము. కావ్యాంతమున భగవం

* ఈయంశము తెలుపుపద్యము లీశతకమున నుదాహరింపఁబడియున్నవి. చూ. ప.

తుని గటువచోహతిచే నొప్పించితినని కవి పరిత పించు దీనవాక్యములు హృదయదారణములు. ఏతదుత్తమశతకరచనమూలమున నీకవికీర్తి యాచంద్రతారమై వెలుగుచున్నది.

ఈశతకము యుక్తియుక్తములగు సామెతలతో మృదుమధురములగు మాట పొందికలతో శతక వాఙ్మయమునకు భూషణప్రాయముగనున్నది. ఆంధ్ర దేశమును యవనపళములు ముట్టడించి చేసినకల్లోలములకు, దేశీయులు లంచగొండులై వారిథాటికవకాశము లొసంగి యాత్మహత్యాసమమగు నాత్మ వంచనమునకుఁ బాలుపడినందులకీశతకము తార్కాణము కాఁగలదు.

ఇట్టి విప్లవపరిస్థితులలో రచింపఁబడిన వెంకటాచలవిహారశతకము, మట్టపల్లి నృసింహశతకము లోనగునవి చూచుట కాంధ్రప్రపంచ మాతురపడుచున్నది. వావిళ్లవా రాగ్రంథముల లోకమున కొసంగఁ బ్రార్థితులు.

ఇట్లు,
భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు.

నందిగామ
1-1-25

శ్రీ రస్తు.

# సింహాద్రి
# నారసింహశతకము.

---

సీ. శ్రీమద్రమారమణీమణీరమణీయ
సరసచిత్తాబ్జబంభర పరాకు
శంఖచక్రగదాసిశార్ఙ్గచాపాదిభా
సురదివ్యసాధనకర పరాకు
ప్రహ్లాదనారదవ్యాసశుకాదిక
భక్తసంరక్షణపర పరాకు
బహుతరబ్రహ్మాండభాండపరంపరా
భరణలీలాధురంధర పరాకు
తే. నీకు సాష్టాంగవినతు లనేకగతులఁ
జేసి విన్నప మొనరింతుఁ జిత్తగింపు
చెనఁటి వీఁ డని మదిలోనఁ గినుక మాని
వైరిహరరంహా సింహాద్రినారసింహా. 1

సీ. అవధారు దేవ చిత్తావధానతఁ గొను
వనజజాదులు సేయుసం[illegible]నములు
సెలవె రాత్రిందివస్థితిగతు ల్దెలుపఁగా
సోమపద్మాప్తు లిచ్చో నిలిచిరి

మందారతరుసూనమాల్యము ల్గొని యింద్రుఁ
డేతెంచె నిందుల కేమియాజ్ఞ
గంధర్వకిన్నరు ల్కరగతవీణు లై
తడవాయె వచ్చిరి దర్శనేచ్ఛ
తే. ననుచు జయవిజయులు దెల్ప హాయి యనుచు
నిందిరను గూడి యుంటి వీ వింటికన్న
గుడి పదిలమంచు యవనులఁ గొట్టవయ్య, వైరి.

సీ. చటులజోమకహరస్ఫుటతరాటోపంబు
కుంభినీభరణ విజృంభణంబు
ఖలహిరణ్యాక్షశిక్షణరూక్షదక్షత
క్షుభితహిరణ్యరక్షోభిదాత్మ
బలిమహావైభవభంజనమహిమంబు
నుర్వీశగర్వాంతకోర్వతిశయ
మతిదుష్టదశకంఠహరణబాహాశక్తి
ప్రబలప్రలంబదారణవిధంబు
తే. పురవధూవ్రతభంగవిస్ఫురణసరణి
భువనములు బ్రోవఁ గావించి జవనయవన
సేన నణఁచుట కిటు జాగు సేయఁదగునె, వైరి.

సీ. *మొఱవహోయెనా వక్రముఖనక్రహరమహా
సంపర్కనిర్వక్రచక్రధార

* మొక్క-పాఠాం.

వాసి దప్పెనొ హతోద్భాసిసుమాలిమ
హాసురశార్ఙ్గబాణాసనంబు
పదను వాసెనొ మధుప్రముఖేంద్రరిపురాజి
బృందాంతకారకనందకంబు
కడిమి దప్పెనొ సౌంభకమథనప్రణిధాన
చండమై తగుగదాదండపటిమ
తే. జబ్బుపడి యుంటి వేల మాయబ్బ యొక్క
దెబ్బ దీయక తురకలయుబ్బు చెడదు
గొబ్బునఁ జెలంగు మీకనైననిబ్బరముగ, వైరి.

సీ. చుట్టు బెట్టెను మహారట్టజంబులతోడ
నిఖిలరాజ్యము పఠాసీలఫౌజు
మట్టి మల్లాడెను మదసామజంబులఁ
బురజనపదములు తురకబలము
కొట్టి కొల్లలు వెట్టె గురువిప్రమానినీ
ఘనగోగణంబుల ఖానసమితి
పట్టిపల్లార్చిరి బహుదుర్గవర్గముల్
సరభసోద్ధత్యపాశ్చాత్యచయము
తే. మించి భూస్థలి నిటు లాక్రమించి రాఁగ
నలుక రా దేమి నగరివారలను దోఁచఁ
బొంచియుంటివి యవనుల ద్రుంచుమికను, వైరి.

సీ. మొగిసి రక్కసుని బొందుగఁ జించునీగోళ్లు
 చిటిలెనో సిరికుచశిఖరి దాఁకి
యరులపై భగభగలాడుకోపజ్వాల
 లారెనో శ్రీకటాక్షామృతమునఁ
బరవీరగర్భము ల్పగిలించుబొబ్బ ప
 ల్కదో రమానందగద్గదికచేత
ఖలుల దండింపగాఁ గఠిన మౌనీగుండె
 కరఁగెనో శ్రీలక్ష్మి సరసకేళి
తే. నహహ నీభీకరోద్వృత్తి నల్పు లనక
యవనరాజుల నడఁచి ప్రేయంగ వలయు
పిన్నపామునకైనను పెద్దదెబ్బ, వైరి. 6

సీ. పొదలలో డాఁగెనో పొట్నూరులో నున్న
 రమణీయకోదండరామమూర్తి
యెక్కడి కేఁగెనో యెఱుఁగంగ రాదుగా
 పటుభీమసింగి గోపాలమూర్తి
సాధ్వసోద్వృత్తి నెచ్చటి కేఁగి యుండునో
 జామిజనార్దనస్వామిమూర్తి
యెన్నిపాట్లను బడుచున్నాఁడో చోడవ
 రంబులోఁ గేశవరాయమూర్తి
తే. నిబిడయవనులభయశంక నీవు నింకఁ
బరుల కగపడకుండుమీ ప్రక్క నున్న
గాయమిప్పటికిని మానదాయె నయయొ, వైరి.

సీ. పాశ్చాత్యుల నమాజుపై బుద్ధిపుట్టెనో
మౌనులజపముపై మనసు రోసి
యవనులకందూరియం దిచ్చ చెందెనో
విప్రయజ్ఞములపై విసువు బుట్టి
ఖానజాతిసలాముపై నింపు బుట్టెనో
దేవతాప్రణతిపై భావ మెడలి
తురకలయీదునందు ముదంబు గల్గెనో
భక్తనిత్యోత్సవపరత మాని
తే. వాండ్రు దుర్మార్గు లయ్యయో వ్రతము చెడ్డ
సుఖము దక్కదు వడి ఢిల్లి చోరఁగఁదోలు
పారసీకాధిపుల పటాపంచలుగను, వైరి. 8

సీ. నీకొండపై నెక్కి నియతు లౌభక్తులఁ
గొట్టి నానావస్థ బెట్టకుండ
గాంగధారాతీరకలితమండపముల
మద్యపానము జేసి మలయకుండ
నీవంటశాలలో నిశ్శంకతో మాంస
ఖండము ల్మెండుగా వండకుండ
నీగుడిఁ జొచ్చి దుర్నీతిఁ గామాంధులై
పరవధూటుల భంగపఱుపకుండఁ
తే. బౌరుషంబునఁ దురకల బాఱఁ దఱుము
వేటకాఁ డిల మెత్త నావేళ లేడి
మూఁడుకాళ్లను నడుచునిర్మూలితాంహ, వైరి.

సీ. సెల వైన భైరవుం డలుకచే వైరుల
        నెత్తి బల్లదచేత మొత్తలేఁడె
    యాజ్ఞ యిచ్చిన వీర హనుమంతుఁ డహితుల
        ఘనవాలమున నేలఁ గలుపలేఁడె
    యంపించితేఁద్రిపురాంతకుం డరిసేన
        ఘోరశూలమ్మునఁ గ్రుమ్మలేఁడె
    కనుసన్నఁ జేసిన వినతాతనూజుండు
        విమతుల నెగిరి పో విసరలేఁడె
తే. యింత తాలిమి చేయుదే యిప్పటికిని
    మట్టుకొని వచ్చె శత్రుసమాజ మెల్ల
    ప్రజల రక్షింపు యవనేశుబలముఁ గూల్పు, వైరి.

సీ. యవనేశుధాటికి నడలి సర్వస్వమ్ము
        విడిచి మందిరములు వెడలువారు
    వెడలియు దలఁ దాఁచ వెర వేమి గానక
        నడవుల నిడుమలఁ బడెడువారుఁ
    బడియు నెచ్చట కూడుఁ బట్టఁ గానక తమ
        శిశువులతో వెతఁ జెందువారుఁ
    జెంది డెందము గుందఁ గాందిశీకత నభి
        మానార్థులై ఖేద మానువారు
తే. వైరి యొక్కొక్క భార్యతో నవనిప్రజలు
    అష్టమహిషులపై పదియాఱువేల
    సతులతో నీవు వలస కెచ్చటి కరిగెదు, వైరి.

సీ. దర్పణాకృతి తళ త్తళలాడుకంబాలు
డంబై చెలంగు బేడాహెురంగు
చెప్పఁ జూపఁగ రాని యొప్పైన నుప్పరం
బప్పళించెడువంక కొప్పుచొప్పు
చిత్రవిచిత్ర మౌచిత్రంపుబొమ్మలఁ
గులుకు చక్కనిగుళ్లు గోపురములు
నమృతోపమాన మై యలరారుగాంగధా
రాముఖ్యసకలధారాజలంబు
తే. నెంత ముచ్చటపడి సృజియించి నావొ
యిల్లు చెడఁగొట్టుకొనకు న న్నేలినయ్య
ఘనతురుష్కులఁ బడఁగొట్ట మనసుబెట్టు, వైరి.

సీ. యవనధాటికి భయ మందియే కాఁబోలు
నక్కజంబుగఁ గొండ యెక్కినావు
ఖానుల కడలియే కాఁబోలు సంపూర్ణ
పౌరుషంబునఁ గత్తి బట్ట వైతి
వఖిల పాశ్చాత్యుల నలమ లేకయపోలు
తాపసగతి జడఁ దాల్చినావు
మ్లేచ్ఛనాయకబలాలికి జంకి కాఁబోలు
మిక్కిలిగంధంబు మెత్తినావు
తే. గట్టిగా నీవు తురకలు ముట్టకుండ
నవవరాహాకృతి ధరించినావు సామి
వలదు నిందలఁ బడ తురుష్కులవధింపు, వైరి.

సీ. పటుతర స్తంభంబు పటపట బ్రద్దలు
గా జనించిన నీయఖండమహిమ
చటులతరంబుగా చెటపెట దంష్ట్రిలు
కొఱుకుచు వచ్చునీఘోరవృత్తి
స్ఫుటతరోద్భటవృత్తిఁ జిటచిటధ్వని మీరు
నీనిటలాక్షువహ్నిక్రమంబు
కుటిలనఖంబుల పొటపొట నెత్తురు
సింద రక్కసిరొమ్ముఁ జించుకినుక
తే. యెందుబోయెనో నేఁడు మహీజనంబు
గుంద యాద్ధత్యమున వచ్చుఘోరయవన
బృందములయందుఁ జూపుతద్భీకరగతి, వైరి. 14
సీ. నట్టువల్ ద్రొక్కఁగా నవయామునీయకూ
లంబు గాదు రణస్థలంబుగాని
కొట్టి తోలఁగ నీకు గోవృషభంబుల
బాజుగాదు గుఱాల ఫౌఁజుగాని
పట్టిచూడఁగ నీకు పసిగాఁపుఁజెలులపా
లిండ్లుగావు ఫిరంగిగుండ్లు గాని
ముట్టి ముక్కలు సేయ ముదిసినయర్జున
తరులు గా వరివీరతరులుగాని
తే. యవనబలములతోడఁ బోరాడలేవు
శూరుఁ డౌజరాసంధుండు చుట్టుకొసిన
నాఁటితీ రయ్యె మే ల్నీకు నవ్వుగాదు, వైరి.

సీ. కాంతలఁ జెఱఁబట్టఁ గనుగొను చుంటివి
పాంచాలివెత యెట్లు బాపినావొ
గోవధ సేయఁ గన్గొనుచుంటి విప్పుడు
కరుణతోఁ గరి నెట్లు కాచినావొ
ద్విజులు బాధలుపడఁ దిలకించు చుంటివి
భువిఁ గుచేలుని నెట్లు బ్రోచినావొ
సత్ప్రభురాజ్యనాశన మొందఁ గంటివి
ధ్రువుని కె ట్లిచ్చితో దొడ్డపదవి
తే. దుష్టశిక్షణ మొనరించి శిష్టరక్షఁ
జేయకుండిన పూర్వప్రసిద్ధి జెడును
ఆర్తరక్షణబిరుదంబు హానిఁ జెందు, వైరి. 16

సీ. సముదగ్ర మగుసముద్రముఁ జొచ్చి యీఁదుటో
కొండ నెత్తినిఁ బెట్టుకొంటయొక్కొ
ధారుణీస్థలి ద్రవ్వి తల నెత్తుకొంటయో
గొబ్బున సింగంపుబొబ్బ యిడుటొ
యడు గిడి త్రైలోక్యమాక్రమించుటయొక్కొ
వేయిచేతులవాని వేయుటొక్కొ
యొకశరాగ్రమున నుదధి నింకించుటో
కరిపురంబెల్ల బెగల్చుటొక్కొ
తే. కరుణ జగములఁ బ్రోచుటో తురగమెక్కి
ఘనరిపులఁ గొట్టుటో తురుష్కవధ యెంత
కొండయెక్కెదు బ్రతిమాలుకొనినఁ గొలఁది, వైరి.

సీ. కుఱుపాలు ప్రొద్దునఁ గ్రోలక నొకక్షణ
మైనఁ దాళవుగదా యాఁకటికిని
బాగుగా మెయి మలాశీగంధ మలఁదక
నింపు పుట్టదుగదా యెప్పటికిని
తనువునిండఁగ ధగద్ధగితపట్టాంబరం
బవధరింపక మాన వహరహంబు
నాటపాటలు మొద లగువినోదంబుల
నుబుసుపుచ్చుచుఁ గాని యుండలేవు
తే. భక్తు లెల్లరు దుర్మార్గపరతురుష్క
రాజిచేఁ బొంది రిదె పడరానిపాట్లు
భోగరాగంబు లిఁక నీకుఁ బొసఁగుటెట్లు, వైరి.

సీ. పుట్టినప్పుడు పీఁకఁ బోకార్చితివి భళీ
పూతనాఖ్యోపేతయాతుధానిఁ
బుడమిపై కడుతప్పటడు గిడునప్పుడు
బండిరక్కసు మేను చెండినావు
ఆటప్రాయమునఁ దృణావర్తబకధేను
కాదిదైత్యకులంబు నణఁచినావు
యౌవనంబున నృశంసావతంసకకంస
విధ్వంసనరిరంస వెలసినావు
తే. భూసురులఁ బ్రోవవేమి మహాసురారి
యిప్పు డేటికిఁ ద్రుంప వేండ్లెగస నైన
బుద్ధ దిగసన వచ్చెనో పో మతేమి, వైరి. 19

సీ. ఎలమితో సోమయాజుల పెద్దఝూరీలు
గుడిగుడీలుగఁ జేసికొనెడువారు
యజ్ఞవాటికలలో నగ్ని హోత్రంబుల
ధూమపానము జేసి త్రుళ్లువారు
యాగపాత్రలుదెచ్చి హాసుగా నడి లుడి
కీచిప్పలుగఁ జేసి కేరువారు
స్రుక్స్రువముఖ్యదారుమయోపకరణముల్
గొని వంటపొయి నిడుకొనెడువారు
తే. నగుచు యవనులు విప్రులఁ దెగడుచుండ
సవనభోక్తవు నీ విట్లు సైఁపఁ దగునె
తినఁ దినఁగ గారెలైనను కనరువేయు, వైరి. 20

సీ. చింపికుళ్లాయైన శిరమునఁ దాల్చి
దివ్యకిరీటంబు దీసి దాఁచు
వనమాలికయు చాలు వక్షంబున ధరింపఁ
గౌస్తుభరత్నంబు గట్టిసేయు
పూఁడ కుండఁగఁ జెవిపుడకైన నిడుకొని
మకరకుండలములు మాటుసేయు
కటి ధగద్ధగిత మహాకనకచేలం బేల
మొలచుట్టు మొకపాటిముతుకగుడ్డ
తే. దొడ్డసరకులు తురకలు దోఁచుకొనినఁ
గష్ట మా కానివేళ జగత్కుటుంబి
వీవు వేషంబు చెడిన నీ కెట్లు గడచు, వైరి. 21

సీ. నామొ ఆలింపవు నారదగానంబు
వినుచుంటివో వేడ్క నీను లలరఁ
గరుణఁ జూడవు మమ్ముఁ గమలామహాదేవి
కన్నులు మూసెనో కౌతుకమున
మముఁ బ్రోవ రావేమి కమలభవాదులు
భక్తితోఁ బాదముల్ పట్టుకొనిరొ
ఆదరకలన మాటాడవు భూనీళ
లలరఁగా ముచ్చట లాడుచుండ్రొ
తే. యిట్టు లున్న ననాథల కేది దిక్కు
సమయమా యిది కేళికాసౌఖ్యమునకు
దుష్టుల వధించి ప్రోవు సాధువులనెల్ల, వైరి. 22
సీ. పాలీయ వచ్చిన భామిని ప్రాణంబు
లపహరించి చెలంగినట్లు గాదు
యాగోత్సవంబున కతిమోదమునఁ బిల్వ
నపుడు మామను ద్రుంచినట్లు గాదు
చేతగా కొకనరు చేతఁ జుట్టంబుల
నందఱఁ జంపించినట్లు గాదు
తుంగఁ గల్పించి యుత్తుంగవంశద్రోహ
మాచరించి చెలంగునట్లు గాదు
తే. పరబలం బిది నీప్రజ్ఞ పనికిరాదు
లెక్కకను మీన మేషము ల్లెక్కయిడక
చొరవతురకలఁ గొట్టఁగాఁ జొక్క లెదురె, వైరి.

సీ. అవని మూఁ డడుగు లి మ్మని వేఁడ నిచ్చిన
బలి నణంచిన దేమిప్రాభవంబు
ఇనకుమారుని మది కిచ్చకంబుగఁ బొంచి
వాలినిఁ జంపు టేపీలు నీకుఁ
గడు కాలయవనున కడలి యాముచుకుందు
పాలి కేతెంచు టేపౌరుషంబు
భువి జరాసంధుతోఁ బోరాడఁగా లేక
ద్వారకఁ జేరు టేధైర్యవృత్తి
తే. యేర నిజ మాడ నిష్ఠురం బౌ నటండ్రు
• కాక రోషంబు గలిగినఁ గఠినయవన
సేన నిర్జించి యీయాంధ్రసృష్టి నిల్పు వైరి.
సీ. నీరుహాఁ కొకా పకడోరె గద్దాయని
యాహితాగ్నుల నెత్తు లణఁచకుండ
పాముధో నేకు తుం పాని లారే యని
తివిరి శ్రోత్రియుల మర్దింపకుండ
ఘూసులారే అరే గాండూ యనుచు శిష్ట
తతులపైఁ బడి వడిఁ దన్నకుండ
కులితీ పకావు రే జలిదీ యటంచు మా
ధ్వుల మెడ వడిఁ బట్టి త్రోయకుండ .
తే. బహులహాలామదావిలపరుషయవన
రాజి నిర్జింపు నీవంటిప్రభువు గల్గ
బ్రాహ్మణుల కిన్నిపాట్లు రారాదు గాదె, వైరి.

సీ. అగ్రజపీడితుం డైనవిభీషణు
      రీవి ముక్తి దయఁ జూచినావుగావొ
అలమునిభీతుఁ డౌనంబరీషునియార్త
      నాదంబు మున్ను విన్నావు గావొ
బహుబాధితుం డైనప్రహ్లాదునకును ము
      న్నీవు ప్రత్యక్షమైనావు గావొ
ధ్రువముఖ్యు లైనభక్తుల నెల్ల మున్ను సం
      తసమున రక్షించినావు గావొ
తే. నాఁటిమది లేదొ కరుణ నన్గనవు వినవు
రావు బ్రోవవు వేగఁ బురాణపురుష
తాతతాతవు ముది మది దప్పినావొ, వైరి. 26

సీ. గ్రామంబు లన్నియుఁ గాల్చి దీపారాధ
      నలు చేసి రౌర యానందముగను
వడి సాధుజనులసర్వస్వమ్ముఁ గొని శఠ
      గోపంబు బెట్టిరి గురుతరముగ
పటఘటాదులు పోవఁ బ్రతిమాలువారి కే
      మియ్యక ఘంట వాయించి రహహ
పెద్దలకడ దుడ్డుపెట్టి ప్రసాదంబు
      వడ్డించి తగ పరవశులఁ జేసి
తే. రవుర యవనార్చకులు నీకు నాప్తు లైరి
భూసురులు సేయుపూజలు పోసఁగ వొక్కొ
అకట యిది యేమి పాపమునకు వెలువవు, వైరి.

సీ. వాసవ పిడుగులవానకు వెఱవవు
కడుఫిరంగిగుండ్ల కడల నేల
వెఱవవు భీష్మాదిభీష్మబాణాళికి
బాణాల కేటికి భయపడంగ
దవవహ్ని దిగమ్రింగితివి గాని జంకవు
భయ మేల యీయరబ్బులకు నీకు
గణియింప కధికరాక్షసుల శిక్షించితే
మ్లేచ్ఛుల నణఁచు టేలెక్క నీకు
తే. నీకలిమి నీ వెఱుంగవుగాక లోక
కర్త వగునీ కొకయసాధ్యకార్య మేది
పామరులు నవ్వకుండఁగఁ బరుల దఱుము, వైరి.
సీ. సమధికప్రేమచే శబరి యెంగిలిజేసి
యొసఁగినపం డ్లెల్ల మెసఁగి మెసఁగి
చెలఁగి కుచేలుండు జీర్ణచేలంబునఁ
బొదవుముక్కటుకులు బొక్కిబొక్కి
వనములోఁ బాంచాలి వండిన శాకభాం
డములోనిబలుసాకు నమలి నమలి
పొంచి యాదుగ్గనబోయనిపోటిలో
కొట్టిగింజలు కొన్ని కొఱికి కొఱికి
తే. పొంది తిప్పుడు భక్తుల పుణ్యమునను
భోగ మోయప్ప యీతిప్ప బోర్లపడిన
దేమిటిని మొద వరుల యుద్వృత్తినడవు, వైరి.

సీ. తను దానె కౌఁగిలించెను నిన్ను రుక్మిణి
యలసత్యయును పొలయలుక మానె
క్షణమైనఁ బాయదు జాంబవతీదేవి
మేనుమే న్గదియించె మిత్రవింద
భద్రయు భవదూరు భద్రపీఠిక నెక్క
వదలకుండె సుదంత వామకరము
కాళింది నిజపాదకమల మొత్తుచు నుండె
లక్షణ మెయితీఁగెలాగు చెనఁగె
తే. రాఁగ నోపవా పాశ్చాత్యరాడ్బలంబు
సాధుతతిఁ గొట్టి దోఁచగా చకితులయిరి
తుది పనికివచ్చెలే నీకు తురకగుద్దు, వైరి. 30
సీ. తపనీయకశిపుండు దండించు తరువాత
కాని ప్రహ్లాదునిఁ గావలేదు
కురురాజు పాంచాలికొప్పుపట్టీడిపిం
చినవెన్కఁగాని రక్షింపలేదు
కరిరాజు మొసలిచేఁ గడుకష్టపడినపి
మ్మటగాని వేంచేసి మనుపలేదు
పాండవు ల్బాధలఁ బడినయనంతరం
బునఁగాని సిరు లిచ్చి ప్రోవలేదు
తే. భక్తు లివ్వుడు కొన్నియాపదలఁ బడక
ముందు పోషింపవట్లయా కొందఱికిని
మును శిశువు నేడిపింపక ముద్దు రాదు, వైరి. 31

సీ. జడవిప్పి జులపాలు సవరింపు మిరువంక
బలుకిటికీదారుపాగఁజుట్టు
బొట్టు నెన్నుదుటిపై బొ త్తిగా దుడుచుకో
పోగు లూడ్పుము చెవు ల్బ్రాడవిడువు
వడిగ నంగీ యిజా ర్గొడుగు దట్టీ జుట్టు
కై జారుదోపు డాల్కత్తిఁ బట్టు
భీబినాంచారని బిలిపింపు వేగమే
తుద కభ్యసింపుమీ తురకభాష
తే. శక్తి లేకున్న నిట్టివేషంబు పూను
మన్న సరి లోకవంద్యుఁడ వైననీవు
నీచులకును సలాం సేయ నే సహింప, వైరి. 32
సీ. గోవర్ధననగంబు గొడుగుగాఁబట్టిన
నాఁడు కేలున నొప్పి నాఁటె నొక్కొ
సరిదెబ్బ లాడుచో జాంబవంతునిగ్రుద్దు
కోరెక్కలో గుట్లు పోరె నొక్కొ
నరునిసారథి వైననాఁడు భీష్మునిచేతి
కఱకుటమ్ముల బొమ్ము కవిసె నొక్కొ
దుగ్గన బోయనితూఁపు నాఁటినప్రక్క
గాయ మిప్పటికిఁ బోదాయె నొక్కొ
తే. యొక్కట యవనరాట్సేన జక్కజేసి
యుక్కణఁప నెందుచేత నీవోపలేవు
పేదపుం డెల్ల బయలను బెట్టవలయు, వైరి. 33

సీ. కనిపించుకోవుగా ఖలులు మార్గస్థులఁ
గొంకక ముక్కులుఁ గోయునపుడు
ఆలకింపవు గదా యయ్యయో ప్రజఘోష
ధూర్తులు వడినిళ్లు దోఁచునపుడు
జాలిగాదాయెగా చటులతురుష్కులు
భామినులను చెఱఁబట్టునపుడు
అలుక రాదాయెగా యవనులు సత్ప్రభు
వసుమతి ముట్టుకోవచ్చునపుడు
తే. మంకుతనమేమి మాతండ్రి మఱచినాఁడ
మాను నే గొల్లపాల్ద్రావ మందబుద్ధి
దేవకీదేవిపాల్ద్రావఁ దెలివిరాదె, వైరి. 34

సీ. అల విప్రభార్యయౌ నదితిపాల్ద్రావుట
బలి యాచనావృత్తి పాదుకొనియె
క్షత్రియకన్యయౌ కౌసల్యపాల్ద్రావ
రావణాదులఁ ద్రుంచి ప్రబలినావు
గొల్లయౌ నందుని కులసతిపాల్ద్రావఁ
బసులఁ గాచెడుబుద్ధి పట్టువడియె
నిసుమంతవిసపురక్కసిపాలు చవి చూడఁ
గాబోలు మాపట్ల కఠినవృత్తి
తే. పాలకాగ్రణి వైనగోపాలబాల
పాలబుద్ధులు మాని మాపాలగలిగి
పాలన మొనర్పవయ్య కృపాలవాల, వైరి. 35

సీ. జేగీ అరే అరబ్బీ పడో రే యని
బోడిసన్యాసులఁ బొడుచువారు
మత్రభో మూపరు మాటీ యనుచు వైష్ణ
వులబొట్లు దుడుచఁగ బోవువారు
పత్తరుకాయకు బందియా రే చోడు
దేవనిశైవులఁ దిట్టువారు
కాలటీకాతూ నికాల్దే వటంచు మా
ధ్వులఁ బ్రల్లదము లాడి త్రోయువారు
తే. వైరి యవనులు మిమ్ము ని ట్లడలఁజేయ
నట్టివాండ్రకు ద్విజులెంతయాగడ గుడి
మ్రింగువానికి లింగ మూర్చిండి వడెము, వైరి.
సీ. విషవహ్నిఁ బ్రజకెల్ల వెతఁజేయు కాళీయు
పడగలు వడిఁ ద్రొక్కుపటిమ యేది
వడిగ బిడౌజుండు పిడుగులు వర్షింప
శైలమె త్తిననాఁటి శక్తి యేది
దుర్యోధనాదులు దొరకించుకొను వేళ
విశ్వరూపముఁ జూపువింత యేది
మురనరకాది ముష్కర దుష్కరాదుల
మర్దించి చెలఁగు నీమహిమ యేది
తే. యిట్లు ఖలులేచ దీనుల నెన్నఁటికిని
గరుణఁజూచెదు కలవాఁడుగాదెఁ దీయు
దనుక బీదలప్రాణముల్ తాళపట్లు, వైరి. 37

సీ. ఆభీరగృహముల నారఁ గాఁగినపాల
మీఁగడ ల్వడి దిగమ్రింగఁగలవు
తల్లియిచ్చిన చల్ది తగ బ్రహ్మవచ్చిన
వెనుకఁ జూడక వేగ విసరఁగలవు
రాధికామధురాధరామృతధారలు
గుటుకుగుటుక్కునఁ గ్రోలఁగలవు
భక్తులెల్లను దిరుపణ్యారము లొసంగఁ
జెలఁగి లోలోన భక్షింపఁగలవు
తే. గాని యవనులపై వడి బూనలేవు
కబళ మన నోరుఁ దెఱతువు కల్లె మన్న
మోము ద్రిప్పుహయగ్రీవమూర్తివహహ, వైరి.
సీ. అల విభీషణుపల్కు లాదరించినవాఁడె
యతిదుష్టుఁడౌ రావణాసురుండు
వసుదేవముఖ్యులవరబోధ వినియెనే
దుండగీడైన కంసుండు నాఁడు
విదురాదిబుధుల వివేకము ల్దెలిసెనే
క్రోధాత్ముఁడైన దుర్యోధనుండు
భీష్మాదు లెంతచెప్పిన నిచ్చగించెనే
బాలిశుఁ డగు శిశుపాలకుండు
తే. కొట్టకుండఁగ ధూర్తుల పట్టిశాంతి
తాలిమేటికి తురకలు తరిమి రాఁగ
నొదిగిచూచెదు కలిబోయ నుట్లదిక్కు, వైరి.

సీ. నిదురించినావో నిర్నిద్రభద్రాకార
కలితభోగీంద్రభోగంబుమీఁద
శయనించినావో శైశవమూర్తితోఁ బయః
పాథోధి పటువటపత్రసీమఁ
బవళించినావో శ్రీభామినీదోర్మూల
కూలంకష స్తనకుంభయుగళిఁ
బడక గావించితో భక్తసమ్రాణ్మన
స్సంకల్పితానల్పశయ్యయందు
తే. నిబిడ పాశ్చాత్యభీతులై నిఖిలజనులు
కదసి మొఱవెట్ట నీకెట్లు నిదురవట్టె
లెమ్ము నాసామి జాగేమి చిమ్ము రిపుల, వైరి.

సీ. నినుఁబూజఁ గావింప ఘనవిప్రు లేటికి
గోడువ గాకుండ సయ్యదులె కలరు
వినుతింప శాస్త్రజ్ఞవిద్వాంసు లేటికి
వీలుగావించు మౌల్వీలె కలరు
ఆత్మకీర్తనఁజేయ హరిభక్తు లేటికిఁ
గేకలు వేయ పకీర్లు కలరు
పూతాత్ము లగు నను ష్ఠాతలు నీకేల
తఱుచుగా పీరుజాదాలె కలరు
తే. వట్టియాసల నిటు మెడ వట్టి త్రోయ
చూరు వట్టుకొ వ్రేళ్లాడినార మిట్టి
ముచ్చటకె నీవు పశ్చిమముఖుఁడ వౌట, వైరి.

సీ. జయవిజయీభవ జగదవనాసక్త
జయవిజయీభవ శౌర్యయుక్త
జయవిజయీభవ శాశ్వతకళ్యాణ
జయవిజయీభవ నయధురీణ
జయవిజయీభవ సర్వాంకషప్రజ్ఞ
జయవిజయీభవ సన్మనోజ్ఞ
జయవిజయీభవ సాధుజనాధార
జయవిజయీభవ భయవిదూర
తే. యనుచు జయవాక్యముల జను ల్వినుతి సేయఁ
జక్రహస్తుండవై రిపుక్షయ మొనర్చి
ధరణిఁ బాలింపు మాచంద్రతారకముగ, వైరి.
సీ. చాటక పోఁ జుమీ చాలఁ బ్రోవకయున్న
నాఁటివ్రేపల్లెలో నాఁటిమాట
ప్రకటింతుఁ జుమి మమ్ము రక్షింపకుండినఁ
దగఁ గొల్లచెలుల వస్త్రములమాట
దాఁచను జుమి మమ్ముఁ దరిఁజేర్పకుండినఁ
గొంకక మధురలో కుబ్జమాట
బైటఁ బెట్టెద జుమీ పాలింపకుండినఁ
గాలయవనునాఁటి కానిమాట
తే. మర్మమెఱిఁగినవారితో మానువాదు
బైసి బోఁగొట్టుకోకు మాపాలఁ గలిగి
సాధురక్షణ దుష్టశిక్షణ మొనర్పు, వైరి. 43

సీ. ఖలవధార్థమునందు నిలయ మొందితి వంటి
నలవెన్నదొంగిలి తనుట లేదు
లక్ష్మియా రుక్మిణీలలనఁ గూడితి వంటి
నలరాధ మరఁగితి వనుట లేదు
అవనిఁ బాలింపఁగా నవతరించితి వంటి
పశుపాలకుఁడ వని పలుకలేదు
దుష్టులౌ రాజదైత్యుల హరించితి వంటి
నల నరసారథి వనుట లేదు
తే. అయ్యయొద గాడ నామాట లనకమున్నె
ఖలుల వధియించి నీసిగ్గు నిలుపుకొమ్ము
పరులు నవ్వఁగ నపకీర్తిపాలుగాక, వైరి. 44

సీ. గ్రామదాహకకర్మగతి మానుపు మటన్న
వెస నదే మఱియుఁ గావింపె దీవు
పథికులఁ దోపించు పగ మానుపు మటన్న
వెస నదే మఱియుఁ గావించెదీవు
చెఱలు జూఱలువట్టు సేఁగి మాన్పు మటన్న
వెస నదే మఱియుఁ గావించెదీవు
బహుసస్యనాశనార్భటి మానుపు మటన్న
వెస నదే మఱియుఁ గావించెదీవు
తే. వేఁడుకొనుకొద్ది లావాయె వెఱ్ఱివాఁడ
మోడ ముంచకు మనురీతి యొనరె మాకు
బుద్ధిదెచ్చుకొ యవనుల పొంకమణఁచు, వైరి.

సీ. మామిడిచిగురుసొం పేమిలక్ష్యం బన
కరచరణాంబుజకాంతి వెలుఁగఁ
గలకలనవ్వు చక్కనిముద్దునెమ్మోము
పద్మసౌభాగ్యంబుఁ బరిహసింపఁ
వెలిదమ్మిరేకుల వెలవెలఁ బోఁజేయు
సోగకన్నులచూపు చోద్యపఱుప
నిద్ధంపు నునుఁజెక్కుటద్దంబులందుల
మొలకనవ్వులతేఁట ముద్దుఁగులుక
తే. నపుడు బుట్టిన పసిబిడ్డఁ డనఁగఁ బాల
కడలిమఱ్ఱాకుపైఁ బండి కరుణ జగముఁ
బ్రోతువఁట మమ్ముఁ గావవిప్పు డదియేమి, వైరి.
సీ. పుడమిపై నడుగిడి నడువనేరనివారి
తీవ్రతఁ బరువు లెత్తించినావు
పైమీఁదిదుప్పటి బరు వనువారిచే
మించైనమూట మోయించినావు
గడపదాఁటని కులగాంతామణుల పృథ్వి
నెల్లెడఁ గలయఁ ద్రిప్పించినావు
షడ్రసోపేతాన్నసంభోక్తృజనపరం
పరఁ బలుసాకుపాల్పఱచినావు
తే. భళిర యఘటనఘటనప్రభావ మెల్ల
దీనజనులందె చూపితి దెలిసి వచ్చె
నయ్య సామెల్లనింటనే యన్నమాట, వైరి. 47

సీ. భవదీయముఖభవ బ్రాహ్మణోత్తములకా?
యవనులచేత నాయాసపడుట
భవదీయబాహుసంభవ రాజవరులకా?
మ్లేచ్ఛనాథుల గెల్వలేక యుంట
భవదూరుసంభవ బహువైశ్యకోటికా?
తురకలచే నిట్లు దోపుఁ బడుట
భవదీయపాదసంభవ శూద్రజనులకా?
విమతులౌ తురకల వెట్టిచేత
తే. మాకుఁ జెప్పను మెత్తైన మంచిదిగద
లోకకర్తకు నపకీర్తి నీకు వచ్చు
వలదునాయన్న యిఁకనైన నఖిలులనణఁచు, వైరి. 48
సీ. రాఘవమమ్ముబ్రోవ రావయ్య ఖగయాన
రాకున్న మీదశరథునియాన
శీఘ్రంబు మమ్ము రక్షింపు శేషశయాన
జాగు చేసినను గౌసల్యయాన
మది కఠినత మాని మనుపుము మాయాన
మనుపకున్న వసిష్ఠమౌనియాన
పాలింపు మమ్ము నీపరమసత్కృపయాన
పాలింపకున్న శ్రీభామయాన
తే. యాన బూన సమర్థుఁడ వఖిలజగము
నానదప్పక పోషింపుమా నతారి
తగవు దప్పి నటింపఁగా ధర్మమగునె, వైరి. 49

సీ. అరులఁ గొట్టక సింహగిరి గుహఁ డాఁగిన
నవని నిల్చి బ్రతికివాఁ డందురయ్య
నీవు రక్షింపక నీలాద్రి కేగిన
నవనిని న్మోండివాఁ డందురయ్య
పోషింపఁగాలేక శేషాద్రి కేగిన
నతిలోభి వనుచు ని న్నందురయ్య
తగనాదరింప కంతర్వేది కేగిన
నత్యుగ్రుఁడంచు ని న్నందురయ్య
తే. నాథ! యిటు లోకనటనం బొనర్చునీకు
నహహ నిందలు వచ్చును నదియు విడిచి
యొడ్డుకొనఁబోకు వెసఁ బ్రోవు మర్విజనుల, వైరి.

సీ. అరిసైన్యధూళి సూర్యాక్రాంతమై మించె
నింక నేమి దయఁ జూచె దీవు మమ్ము
పరభేరిభాంకృతు ల్పగలించె దిశల నిం
కేమినామొఱ విని యెదవు నీవు
ధరశత్రుహరిఖురదళితమయ్యె నింకేమి
వచ్చెదవయ్య ప్రోవంగ మమ్ము
వైరితేజము శిఖివారగా నింకేమి
మొగమునఁ జూచెదు జగతిజనులు
తే. నీపయికి వచ్చునప్పుడు నీవెఱుంగ
వేమి మసలకు మింక దిక్కేది మాకు
జాగరూకుఁడవై రిపుక్షయ మొనర్పు, వైరి. 51

సీ. ప్రజలెల్ల పిసికిరి పాశ్చాత్యరాట్చమూ
భీతులై మిమ్ముఁ బిలిచి పిలిచి
జనులు వేసారిరి సమదతురుష్కుల
వెతలచే మిమ్ముల వేఁడి వేఁడి
నరులెల్ల స్రుక్కిరి నానాయవనహృత
ముఖ్యార్థులై మిమ్ము మ్రొక్కి మ్రొక్కి
ప్రాణిసంతతి భంగపడియె ఖానులు సేయు
దరిలేని వెత మిమ్ముఁ దలఁచి తలఁచి
తే. యిందుఁ గలఁ డందు లేఁ డనుసందియంబుఁ
జెందవల దన వేదవాగ్బృంద మెల్ల
నెందు వెదకినఁ గానరావేమి యిపుడు, వైరి. 52

సీ. బహుఫణాదీప్తుఁడౌ ఫణిరాజుపైఁ బండి
గాలివారక యుండఁ గాచెదీవు
వరగరుద్వ్యాస్ఫురద్గరుడునిపైఁ జెంది
చిరసుఖగతుల రక్షించెదీవు
వేత్రాధిగతజగద్వ్రాతతివిష్వక్సేను
దరిఁ జేర్చి బలయుక్తిఁ దనిపెదీవు
ఘనభుజాబలవంతు హనుమంతు నెదఁ జేరి
యొలమి బ్రహ్మానంద మిచ్చెదీవు
తే. పొసఁగ నీరీతిఁ దలపోయ పొడుగు చేతి
వాని పణ్యార మాయెగా దీనపాల
పృథుబిరుదలీల యేమూలఁ బెట్టినావు, వైరి.

సీ. మామొఖాసాకు గ్రామంబు లిమ్మనలేదు
కొంపలు గాల్పింపకూడ దంటిఁ
గరిహయాదుల మేను గాంక్షింపఁగాలేదు
గోవధ మాన్పించి బ్రోవు మంటి
మాకు మిమ్ములను సామ్రాజ్య మిమ్మనలేదు
జనులను దోఁపింపఁ జనదటంటి
స్వామి మాకొఱకేమి కామింపఁగాలేదు
క్షితిలోనఁ బ్రజల రక్షింపుమంటిఁ
తే. తెలఁగి నీపదసేవలు జేయుమాకు
వేఱకోరికలేటికి వెన్నగలుగ
సహహా నేటికి నేతికి నంగలార్వ, వైరి. 54

సీ. భక్తసంరక్ష కృపాపర జలజాక్ష
నరహరి గోవింద హరి ముకుంద
సంసారతారక సజ్జనాధారక
సత్యసంకల్ప శేషాహితల్ప
నీలాంబుదశ్యామ నిఖిలదైవలలామ
సర్వపాపవినాశ జగదధీశ
శ్రీరమానాయక శ్రితఫలదాయక
శృంగారదరహాస చిద్విలాస
తే. భవదచలపాదగతులైరి యవను లయయొ
అలుక మానక తరుమువాం డ్రంద సికయు
నందకుండినఁ గాల్బట్టుకొందురయ్య, వైరి. 55

సీ. దశకంఠకంఠమర్దనదుర్దమాటోప
రామనామకమౌ ఫిరంగిదెబ్బ
తతమేఘనాదభేదకమోదలక్ష్మణ
ప్రకటనామకమౌ ఫిరంగిదెబ్బ
ఖర హిరణ్యాక్షశిక్షకరూక్ష నిజనృహ
ర్యక్షనామకమౌ ఫిరంగిదెబ్బ
కుంభినీభరణ విజృంభణ శ్రీకూర్మ
రమ్య నామకమౌ ఫిరంగిదెబ్బ
తే. తగిలివచ్చియుఁ జావక ధరణి దిరిగె
యవనబలము సుదర్శనాహతను హెచ్చుగ్ర
రాహువన నట్లుగాకుండ రహిఁజయింపు, వైరి.
సీ. గ్రామముల్ నిర్ధూమధామము లాయెను
సస్యంబులెల్ల నాశనముఁజెందె
దొడ్లలో శాకముల్ దుంపశుద్ధిగబోయె
దోచిరి సర్వంబు గోచిదక్క
చెట్టొక్కపిట్టయై చెదరిరి దిక్కుల
బలువెతఁ బడరానిపాట్లు బడిరి
యన్నమందఱకును నమృతోపమంబయ్యె
వరుసగా నటమీఁద వానలేదు
తే. ప్రజలపసతీఱె నీకమొద ల్పదిలమయ్యె
దరిదరికివచ్చె నిదె మెందుతురక దండు
చిత్తమునఁ జూచుకోవయ్య శీఘ్రబుద్ధి, వైరి.

సీ. శ్రీదేవి మఱి తను జేరరానీదని
భూదేవి వదలక పొదివె ననఁగ
మోక్ష ధనంబని మునులు మహాపేక్ష
చేతిని క్షేపంబు జేసి రనఁగ
భక్తాగ్రగణ్యుఁడౌ బలిపూజ సేయఁగా
బలిసద్మముననుండి వెలసె ననఁగ
బ్రహ్మాది హృదయసారసములతోడ దాఁ
గుడుమూఁత లాడుచుండెదు ననంగ
తే. ధరణి గుప్తములైన పాదములతోడఁ
బాఱిపోలేవుగద యేది బ్రతుకుత్రోవ
పౌరుషముచాలదుతురుష్కబలముద్రుంప, వైరి.

సీ. నిఖలవిశ్వంబును నీయందణఁగియుండు
విశ్వంబులో నీవు వెలసినావు
విశ్వరూపకుఁడవు విశ్వమయుండవు
విశ్వసాక్షివి విశ్వవిభుఁడ వీవు
విశ్వసర్గస్థితివిదళనకరుఁడవు
విశ్వంబునకు నీకు వేఱు లేదు
కినుక విశ్వద్రోహ మొనరించు దుష్టుల
శిక్షించి ప్రజల రక్షింపవేమి
తే. యింతబతిమాల మాకేల యెట్లులైనఁ
గాని శుభకంద కందకు లేని దూల
బచ్చలికి నేలగల్గునో పరమపురుష, వైరి. 59

సీ. ఉరమున శ్రీదేవి యొఱపైన మెఱుపుగా
గంభీరవాగ్ధార గర్జితముగ
హారమౌక్తికకళ లల వడగండ్లుగా
భ్రూలత హరిచాపలీల మెఱయ
కోరిక భక్తమయూరముల్ నటియింప
దీనచాతకపంక్తి తృప్తిఁ జెందఁ
దనువనప్రభ దశదిశల్ నిండఁగా
పృథివీస్థలిని కృపావృష్టి నించి
తే. సత్ప్రజాసస్య సంరక్షసలుప నిది యె
సమయ మోయయ్య యిఁక మాను జాగుసేయ
నన్నుఁ గన్నయ్య రక్షింపు నల్లనయ్య, వైరి. 60

సీ. నిడుదకడానిశాల్నడుమున బిగియించి
తీరైన గండపెండేర మూని
రమణీయమణిశిరస్త్రాణ మౌదలఁ బూని
స్ఫుటవజ్రమయమైనజోడు దొడఁగి
తూణంబు లిరువంక తోరణంబుగఁ గట్టి
విలసితశరమైన విల్లుబట్టి
పరవైరిహరమైన తరవారి ధరియించి
డాపల చికిలికటారి చెక్కి
తే. రామవేషంబుతో సుమిత్రాసుతుండు
నీవు రణరంగమున నిల్చి నిబిడశత్రు
జాలముల నేల పాల్సేయులీల నెఱపు, వైరి. 61

సీ. గాధేయయజ్ఞవిఘ్నకరాసురావళి
జక్కఁజేసినయట్టి శౌర్యనిధివి
పరవీరభీకర పరశురాముని పరా
క్రమము బెండుగఁజేయు ఘనభుజుఁడవు
పదునాల్గువేల దుర్మదరాక్షసులతోడ
ఖరుని మర్దించిన వరబలుఁడవు
బంతులాడినరీతి పంక్తికంఠునితల
ల్ఖండించు చండప్రచండరుచివి
తే. నీకు నొకదొడ్డకార్యంబె నీచయవన
సేన నిర్జించుపని ప్రజ ల్చెరికొనిన
కర్మమున నీదుచిత్తంబు కరఁగదాయె, వైరి. 62

సీ. కోటిసూర్యోజ్జ్వలత్కోటీరమణులతో
రమణీయ మణికుండలములతోడ
శంఖ చక్ర గదా సి శార్ఙ్గాయుధములతోఁ
బ్రస్తుతప్రభ కౌస్తుభంబుతోడ
వలిపెబంగరువల్వ వలెవాటునీటుతోఁ
బొక్కిలితామరపువ్వుతోడ
గంగను గన్న చక్కనిపదాబ్జములతో
మిసిమి చామనిచాయ మేనితోడఁ
తే. బక్కిగుఱ్ఱంబుమీఁదను నెక్కి నాదు
మ్రొక్కుఁ గైకొని శౌర్యంబు పిక్కటిల్ల
నొక్కట యవనరాట్సేన జక్కసేయు, వైరి.

సీ. దండంబు నీకు నుద్దండ తేజశ్చండ
జోహారు భక్తదుర్మోహ నాశ
మ్రొక్కెద గొను జలముక్కాయరుక్కాంత
వందనం బిదె చిదానంద కంద
నుతిజేతు శతధృతిస్తుతియుతోన్నతచర్య
ప్రణతి జేసెద మునిప్రణుత చరణ
సాష్టాంగ మిదె నీకు సాష్టాపదాంబర
కేలుమోడ్చెద జగత్కేళిలోల
తే. వలదు వలదు పరాకు భావమున నీకు
దీనజనముల కృపబ్రోవ దిక్కునీవ
దుష్టుల వధించి పోషింపు శిష్టజనుల, వైరి. 64
సీ. గరుడాచలంబుపై కడఁకతో వసియించి
సత్యభామాతటిచ్ఛాయ నలరి
వరచాప మనియెడిహరిచాప మమరించి
వివిధభక్తులఁ గృపావృష్టి ముంచి
అమర మయూరవారము మోద మందించి
దీనచాతకముల దృప్తి నించి
తుత్రకన్యాకామసస్యము ల్పండించి
జగములు చల్లనై నెగడఁజేసి
తే. నవఘనస్ఫూర్తిచే మురనరక ధేను
ఖర దవానల మార్చిన కడఁక నిపుడు
రిపుల శిక్షించి రక్షించు పృథివి జనుల, వైరి.

సీ. నీపాదరజమున నిమిషంబులోపల
బాపురే సతియయ్యె చాపఱాయి
నీబాహుబలమున నిలవక పెళ్లిన
ముక్కంటిచాపంబు ముక్కలయ్యె
నీయాజ్ఞచే గిరుల్ నీటఁ దేల్పఁగ దేలె
కడఁక సముద్రంబు గట్టువడియె
నీప్రతాపాగ్నిచే నిఖిలరాక్షసకోటి
మాడి దోమలపోల్కి మడసిపోయె
తే. బాగులే యిట్టినెరవైనప్రాపు గల్గి
యల్పులకు లొంగి తిరుగలేనయ్య మేము
కర్మమా మాకు గజమెక్కి కంత దూర, వైరి.

సీ. మున్ను తాటకప్రాణము ల్గొన్నబాణంబు
మెఱసి సుబాహు దున్మిన విశిఖము
మించి విరాధు ఖండించిన ప్రదరంబు
ఖరదూషణాది సంహారణశరము
మాయలమారీచు మద మణంచిన తూపు
ఘోరకబంధునిఁ గూల్చుచిలుకు
వాలిని బలశాలిఁ గూలనేసినకోల
జలధి నింకించిన సాయకంబు
తే. రావణాది మహాసురరాజి నణఁచు
చండకాండంబు లేమాయెఁ జటుల యవన
ఖండనముసేయ నయ్యంబకములఁ బఱపు, వైరి.

సీ. ఖల హిరణ్యాక్ష ముఖ్యులనెల్ల ఖండించి
దేవతాతతిఁ బ్రోచు దివ్యమహిమ
రావణ కుంభకర్ణ ప్రముఖులనెల్లఁ
గొట్టి మానులఁ బ్రోచు దిట్టతనము
శిశుపాలకాది దుశ్శీలురఁ బరిమార్చి
క్షితి దీనజనుల రక్షించు కడఁక
కంసాది దుష్ట విధ్వంసనం బొనరించి
ధరణి పాలించు నుదార కరుణ
తే. వినుటయే కాని కన్నులఁ గనుటలేదు
కంటి మిప్పుడు యవనుల గర్వ మణఁచి
ప్రజల రక్షించు నీదుప్రభావమెల్ల, వైరి. 68
సీ. కారుణ్యదృష్టిచేఁ గనిమమ్ము రక్షింప
నీరజేక్షణ నేఁడు నీవు బంపఁ
బారసీకుల దండుపైఁ గొండలో నుండి
గండుతుమ్మెదలు నుద్దండ లీలఁ
గల్పాంతమున మిన్ను గప్పి భీకరమైన
కాలమేఘంబులు గవిసినట్లు
దాఁకి ఘోరున రక్తధారలు గురియఁగా
గఱచి నెత్తురుపీల్చి కండలెల్ల
గీ. నూడిపడ నుక్కుమూతుల వాఁడి మెఱసి
చించి చెండాడి వధియించెఁ జిత్రముగను
నాకొకని చుట్టుముట్టిబల్ మిక్కుటముగ, వైరి.

సీసపద్యగీతము.

అరులఁ బరిమార్చి వైశాఖపురసమీప
గిరిబిలంబున డాఁగె బంభరములెల్ల
అదిమొదల్ తుమ్మెదలమెట్ట యంద్రు దాని
వైరి హర... 70

సీ. జయమాయె యవనరాట్సంతమసము బాసె
భవదీయభాస్వత్ప్రభాబలమున
భువనజాతంబులు పొలుపుచేఁ జెన్నొందె
దిక్చక్రములు చాల తెలివి నొందె
కమలజాదులనుతు ల్గణన సేయని నీవు
లీల నామనవి చెల్లించినావు
బ్రహ్మాండభాండ సంభరణలీలాఘను
నిల నిన్ను మెచ్చి యేమియ్యఁగలను
తే. తోఁచ దిఁక నెట్టు లిదె నాకు దోఁచినట్టు
తులసిదళ మొక్కటిత్తు సంతోష మొందు
మదియె యగణితపూజగా నవధరింపు, వైరి. 71

సీ. అపరాధి నపరాధి నార్తరక్షణదక్ష
యపరాధి నపరాధి నంబుజాక్ష
యపరాధి నపరాధి నద్భుతగుణధుర్య
యపరాధి నపరాధి నధికశౌర్య
యపరాధి నపరాధి నంభోధిగంభీర
యపరాధి నపరాధి నత్యుదార

యపరాధి నపరాధి నానందపరిపూర్ణ
యపరాధి నపరాధి నభ్రవర్ణ
తే. నేర్పుయైనను మిక్కిలి నేరకైన
నిష్ఠురోక్తులు పల్కితి నిన్ను నాదు
తప్పు సైరించి దాసుని దయదలంపు, వైరి. 72
సీ. వీరాధివీరుఁడ వై రాజిలెదునిన్ను
బిఱికివాఁడంటిని భీతిలేక
జగదేకవితరణాశ్రయమూర్తి వగునిన్ను
బహులోభి వనుచును పలికినాఁడ
పరిపూర్ణ కరుణాస్వభావుండ వగునిన్ను
నిర్దయుం డంచు నిందించినాఁడ
నద్భుతానందకళ్యాణగుణుండ వౌ
నినుఁ గూర్చి పలికితి నిర్గుణుఁ డని
తే. యలుక జనియించి దుష్టుల నణఁచుకొఱకుఁ
బడుచుఁదనమున నిటులంటి భక్తవరద
మదపరాధసహస్రముల్ మది క్షమింపు, వైరి.
సీ. పరమమోహాంధుఁడఁ బాపస్వభావుండ
దుశ్శీలపరుఁడను దుర్మదుండ
దుష్కామయుక్తుండ దుర్మార్గసక్తుండఁ
గ్రోధాంతరంగుఁడ కుటిలమతిని
లోభిని యింద్రియలోలుండఁ జపలుఁడ
దంభవృత్తుండ మాత్సర్యయుతుఁడ

దుష్టుండ దుస్సంగదూష్యుండ శమదమ
హీనుఁడ శౌర్యవిధానపరుఁడ
తే. నైన శరణొందితిని నన్ను నాదరింపు
సజ్జనునకైన మిగుల దుర్జనునకైన
సౌఖ్య మొసఁగదె కల్పవృక్షంబు నీడ, వైరి. 74
సీ. తేనమో రక్షితదేవతాయ సురేంద్ర
సేవితాయ మునీంద్రభావితాయ
తేనమో నిత్యసుధీరతాయ సుమేరు
ధీరతాయ యశుభవారణాయ
తేనమో నిర్జితదీనతాయ భృత్యాత్త
మానవాయ దళితదానవాయ
తేనమో జ్ఞానసుధీహితాయ స్మరాయు
తాకృతాయ బుధోరరీకృతాయ
తే. పాహి మాం పాహి మా మనన్యథాహి నాస్తి
శరణ మరుణాబ్జదృక్కోణకరుణ యనుచు
వందనము చేసికొలుతు భావముననిన్ను, వైరి.
సీ. స్నాన సంధ్యాద్యనుష్ఠాన శక్తుఁడఁగాను
పరమ యోగాభ్యాసపరుఁడఁగాను
విమల దివ్యక్షేత్ర గమనదక్షుఁడఁగాను
ఘన వరదాన సంగతుఁడఁగాను
భవదీయ పదపద్మ భక్తియుక్తుఁడఁగాను
నిరుపమజ్ఞాన మానితుఁడఁగాను

పరమోపకార సంభరిత చిత్తుఁడఁగాను
శమదమ సత్యనిశ్చలుఁడఁగాను
తే. వినుము దీనావన యనాథజనుఁడనయ్యా
నేను మిక్కిలి తెలియఁగా నేరనయ్య
దేవ నిర్హేతుకృప నన్నుఁ బ్రోవవయ్య, వైరి.76
సీ. ధరణి గుప్తంబైన చరణయుగ్మముతోడ
వలరారు పక్కగాయంబుతోడ
రమణీయమైన వరాహాననముతోడ
ఘనతలఘాలలోచనముతోడ
నిగనిగలాడుబల్విడుదకీల్జడతోడ
నవ్యగోక్షీరవర్ణంబుతోడ
మైనిండ నలఁదిన మంచిగంధముతోడ
నమితభక్తానుగ్రహంబుతోడ
తే. నఖిలలోకావనము సేయ నవతరించి
యున్నమిమ్ముల వినుతింప నోపలేరు
హిమకర కిరీట ముఖులు నేనెంతవాఁడ, వైరి.77
సీ. సోమకాభిఖ్యరక్షోనేత ధృతిచేత
నామ్నాయజాతము లపహరించి
మత్స్యనదీనాథమగ్నుఁడై డాఁగిన
తత్తలు దునిమి వేదములు మఱల
ధాత కొసంగఁగాఁ దలఁచి నీ వలమత్స్య
మూర్తివౌటను దపస్ఫూర్తివేళఁ

దొడరి ధీవరులు సద్గుణజాలముల నెంచి
నిలుపుదు రాత్మమందిరము లందుఁ
తే. గాన నినుభక్తిరసపూరకలితలలిత
మామకీనమనస్సరోమహితుఁ జేతు
శీఘ్ర మిష్టమొసంగ వేంచేయుమయ్య, వైర.
సీ. చలువగాఁ బన్నీట జలకంబు లొనరించి
విలువలేని కడానివలువ గట్టి
కలికిమానికములఁ గులుకుగద్దియ నిల్పి
తిలకంబు నొసటఁ జెన్నలర దిద్ది
కలపంబు మైనిండ నలఁది బల్మగరాల
తళతళలాడుసొమ్ములు ధరించి
యలరు నెత్తావిదండలు వీలుగా వేసి
కలిత రసాన్న మింపాలయఁ బెట్టి
తే. విడె మొసఁగి పదముపడుదు వేడ్కతోడఁ
బవ్వళింపుము మన్మనఃపద్మశయ్య
నల రిపుల నెల్లమర్దించి యలసినావు, వైర. 79
సీ. భువనము ల్కుక్షిలోఁ బూని రక్షించి తా
భువనంబులో నిక్కముగఁ జరింతు
పరమాణురూప విభ్రాజమానుఁడవయ్యు
తామేటిరూపంబు దాల్పనేర్తు
వసుమ వైరాగ్యమానసుఁడవయ్యు వినోద
గతితోన సుందరాగము ధరింతు

వతినిర్భరాత్ముఁడవై వెలిఁగియు నీవ
నంతరూపంబు ధరింతు వెప్పు
తే. డనుచు లోకోపకారార్థ మవతరించి
మించి యాక్రియ లొనరించి మిగులఁ జెలఁగు
కూర్మనాయక నన్నేలుకొనఁగదయ్య, వైరి. 80

సీ. అతితిగ్మరుచి మండలాతీయుగ్మచ్ఛాయ
వలయాద్రిదావాగ్నివలె వెలుంగ
రిక్కించ తనురుహశ్రేణి గాడినయఖం
డాళిసూచ్యగ్రముక్తాంచితముగ
గురుదిశాభేదక ఘుర్ఘురధ్వని తీయ
స్తనయిత్ను గర్జకుం జదువు చెప్ప
పదఘట్టనల జిమ్ము ప్రళయోదకము నభ
స్థ్సలము నామ్రేడితార్థముగఁ జేయ
తే. కిటితనువుతో హిరణ్యాక్షు గీటణంచి
క్షమధరించితి చర్వణసమయ లగ్న
మేఘశకలంబుగతి దంష్ట్రిమీఁద నడర, వైరి.

సీ. నతి జేతు నిదె నీకు నాసికానిస్సృత
ఝంఝానిలోద్ధూత శైలజాత
వందనం బిదె నీకు బ్రహ్మాద శుక పరా
శర ధీర హృదయగహ్వర విహార
సాష్టాంగ మిదె నీకు స్వర్భానుహిమధామ
జైత్రప్రతాప నృసింహరూప

మ్రొక్కెద నిదె నీకు క్రూరసంహారక
సాగరపూర శోధారకరుణ
తే. పాలన మొనర్చు నఖరకుద్దాల దళిత
కనకకశ్యప ముఖ్యదానవ విదళన
జాతకీలాల పరితృప్తభూతనివహా, వైరి. 82
సీ. దేవతాతతికోర్కి దీర్పఁగా సమకట్టి
జనకతార్థికిఁ గశ్యపునకు బుట్టి
యుదుటుగా నుదుట మృదూర్ధ్వపుండ్రముఁ బెట్టి
కింశుకదండంబుఁ గేలఁ బట్టి
పసపునిగ్గులుదేరు పచ్చగోచియుఁ గట్టి
మధ్యస్థలంబున మౌంజిఁ జుట్టి
వర్ణనీయద్విజవర్ణి వై పొడకట్టి
బాలార్కశత శతాభ గనుపట్టి
తే. ధరణి గగనము రెండుపాదములు మట్టి
మఱి తృతీయాంఘ్రి నబ్బలి మట్టినట్టి
వామనప్రేమ నామనస్సీను నుండు, వైరి. 83
సీ. కార్తవీర్యార్జున కరచయారణ్యంబు
దారుణాగ్రకుఠారధారఁ దునిమి
చిరతరక్షత్రియ క్షేత్రముల్ సొంపుగా
భీమశుహాలములఁ బెగడ దున్ని
తన్నృపమస్తకతతులు గుట్టలు వైచి
మిగులచిత్రంబుగా మెట్లుగట్టి

తత్తను కీలాల ధారాసరిత్తుల
నవనవంబులుగఁ గాలువలు దిద్ది
తే. ఘనయశస్సస్య మవని యాకసము నిండఁ
బ్రబలఁజేసితి వౌభళీ పాదుకొనిమె
భావిహాళమూర్తి పరశురామావతార, వైరి.
సీ. మనువంశభూషణ మహిమచేఁ జెన్నొంది
ఘనకళాసాంగత్యకలనఁ జెంది
సకలసాయకవర్ణసంగతి నింపొంది
సద్గుణరీతి ప్రశస్తినొంది
యత్రాసపటల లీలాత్మతఁ జెలువొంది
నిర్దోషగతులచే నెరవుఁజెంది
సకలజగన్నుతసంపదఁ జెన్నొంది
సుకుమారరత్నసంశుద్ధి నొంది
తే. సరస దశరథపత్ని కౌసల్యగర్భ
మనెడుగనియందు హరినీల మన జనించి
రామసంజ్ఞ మెలంగు నిన్ బ్రస్తుతింతు, వైరి. 85
సీ. ఫణిరాజశయ్యపై బవ్వళించెడునీవు
పండితి కౌసల్య పక్కలోన
బ్రహ్మాండగోళముల్ బ్రాకియాడెడునీవు
రహిఁ బ్రాకితివి దశరథునియింట
బహు వేదశాస్త్రప్రభావుండవౌ నీవు
నవ్యక్తవాక్యము లాడినావు

సకలచరాచర సంచారి వగునీవు
మహిఁ దప్పటడుగుల మసలినావు
తే. తల్లిభాగ్యముననొ తండ్రితపము గతినొ
పురజనంబుల తొల్లిటి పుణ్యముననొ
భూవ్రతంబుననో యిట్లు బుట్టితీవు, వైరి. 86
సీ. చిఱుతకూఁకటి ఘటించిన రావిరేకము
త్యములు నెన్నొసటిపై దుముకుచుండ
నిద్దంపు చెవులఁ జెందిన పెద్దమగఱాల
మద్దికాయల జతముద్దుగులుకఁ
బులిగోరునాఁటిన బలుపద్మరాగంబు
హార మక్కున తళుక్కనుచు మెఱయఁ
గంకణధ్వని మొలఘుంటల రొదయు కిం
కిణి రావములును నేకీభవింప
తే. భరత లక్ష్మణ శత్రుఘ్న బాలకేళిఁ
దనరు నినుఁగన్న తలిదండ్రు లనఘులెన్న
చిన్నిరామన్న నన్ను రక్షింపుమన్న, వైరి. 87
సీ. రత్నకీలిత తనుత్రాణంబు ధరియించి
కస్తూరికాతిలకంబు దిద్ది
బాణాసన సబాణతూణీరమును దాల్చి
యందంపు జాబరాగంద మలఁది
మొసలివా నెఱబాకు మొల జక్కఁగాఁ జెక్కి
కలికిబంగరురంగు కాసెఁగట్టి

భీకరంబుగ గండపెండేరములు బూని
నవరత్నమయభూషణములు దాల్చి
తే. వీర శృంగార రసములు వెలయ నీవు
కౌశికునితోడ జనుట తాటకవధంబు
సలుప జానకిఁ బెండ్లాడ దలఁచియె కద, వైరి. 88
సీ. శిల డాసినప్పుడె చికురభావము దోఁచెఁ
బదపద్మకలిత షట్పదము లనఁగ
నడుగిడినప్పుడె యాననం బేర్పడె
నఖతారగతి నిశానాథుఁ డనఁగ
నంజవేయఁ గుచద్వయము గనుపట్టెను
రతియుక్తకోకదంపతు లనఁ దగి
కలయఁ గొమ్మరు వేళఁ గాంత యయ్యె దనూజ
నాసఁగ నల్లునిఁ జూచు నుర్వి యనఁగ
తే. నంత గౌతమునతివ యహల్య యగుచు
నతిథిసత్కారములు సల్పెనట త్వదంఘ్రి
రజము నుతిసేయ దరమె శ్రీరామచంద్ర, వైరి. 89
సీ. జనకరాజన్య సంసన్మధ్యముననుండి
గొబ్బునలేచి వే నిబ్బరముగ
మణిలసత్కంకణమంజుధ్వనుల చేత
రాజన్యమనములు రగులఁజేసి
సామిలంబుగ కంఠసరములు దాలిచి
యీశ్వరచాపంబు నెత్తి హస్తి

హస్తాగ్రమున బిస మవలీలఁ గొనులీలఁ
గొని నారి దివియ ఫెళ్లనను విఱిగె

తే. విఱిగె రాఘవ తద్ధ్వని దరులు గిరులు
విఱిగె నృపతులమనసులు విఱిగె రిపుల
నడుము ఫెళ్లన నీభుజౌన్నత్యగరిమ, వైరి. 90

సీ. కనకశలాకశృంగారతరంగంబు
రాజమరాళి సామ్రాజ్యలక్ష్మి
మదనబాణము నవమాలిక మాణిక్య
వల్లరీచంచలావల్లి చంద్ర
కళ ధగద్ధగిత నక్షత్రంబు నవరత్న
మంజరీ కందర్పమదగజంబు
లావణ్యసరసి విలాసపేటిక మనో
జవనవాటిక ఘనసారఘుటిక

తే. జాతరూపసమేత భూజాత జనక
జాత దృగ్జాత నవవనజాత సీత
బరిణయంబగు నీమూర్తి ప్రస్తుతింతు, వైరి. 91

సీ. కళ్యాణవేదిక కౌతుకంబులు దాల్చి
యందంపుమైగంద మలఁది ప్రేమ
తెరవైచి బాసవాల్తైరవలు దీవింప
లోలోనఁ జూచుమేల్జూపుసొగసు
తోరంపుముత్యాలు దోసిళ్ల గిలించి
తలఁబ్రాలుబోయు బిత్తరపుకోపు

మంగళసూత్రసంబంధ వేళానోన్యన్య
పులకితస్విన్నాంగముల మెఱుంగు
తే. చెట్టపట్టులతో నల సీత నీవు
గురువులకు వందనముసేయు కూర్మిభక్తి
రంగుమీఱంగ మిథిలాపురంబునందు
జూచుపుణ్యాత్ము లేనోము నోచినారొ
భద్రయుతకీర్తి శ్రీరామభద్రమూర్తి, వైరి. 92
సీ. తమ్ములు నీవు నందమ్ములతోఁ బెండ్లి
కొడుకులై సతులతోఁ గూడి చనుచుఁ
బరశురాముని భంగపఱచి యయోధ్యాపు
రంబు వైభవము మీఱంగఁ జేరి
కోరిక ల్మీఱఁగా కొన్నాళ్లు వసియింప
దశరథేశుఁడు మీకు ధర్మనియతి
యువరాజ్యపట్టణోద్యోగంబు గావింప
కడు జూడఁజాలక కైక మిమ్ము
తే. సకలలోకైకనిందకు జడియ కకట
యడవులకు నేగు మనఁగ నోరాడె నెట్లు
కైక నననేల నీదుసంకల్ప మిట్లు, వైరి. 93
సీ. అంటినగం దెడు నడుగుదమ్ములతోడ
నడవి జానకి యెట్లు నడచెనయ్య
పుడమి యేలుట మాని జడదారు లగుమిమ్ము
తల్లి గన్గొని యెట్లు తాళెనయ్య

యనుఁగుదమ్ముఁడు సుమిత్రాత్మజుం డొక్కఁడె
మిముగొల్చి వెతమాని మెలఁగెనయ్య
నీదుపావలు రాజ్యనేతలుగాఁ గొల్చె
భరతుఁ డక్కట యెంతభక్తుఁడయ్యెఁ
తే. చిత్రకూటాద్రిఁ గడుతప్పుజేసినట్టి
చెడుగుకాకము మఱల రక్షించినావు
రామ నీవెంతకరుణాంబురాశివయ్య. వైరి, 94

సీ. దండకారణ్యదైత్యావళిఁ బరిమార్చి
సాపరాధు విరాధురూపు మాపి
మును హేతిఁజుప్పనాతిని విరూపిని జేసి
ఖరకృత్యు ఖరదైత్యుఁ గండణంచి
మాయాతినీచుని మారీచుఁ బరిమార్చి
దుర్మదాంధుని గబంధుని వధించి
తతవక్రశీలము ల్తాళముల్ ఖండించి
వాలిమహాశాలిఁ గూలనేసి
తే. తోడరి సుగ్రీవహనుమదాదులను గూడి
వనధి గర్వ మడంచి రావణుని ద్రుంచి
ఘనవిజయ మొందు వీరరాఘవుఁడ వీవు, వైరి.

సీ. శాశ్వతంబుగ విభీషణునకు లంక ని
శ్చలకృప నొసఁగుటఁ దలఁచుకొన్న
జెఱబడ్డ సుర సిద్ధ గరుడ గంధర్వకాం
తల విడిపించుటఁ దలఁచుకొన్న

నిఖిలలోకంబులు నిష్కంటకములుగా
నలర బ్రోచినవింతె దలంచుకొన్నఁ
గొలిచినవారికి గొంగు బంగారమై
తగు కోర్కు లిచ్చుటెఁ దలఁచుకొన్న
తే. ముదముగాని; ధరాసుత ముద్దరాలి
బరమపావని వినగాని పలుకులాడి
యగ్ని చోఁజేయుట కేమాయనలుకపుట్టె, వైరి.

సీ. అభినవాయోధ్యపురాంతరపురమునందు
మిసిమిబంగరురంగు మేడలోన
జిలుగుమేల్రతనాల సింహాసనముమీఁద
వామాంకమున సీత ప్రేమ గులుక
హనుమంతుఁ డగ్రంబునందు భక్తి జెలంగ
ఛత్రంబు వెనుక లక్ష్మణుఁడు బట్ట
భరతశత్రుఘ్నులు పార్శ్వస్థులై వీవ
వాయుసూనుకోటి జాంబవద్విభీష
తే. ణేన జాంగదముఖులు పెంపెసఁగ మధ్య
నీలజలరుహ రుచిమీరు నిన్ను రాము
రమ్యగుణధాము పట్టాభిరాము గొల్తు, వైరి.

సీ. మానితమూర్తియై మహిమచేఁ జెన్నొంది
కామపాలాభిఖ్యగరిమ జెంది
పంకజాతంబుల బరిమార్చు కళమించి
యరిభయంకరగతి నధిగమించి

శుభకరధవళాంగశోభచేఁ దనరారి
రేవతీరమణాంకరీతి మీఱి
సద్బలభద్రప్రశస్తిచేఁ జెన్నొంది
ఘనతర రామాకృతిని జెలంగి
తే. చంద్రుఁడన భూజనాహ్లాదసరణి మీరు
నిన్నుఁ గొనియాడ దరమె వాఙ్మేతకైన
నతులసంకర్షణస్వరూపాభిరామ, వైరి. 98
సీ. నీమహామహిమ వర్ణింపఁగాఁ దరమౌనె
ఫణిపతికైన వాక్పతికి నైన
సకలలోకంబులు జనసంబు నొందింప
రక్షింప శిక్షింప రాజవీవ
యఖిల జగత్కంటకాకృతి నుగ్రులౌ
త్రిపురరాక్షసుల మర్దించుకొఱకుఁ
దద్వధూనికరవ్రతంబులు భంగించి
దుష్టసంశిక్షయు శిష్టరక్ష
తే. చేయఁగా బుద్ధమూర్తిప్రసిద్ధిఁ గన్న
యతులకారుణ్యమూర్తి ని న్నభినుతింతు
నీపదంబులపై భక్తి నిలుపఁజేయు, వైరి. 99
సీ. అయ్యారె నెమ్మోము నొయ్యార మౌాభళీ
నిక్కు వీనులు ముక్కు చక్కఁదనము
ఔరకై బామోరయల్లార్చు నుద్ధతి
సేబాసురొమ్ములో జిగిబెడంగు

అన్నన్నచిత్రతరాంఘ్రి ధారాగతి
వాహులవా సుందర బాహులీల
ఆహా సమస్తశుభావర్తవిస్ఫూర్తి
బాపురే విపులమా వీపుసోపు
తే. అనుచు సకలజనుల్ చోద్య మంది పొగడ
ఘనతరాశ్వంబుపై నెక్కి కలికిమూర్తి
వగుచు పాశ్చాత్యపరులను నడఁచెదీవు, వైరి.
సీ. దేవకీసతి వసుదేవనందనుఁడవై
నందయశోద లానంద మొంద
సముదాత్తపూతనా శకట తృణావర్త
ధేనుక ముష్టికాదికుల ద్రుంచి
గొల్లచేడెలవల్వ లుల్లంబుల హరించి
మామకంసునిద్రుంచి మధుర నలరి
రుక్మిణీముఖ్య సరోజేక్షణలఁ గూడి
ద్వారక వసియించి ధర్మసరణి
తే పాండవులఁ బ్రోచి కౌరవబలము నడఁచి
భక్తరక్షణశిక్షచేఁ బ్రబలినట్టి
కృష్ణ గోవింద మాధవ కేశవ హరి, వైరి. 101
సీ. మాణిక్యపీఠికామధ్యపద్మస్థితు
రవికోటితేజోవిరాజమానుఁ
గందర్పశతకోటిసుందరాకారుని
శంఖచక్రగదాసిశార్ఙ్గధరుని

శ్రీ భూమి యువతి సంశోభిపార్శ్వద్వయు
 నంచితపుండరీకాయతాక్షు
శ్రీవత్సకౌస్తుభ శ్రీహారయుతవక్షు
 గటిలసన్మణికాంతి కనకచేలు
తే. మకుటకుండలకేయూరమహితకంక
 ణాంగుళీయకముఖ్యభూషాంగు విశ్వ
 నిలయు నారాయణస్వామి నిన్నుఁగొల్తు, వైరి.
సీ. తిరుమలపెద్దింటి ధీర సంపత్కుమా
 రార్య సద్వేంకటాచార్యశిష్యు
 సురుచిరాపస్తంబసూత్ర మౌద్గల్యస
 గోత్రు గోఁగులపాటికులజగౌర
 మాంబికాశ్రితబుచ్చనామాత్యవరపుత్రు
 కూర్మదాసాఖ్యు నన్ గూర్మి నీదు
 చరణదాస్య మొసంగి సంతరించితి భళీ
 యేరచించినయట్టి యీశతకము
తే వినిన జదివిన వ్రాసిన వివిధజనుల
 కాయు రారోగ్య మైశ్వర్య మతిశుభంబు
 కరుణ దయచేసి పాలింపు కమలనాభ
 వైరి హరరంహ సింహాద్రి నారసింహ. 103

సింహాద్రి నారసింహశతకము

సంపూర్ణము.



# పీఠిక.

---

ఈ కృష్ణశతకమును భారద్వాజ గోత్రుఁడును గంగాంబ కుమారుఁడునగు నృసింహాకవి రచించి నటులఁ జివరపద్యమువలనఁ దెలియుచున్నది. కవి కాలము స్థలము నెఱుంగఁదగు నాధారములు ఇందు లేవు.

శ్రీకృష్ణుని బాల్యక్రీడలు ఈ శతకమున సులభ శైలిలో వర్ణింపఁబడియుంటచేతను సుబోధముగ నుంటవలనను జనసామాన్య మీశతకమును గౌరవ భావముతోఁ బఠించుచున్నది. వీధిబడులలో నీశతకము పఠనీయగ్రంథమైయుంటచే నిందలిపద్యములు చాలమందికిఁ జిరపరిచితములె.

మొన్నటివఱకీ శతకము ఉలిపిరికాగితములపై తప్పులతడికగా ముద్రింపఁబడి యగ్రాహ్యముగనుండెను. నూతన సంస్కరణములతో వావిళ్లవారీ పుస్తకము ముద్రించి విద్యార్థిబృందమునకుఁ బరమోపకారము గావించిరి. ఈ శతకమున వ్యాకరణదోషములు చాలగలవు. ఐనను స్త్రీబాలవృద్ధాదు లీశతకమును బ్రేమించుచునేయున్నారు.

నందిగామ. }
1-1-25. }

ఇట్లు, భాషాసేవకులు,
శేషాద్రి రమణ కవులు,
శతావధానులు.

శ్రీ ర స్తు.

నృసింహకవికృత

# కృ ష్ణ శ త క ము.

---

క. శ్రీరుక్మిణీశ కేశవ
నారదసంగీతలోల నరసఖ శౌరీ
ద్వారకనిలయ జనార్దన
కారుణ్యముతోడ మమ్ముఁ గావుము కృష్ణా. 1

క. నీవే తల్లివి తండ్రివి
నీవే నాతోడునీడ నీవే సఖుఁడౌ
నీవే గురుఁడవు దైవము
నీవే నాపతియు గతియు నిజముగఁ గృష్ణా. 2

క. నారాయణ పరమేశ్వర
ధారాధరనీలదేహ దానవవైరీ
క్షీరాబ్ధిశయన యదుకుల
వీరా నను గావు కరుణ వెలయఁగఁ... 3

క. హరి యను రెండక్షరములు
హరియించును పాతకంబు లంబుజనాభా
హరి నీనామమహత్త్వము
హరిహరి పొగడంగ వశమె హరి శ్రీ... 4

క. క్రూరాత్ముఁ డజామీళుఁడు
నారాయణ యనుచు నాత్మనందను బిలువ

ఏరీతి నేలుకొంటివి
ఏరీ నీసాటివేల్పు లెందును కృష్ణా. 5

క. చిలుక నొకరమణి ముద్దులు
చిలుకను శ్రీరామ యనుచు శ్రీపతిపేరుం
బిలిచిన మోక్షము లిస్తివి
అలరఁగ మిముఁ దలఁచుజనుల కరుదా... 6

క. అక్రూరవరద మాధవ
చక్రాయుధ ఖడ్గపాణి శార్ఙ్గి ముకుందా
శక్రాదిదివిజసన్నుత
శుక్రార్చిత నన్నుఁ గరుణఁ జూడుము... 7

క. నందునిముద్దులపట్టిని
మందరగిరిధరుని హరిని మాధవు విష్ణున్
సుందరరూపుని మునిగణ
వందితు మిముఁ దలఁతు భక్తవత్సల... 8

క. ఓకారుణ్యపయోనిధి
నా కాధారంబ వగుచు నయముగఁ బ్రోవన్
నా కేల యితరచింతలు
నాకాధిపవినుత లోకనాయక.... 9

క. వేదంబులు గన నేరని
యాదిపరబ్రహ్మమూర్తి యనఘ మురారీ
నాదిక్కుఁ జూచి గావుము
నీదిక్కే నమ్మినాను నిజముగఁ గృష్ణా. 10

క. పదునాలుగు భువనంబులు
కుదురుగ నీకుక్షిఁ నిల్పుకొని నేర్పరి వై
విదితంబుగ నాదేవకి
యుదరములో నెట్టు లొదిగియుంటివి... 11

క. అష్టమి రోహిణిప్రొద్దున
నష్టమగర్భమునఁ బుట్టి యాదేవకికిం
దుష్టుని గంసు వధింపవె
సృష్టిప్రతిపాలనంబు సేయఁగఁ... 12

క. అల్ల జగన్నాథుకు రే
పల్లియ క్రీడార్థ మయ్యెఁ బరమాత్మునకుఁ
గొల్లసతి యాయశోదయుఁ
దల్లియు నై చన్ను గుడిపెఁ దనరఁగఁ... 13

క. అందెలు గజ్జెలు మ్రోయఁగఁ
జిందులు ద్రొక్కుచును వేడ్క చెలు వారంగా
నందునిసతి యాగోపిక
ముందర నాడుదువు మిగుల ముద్దియుచుఁ...

క. హరిచందనంబు మేనను
గర మొప్పెడు హస్తములను గంకణరవముల్
ఉరమున రత్నము మెఱయఁగఁ
బరగితి వౌ నీవు బాలప్రాయము కృష్ణా. 15

క. పాణితలంబున వెన్నయు
వేణీమూలంబునందు వెలయఁగ బింఛం

బాణీముత్యము ముక్కున
జాణఁడవై దాల్తు శేషశాయివి... 16

క. మడుఁగునకుఁ జని కాళింగుని
పడగలపై భరతశాస్త్రపద్ధతి వెలయం
గడు వేడుకతో నాడెడు
నడుగులు నే మదిని దాల్తు నచ్యుత... 17

క. బృందావనమున బ్రహ్మా
నందార్భకమూర్తి వేణునాదము నీవుŋ
మందారమాలముగ గో
విందా పూరింతు వార వేడుకఁ... 18

క. వారిజనేత్రలు యమునా
వారిని జలకంబు లాడవచ్చిన నీవుం
జీరెలు ముచ్చిలి యిస్తివి
నేరుపురా యిదియు నీకు నీతియె... 19

క. దేవేంద్రుఁ డలుకతోడను
వావిరిగా రాళ్లవాన వడిఁ గురియింపŋ
గోవర్ధనగిరి యెత్తితి
గోవుల గోపకులఁ గాచుకొఱకై కృష్ణా. 20

క. అండజవాహన విను బ్ర
హ్మాండంబుల బంతులట్ల యాడెదునీవుŋ
గొండల నెత్తితి వందురు
కొండికపనిగాక దొడ్డకొండా... 21

క. అంసాలంబితకుండల
కంసాంతక నీవు ద్వారకాపురిలోనన్
సంసారిరీతి నుంటివి
*సంసాదితవైరి సత్ప్రశంసిత... 22

క. పదియాఱువేలనూర్వురు
సుదతులు నెనమండ్రు నీకు సొంపుగ భార్యల్
విదితంబుగ బహురూపుల
వదలక భోగింతు వౌర నడి శ్రీ... 23

క. అంగనపనుపున ధోవతి
కొంగున నటుకులను ముడిచికొని వచ్చినయా
సంగతి విప్రున కిస్తివి
రంగుగ సంపదలు లోకరక్షక... 24

క. హా వసుదేవకుమారక
కావుము నామాన మనుచుఁ గామిని వేడన్
ఆవసజాక్షికి నిస్తివి
శ్రీవర యక్షయ మటంచుఁ జీరెలు కృష్ణా. 25

క. శుభ్ర మగుపాంచజన్యము
†నభ్రంకషమగుచు మ్రోవ నాహవభూమిన్
విభ్రమవై దనుజసుతా
గర్భంబులు వగులఁ జేయు ఘనుఁడా... 26

---

* అసురాదినరేంద్రవైరియచ్యుత-ముద్రితప్రతిపాఠము.
† అభ్రంబులపగిది-ముద్రితప్రతి.

క. జయమును విజయున కీయవె
హయముల ములుగోల మోపి యదలించిమహా
రయమున రొప్పవె తేరును
భయమున రిపు సేన విఱిగి పాఱఁగఁ... 27

క. దుర్జను లగునృపసంఘము
నిర్జింపఁగ వలసి నీవు నిఖిలాధారా
దుర్జనుల సంహరింపను
నర్జునునకు నీవు సారథైతివి... 28

క. శక్రసుతుఁ గాచుకొఱకై
చక్రముఁ జేపట్టి భీష్ముఁ జంపఁగ చను నీ
విక్రమ మేమని పొగడుదు
నక్రగ్రహ హరణ లోకనాయక... 29

క. దివిజేంద్రసుతుని జంపియు
రవిసుతు రక్షించినావు రఘురాముఁడ వై
దివిజేంద్రసుతుని గాచియు
రవిసుతుఁ బరిమార్చి తౌర రణమునఁ గృష్ణా. 30

క. దుర్భరబాణము రాఁగా
గర్భములో నుండి యభవ కావు మటన్నన్
నిర్భరకృప రక్షించితి
యర్భకు నభిమన్యుసుతుని నచ్యుత... 31

క. గిరులందు మేరు వౌదువు
సురలందును నింద్రుఁ డౌదు చుక్కలలోనన్

బరమాత్మ చంద్రుఁ డౌదువు
నరులందును నృపతి వౌదు నయముగ... 32

క. చుక్కల నెన్నఁగవచ్చును
గ్రక్కున భూరేణువులను గణుతింప నగున్
జొక్కపునీగుణజాలము
నక్కజమగు లెక్క పెట్ట నజునకుఁ.... 33

క. కుక్షిని నిఖిలజగంబులు
నిక్షేపము జేసి ప్రళయనీరధినడుమన్
రక్షక వటపత్త్రముపై
దక్షతఁ బవళించునట్టిధన్యుఁడ... 34

క. విశ్వోత్పత్తికి బ్రహ్మవు
విశ్వము రక్షింపఁ దలఁచి విష్ణుఁడ వెన్నన్
విశ్వముఁ జెఱుపను హరుఁడవు
విశ్వాత్మక నీవె యగుచు వెలయుదుఁ గృష్ణా. 35

క. అగణితవైభవ కేశవ
నగధర వనమాలి యాదినారాయణ యో
భగవంతుఁడ శ్రీమంతుఁడ
జగదీశ్వర శరణు శరణు శరణము... 36

క. మగమీనమవై జలనిధిఁ
బగతుని సోమకునిఁ జంపి పద్మభవునకున్
నిగమములు దెచ్చి యిత్తివి
సుగుణాకర మేలు భక్తశుభకర... 37

క. అందఱు సురలును దనుజులు
పొందుగ క్షీరాబ్ధిఁ దరువ పొలుపుగ నీవున్
అందం బగు కూర్మంబై
మందరగిరి నెత్తితౌర మాధవ... 38

క. ఆదివరాహము నయ్యును
నాదనుజుహిరణ్యనేత్రు హతుఁ జేసి తగన్
మోదమున సురలు పొగడఁగ
మేదిని నడి గొడుగు నెత్తి మెఱసితి... 39

క. కెరలియఱచేతఁ గంబము
నరుదుగ నేయుటయు వెడలి యసురేశ్వరునిన్
బురమునఁ జేరి వధించితి
నరహరి రూపావతార నగధరకృష్ణా. 40

క. వడుగఁడవై మూఁడడుగులు
నడిగితి వౌ భళిర భళిర యఖిలజగంబుల్
దొడిగితివి నీదు మేనను
గడుచిత్రము నీచరిత్ర ఘనుఁడవు... 41

క. ఇరుఁదొకమాటు నృపతుల
శిరములు ఖండించి తౌర చేగొడ్డంటన్
ధరఁ గశ్యపునకు నిచ్చియు
బరగఁగ జమదగ్ని రామభద్రుఁడ... 42

క. దశకంఠుని బరిమార్చియుఁ
గుశలముతో సీతఁ దెచ్చికొనుచు నయోధ్యన్

విశద మగుకీర్తి నేలిన
దశరథరామావతార ధన్యుఁడ... 43

క. ఘను లగు ధేనుకముష్టిక
దనుజులఁ జెండాడి తౌర తగ భుజశక్తిన్
అనఘాత్మ రేవతీపతి
యనఁగా బలరామమూర్తి వైతివి... 44

క. త్రిపురాది దైత్యభార్యల
నిపుణతతో వ్రతముఁ జేసి నిలిపితి కీర్తుల్
కృపగలరాజవు భళిరే
కపటపుబుద్ధావతారఘనుఁడవు కృష్ణా. 45

క. బలువు గల తేజి నెక్కియు
నిలపై ధర్మంబు నిలుప హీనులఁ ద్రుంపన్
గలియుగము తుదను వేడుకఁ
గలికివిగా నున్నలోకకర్తవు... 46

క. వనజాక్షుభక్తవత్సల
ఘను లగుత్రైమూర్తులందుఁ గరుణానిధి వై
విను నీసద్గుణజాలము
సనకాదిమునీంద్రు లెన్నఁజాలరు... 47

క. అపరాధసహస్రంబులు
నపరిమితము లైన యఘము లనిశము నేనున్
గపటాత్ముఁడనై చేసితిఁ
జపలుని ననుఁ గావు శేషశాయివి... 48

క. నరపశువ మూఢచిత్తుఁడ
దురితారంభుఁడను మిగులదోషకుఁడను నే
గురు తెలియఁగ నెంతవాఁడను
హరి నీవే ప్రాపు దాపు వౌదువు... 49

క. పరనారీముఖపద్మము
గురుతుగఁగుచకుంభములనుగొప్పునునడుమున్
అరయఁగఁ గనిమోహింతురు
నిరతము నిను భక్తిఁ గొల్వ నేరరు కృష్ణా. 50

క. పంచేంద్రియమార్గంబులఁ
గొంచెపుబుద్ధిని జరించి కొన్నిదినంబుల్
యించుక సజ్జనసంగతి
నెంచుచు ని మ్మెఱిఁగినాఁడ నిప్పుడ... 51

క. కష్టు ననాచారుని గడు
దుష్టచరిత్రుఁడను చాల దుర్బుద్ధిని నే
నిష్టతనుఁ గొల్వ నేరను
గష్టుని నను గావు కావు కరుణను... 52

క. కుంభీంద్రవరద కేశవ
జంభాసురవైరి దివిజసన్నుతచరితా
యంభోజనేత్ర జలనిధి
గంభీరుఁడ నన్నుఁ గావు కరుణను... 53

క. దిక్కెవ్వరు ప్రహ్లాదుకు
దిక్కెవ్వరు పాండవులకు దీనుల కెపుడున్

దిక్కెవ్వ రయ్యహల్యకు
దిక్కెవ్వరు నీవు నాకు దిక్కగు... 54

క. హరి నీవె దిక్కునాకును
సిరితో నేతెంచి మకరి శిక్షించి దయం
బరమేష్ఠి సురలు పొగడఁగఁ
గరిఁ గాచినరీతి నన్నుఁ గావుము కృష్ణా. 55

క. పురుషోత్తమ లక్ష్మీపతి
సరసిజగర్భాది మౌనిసన్నుతచరితా
మురభంజన సురరంజన
వరదుఁడ వగు నాకు భక్తవత్సల... 56

క. క్రతువులు తీర్థాటనములు
వ్రతములు దానములు సేయవలెనా లక్ష్మీ
పతి మిముఁ దలఁచినవారికి
నతులితపుణ్యములు గలుగు టరుదా... 57

క. స్తంభమున వెడలి దానవ
డింభకు రక్షించినట్టిదీనిని వెలయన్
అంభోజనేత్ర జలనిధి
గంభీరుఁడ నన్నుఁ గావు కరుణను... 58

క. శతకోటిభానుతేజుఁడ
యతులితసద్గుణగణాఢ్య యంబుజనాభా
రతినాథజనక లక్ష్మీ
పతి హిత నను గావు భక్తవత్సల... 59

క. మందుఁడ నే దురితాత్ముఁడ
నిందల కొడిగట్టినట్టి నీచుని నన్నున్
సందేహింపక కావుము
నందునివరపుత్త్ర నిన్ను నమ్మితిఁ గృష్ణా. 60

క. గజరాజవరద కేశవ
త్రిజగత్కల్యాణమూర్తి దేవ మురారీ
భుజగేంద్రశయన మాధవ
విజయార్చిత నన్నుఁ గావు వేగమ... 61

క. దుర్మతినై బలుకష్టపుఁ
గర్మంబులు జేసినట్టికష్టుని నన్నున్
నిర్మలుఁ జేయఁగవలె ని
ష్కర్ముఁడ వని నమ్మినాఁడఁ గదరా... 62

క. దుర్వారచక్రధరశర
శర్వాణీప్రణుతనామ జగదాధారా
నిర్వాణనాథ మాధవ
సర్వాత్మక నన్నుఁ గావు సరసతఁ... 63

క. సుత్రామనుత జనార్దన
సత్రాజిత్తనయనాథ సౌందర్యకళా
చిత్రాననాంక దేవకి
పుత్త్రా నను గావు నీకుఁ బుణ్యము... 64

క. బల మెవ్వఁడు కరిఁ బ్రోవను
బల మెవ్వఁడు పాండుసుతులభార్యను గావన్

బల మెవ్వఁడు సుగ్రీవుకు
బల మెవ్వఁడు నీవు నాకు బలమా కృష్ణా. 65

క. పరుసము సోఁకిన నినుమును
వరుసతో బంగార మైన వడువున జిహ్వన్
హరి నీనామము సోఁకిన
సురవందిత నేను నట్లు సుభుఁడఁ... 66

క. ఒకసారి నీదునామము
ప్రకటముగాఁ దలఁచువారిపాపము లెల్లన్
వికలము లై తొలఁగుటకును
సకలాత్మ యజామిళుండు సాక్షియె... 67

క. హరిసర్వంబునఁ గలఁ డని
గరిమతో దైత్యజుఁడు పలుకఁ గంబములోనన్
ఇర వొంద వెడలి చీరవె
శరణన్నవిభీషణుండు సాక్షియె... 68

క. భద్రార్చితనిజచరణ సు
భద్రాగ్రజ సర్వలోకపాలన హరిశ్రీ
భద్రానుజ కేశవ వర
భద్రాధిప నన్నుఁ బ్రోవు భయహర... 69

క. ఎటువలెఁ గరిమొఱ వింటివో
యెటువలెఁ బ్రహ్లాదు కభయ మిచ్చితో కరుణన్
అటువలె నను రక్షింపుము
కటకట నిను నమ్మినాఁడఁ గావుము కృష్ణా. 70

క. తటవిట లేటికిఁ జేసెదు
కటకట పరమాత్మ దుష్టఘంటాకర్ణుణ్
ఎటువలెఁ బుణ్యునిఁ జేసితి
రటువలె రక్షింపుమయ్య యచ్యుత... 71

క. తురగాధ్వరంబుఁ జేసిన
పురుషులకును వేఱె పదవి పుట్టుట యేమో
హరి మిముఁ దలఁచినవారికి
నరుదా కైవల్యపదవి యచ్యుత... 72

క. ఓభవబంధవిమోచన
యోభరతాగ్రజ మురారి యోరఘురామా
యోభక్తకామధేనువ
యోభయహర నన్నుఁ గావు మోహరి... 73

క. ఓతండ్రి కనకకశ్యపు
ఘాతకుఁనై యతనిసుతుని గరుణను గాచెణ్
బ్రీతి సురకోటిఁ బొగడఁగ
నాతండ్రీ నిన్ను నేను నమ్మితి... 74

క. ఓపుండరీకలోచన
యోపురుషోత్తమ ముకుంద యోగోవిందా
యోపురసంహరమిత్రుఁడ
యోపుణ్యుఁడ నన్నుఁ బ్రోవు మోహరి కృష్ణా.

క. ఏవిభుఁడు ఘోరరణమున
రావణు వధియించి లంక రాజుగ నిలిపెణ్

దీవించి యావిభీషణు
నావిభు నేఁ దలఁతు నేను అచ్యుత... 76

క. గ్రహభయదోషముఁ బొందదు
బహుపీడలు చేర వెఱచుఁ బాయును నఘముల్
ఇహపరఫలదాయక విను
తహతహ లెక్కడివి నిన్నుఁ దలఁచినఁ... 77

క. గంగ మొదలైన నదులను
మంగళముగఁ జేయునట్టి మజ్జనములకుఁ
సంగతి గలిగినఫలములు
రంగుగ మిముఁ దలఁచు సాటి రాపుర... 78

క. ఆదండకాపనంబునఁ
గోదండముఁ గాచినట్టి కోమలమూర్తీ
నాదండ దాపు గమ్మీ
వేదండముఁ గాచినట్టి వేల్పుఁడ... 79

క. చూపుము నీరూపంబును
బాపము దుష్కృతములెల్లఁ బంకజనాభా
పాపుము నాకును దయతో
శ్రీపతి నిను నమ్మినాఁడ సిద్ధము కృష్ణా. 80

క. నీనామము భవహరణము
నీనామము సర్వ సౌఖ్యనివహకరంబుఁ
నీనామ మమృతపూర్ణము
నీనామము నేఁ దలంతు నిత్యుఁడ... 81

క. పరులను నడిగిన జనులకుఁ
గుఱుచ సుమీ యగునటంచు గుఱుతుగనీవున్
గుఱుచవు నై బలిచే మును
ధరఁ బాదత్రయముఁ గొంటి దద్దయు... 82

క. పాలును వెన్నయు మ్రుచ్చిలి
ఆలను మీతల్లి గట్ట రోషముతోడన్
లీలావినోది వైతివి
బాలుఁడవా బ్రహ్మకన్నఁ బ్రభుఁడవు... 83

క. ఏఘుడియను నీనామము?
లఘుమతితోఁ దలఁపఁగలనె లక్ష్మీరమణా
అఘములు వాపుము దయతో
రఘురాముఁడ వైన లోకరక్షక... 84

క. అప్పా యిత్తును దయతో
నప్పాలను నతిరసంబు లనుభవశాలిన్
అప్పా ననుఁ గనుఁగొననే
యప్పా ననుఁ బ్రోవు వేంకటప్పా కృష్ణా. 85

క. కొంచెపువాఁ డని మదిలో
నుంచకుమీ వాసుదేవ గోవింద హరీ
యంచితముగ నీకరుణకుఁ
గొంచెము నధికంబు గలదె కొంతయుఁ... 86

క. వావిరి నీభక్తులకున్
గావరమున నెగ్గు సేయు గర్వాంధులకున్

దేవ వధించుట వింటిని
నీవల్లను భాగ్య మయ్యె నిజముగఁ... 87

క. అయ్యా పంచేంద్రియములు
ఉయ్యాలలు ఊఁచినట్టు లూరక నేనుʼ
నీయాజ్ఞఁ దలఁగ నేరను
కుయ్యాలింపుము మహాత్మ గుఱుతుగఁ... 88

క. కంటికి ఱెప్పవిధంబున
బంటుగదా యనుచు నన్నుఁ బాయక యెపుడుం
గంటుండ వెఱవ నేలా
కంటక మగు పాదములను గడచితిఁ... 89

క. యమునకు నిఁక నే వెఱువను
కమలాక్ష జగన్నివాస కామితఫలదా
విమల మగు నీదునామము
నమరఁగ దలఁచెదను నేను నమరఁగఁ గృష్ణా. 90

క. దండమయా విశ్వంభర
దండమయా పుండరీకదళనేత్ర హరీ
దండమయా కరుణానిధి
దండమయా నీకు నిపుడు దండము... 91

క. నారాయణ లక్ష్మీపతి
నారాయణ వాసుదేవ నందకుమారా
నారాయణ నిను నమ్మితి
నారాయణ నన్నుఁ బ్రోవు నగధర... 92

క. తిరుమణి దురితవిదూరము
తిరుమణి సౌభాగ్యకరము త్రిజగములందుఁ
తిరుమణి పెట్టినమనుజుఁడు
పరమపవిత్రుండు భాగ్యవంతుఁడు... 93

క. శ్రీలక్ష్మీ నారాయణ
వాలాయము నిన్నుఁ దలఁతు వంద్యచరిత్రా
ఏలుము నను నీబంటుగఁ
జాలా నిను నమ్మినాను సరసుఁడ... 94

క. శ్రీధర మాధవ యచ్యుత
భూధర పురుహూతవినుత పురుషోత్తము నీ
పాదయుగళంబు నెప్పుడు
మోదముతో నమ్మినాఁడ ముద్దులకృష్ణా... 95

క. శిరమున రత్నకిరీటము
కరమున నవశంఖచక్ర ఘనభూషణముల్
ఉరమున వజ్రపు పతకము
సిరినాయక యమరవినుత శ్రీహరి... 96

క. అందెలఁ బాదము లందును
సుందరముగ నిల్పినావు సొంపమరంగా
మందరధర మునిసన్నుత
నందునివరపుత్త్ర నిన్ను నమ్మితిఁ... 97

క. కందర్పకోటిసుందర
మందరధర భానుతేజ మంజులదేహా

సుందరవిగ్రహ మునిగణ
వందిత మిముఁ దలఁతు భక్తవత్సల... 98

క. ఓపాలఁదొంగ మురహర
పాపాలను బాఱఁదోలు ప్రభుఁడవు నీవే
గోపాలమూర్తిదయతో
నాపాలిటఁ గలిగి బ్రోవు నమ్మితిఁ... 99

క. అనుదినము గృష్ణశతకము
వినినఁ బఠించినను ముక్తి వేడుకఁ గలుగున్
ధనధాన్యము గోగణములు
తనయులు నభివృద్ధిబొందుఁదద్దయుఁ గృష్ణా. 100

క. భారద్వాజసగోత్రుఁడ
గౌరవమున గంగమాంబకరుణాసుతుఁడన్
పేరు నృసింహాహ్వయుఁడన్
శ్రీరమయుత నన్నుఁ గావు సృష్టిని కృష్ణా! 101

శ్రీ కృ ష్ణ శ త క ము
సంపూర్ణము.

---

# పీఠిక.

తెలుఁగుబాసలోఁ బేరెన్నికఁగన్న శతకములలో మాతృశతక మొకటిగా నెన్నఁదగియున్నది. ఇందు గర్భధారణమునకు ముందునుండి పుత్త్రవాంఛతో సతు లువ్విళులూరువిధము గర్భభారముచేఁ గృశించుచు సత్పుత్త్రునకై జననిపొందునాందోళనము కుమారుని శ్రేయోభివృద్ధులకు విద్యావిశేషాదులకుఁ దల్లి యానందించువిధము రమణీయముగ, మనోహరముగ, స్వభావానుకూలముగ రసవత్తరముగ వర్ణింపఁబడినది. తనకుమారుఁడు విద్యావివేకశాలియై రాజకీయకార్యములతోఁ బేరెన్నికఁ గనినంత తల్లిభారముతీఱెనని కాంబోలు. ఈకవికొడుకు కోడలు కలిసిమెలసి యుండునపుడు మనుమఁడు కలిగినపుడు మాతృదేవిపొందు సంతోషపారవశ్యములీగ్రంథమున సజీవముగఁ జిత్రించియున్నాఁడు.

మాతృలీలలను, శతకకర్తయగు నీకవి చక్కఁగ హృదయగతము గావించుకొని భక్తిరసావృతమగు నిరర్గళకవితతో "మాతృదేవోభవ" యను వేదవాణిని ముక్తకంఠముతో గానముగావించి మాతౄణముక్తుఁ డయ్యెను. ఆంధ్రవాఙ్మయమునఁగల శతకసమూహమునం దిట్టి ప్రేమస్వరూప మనఁదగు మాతృదేవతను స్మరించుగ్రంథములు చాలయరుదుగానున్నవి. ఈశతకము మాతూరి అప్పావు మొదలారిచే

రచింపఁబడినటులఁ బూర్వముద్రణమువలనఁ దెలియుచున్నది. అంతియగాక కవి తననామము అప్పావు అని నూఁటవపద్యములోఁ జెప్పికొనినాఁడు. ఈశతకములోఁ బలుతావుల మీనాక్షీస్మరణము (చూ.ప. 14, 30, 70, 86, 93) చేసియుంటవలనను, మాతృశతకము పూర్వముద్రణము గావించిన కవికుమారునినామము మీనాక్షీదాసు ఐయుంటవలనను కవి మీనాక్షీభక్తుఁడనియు మధురామండలనివాసియనియు నూహచేయ నవకాశము చిక్కుచున్నది. శతకమునుండి కవిచరిత్ర మింత కెక్కుడు తెలియరాదు.

ఈశతకరచయితయగు అప్పావు మొదలారి ద్రవిడదేశము చేరిన యాంధ్రుఁడని కవితనుబట్టి యూహచేయవచ్చును. ఈశతకము ప్రథమముద్రణము కవికుమారుఁడు క్రీ. శ. 1861లో నొనర్చియుంటవలన నిది యిప్పటికి రమారమి డెబ్బదిసంవత్సరములనాఁడు రచింపఁబడినటులఁ దోఁచుచున్నది. ఉపజ్ఞాకల్పితమగు నిట్టియుత్తమశతకమును పునర్ముద్రణ మొనర్చి యాంధ్రలోకమున కొసంగిన బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి యుద్యమము ప్రశంసాపాత్రము. కవితలో నటనట వ్యాకరణదోషములు గానవచ్చుచున్నవి.

291

శ్రీ రస్తు.

అప్పావు మొదలి విరచిత

# మాతృశతకము.

---

ఉ. శ్రీపతియైనఁ గాని విధుశేఖరుఁడైన త్రిశూల
పాణియై, నా పరమేష్ఠియైన గణనాయకుఁడైన
రమామృడానులై, నా పలుకుం బోలంతి యయి
నా పరిరక్షణకార్యశక్తియో, ద్దీపనబోధనోక్తు
లను దెల్పను తల్లినిఁ బోల రెవ్వరున్. 1

చ. జలరుహనేత్రుఁడైనయల చక్కనిదేవునిబొడ్డుత
మ్మిలో,పలను జనించి వాగ్వనితపాలిటిపెన్నిధి
యో యనంగఁ బెం, పలరిన బ్రహ్మసృష్టికిని
నాదిమకారణమై త్రయీమయో, క్తులఁ గొని
యాడినాద్యయగుతొయ్యలిఁ ద... 2

చ. చిఱుతతనంబునన్ జెలులఁ జేరి విహారము సల్పు
వేళ నా, దరమునఁ గొయ్యబొమ్మను ముకం
బునఁ బుత్త్రునిగాఁ దలంచి తాఁ, బరవశ మొంది
వేడుక నెపం బిడి లాలనఁ జేసి మిక్కిలిన్, ముర
పముఁ గాంచి మోహమున నూల్కొనుత... 3

ఉ. బాలలఁ గూడి బొమ్మ నొడిపైఁ గడుఁ బ్రేమ
చెలంగ నిల్పి తా, నోలలు పాడుచుం బొదలి
యుగ్గిడి కేలను మేను దువ్వుచోఁ, జాల మనం
బుతో నిటులఁ జక్కనిపట్టిని గాన నెప్పుడో,
కాల మటంచు నెంచు మదిఁ గల్గినతల్లినిఁ బోల
రెవ్వరున్. 4

చ. ఇలఁ గలదేవతాతతుల నెల్ల మనంబున నెంచి
నామముల్, పలుమఱు నోటఁ బల్కుచును
బార్వతి గేహముఁ జొచ్చి శాంభవీ, లలితకుమా
రసంభవఫలప్రద మైనవివాహ మింకఁ గా, వలె
నని మ్రొక్కి వేఁడు సుతవాంఛకుఁ ద... 5

చ. చిలుకలు లేనిపంజరము శీతమయూఖుఁడు లేని
రాత్రి చెం, గలువలు లేని పెంగొలను గాదె
పరేహసుఖప్రదాననిర్మలగుణశాలి నాఁ దగుకు
మారకునిం గన లేనిదానిమే, ల్చెలువ మ దేల
యంచు మదిఁ జింతిలు త... 6

చ. సుతులను గన్నయట్టినెఱసుందరులం గని భాగ్య
భోగసం, గతమతులార నందనులు గల్గుటకుం
దిట మార నేమినోఁ, చితిరొ తపంబు లేమి
మఱి చేసితిరో యని పుత్రవాంఛలోఁ, గుతుక
మెలర్పఁగా నడుగుకోమలిఁ ద... 7

చ. పొరుగిరుగిండ్ల భామినులు పుత్త్రులు గల్గుట
కాత్మత త్త్వసుస్థిరమతిఁ జేయుసాధనముఁ జెప్పిన
యట్లుపవాసదేవతా, చరణయుగార్చనప్రభృతి
సత్క్రృతు లెల్లను దానొనర్చుచోఁ, జిఱుతల
మీఁదియాశ మదిఁ జేర్పడుత... 8

చ. తనయునిమీఁదిబాళి మదిఁ దాఁకినచో నుప
వాస మీశ్వరా, ర్చనమును నోము లాది య
నుసత్క్రియ లెల్లను జేయుచో నెదం, బెనఁగిన
ప్రేమమై నొగిఁ దపింపఁగ నోర్చుచు సౌఖ్య మేమి
నె, మ్మనమున నాస పాల్పడని మానినిఁ ద... 9

ఉ. నీతుపులో మునుంగు నతి శేముషి దీనుల నన్న
దానసం, ప్రీతులఁ జేయు దేవతలఁ బేర్కొను
నైదువరాండ్ర కెల్లన, య్యే తనివారువాయనము
లిచ్చుఁ బురాణము లాలకించుఁ దా, నేతఱి నో
మునోఁచుఁ దనయేచ్ఛను దల్లినిఁ బోల రెవ్వ
రున్. 10

ఉ. మోద మెలర్పఁగా దనయమోహము చేతను
బిప్పలద్రునా, గాది ప్రతిష్ఠ లెల్ల జనులందఱు
సంతస మందఁ జేయుచో, బేదఱికం బదెంత మఱి
బిడ్డలు గల్గినఁ జాలు నంచు నా, పాదన జేయు
చో నెపుడుఁ బల్కెడుత... 11

చ. ఇలఁ జెలువారినందనుల నెత్తుచు ముద్దిడుచోఁ
చెనంగి యన్నులఁ గని బిడ్డలెన్నటికినో కన నోఁ
తు నటంచు బల్కు లే, మొలకమెఱుంగునవ్వు
లకు మోదముఁ జెందుచు నిష్టదైవముల్, దలఁ
చుచు బుత్త్రవాంఛ మతిఁ దాఁకినత... 12

చ. తనయులబాళి మ్రుగ్గు లిడుఁ దాలిమి మీఱఁగ
నెవ్వ రేమిచె, ప్పిన నదిసేయుచుండు నిల వేల్పు
లకుఁ మతి మీఁదు గట్టు దా, ననయము గర్భ
హేతువిధౌషధముల్ పచరించు ధర్మచిం,తన
నొకకాలమైన మదిఁ దప్పనిత... 13

చ. అనయము నందనేచ్ఛ హృదయంబున మల్లడి
సేయ మీనలో, చన నిలయంబులో నిలిచి ష
ణ్ముఖునిం జెలువారఁ గన్నయో, జనని దయానిధీ
సుతులఁ జయ్యన ని మ్మని నెమ్మి మీఱఁగా,
మునుకొని సాగిలం బడుచు మ్రొక్కెడుత...

చ. మునుకొని తాను బెద్దలకు మ్రొక్కిన వారును
బ్రేమఁ బుత్త్రులం, గనుఁగొని సర్వకాలము సుఖం
బున నుండుదు వీ వటంచు దీ, వన లిడునంతలో
నన సువర్ణమహీధర మెక్కినట్లు నె, మ్మనమునఁ
జాల సంతసిలుమానినిఁ ద... 15

చ. ఎఱుకులసానిగద్దె విన నెంచుమనోరథ ముప్ప

తిల్లఁగాఁ, గరగతలేఖ లూర్జితముగాఁ గని పెద్ద
లు నీకుఁ బుత్త్రులే, వురుగల రన్నమాత్రమున
నూరట దోఁప నుత్తేచ్ఛలోనము, ప్పిరి గొన
సంతసిల్లి మది జేర్చెదు త... 16

చ. నెల నిలిచెంగదే యనును నీరజపాణులు పల్కు
నంతలో, పల నిధిఁగన్న యు ట్లుదరభాగములో
పలఁ బిండ ముష్ణముఁ, దొల గెడురీతి భోజన
నిధుల్ మఱి గోరుచుఁ బుత్త్రమోహ ము, త్క్యు
రుతరభంగిఁ గొల్చువగ నుండెడుతల్లినిఁ బోల
రెవ్వరున్. 17

ఉ. నేవిళు లోకిరింతలను విన్నఁడనంబును దోఁప
డస్సిగ, ర్భావలాగ్భకావనశుభక్రమ మొప్పఁ
గ మంత్రతంత్రసం, భావన మీఱ మాంత్రికుల
భావనఁ జేయుచుఁ బుత్త్రవృద్ధికిఁ, దైవము తో
డు గావలె వజా యను... 18

చ. నెల నిలువన్ మనోరథము నిర్వటించఁగను బైఁడి
రతురే, కులు మెడఁగట్టు మోమునను గోరిక
మీఱ విభూతిఁ బెట్టు దా, నలయక గాలి
సోఁకెను నటంచు నుచ్ఛను నాఁడునాఁటి కీ,
చెలువుగ నుత్తమక్రియలు చేసెదుత... 19

చ. చెలు లిటు రమ్మటంచుఁ దనుఁ జీఱిన వేసట గర్భ

గోళసం, కలితసుతావనేచ్ఛఁ జనఁగా వడి యా
హాఁదొలంగు దేహళీ, స్థలి నెగదాఁటనేర నని
తగ్గులు మిట్టలు చూచి తిన్నఁగాఁ, గలక దలంగి
తా నడచుకామినిఁ ద... 20

ఉ. మాసము లెల్లఁ బూర్ణమయి మానవతీమణి గర్భ
వేదనా, యాసముతోఁ ష నుండు తఱి నంగన
పుత్త్రునిఁ గాంచె నన్నఁ దా, నాసడి విన్నమా
త్రమున నావచనం బమృతప్రవాహధా, రాసమ
మైనచోఁ మనము రంజిలుత... 21

చ. విసుకుచు బిడ్డనుం గనినవేదనఁ గుందుచు నున్న
యప్పుడా, నిసువును దెచ్చి పొత్తులను నించి
నచోఁ దనకష్టరీతులఁ, మసలక తత్సుతాననవి
మర్శ ఘనంబుగఁ జిందు ద్రొక్కఁ దా, మనమునఁ
బ్రోచు నేర్పు గలమానినిఁ ద... 22

చ. చిఱుత జనించునంతఁ దనచిత్తము సార్థక మై
చెలంగిన, ట్లురుతరభాగ్య మబ్బినటు లుర్వి సమ
స్తము నేలినట్లు పెం, దురమున గెల్చుచో విజ
యతూణము లెల్లెడ నాఁటినట్టు ల, బ్బురముగ
సంతసిల్లువిరిబోఁడిని దల్లిని బోల రెవ్వరున్. 23

చ. పురిటిలు సొచ్చి యున్నతఱిఁ బుత్త్రునకుఁ వివి
ధోపచారముల్, మెఱపడి . చేయువారలను

మిక్కిలి ప్రార్థన చేసి దేవతా, తరుణులయట్లు
చూచునెఱతాలిమి మీఱఁగ నిట్టు లక్ష్యకా,
తురమున నేమిచెప్పవలెఁ దొయ్యలిఁ ద... 24

చ. తన కుపచారముల్ జరుపు తామరసాక్షులఁ జూచి
బిడ్డ కిం, పొనరఁగ బోరుమాన్పి చెలు వొందఁ
గ ను గ్గిడరమ్మ మీరలే, దినదిన మంచు బల్కి
తనదేహసుఖం బిసుమంతయైనఁ గో,రని తనయా
వనక్రియలరంజిలుత... 25

చ. ప్రసుదము మీఱఁ గన్నయలబాలునకై యొక
వేళఁ బక్షిదో, ష మొనరుదృష్టి పోఁకుగ్రహాసం
సరణంబును గాలి ముట్టుదో, షము మొదలైన
దోషములు సంధిలకుండఁగ నంతలోన వే, గము
నను రక్షరేకు మొలఁ గట్టెడుత... 26

చ. పురుడు చనంగ జాతకపుఁబొంక మెఱింగినయట్టి
పెద్ద లా, దరమున దీక్షకాలము ముదంబున
మానవిలోచనాతిథి, స్ఫురకరుణావిశేషమున
శోభిలుచుం భవదాత్మజుండు బ, ల్వారలు నటన్న
మాట విన వాంఛిలుత... 27

చ. నెలపురు డీఁగుదాఁక బలునేర్పులరారను మూల
యింటిలో, పలఁ బరు లెవ్వారేని తనపట్టినిఁ జూ
చిన దృష్టిదాఁకు ని, ష్ముల నని దాఁచి గాలితె

అముంగలఁ దా నొనరించి పెంపుటిం, తుల ప
యిఁ గాఁవుగా నిడినతొయ్యలిఁ ద... 28

ఉ. కారము నూరిపోయు నెడ గాసిలనీయదు బోరు
బెట్టినన్, గూరిమితోడ నెత్తుకొని గుబ్బల
పా లిడు జోలఁ బాడు స, త్కారము మీఱు
చోఁ గసురు దాఁకె నటం చని కుందుఁ బుత్త్రలీ,
లారతి నాఁటనాఁట నిటుల న్మదిఁ ద... 29

చ. తనపొరుగిండ్లభామినులు తారసిలంగను దృష్టి
తాఁకునో, యని మిహిరాదికగ్రహచయాభిమతు
ల్పచరించి మీనలో, చనను దలంచి నందనుని
సంగతిఁ బాయకప్రోవనమ్మ యో, జననియటంచు
నంజలులు సల్పెదు తల్లినిఁ బోల రెవ్వరున్. 30

చ. పెనఁకువమీఱుచుంతఁ దనబిడ్డపయిం గలయట్టి
బాళిచే, తను మలమూత్రము ల్గడు ముదంబున
నెమ్మెయిఁ బూసినట్టి చం, దనహిమనీరసౌరభము
దారిఁ దలంచు నిజాన్వయాబ్ధిచం, ద్రునిఁ గని
నట్లు బొంగు భళిరే యల త... 31

చ. అనుదిన మాత్మసంభవున కాముద ముగ్గిడు నం
తమీఁద లో, చనములు ముక్కుపెందొడలు
చంకలుకాళ్లను చేతు లాదిగాఁ, గను సమమొం

దఁగా నివిరి చక్కనివాఁడగునట్లు చేయునే,
ర్పున నలరారుచున్న ననబోణినిఁ ద... 32

చ. పిడికిలి పట్టువేళఁ దనుఁ జెర్కొని నవ్వెడువేళ
నోరలం, బడియెడువేళ నూకురులు పల్కెడివే
ళను దోఁగులాడుటన్, దడఁబడువేళఁ జూడఁ
గని తప్పటడుం గిడువేళఁ బ్రేమ బల్, గడలు
కొనంగ సంతసిలుకామినిఁ ద... 33

ఉ. బాలుని వృద్ధికై యొరులుపల్కినయట్టుల నెంత
ద్రవ్య మై, నా లవమాత్రమంచుఁ దననాథున
కున్ దెలియంగఁ బల్కుచున్, లీల ఘటించి
నందనుని లీలలకు న్మది సాక్కి యోగులం, బో
లినయట్టు లుండు ననబోణినిఁ ద... 34

చ. మన పతిప్రీతి నొంద నొకమంచిముహూర్తముఁ
జూచినంతఁదా, ననువమరంగ రంగలరునన్నము
ముట్టఁగఁ జేసి బిడ్డఁ డిం, పెనయఁగ నాఁకఁటం
బొదలి యెన్నఁడు బువ్వదినంగ నేర్చునో, యని
మది నూహపాల్పడినయంగనఁ ద... 35

చ. చెలు లుదకంబు దేరఁ దనచేతను నూనియఁ
దోఁగ నంటుచోఁ, దల జలకంబు లార్చి బలు
తాలిమితోఁ దడియొత్తి మోమునన్, దిలకము
చుక్కబొట్టువలె దీరిచి సంతసమంద నాత్మలో,

పల నలరారుచున్నయలభామినిఁ దల్లినిఁ బోల రెవ్వరున్. 36

ఉ. ఇంతులఁ జూచి మీసుతుల కేపస రుగ్గిడినారు మీరు గో,రంత యెఱుంగఁ బల్కఁగదరమ్మ యటంచుఁ జికిత్స దోఁప నిం, తంతనరానియౌష
షధము లారయుచుణ్ గడుఁబ్రోచుచున్నధ, న్వంతరియో యనంగఁ జెలువారెడుత... 37

ఉ. భావ మెలర్ప మూలికల భావనచేసినయట్టిబంగ రుం, దీవెల నూకచిట్టుడుకు దిసి మరీచిఘృతో చితంబుగాఁ, ద్రావఁగఁ జేసి వేఁడి జలధారల మేను గడింగి నిద్దురం, బోవఁగ జోలఁ బాడు చును బొంగెడుత... 38

ఉ. క్షీరను శర్కరాన్నమును జిక్కనిగట్టిపెరుంగు పాయసం, బారయ బొజ్జ నిండునటు లామె తగాఁ దినిపించి బిడ్డఁ డే,మో రహి లేక ముట్టఁ డని మోమ మఱి వాంచుచు"ముద్దులయ్యగా, రార"యటంచుఁ బిల్చుచును రాజిలుత... 39

చ. చిఱుతను జంకఁ బెట్టుకొని చిత్రముఁ జూపుచు వెండిగిన్నెలో, మెఱయుచు నున్నబువ్వఁ దిను మీ తినకున్నను బూచివాని వే, గిర మిదె

పిల్తు నంచు నళికించుచుఁ గాకికి వేతు నంచుఁ
దా, బిరబిర చేతిముద్దఁ దినిపించెడుత... 40

చ. అరమర మానుచుŋ గురుపదార్థము లెవ్వి
భుజించితేని పా, లరుగవు బిడ్డకంచు నిహితా
శనముం గబళించుచోఁ బరా, త్పరుని మునీంద్రు
లట్లు సుతతత్పరదృష్టు లనంతపథ్యవి, స్ఫురణఁ
జెలంగుచున్నయిలసుందరిఁ ద... 41

ఉ. ఆఁకొని పోరువెట్టునెడ నారయ నడ్డముగాఁ
దనూజునిం, జేకొని త్రుచ్చి ముద్దిడుచుఁ జెక్కిలి
దువ్వుచుఁ బాయిద్రావరా, రా కనతండ్రి యం
చని మనంబునఁ గుందుచు బొజ్జనిండ ర, క్షాక
లితోక్తిఁ జన్గుడుపు కామినిఁ ద... 42

చ. తడఁబడునట్లు ముంగిటను దప్పటడుం గిడువేళ
నజ్ఞతŋ, బడు ననుచింతయు న్నడుమఁ బాల్పడె
నన్నకుతూహలంబు చే, డ్పడ నొకటైన మైమఱచి
బాలునకుŋ దనవ్రే లొసంగి నే, ర్పడరఁగ
ద్రిప్పుచోశుభముఁ బల్కెడుతల్లినిఁ బోల రెవ్వ
రున్. 43

చ. తనసరిబాలురం గలసి దవ్వుల కాటల కేగి
యున్నచోఁ, దనయుఁ డిదేమొ లేఁ డనుచుఁ
దత్తఱ మొందుచు నావ తాగిన, ట్లనయము

నాత్మఁ గుందుచుఁ దదాగమనాభిముఖాభిలాష
పై, గొని కనినంత సంతసిలుఁగోమలిఁ ద... 44

చ. చిఱుతలతోడ నాటలకుఁ జేతులు జాఁచుచు
నందుగొందులం, బరుగులు పాఱుచున్న పశుబాధ
ఘటించు నటంచు సాధ్వసా, తురమున రాణి
వాస మటు ద్రోసి బహిస్థలి కేఁగి యంత నా,
బురుకనిఁ గేల నందిగొని పోయెడుత... 45

చ. కడువడి నెండఱేఁ గనినఁగాని తనూజులు చెంతఁ
జేరి పైఁ,బడి ముఱిపంపుఁబెంపు నెఱబాధలు
పెట్టినఁగాని వేసటం, బడక నితోఽధికం బయిన
బాలురఁ గవ్వలె నంచు బాళిలోఁ, బోడమి
చరించుచుండువిరిబోఁణినిఁ ద... 46

చ. విన వినఁ బాలు గాఱునెఱవేడుక మీఱఁగ
ముద్దుముద్దుగాఁ, దనయుఁడు పల్కుచున్న విని
తాఁ గనకం బొడిఁ గట్టినట్లు నె, మ్మనమున సంత
సిల్లుచును మాటికి మాటికి దృష్టి దీయుచోఁ,
జను గుడిపించి మై నివురుచక్కని త... 47

చ. గునగున నేగుదెంచి తనకు న్మఱి పప్పు లొసంగు
మంచుఁ బ,ల్కిన నెఱముద్దుమాటలకుఁ గేవలము
న్మది సొక్కి తద్వచో, జనితసుధారసానుభవ

సంగతి నాఁకలి నొప్పి దప్పు లెం, చని తనుజెప్పి
తార్థఫలశాలినిఁ ద... 48

చ. పెరచిఱుత న్మథింపఁ గని పెంచినయాబిడ చాడి
చెప్పినన్, మఱి విని నీతనూభవునిమంచికి నీమది
మెచ్చఁబోలు మా, బురుకని గొట్టినాఁ డనుచు
బొంకి నిజాలయసీమఁ జేరి య, బ్బురముగ
బుద్ధిఁ జెప్పు సిరిబోలినతల్లినిఁ బోల రెవ్వరున్. 49

చ. తనయునికొంటెచేఁతలకుఁ దండ్రి యహో
బెదరించుచున్న లే, దనుచు నిజాత్మనాయకు
నియాజ్ఞ దొలంగఁగ రా దటన్న వా, గ్ధన మటు
డించి నందనుని దండనపా ల్పడనీక యడ్డముం,
జని కరుణింపఁ జేయునెఱజాణను ద... 50

చ. తలఁపున నున్నభావ మొకదారిఁ జెలంగఁగ
వచ్చి రానిమా, టలు మఱి పల్కు వేళఁ గడు
రాయి జెలంగెడుశౌరిసత్కథా, కలితవినోదము
ల్ వినెడుకై వడిగా వడి నాలకించుచో, ఫల
మొనఁగూడె నంచు నుతిఁ బల్కెడుత... 51

చ. తనతనుజాతుఁ డొక్కతఱిఁ దప్పిదముల్ ఘటి
యింప భ_ర్త నె, మ్మనమున సంతసించుటకు మంచి
విగా వినిపించు మంచిగాఁ, బను లొనరింప నంద

అను "బాలుఁడు యోగ్యుఁ" డటన్న మాటఁ
దా,విని మది సంతసిల్లునలివేణినిఁ ద... 52

చ. తినుకుచు బువ్వఁ బెట్టు మని తేపకుఁ బాతర
లాడుఁ బెట్టినన్, గనుఁగొని పాలుపోయు మను
గ్రక్కునఁ బోసిన "వెన్న గావలెం, జనని"య
టంచుఁ దా నగడు జేసినఁ గోపములేక తన్మనం,
బనువడఁ జేసి సంతసిలునంగనఁ ద... 53

చ. కలకొలఁదిం దనూజునకుఁ గానొనరించినయట్టి
భూషణం, బులు ధరియించుచో నెదుటఁ బుత్త్ర
నకుం దనదృష్టి తాఁకి మై, చెలువు దోలంగునో
యనుచుఁ జేరువవారలమీఁద దృష్టి నె, క్కొ
లుపుచు సంతసిల్లుసుమకోమలిఁ ద... 54

చ. అలసట వేసటల్ దలఁప కాఁకలిదప్పుల మీఁది
యాశమై, తొలఁగుచు రాత్రులుం బగలు తోడి
చెలు ల్మది మెచ్చఁ దత్తనూ,విలసనకార్యకర్మపద
విం బడి "భర్తృవినోద మింతకుం, గలదె" య
టంచు సంతసిలుకామినిఁ ద... 55

చ. సరసవివేకము ల్దనరుజాడగలుంగను బిడ్డ నొక్క
స, ద్గురునకు నొప్పగింపు మని కోరిక మీఱ
నిజేశుతో మనో, హరగతి మీఱఁ బల్కి తన

యా విను నీ వెపుడో పురాణమై, ఖరు లెఱిఁగిం
తు వంచుఁ గుతుకంపడుతల్లినిఁ బోల రెవ్వరున్.

ఉ. శ్రీలు చెలంగఁగాఁ జదువు చెప్పెడువేళఁ బరా
కు మాని మా, బాలున కిమ్ము విద్య బహుభం
గుల నేర్పు మటంచు పెక్కు చం,దాల నొసంగు
వస్తుసముదాయము నాథుఁ డెఱుంగనీక బ, ల్మా
లిమి మీఱ నట్టిసుకుమారిని ద... 57

చ. చదివితివేని నీ కిపుడు జామఫలంబులు దెచ్చి
యిత్తు స,ష్మ కమున మంచిదోనతులు మాడ లో
సంగుదు నంచుఁ బల్కి మే, ల్పొదలఁగ బుజ్జగిం
చుచును బొంకముగాఁ బడిఁ జేరఁ బంపి తాఁ,
బడపడి త్రోవలో నిలుచుఁ బల్మఱుత... 58

చ. చిఱుతను ద్రోవబాలకులు చిన్నతనంబునఁ గొట్టి
కుండ భూ,సురునకు దిట్టముం బఱచుచో నిలు
చేరను బ్రొద్దుపోవఁగా, నరయుచు బిడ్డఁ డాఁ
కొనియె నంచు మదిన్ దిగులొంది పిల్వఁగాఁ
బఱచుఁ దనంతటన్ బడికిఁ బల్మఱు త... 59

చ. పెనఁకువ మీఱ భోజనము పెట్టు మటంచనిరాఁ
గుమారునిన్, గని చిఱునవ్వు మోవిపయిఁ
గ్రమ్మఁగ నీ కిపు డేమినేర్చితో, వినవలె నంచుఁ

గోరుచును వేమలు లాలనసేసి వేడుకన్, దిను
మని బువ్వఁ బెట్టుయుపతీమణిఁ ద... 60

చ. మఱి బడిఁ జేరఁ బోవునెడ మార్గములోపల
ముల్లు నాఁటునో, మెఱపడి గోవు లేమయిన
మీఁదికిఁ జేర్వడి వచ్చునో యటం, చఱిమురి
కొందఱిం బనిచి యాఁడటఁ దానును బోవ నెంచు
వాంఛ రహిం జెలంగ నెల్లపుడుఁ జయ్యనఁ ద...

చ. కొడు కెటువంటివాఁ డయినఁ గుంభినిలో నద
లింపరానిదుం,దుడుకయి యున్న నన్యులకు దొడ్డ
ఱికం బెఱిఁగించుచున్ మదిన్, జిడజిడ మాని
సంతసము చిప్పిలఁ గంటికి ఱెప్పచాడ్పునన్,
దొడఁబడి ప్రోచుచున్న యలతొయ్యలిఁ దల్లి నిఁ
బోల రెవ్వరున్. 62

చ. సదమలరీతు లుల్లసిల సార మెఱింగెడిరీతిఁజక్కఁ
గాఁ, జదివితి వేని భూజనులు సన్నుతి చేసెద
రింతె కాక సం, పద లెడఁగూడు నీ కనుచు
బాలునకు న్మఱి బుద్ధి చెప్పచో, మది ముద మంది
యొప్పెసఁగుమానినిఁ ద... 63

చ. తనయుఁడు సర్వవిద్యలను దక్షతఁ గాంచి పఠించు
చున్నచో, విని పరితోషనీరనిధి వెల్లువగాఁ
బయిఁ బాఱినట్లు నె, మ్మనమున సంతసిల్లుచుఁ

గుమారునిఁ గన్నఫలంబుఁ గంటిఁగా, యని తల
పోయు చుండుకనకాంగినిఁ ద... 64

చ. వెడవెడ నింక భోజనపువేళ గతించిన బిడ్డఁడే
మెుకో, బడి విడి రాఁడు నేఁ డనుచుఁ బాతర
లాడుచు నుండునంతలోఁ, గడఁ జనుదేర నెత్తు
కొని కౌఁగిటఁ జేరిచి చుంచు దువ్వి మై, బడ
లిక దీఱ సంతసిలుభామినిఁ ద... 65

చ. తనయునిముద్దుమాటలకుఁ దా ముదమందుచుఁ
దేటనీట మ, జ్జన మొనరించి మోమునను జాఁ
దిడి సన్నపుఁజేలఁగట్టి బల్, పెనఁకువ షడ్రసా
న్నములు పెట్టి భుజించిన "ముద్ద ముట్టలే",
దని పెఱవారితోఁ బలుకు లాడెడుత... 66

చ. పలుమఱు తాను నందనుఁడు పాఠశాలకుఁ బో
నినాఁడు "నా, పలుకు వినంగదయ్య మృదుభా
షణ లాడఁగదయ్య సత్యముల్, బలుకఁగదయ్య
నీ కెవుడు భాగ్యము గల్గు" నటంచు బ్రేమతోఁ,
దెలుపుచు బుద్ధిఁ జెప్పుయువతీమణిఁ ద... 67

చ. సరసులు మెచ్చఁగా గణితశాస్త్రము నేరిచి సం
ఖ్య లెల్ల సు, స్థిరమతితోడఁ జెప్పుటకుఁ దెల్వి
వహించినయట్టిమంచి లే, కరి యగుఁ గాక నాసు

తశిఖామణి యంచుఁ బరాపరేశు సద్గురునిఁ దలం
చుచో నెదను గోరెడుత... 68

. విమలవిచారశీలుఁడయి విశ్రుతకీర్తి దిశల్ ఘటి
ల్ల మా, ఘము మొదలైనకావ్యరసకల్పనలు న్మతి
శాస్త్రము ల్పురాణములు నలంకృతు ల్మనము
న బెనుపారఁగ నెన్నఁ డింక నా, కొమరుఁడు
నేర్చునో యనుచుఁ గోరెడుతల్లినిఁ బోల రెవ్వ
రున్. 69

చ. స్వరము లలంకృతుల్ కృతులు సయ్యన ముప్ప
దిరెండురాగముల్, మెఱయఁగఁ దాళమానల
యమిశ్రసమంచితఖండజాతిను, స్థిరఘనతాపసం
గతులు తేటపడ న్మతి పాడనేర్చునా, వరసుతుఁ
డెన్నఁ డింక నని వాంఛిలుత... 70

చ. పొలు పలరారఁగాఁ జదివి పూర్ణతఁ గాంచి వ
యోవిలాసముల్, వెలయుచునున్న నందనుని వే
డుకఁ గన్గొని పెండ్లిచేయఁగా, వలె నని భర్త
తో వినయవాక్యములం దగువేళఁ దిన్నఁగాఁ,
దెలుపుచు సంతసిల్లెడుసతీమణిఁ ద... 71

చ. కులమును రూపముం జెలువుఁ గోమలతం దలి
దండ్రు లన్నద, మ్ములుఁ గలదానిఁగా సుగుణము
ల్గలదానినిఁగా దలంచి పై, దలి నటు పెండ్లి చేసి

యలదంపతులం గని మూఁడులోకముల్, చెలు
వుగ నేలినట్లు విలసిల్లెడుత... 72

చ. చెలువము మీఱుచున్న తనచిన్నికుమారునిఁ
జూచి మంత్రవా, దులు కలుషం బొనర్తు రని
తోడనె పెద్దల నాశ్రయించి ని, ర్మలుఁ డగున
ట్లు చేయ హరిమంత్రములన్ బఠియింపఁ బూన్చి
వా, రల కుపయుక్తిఁ జేయ నలరారెడుత...73

చ. కొమరుఁడు రాజకార్యములకున్ జని క్రమ్మఱ
నింటఁ జేర రాఁ, దమక మెలర్పఁగాఁ బనులు
తాల్మిఘటించినఁగాని వందిత, క్రమ మిగురొత్త
నందతిని గా దని తాఁ దని వార నంద నా,భిమత
ము మీఱ భోజనముఁ బెట్టెడిత... 74

చ. కర మరుదార రాజహితకార్యములన్ సవరించి
రా సభాం,తరమునఁ జేయుసత్క్రియలు దా విని
తత్కమనీయకల్పనా, పరవశయై సదా "త్రిపుర
భంజన సేమ" మొసంగు మంచు మీా, సర మల
రార దీవనలు సల్పెడుతల్లినిఁ బోల రెవ్వరున్.

ఉ. భూరివివేకుఁడై సుజనపోషకుఁడై యభిమా
నుఁడై సదా, చారవిహారుఁడై పరమసాత్త్వి
కుఁడై గుణవంతుఁడయ్యె నేఁ, గోరినయట్లు

పట్టి తనకుం బ్రభవిల్లెఁగదా యటంచుఁ దా, నూ
రక సంతసిల్లి మది నుబ్బెడు త... 76

చ. చతురతఁ గాంచుచో విమలసాత్త్వికశాస్త్రము
లెల్ల నేర్చి సు, వ్రతుఁ డయి సత్యసంధుఁ డయి
రాజసభాంతరపూజనీయుఁడై, సుతుఁ డుద
యించె నంచు మదిఁ జొక్కి ప్రహర్షణ ముప్పొ
తిల్ల లోఁ, గుతుకము మీఱు చున్నయలకో
మలిఁ ద... 77

ఉ. శ్రీలలరారుసంతతసుశీలుఁడు భూతదయాపరుం
డు వా, చాలుఁ డనన్యచారుజలజాతముఖీహృ
దయానుకూలుఁ డీ, బాలకుఁ డంచు సజ్జనులు
పల్కినఁ దద్వచనంబు వీనులం, గ్రోలుచు సంత
సిల్లుసుమకోమలిఁ ద... 78

ఉ. దానధురాయశోవినయధైర్యనిరంతర సాహసక్రి
యా, మానజనోపకారఘనమాన్యరతుండయి
మీనలోచనా, ధ్యానమనస్కుఁడై సకలధర్మ
విశారదుఁ డైనసూనునిం, దాను దలంచి సంత
సిలుతన్విని ద... 79

చ. పరనిరతోపకారమృదుభాషణభూషణుఁ డాశ్రి
తావన, స్థిరగుణశాలి నీతిపథజీవనజీవనుఁ డుత్త
మాధమాం, తరము లెఱుంగుమేటి తలిదండ్రు

లకు నృవ దాఁటఁ డన్నచో, నరసి మనంబులోన
ముద మందెడుత... 80

చ. కలుపుఁదనంబుతోడఁ దనుఁ గన్నకుమారుఁడు
సంతసిల్లి కో, డలికి నలంకరించుచు నోడంబడి
బుద్ధులు చెప్పుచుక్ దనూజులవలెఁ బ్రేమ మీఱ
మఱి చూచుచు భూజను లాడు మంచిప, ల్కు
లకుఁ బ్రమోద మొందుసునుకోమలిఁ ద... 81

చ. కొమరునిదేహపోషణకుఁ గోడలితో దమయంతి
సత్కథా, క్రమము లతాంగి చంద్రమతికార్య
ము జానకివర్తనంబుచం, దము ననసూయనర్మిలి
మొదల్ జగతిం గఁ మేల్పతివ్రతా, త్వము
లెఱిఁగించుచుండెడుసువాసినిఁ దల్లినిఁ బోల
రెవ్వరున్. 82

చ. తనవలె నన్నపానముల: దన్పునొ తన్పదొ ప్రేమ
మీఱ నం, దనుని నటంచు సందియము తన్నె
డఁబాయనిఁ గోడ లంత భో, జన మిడువేళఁ
దాను బతిసౌఖ్యసమాచరణంబు ముక్తిసా, ధన
మని తెల్పుధర్మగుణదాయినిఁ ద... 83

ఉ. చూతఫలోష్ణనూత్నఘృతసూపసమంచదపూపష
డ్రసో, పేతము గాఁగ భోజనము పెట్టి కుమా
రున కోలి ఘర్మసం, జాతశరీరబాధ దిగ జా

అట కై దయఁ దాళవృంతముం, జేతి కొసంగు
దివ్యగుణశీలను ద... 84

చ. కొడుకును గోడ లొంటిపడి కొంకుచు సైగలు
నారజంపుటా, గడములు వింతవింత నెఱగారవ
ముల్ గిలిగింత లాడుమే, ల్సడిసడిసన్నలుం గు
సగుసల్ జరిగించుట చూచి యాత్మలోఁ, బుడ
మి సమస్త మేలుగతిఁ బొంగెడుత... 85

చ. తనయుఁడు పుత్త్రిఁ గనువిధంబు ఘటించుట
కై రమేశు నీ, శుని సిరి మీనలోచనను జో
క్కము మీఱ భజించు నెన్నఁడే, మనుమని
నెత్తి ముద్దిడుదు మక్కువతోడ నటంచుఁ గో
డలిం, గని ముద మందుచో మిగులఁ గాంక్షి
లుత... 86

చ. కర మనురక్తి నందనులు గల్గుటకై తనముద్దుఁ
గోడలిం, గురుతరభక్తిదేవతలకుం బ్రణమిల్లఁగఁ
జేయు వేంకటే, శ్వరునకు మీఁదుగట్టుమని చా
టును నోములు నోఁచ ద్రవ్యము, త్కరముగ
నిచ్చుచోఁ గరుణ గల్గినత... 87

చ. అనయము కీర్తిహాని సుజనాదరణీయము గాదు
సిగ్గుఁబా, టెనయఁగఁ జేయు లోకు లతిహీనత
గా మతి నెంతు రెందుదు,ర్జనసహవాస మేరికినిఁ

జౌక ఘటించుఁ దలంచినఁ సుమా, విను మని
బుద్ధిఁ జెప్పుఘన వేణినిఁ దల్లినిఁ బోల రెవ్వరున్.

చ. ధన మొనగూర్చు సద్గుణవితాన మొనర్చు ధరి
త్రిలోపలఁ, ఘనత ఘటించు రాజగురుకార్య
సమున్నతిఁ జేయుఁ గీర్తికాం, తను గొని తెచ్చు
ము క్తిపథతత్త్వము లెల్ల నెఱుంగఁ జేయు స,
జ్జనసహవాస మంచు నుడి సల్పెడుత... 89

చ. అనయము రాజకార్యములయందుఁ బ్రవర్తన
సేయువేళ భూ, జనులకుఁ గీడు పన్నునెడ సద్ఘ
ఘటింపఁగ నీకు లోకనిం, దన కెడగానినిర్మల
విధంబు సమస్తము నీకుఁ గీర్తిసా, ధన మని తె
ల్పుసద్గుణమతల్లిని ద... 90

చ. తలఁప నగణ్యుఁడై బుధవితానము వర్ణనచేయ
సత్క్రియా, కలనఁ జెలంగి సద్గుణము గల్గిననుం
దనుఁ గన్నతల్లితం, డ్రులగుణమెల్లఁ బాయ
భళిరే యనిపల్కుదు రంచుఁ బట్టికిం, దెలుపుచు
సంతసిల్లుయువతీమణిఁ ద... 91

ఉ. శిష్టులు మెచ్చ సజ్జనులు చేకొనునట్లు దలంచి

జ్ఞానవా, సిద్ధముఖప్రబంధములు చెప్పెడు స
త్త్వపురాణమర్మసా, భీష్టవిధుల్ పఠించుటకుఁ
బెద్దలఁ జూపుచుఁ బుత్త్రవాంఛసం, తుష్టిచెలం
గుచున్న యలతొయ్యలిఁ ద... 92

ఉ. కోడలు గర్భమౌట తనకు న్మదిఁ దోఁచినయంత
ప్రేమ గొం, డాడ సుపుత్త్రునిం బడయునట్లు ఘ
టింపు మటంచు శూలి పూఁ, బోఁడిని మంద
గామినినిఁ బుష్పసుగంధిని మీనలోచనన్, వే
డుక మీఱ వేఁడునలివేణినిఁ ద... 93

చ. మనుమఁ డటంచుఁ బిల్వ సుకుమారునిఁ గోడలు
గన్నమాటఁ దా, విని యనివార దానముల వే
లముగా నొనరింపఁజేసి చ, య్యన శుభవాద్య
ముల్ మొరయునట్లు ఘటించెఁ గదా యటం
చుఁ గన్గొని ముదమందునట్టి యలకోమలిఁ ద...

చ. కలిమి బలంబు భోగము సుఖంబు జయంబు
యశస్సమృద్ధియుం, గలుగఁగఁ గోరుచుం దన
దు కాయము డస్సిన శక్తిలేమిడిన్, బలము దొ
లంగి యుండిను బాయనికార్శ్యతురంగలింప ని,

ర్మలమతిఁ బుత్త్రవత్సలత రంజిలుతల్లినిఁబోల రె
వ్వరున్. 95

చ. సరవిఁ గుమారవాంఛ కొనసాగుటకై పడువేపు
లింతనో, రరుచివిచేష్ట గాసి మొదలైనప్రయాస
ముల్లెల్లఁ జూడఁగా, హరిహరపంకజాసనముఖా
మరు లైననుగాని యిట్టిదు, ష్కరతరబాధ లో
రువరు గావునఁ ద... 96

చ. కడువడి మీఱ నందనునిగర్భములో భరియించి
యింటిలో, నడిచెడివేళఁ దాఁ బనులునానెము
గా నొనరించువేళ నిం, పడరఁగఁ గూరుచుండు
నెడనైన ప్రయాసము లోర్చెఁ గాన నీ, వుడ
మిని లోకమాత యనఁ బోలినత.... 97

చ. ప్రసవము నొందునాఁడు పడుబాములు చూచి
నఁ బ్రాణహానియై, యొసఁగినఁగాని లోనఁ గస
టంతయు లేకయె పుత్త్రవాంఛలో, మసలెదుఁ
గాన నింకిట సమానదయారసపూర్ణ లెవ్వ రీ,
వసుమతిలోన దివ్యగుణవార్ధినిఁ ద... 98

ఉ. నేరుపు విద్యయుం గలిమి నీతివివేకము గల్గున
ట్లుగా, సారెకుఁ దెల్పుచో జగతి సౌఖ్యము

గల్గ ఘటింపఁ జేయుచో, నారయఁ బ్రేమఁ దా
నహరహంబును గంటికి ఱెప్పచాడ్పునం, దార
మురీతిఁ బ్రోచుగుణధన్యను ద... 99

ఉ. శ్రీ వెలయంగ లోకులిది చిత్రమటంచు మదిం
దలంప నప్పా వతిభక్తితో జననిపైఁ గలప్రేమ
దురంగలించి రాఁ, గా వగ మీఱ మాతృశతకం
బొనగూరిచెఁ గానఁ జూచినం, బూవిలుకానిఁ
గన్నసిరిఁ బోలినతల్లినిఁ బోల రెవ్వరున్. 100

మాతృశతకము సంపూర్ణము.

---

# పీఠిక.

ఈశతకమురచించిన కవినామము ఇందుఁ గానరాదు. ఇంకను నీశతకమునఁ గొన్నిపద్యము లున్నగాని యష్టోత్తరశతపద్యసంఖ్య పూర్తిగాదుగాన ననుపలభ్యములగు పద్యములలోఁ గవిచరిత్రపద్యమిమిడియుండునేమో!! ఎవరేని మాతృకగలవారీ ప్రతిలో లేనిపద్యములఁ బంపుదురేని వందనీయులు.

శతకకర్తయగు కవినివాసము ఉన్నవ కొండవీటిలోని యొకపూర్వగ్రామము. ఇది గుంటూరునకుఁ దూర్పున రెండామడల దూరములోనున్నది. ఈశతకము రచించినకవి పద్మావతీపరిణయమను పద్యకావ్యమునుగూడ రచించెను. అందుఁ బద్మావతిని వేంకటేశ్వరుఁడు పెండ్లాడినకథ చెప్పఁబడినది. పద్మావతీపరిణయకృత్యాదికమువలన నీశతకకర్త ఉన్నవ యోగానందకవి యని తెలియును. ఇక్కవి ఆపస్తంబ సూత్రుఁడు గార్గ్యగోత్రుఁడు. ఆఱువేలనియోగి బ్రాహ్మణుఁడు. యోగానందకవి జీవితచరిత్రము సంగ్రహముగాఁ బద్మావతీపరిణయపీఠికలోఁ గలదు. దానివలన నీకవి రమారమి నూటయేఁబదిసంవత్సరముల క్రిందనున్నటుల నెఱుంగనగును. కవిజీవితమందలి విశేషములు కొండవీటిసీమలోఁ గృషిచేసి విచారింపవలసియున్నది.

ఇందలి పద్యములు ధారాశోభితములై భక్తిరస మున కాటపట్టుగా నున్నవి. ఇందలి కవిత మృదు మధురముగాని వ్యాకరణము దోషములు ఛందో లోపములు నందందు గానవచ్చుటచే నిది ప్రథమ ప్రయత్నమేమో యని తోఁచుచున్నది.

ఈ రాజగోపాలశతకములోని కొన్నిపద్యములు శ్రీకృష్ణకర్ణామృతములోని శ్లోకముల కాంధ్రీకరణ ములుగ నున్నవి. కొలఁదిగా సామాన్యనీతులుగ వ్యవహారాదర్శములుగా నున్నవి. ఇందలి కృష్ణుని శృంగారలీలావిహారములను వివరించు పద్యము లిప్పటి నాగరికులకుఁ గొంచెము వెగటు గలిగించి నను భగవద్వర్ణనము లగుటచేఁ బఠనీయములే యని మాతలంపు.

నందిగామ. 1-1-25

ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు.

319

శ్రీరస్తు.

ఉన్నవ యోగానందకవివిరచిత

# రాజగోపాలశతకము.

---

సీ. శ్రీకరనిలయమై చెన్నొంది యుష్మత్కృ
పామృతదృష్టిచే నంకురించి
సత్పదసందర్భసరసవాఙ్మహనీయ
శాఖోపశాఖలఛాయఁ బరగి
పరమసుగంధకృద్బహుమానమంజరీ
పరిఫుల్లసుమములఁ బరిమళించి
యలరుచు నుండెడు నస్మన్మహాభాగ
ధేయసారస్వతదివిజతరువు
నందు సత్ఫల ముదయంబు నొందుకొఱకు
సముచితంబుగ సీసశతము రచింతు
సురుచిరాకార ఉన్నవపురవిహార
రాజగోపాల రాధామనోజఖేల. 1

సీ. బృందావనంబులో బిబ్బోకవతులపైఁ
గూర్మిచే మరుకేళిఁ గూడికూడి

కరుణతోఁ గుబ్జను గైకొని రతిలీల
నలవరించినభంగి జలవు మెఱసి
నవరసాలంకారకవివరప్రోక్తప్ర
బంధాభినుతి చేతఁ బరిఢవిల్లి
కృపఁ జూచి నావంటికించిద్జ్ఞుఁ డొనరించు
శతకముఁ గొమ్ము శాశ్వతముగాను
నిన్ను వర్ణింప శేషాహిసీరజాత
సంభవభవాదులకు నైన శక్యమగునె
సురుచిరాకార... 2

సీ. దండము పద్మగర్భాండభాండోదర
పుండరీకాక్ష వేదండవరద
దండము కాళియకుండలిరాట్ఫణా
మండలకృతచిత్రతాండవపద
దండము మదగజశుండాభదోర్దండ
చండపరాక్ర మాఖండలనుత
దండము రక్షితపాండవ వాహీకృ
తాండజరాజ విఖండితాఘ
దండ మంభోధిభయదప్రచండకాండ
దండ మతులితశార్ఙ్గకోదండభరణ
సురుచిరాకార... 3

సీ. వందన మిందిరాసుందరీహృదయార
విందానుషంగమిళింద నీకు
వందన మమృతాశిసందోహసన్నుత
మందరధరణ గోవింద నీకు
వందన ముజ్జ్వల నందకహతదైత్య
బృంద త్రయీమూలకంద నీకు
వందన మాత్మజకందర్ప దేవకీ
వందన స్తుతముచుకుంద నీకు
ననుచు సద్భక్తిపూర్వకమున వచించు
మనుజులకు ముక్తి కరతలామలక మగును
సురుచిరాకార... 4

సీ. యదుకులవార్ధి రాకామృతకిరణాయ
భవహరణాయ తుభ్యం నమోఽస్తు
గగనధునీజన్మకారణచరణాయ
యగధరణాయ తుభ్యం నమోఽస్తు
కమనీయమారళీగానప్రవీణాయ
భద్రగుణాయ తుభ్యం నమోఽస్తు
కస్తురీతిలకాయ కౌస్తుభాభరణాయ
భర్మచేలాయ తుభ్యం నమోఽస్తు
పంకరుహలోచనాయ తుభ్యం నమోఽస్తు
భక్తసంరక్షణాయ తుభ్యం నమోఽస్తు
సురుచిరాకార... 5

సీ. అక్షీణరణరంగరక్షోనివహభంగ
పక్షిరాజతురంగ బహుపరాకు
ఘోరారిధర చక్రధారాదళితనక్ర
భారావనీచక్ర బహుపరాకు
తాండవస్ఫుటలీల ఖండితార్జునసాల
పాండవపరిపాల బహుపరాకు
వరభుజంగమతల్ప గురువిక్రమానల్ప
పరమార్థి జనకల్ప బహుపరాకు
భక్తయోగీశహృద్వాస బహుపరాకు
భానుకోటిప్రభాభాస బహుపరాకు
సురుచిరాకార... 6

సీ. రుక్మిణీహృదయసరోరుహాభృంగాయ
భామామనఃపద్మభాస్కరాయ
జాంబవతీచిత్తపద్మసంచరణాయ
తారుణ్యమిత్రవిందాధవాయ
భద్రాహృదంతరఫలదాయకాయ సు
దంతామనోహరస్వాంతజాయ
వరకళిందాత్మజాసరసప్రియాయ ని
రంతరలక్షణారంజనాయ
రాధికాదృక్చకోరతారావరాయ
దివ్యకల్యాణవిభవాయ తే నమోఽస్తు
సురుచిరాకార... 7

సీ. భవదీయసత్కథాఫణితపద్యంబులో
నొరగులు మిక్కిలి యుండెనేని
ఇక్షుదండంబు పేడెత్తిన గుజ్జైనఁ
గుంటువోయినఁ గడుఁ గులుచ యైన
మధురంబుగాక నెమ్మది విచారించినఁ
దిక్తమౌనా యని ధీరు లైన
సుకవు లాదరణతోఁ జూతురు గావునఁ
దప్పు లుండిన నైన నొప్పుచేసి
కైకొనుము నీకటాక్షవీక్షణము గలిగి
భవ్యకరుణావిధేయ సద్భక్తగేయ
సురుచిరాకార... 8

సీ. నీనామపఠనంబు నెమ్మిఁజేసియెకదా
యాకిరాతుఁడు దా మహర్షి యయ్యె
నీపాదరేణువు నెఱయ సోఁకినఁ గదా
పాషాణ మప్పుడె పడఁతి యయ్యె
నీచరణాంఘ్రిసంజాత యాటనె కదా
జాహ్నవి లోకప్రశస్త యయ్యె
నీమంత్ర మెడలోన నిల్పుటనే గౌరి
సర్వమంగళయన జగతిఁ బరగె
నౌర భవదీయదివ్యనామామృతంబుఁ
గ్రోలునరుఁ డేల యితరంబుఁ గోర నేర్చు
సురుచిరాకార... 9

సీ. మకరిచేఁ గడుడస్సి మది నిల్పి వేఁడిన
గజరాజుఁ గాచినఘనుఁడ వీవు
హాకృష్ణ! యన్నంత నక్షయపటములు
ద్రౌపది కొసఁగినదాత వీవు
అడుకులు దెచ్చిన యాకుచేలునకు సౌ
భాగ్యమిచ్చిన జగత్ప్రభుఁడ వీవు
గంధ మర్పించువక్రాంగిఁ గుబ్జను జూచి
రమ్యాంగిఁ గాఁ జేయురాజ వీవు
అహహా నీమహనీయదయార్ద్రచిత్త
వృత్తి వర్ణింప నలవియే విధికి నైన
సురుచిరాకార... 10

సీ. శరధిఁ జొచ్చి బిరానఁ దిరిగి యిట్టటుపో
రలి నోరుదెఱచి కెరలి జలములు
గళగళఁ ద్రాగి వెక్కసమైన నుమియుచుఁ
గమఠఝషములఁ గర్కటకములను
జట్టి మట్టాడుచుఁ జటులకోపాటోప
మున సోమకాసురుఁ గినిసి పట్టి
కులిశసన్నిభ దంష్ట్రములఁ జక్కుచక్కుగా
నఱికి విక్రమమున మెఱసి వేద
ములను గొనివచ్చి ప్రియమున నలువ కిచ్చి
నట్టిమత్స్యావతార మేమని నుతింతు
సురుచిరాకార... 11

సీ. పాలమున్నీటిలోపల సురాసురులు గుం
పులుగూడి మందరభూధరంబుఁ
గవ్వముఁ గావించి కాకోదరాధీశు
నాఁకత్రాడుగఁ జేసి యబ్ధిలోనఁ
జేకొనితరువంగ శైలంబు గలఁగిన
సురలమ్రొఱ విని యాదరణతోడ
నంబుధిలోఁ జొచ్చినప్పుడు జలజంతు
జాలంబు భయమున సంచలింపఁ
గూర్మరూపంబుఁ దాల్చి యాకొండ నెత్తి
నట్టినీవేష మెన్న బ్రహ్మకు వశంబె
సురుచిరాకార... 12

సీ. సన్నపుఁబదములు సున్ననిగోరిజలు
చిన్నికన్నులు విలసిల్లు చెవులు
వెడఁదఱొమ్మును గొప్పవెన్నును గుఱుచవా
లము కఱవయినరోమములు కొద్ది
నడుమును బటువైనయొడలు సున్నతఘోణ
మును గడునిశితదశనయుగమును
గిటగిట గీటించు ఘుర్ఘురార్భటముల
నడరి మహార్ణవమందుఁ జొచ్చి
హేమనయనాసురుని జంపి భూమి సవ్య
రదమునను నానినట్టివరాహరూప
సురుచిరాకార... 13

సీ. చిడిముడి హేమకశిపుఁడేడిరా చక్రి
 స్తంభంబులో నని చఱచినపుడు
పటపట స్తంభంబు పగిలి భీకరకరా
 శముఖము నిశితనఖములుఁ గ్రకచ
కఠినదంష్ట్రలుచిఱు కన్నులు కొద్దినె
 న్నడుమును జొక్కపునిడుదవాల
మలర నృసింహమై వెలసి కీలార్చి వి
 పక్షుని వెనుకళేబరముఁ జించి
రక్తధారలు గురియ నాగ్రహము మెఱసి
నట్టినీశౌర్య మెన్నఁగా నజునివశమె?
సురుచిరాకార... 14

సీ. చిఱుతపాదములును జిన్నారిబొజ్జయుఁ
 గుఱుచకరమ్ములు గులుకుమోము
నిద్దంపుఁజెక్కులు కొద్దయంగుళములు
 కరకమండలము వ్యాఘ్రాజినంబు
నారముంజియు గోఁచి యాతపత్రంబును
 యజ్ఞోపవీతంబు నక్షమాల
యును ధరియించి వామనుఁడవై బలిని బ
 దత్రయభూమిని దాన మడిగి
యవని దివి రెండుపదముల నాక్రమించి
యొక్కపాదంబుఁ దలమీఁదఁ ద్రొక్కి తౌర
సురుచిరాకార... 15

సీ. భార్గవరామరూపము ధరించి కరము
న ధనువుఁ బట్టి దొనలు వహించి
గండ్రగొడ్డలిఁ బూని కదిసి రాజులమీఁద
శరవృష్టిఁ గురియుచు నఱకునపుడు
కూలుతేరులు ధరవ్రాలు ఘోటకములు
పడియున్న కరులు కబంధములును
తెగిపడ్డతలలు విఱిగిపడ్డ రాజులు
నైనయాహవభూమియందు నిలిచి
కార్తవీర్యుని భుజములగర్వ మణఁచి
విజయ మొనరించి తో జగద్విదితముగను
సురుచిరాకార... 16

సీ. దశరథసుతుఁడ వై తాటకఁ దునిమి సు
బాహుని ద్రుంచి తాపసునిజన్న
మును గాచి యాశంకరునివిల్లు విఱిచి సీ
తను బెండ్లియాడి మోదమునఁ జెలఁగి
తండ్రివాక్యమునిల్పి దండకాటవిఁ జొచ్చి
మాయామృగముఁ జంపి జాయఁ బాసి
వాలినిఁగూల్చి భాస్వత్తనూజునిఁగూడి
సామీరిచే సీతసేమ మరసి
వనధి బంధించి రావణవధ మొనర్చి
యవనిజను గూడుకొన్న రామావతార
సురుచిరాకార... 17

సీ. కలువపూవన్నియచెలువుచల్లడము జొ
    క్కపునీలిధట్టి నిగన్నిగప్ర
భలు గుల్కనల్లనిపట్టుదుప్పటి నీల
    మణికిరీటము మృగమదతిలకము
ధరియించి రాజసత్త్వము మీఱి కంసుని
    సభఁ జొచ్చి భుజములు చఱచి మల్ల
రంగంబులో నిల్చి పొంగుచు ముష్టికా
    సురుని జయించి కంసుని వధించి
నట్టి నీబలభద్రరామావతార
మహిమ వర్ణింపఁగా నౌనె మర్త్యులకును
సురుచిరాకార... 18

సీ. వెలయఁ బురత్రయములరాక్షసులు నిజ
    భార్యాపతివ్రతాప్రాభవమున
విజయులై వెల్గి దివిజుల బాధింప నా
    యమరులు మొఱవెట్ట నాదరమున
విని వారి కథయంబు మనుకొని యొసఁగుచు
    బుద్ధరూపముఁ దాల్చి పొందు మీఱ
వరదితిజాంగనావ్రతభంగ మొనరించి
    శివునివిల్కానిఁగాఁ జేసి నీవు
శరముఖంబున నిలిచి తత్పురనివాస
పుణ్యజనులను ద్రుంచితౌ ముదముతోడ
సురుచిరాకార... 19

సీ. కడునొప్పు గోరిజలు వెడఁదటొమ్మును జిలు
     కొద్దివాలము వెన్నుకుఱుచఁదనము
కళలు గుల్కెడుమోము గలపంచకల్యాణి
     హయముకుఁ జికిలికళ్లియము పసిఁడి
పల్లము ముత్యపుజిల్లుల యంకవ
     న్నియలును గైసేసి హొయలు మీఱఁ
బెనువిల్లు తరకసంబును వజ్రపుంబాకుఁ
     గట్టి యుత్తమతురంగంబు నెక్కి-
యవనిఁ దిరిగెదునీదుకల్క్యవతార
విభవ మెన్నంగ నగునె యావిధికి నైన
సురుచిరాకార... 20

సీ. [1]చోఱవై జలనిధి చొచ్చిన కూర్మమై
     కొండ వీఁపున నానుకొనిన ఘోణి
వై నేలత్రవ్విన వరనృసింహంబ వై
     భయపెట్టినను పొట్టిబ్రహ్మచారి
వై దానమడిగిన మేదినీసురుఁడ వై
     రాజులఁ గొట్టినరాజవయ్యు
నడవులుదిరిగిన హాలముమోచిన బుద్ధ
     కలికి రూపములచే వెలసియుండి
నన్ను రక్షింపకున్న వెన్నంటివచ్చి
పట్టి సాధింతు నీబంటుపంత మిటుల, సురు...

1 మత్స్యవిశేషము.

సీ. పాలకడలి వటపత్త్రశయనుఁడ వై
యోగనిద్రాముద్ర నొందియుండి
నను శేషఫణిరాజఘనఫణామండల
సింహాసనంబునఁ జెలఁగియున్న
గరుడవాహన మెక్కి మురియుచు లోకముల్
దిరుగంగఁ బోయిన వరమునీంద్ర
హృదయాంతరంబుల నొదిగి తారుండిన
సూర్యమండలమునఁ జొచ్చియున్న
నన్ను రక్షింపకున్న వెన్నంటి వచ్చి
పట్టి సాధింతు నీబంటుపంత మిటుల
సురుచిరాకార... 22

సీ. తల్లిదయాహీనతను జన్నియనివార్త
యెఱిఁగి పోర్గింటను బెరుగుటయును
దానవిచనుబాలు త్రాని జీవించుట
దొంగిలి వెన్నలు మ్రింగుటయును
జాల రోసి యశోద ఱోలఁ గట్టినసుద్ది
మద్దులు గూల్చినపెద్దఱికము
గొల్లభామలకట్టుకోఁక లెత్తుకపోయి
పొన్న మ్రా నెక్కిసన్న తనము
పసులకాపరి వైనట్టిపలుచఁదనము
చెలఁగి చాటుదు నన్ను రక్షింపకున్న
సురుచిరాకార... 23

సీ. సలలితంబుగ మూఁడునెలలబాలుండవై
బండిఁ దన్నినయట్టిదుండగంబు
వలనొప్ప నేఁడాదివాఁడవై యాతృణా
వర్తునిఁ జంపినధూర్తతనము
క్రేపులఁ గాచుచోఁ గినిసి బకాసురుఁ
బట్టిత్రుంచినయట్టిదిట్టతనము
ఆటలాడుచును వత్సాసురు నదరంట
నెలగోలఁ గొట్టినబలిమి కలిమి
ఖరదనుజుఁ గూల్చినట్టియాచులుకుఁదనము
చెలఁగి చాటుదు నన్ను రక్షింపకున్న
సురుచిరాకార... 24

సీ. గోవుల మనుజుల బ్రోవ గోవర్ధన
గిరిఁ గేల నెత్తినబరవసంబు
సొంపు మీఱఁగ నాయశోదకు ముఖమున
లోకముల్ చూపినభీకరంబు
బలియుఁడ వై గోపభామినీమణులను
దుడుకుపనుల్ సేయుపదుచుఁదనము
పరమేష్ఠి దాఁచిన బాలవత్సములను
బ్రతికల్పనము చేయు చతురతయును
దగిలి కార్చిచ్చు మ్రింగిన తెగువతనము
చెలఁగి చాటుదు నన్ను రక్షింపకున్న
సురుచిరాకార... 25

సీ. ధట్టించి మల్లయుద్ధమునఁ జాణూరునిఁ
బట్టిత్రుంచిన యట్టిదిట్టతనము
అపకీర్తికోడక యవలీలగా మేన
మామను జంపిన తామసంబు
అవినీతుఁ డగుకాలయవనుని ధాటికి
వెఱచి పోయినయట్టి పిఱికితనము
రూఢిగా బావయౌ రుక్మకు నవయుని
మూతి గొరిగినట్టి ములుచదనము
అత్త యగురాధ నంటినయపయశంబు
చెలఁగి చాటుదు నన్ను రక్షింపకున్న
సురుచిరాకార... 26

సీ. పాండవు ల్పంపినపని కియ్యకొనిపోయి
దూతకృత్యము చేయుకౌతుకంబు
విహితబాంధవులను విడిచి విదురువింట
విం దారగించిన పొందికయును
గర్ణదుర్యోధనుల్ దుర్నీతు లై పట్ట
విశ్వరూపముఁ జూపు విభ్రమంబుఁ
జొల్కదనం బని చూడక విజయుని
సారథి వైనట్టి పౌరుషంబు
ఘోటకాసురుఁ దునిమిన పాటవంబు
చెలఁగి చాటుదు నన్ను రక్షింపకున్న
సురుచిరాకార... 27

సీ. ఎలమి సత్రాజిత్తునిల్లుఁ జూడఁగఁబోయి
యలశమంతకమణి కాసపడుట
మణి ప్రసేనుండు ప్రేమను గొనిపోవఁగా
నీవు మానవులచే నిందపడుట
జాడపట్టుకపోయి జాంబవతుం డున్న
గుహఁ జొచ్చి యతనిమార్కొని నిలుచుట
ఆభల్లుకేశ్వరుం డాత్మజాతను మణిఁ
దెచ్చియిచ్చిన బ్రీతిఁ బుచ్చుకొనుట
తెలిసి యపవాద మెల్లను దీర్చుకొనుట
చెలఁగి చాటుదు నన్ను రక్షింపకున్న
సురుచిరాకార... 28

సీ. కేళికిఁ గలియక చాలఁ గోపించిన
యాలికి మ్రొక్కిన జేలుఁదనము
వెలఁదిమాటలు విని యలకల్పవృక్షంబు
నిలకుఁ దెచ్చినయట్టిబలిమికలిమి
నరకాసురుని జూచి వెఱచి యాసత్యకుఁ
జేసాచి విల్లిచ్చుకోఁచదనము
కారియఁ బడియున్నకన్యకాషోడశ
సాహస్రములమీఁద మోహపడుట
గొల్లయిల్లాండ్రమానముల్ కొల్లగొనుట
చెలఁగి చాటుదు నన్ను రక్షింపకున్న
సురుచిరాకార... 29

సీ. ముద్దులుగుల్కు నెమ్మోము నిద్దపుఁదళ్కుఁ
జెక్కులసొబగు నాసికము వెడఁద
కన్నులు జిగినొప్పుకర్ణము లాజాను
దీర్ఘబాహువులు విస్తీర్ణవక్ష
మును సోయగపుమేను తనుమధ్యమును చిన్న
బొజ్జయు నునుగాంతిపొడముతొడలు
చెలువంపుజంఘలు చిత్రితపాదములును
గలిగి యొప్పులకుప్పకరణిఁ దేజ
రిల్లు నినుఁ గన్నతల్లి నారీమతల్లి
దేవకీదేవి భాగ్యంబు దెలియ వశమె
సురుచిరాకార... 30

సీ. లలితముక్తామణిలాలాటికద్యుతుల్
నిటలంబుమీఁదను నృత్యమాడఁ
గాంచనరత్నసంగతరశనాఘంటి
కానినాదము ఘల్లుఘల్లు మనఁగఁ
గరయుగమంజుల కంకణరోచులు
గగనభూభాగముల్ గప్పుకొనఁగ
వెలయంగఁ గరమున వెన్నముద్ద ధరించి
కొత్తకంబళము నొక్కింత దాఁచి
కొనుచు దోఁగాడునిన్నుఁ గన్గొను యశోద
పుణ్యఫల మింత యని చెప్పఁబోల దౌర
సురుచిరాకార... 31

సీ. ధగధగద్ద్యుతులతోఁ దనరుముత్తియముల
రావిరేక నుదుట ఠీవిఁ జూప
రత్నసంఘటితమై రంజిల్లుమద్దికా
యలజోడు చెక్కు లలంకరింపఁ
బులిగోరు నేవళమునఁ గల్గునుకాంతి
గరిమ యురంబునఁ గప్పుకొనఁగ
మణిమయమంజులమంజీరనినదంబు
కడఁగి యొక్కొకసారి ఘల్లుమనఁగ
తప్పటడుగు లిడుచు నాడ నొప్పు నిన్నుఁ
గన్నతల్లియు భాగ్యము నెన్నవశమె?
సురుచిరాకార... 32

సీ. ఆణిముత్తియముల నమరినకుళ్లాయి
శిరమున నొకవింతచెలువు మెఱయఁ
దళతళ మనుపైఁడితళ్కులకుబుసంబు
కమనీయతనునీలకాంతు లీనఁ
బదయుగంబున నున్నపసిఁడిగజ్జలు సారె
కును ఝణంఝణ ఝణంఝణ యనంగ
ముంగిటఁ దిరుగంగ ముద్దులమాటలు
విని నందుఁ డానందమునఁ జెలంగి
యయ్య రావోయి యటుపోకు మనుచునిన్నుఁ
గౌఁగిలించినతండ్రిది గాక ఫలము
సురుచిరాకార... 33

సీ. బెడఁ గైనయట్టిచల్లడము ధరించి పైఁ
డళుకుబంగరువన్నెదట్టి గట్టి
చెలువార సందిట నెలవంకజాళువా
తాయెతుల్ గట్టి కౌశేయశాటి
వల్లెవాటుగ వేసి వాసించుకస్తురి
తిలకంబు నుదుటను దీర్చి శిరము
మూర్కొని చెక్కిళ్లు ముద్దాడుచును దండ్రి
రావోయి యనుచు గారాబముసను
నిన్నుఁ జంకిటు లిడుకొని యున్న యాయ
శోదసౌభాగ్య మెంతని స్తుతి యొనర్తు
సురుచిరాకార... 34

సీ. అమ్మ! ఏమిర యాదవాగ్రణి? గిన్నెదే;
ఏలరా చషకంబు ? పాలు ద్రావ;
నిపుడు దుగ్ధములులేవు; వెప్పుడుగల్గును ?
రాత్రికాలమునందు; రాత్రి యెపుడు?
నంధకారపువేళ; నవినఁ గన్నులుమూసి
యిదె నిశివచ్చెనే యిమ్ము పాన
పాత్రంబుఁ దెమ్మని బలిమి యశోదమ్మ
పైఁటకొం గీడ్చినబాల్యచేష్ట
లన్నియును జూపరులకుఁ జోద్యంబు లగుచు
నేత్రపర్వంబు లౌ నీవిచిత్రమహిమ
సురుచిరాకార... 35

సీ. వెఱువకదినమును బోరుగిండ్లఁ జొరబడి
మీఁగడల్ వెన్నలు మెసవి మెసవి
యుట్లమీఁదటిపాలచట్లు చేయందక
తగురంధ్ర మొనరించి త్రావి త్రావి
పెరుగుకుండలలోన సురువడి చేవెట్టి
సొంపుగా నోకకొంత జుర్రిజుర్రి
యొరులు చూడకయుండ నరిగి యెప్పటియట్ల
తోఁటిబాలురతోడ నాటలాడి
కేరి నవ్వుచుఁ దల్లికౌఁగిట వసించి
తౌర నీచౌర్యమహిమ యేమని నుతింతు
సురుచిరాకార... 36

సీ. ఏమిరా కృష్ణ! మన్నేఁటికిఁ దిన్నావు?
అమ్మ! నేఁ దినలేదు అయ్యతోడు
చిన్నవాండ్రందఱు చెప్పిరి గదవోయి
నీవు వారలమాట నిజము జేసి
విందువా నేనంత వెట్టినా శిశువునా!
ఆఁకొంటినా! చూడవమ్మ నోటి
వాసన యనుచును వక్త్రంబుఁ దెఱచి లో
నాయశోదకును బ్రహ్మాండభాండ
పంక్తులెల్లను దొంతులపగిదిగాను
చెంపుచేసిననిన్ను వర్ణింపఁ దరమె?
సురుచిరాకార... 37

సీ. తనరంగ నాయశోదాదేవి యొకనాఁడు
దధి కుంభమున నించి తరుచుచుండఁ
జని నీవు పెరుఁగుతె మ్మనుచుఁ గవ్వముఁ బట్టు
కొన్న యాకుంచలో గుమ్మఁ డనెడు
బూచి యున్నాఁడురా పొ మ్మని బెదరింప
గుమ్మణ్ణిచూపవే యమ్మ యనుచుఁ
గరమునఁ జేలంబుఁ గట్టిగఁ బట్ట నా
ఘుమ్మనునాదమే గుమ్మఁడనిన
నవ్వు మోమునఁ జిల్కఁ జిన్నారిబొజ్జ
గదల గంతులు వేసినఘనుఁడ వహహా
సురుచిరాకార... 38

సీ. అమ్మ! మీఁగడపాలు తెమ్ము లే లెమ్మని
పాణిపంకజమునఁ బైఁటఁబట్టి
తిగిచినమోము[1]నొద్దికచూచి ముద్దాడి
గిలిగింత లిడుచుఁ గౌఁగిటను జేర్చి
ఔనుర కృష్ణ! నీ వాఁకలి గొన్నావు
బువ్వపెట్టెద నని యవ్వధూటి
మీఁగడపాలతో మేళగించినయోగి
రముఁ దపనీయపాత్రమునను నిచి
చేతి కందీయ మెసఁగినకౌతుకంబుఁ
దలఁచి వర్ణింప నెవ్వారి కలవియగునె, సురుచి...

1 లొద్ది.

సీ. గోపబాలురతోడఁ గూడి నిత్యంబును
వత్సంబులను గాయ నుత్సహించి
నునుబట్టుపచ్చడమును మేనఁ గీలించి
కనకచేలము బిగికాసెఁ గట్టి
పదముల రంజిల్లఁ బాదుకల్ ధరియించి
కరమున సెలగోల నెఱయఁ బట్టి
క్రేపుల నదలించి కేరుచుఁ జెలికాండ్రఁ
జేరుచుఁ జిఱునవ్వు చిల్కు మోము
పూర్ణచంద్రునిరీతిని బోలుపుమిగిలి
వెలయునీగోపవేషము చెలువుఁ దలఁతు
సురుచిరాకార... 40

సీ. మౌళిపైఁ జుట్టినమాయూరబర్హంబు
బలభేదికార్ముకప్రభలు గాఁగ
భువనమోహనమైనమురళీనినాదంబు
పటుతరస్తనితశబ్దంబు గాఁగ
ఘనతరోరఃకనత్కౌస్తుభమణికాంతి
లాలితచంచలాలతిక గాఁగఁ
గమనీయదృక్కోణకరుణారసంబులు
రాజితవర్షనీరములు గాఁగఁ
బ్రావృడంబుదతుల్యవిగ్రహము సొంపు
లలర బృందావనంబున వెలసి తౌర
సురుచిరాకార... 41

సీ. ఏకాంతి గని గోవు లిది కళిందాత్మజా
జల మనుశంకచేఁ జనును ద్రావ
నేదీప్తి నీక్షించి యిది వలాహక మని
మత్తమయూరముల్ నృత్తమాడు
నేరుచిఁ జూచి యాభీరకాంతలు తమా
లచ్ఛళంబు లివియని చిదుమఁ దలఁతు
రేశోభఁ గనుఁగొని యిలలోన శిశువులు
సరసజంబూఫలేచ్ఛను జెలంగి
రట్టి భవదీయమూర్తిమహాప్రభావ
మితరులను భ్రాంతి నొందించు టెంతయరుదు
సురుచిరాకార... 42

సీ. ఆపీతదుగ్ధమై యభినవనవనీత
సంస్నిగ్ధమై ఘనసదృశ మగుచుఁ
గోపాలతాపింఛగుచ్ఛసమాన మై
ముగ్ధమై దధికణదిగ్ధ మగుచు
నమలకేకీంద్రబర్హాలాంఛితము నయి
వాసవోపలసువిలాస మగుచు
నలరుయుష్మద్విగ్రహము భక్తజనమనో
వాంఛితంబును దీర్చు నంచితముగ
భువనమోహనరూప విస్ఫురితశార్ఙ్గ
చాప యదుకులభూషణ చక్రహస్త
సురుచిరాకార... 43

సీ. తతగోఖురోద్ధూతధరణీపరాగంబు
గప్పినకుంతలాగ్రంబుతోడ
సంచరణాయాసజనితఘర్మాంబుకం
దళశోభితామలాననముతోడ
నధరబింబాసక్తపృథుల వేణూద్భవ
నవ్యమాధుర్యగానంబుతోడ
భద్రదంతావళప్రతిమానయానంబు
తోడ గోపాలురతోడఁ గూడి
సంజకడ నీవు రాఁజూచి సంభ్రమమున
ఘోషకాంతలు నీపొందుఁ గోరి రార
సురుచిరాకార... 44

సీ. ఒకనాఁడు గోపికాయూథంబుతోఁ గూడి
కడిమిమ్రోఁ జని కుప్పిగంతు లిడుచు
నొకసారి గుమిగూడి యుల్లాసమునఁ బూని
జోడుదాఁగిలిమూఁత లాడుకొనుచు
నొకవేళ ముదమున నుప్పొంగి కొలఁకుల
సారెకు జలకేళి సలుపుకొనుచు
నొకమాటు నవకుసుమోద్యవనములఁ
బువ్వుల నొండొరుల్ రువ్వుకొనుచు
జెలఁగి యిచ్ఛావిహారంబుఁ జేయునీదు
శైశవక్రీడ లేమని చెప్పువాఁడ
సురుచిరాకార... 45

సీ. ఏరుచి వదనపంకేరుహసంగిభృం
గనివహవ్యామోహకరముఁ దాల్చు
నే బెడంగమలముఖేందుమండలమున
సలలితలాంఛనశంకఁ జూపు
నే కాంతి కుంతలాసీకసూర్యాత్మజా
రమణీయకుల్యాభ్రమము వహించు
నేఛవి దృశ్యమాణేందీవరేక్షణా
చిత్తజబాణమై చెలువు నెఱపు
నట్టికస్తూరితిలకముఁ బెట్టి నుదుట
సతుల వలపించుటకు నెఱజాణ వీవె,సురుచి...

సీ. ఏరవం బభినవాభీరకామినులను
వశలఁగ మోహప్రవశలఁ జేయు
నేనినాదము సూరిమౌనిసంఘములకు
శ్రావ్యమై చిరకాలభవ్య మొసఁగు
నేధ్వని †మృగగోపతండంబులకు మనో
హరముగాఁ దాపాపహరము చేయు
నేశబ్ద మసురకులేశవినాశన
కరముగా హృదయభీకరముఁ జూపు
నార! నీ కేలఁ బట్టినచారువంశ
నాళనినదంబు లంతవిన్నాణ మయ్యె
సురుచిరాకార... 47

† గోగోపమృగసంతతికి.

సీ. కుండంబు నవనీతసుందరగంధవా
    హాలంకృతంబుగా నలరుచుండ
మాటలు తస్కరకోటియుక్తివ్యాజ
    పాటవంబున మీటి తేటపడఁగఁ
గన్నులు కుహనాప్రకారభాసురములై
    జారవిలాససంచరతఁ దెలుపఁ
దరుణాంఘ్రిపంకజద్వంద్వంబు సారెకుఁ
    బటుకరతాండవభ్రమము నెఱప
సొబగు మీఱిననినుఁ జూచుసుదతు లెల్లఁ
బంచశరసాయకంబులపాలు గారె
సురుచిరాకార... 48

సీ. ఎవ్వనిమృదుభాష లిందుబింబాననా
    శ్రవణరంధ్రములకుఁ జవులు గఱపు
నెవ్వనిక్రేఁగంట నెసఁగినచూడ్కులు
    కామినీహృదయముల్ గఱఁగఁజేయు
నెవ్వనిమోవి పైనవ్వు భామాజన
    వరలోచనోత్సవకరము నెఱపు
నెవ్వనిసుందర మిఱుకోదండుని
    భంగి వింతులనెల్ల భ్రమయఁ జేయు
నట్టినీమోహనాకార మవనిలోన
వలపుఁ బుట్టింపదే పతివ్రతలకైన
సురుచిరాకార... 49

సీ. పంతగింపుచు గోపబాలురతోఁగూడి
    కందుకక్రీడలఁ జెందుచున్న
తఱి నొక్కఘోషసుందరి పాడచూపినఁ
    గడువేగ నాకాంతఁ గదియఁ బోయి
యిదె బంతివచ్చె నోయెలనాఁగ నీపైఁట
    కొంగుఁ జూపు మటంచుఁ గుదియఁ బట్టి
కుచములపై నఖకోరకంబులు నిల్పి
    యరసిన బంతి లేదంచు మరలి
మొలకనవ్వులు మోముపైఁ జిలుక వచ్చు
నట్టినీచతురత్వ మేమని వచింతు
సురుచిరాకార... 50

సీ. మందకుఁ జనుచున్నమందయానను జూచి
    వెనుకొనిపోయి వేవేగఁ గదిసి
పెండ్లికూఁతుర నీదుపెనిమిటిపే రేమి
    చెప్పుమా యని కేలు చేతఁ బట్టి
నలుదిక్కు లీక్షించి బలిమిఁ గౌఁగిటఁ జేర్చి
    ఘనమాలతీకుడుంగమున నునిచి
కరములఁ బాలిండ్లు గదియించి బిరబిర
    పలుచనికెమ్మోవిఁ బంట నొక్కి
మారుకేళిని గూడినవేరజంపు
చర్యఁ దలపోయ జనుల కాశ్చర్య మయ్యె
సురుచిరాకార... 51

సీ. పొరుగూరఁ జల్లమ్మఁబోయినగొల్లయి
    ల్లాండ్రను ద్రోవలో నడ్డగించి
వనితలారా మీకు వల్లభు లెవ్వార
    లెందుండుదురు మీర లేకతమునఁ
జిక్కితి రిఁక నేమి చేతురు నాతోడ
    మదనకేళికి రండు ముదముతోడ
ననుచు జంకించి యవ్వారుహాననలఁ
    బొదరిండ్లలోఁ దార్చి భూరిసత్వ
శాలి వై యందఱికి నన్ని చందములను
నల్లపని చేసి విడిచినబల్లిదుఁడవు
సురుచిరాకార... 52

సీ. కౌతుకంబున ఘోషకాంతలు యమునాన
    దీజలకేళిని దేలుచున్న
సమయంబుఁ జూచి వే చని వారివస్త్రంబు
    లన్నియుఁ గొనిపోయి పొన్న యెక్కి
నతివ లంశుకవిహీనాంగలై లజ్జించి
    యతనుమందిరముల హస్త మిడుచు
వలువ లిమ్మని వేఁడ వనితలారా చేతు
    లెత్తి మ్రొక్కినఁ జీర లిత్తు ననుచు
కీరవాణులచేత మ్రొక్కించుకొనుట
యెంత విం తని నే విన్నవింతు నార
సురుచిరాకార.... 53

సీ. కుసుమాపచయకాంక్ష గోపిక ల్వనవాటి
కేగినజాడల నెఱిఁగి వెంటఁ
బడిపోయి వనములోఁ బడఁతులఁ గనుఁగొని
యింతులార! సుమము లిచట లేవు
ముందట మల్లెలు మొల్లలు గల వని
తప్పుమాటలు కొన్ని చెప్పి పొదలు
చొరఁ దీసి బలిమిచేఁ బరిరంభణము చేసి
యధరబింబామృతం బాని యాని
సురతకేళిని వేర్వేఱఁ జొక్కఁ జేసి
తార నీ వెంతనేర్పరి వని నచింతు
సురుచిరాకార... 54

సీ. పాలమ్మఁజనుగొల్లపడఁతులవెనువెంట
నరిగి కాననభూమి నడ్డగించి
బలిమిచే నొకయింతిపాలిండ్లు చెనకుచు
మరియుచు నొకకాంతమోవి నొక్కి
సుందరి నొక్కర్తుఁ జూచి చెక్కిలి మీటి
కామిని నొక్కర్తుఁ గౌఁగిలించి
ముదముతో వారిని మోహావశలనుఁ గా
వించి కంతునికేళి వేడ్క లలర
నందఱికి నన్నిరూపులై పొందినట్టి
నీదుచాతుర్యమహిమ వర్ణింప వశమె
సురుచిరాకార... 55

సీ. బృందావనమున నాభీరకాంతల నెల్ల
దినదినంబును బల్మి నొనరఁగూడి
మాపటివేళల నేపార నిండ్లకుఁ
జని పురుషులు లేనిసదనములను
జొచ్చి కన్యలఁ జూచి మచ్చిక నచ్చిక
బుచ్చిక ల్గావించి పొందుగాను
సరసంబు లాడుచుఁ జక్కిలిగింతలు
పెట్టుచు వారలగుట్టు లరసి
పాన్పుమీఁదటఁ గ్రుంగిలఁబడఁగఁ దిగిచి
ప్రథమసురతంబుఁ గావించుప్రౌఢ వార
సురుచిరాకార... 56

సీ. నందునిసోదరి సుందరీమణి రాధ
యొకనాఁడు నీసొబ గొనరఁ జూచి
రార కృష్ణా యని గారవంబునఁ బిల్వఁ
జని నీవు ప్రేమ నవ్వనరుహాక్షి
మిసమిస మను మేనిపసఁ జూచి సిబ్బెపు
గబ్బిగుబ్బలపోయగంబుఁ గాంచి
తత్తరంబునను మేనత్తని తలఁచక
చేరి కౌఁగిటిలోనఁ జేర్చి కూర్మి
నతనుకేళిని దేల్చినవితతచరిత
మెంత వింతని సారె వర్ణింతు నహహా
సురుచిరాకార... 57

సీ. రాధావధూటి నిరంతరప్రేమాతి
శయభవదర్పితస్వాంత యగుచు
దధిరిక్తమైనట్టిపృథులకుంభంబున
మంథదండంబుఁ బల్మారు పూని
తఱచఁగ నీవును దత్కుచస్తంభచం
చలలోలదృష్టిచే నలరి ధేను
దుగ్ధదోహనముకై తొడరి యాఁబోతును
బిదుకంగఁ బోవుట విదిత మయ్యె
నౌర విహ్వలచిత్తులై యలరినట్టి
యుభయమోహంబు లెంతనియభినుతింతు
సురుచిరాకార... 58

సీ. యమునాతటంబున నమరంగ నొకరాత్రి
నవ్యమాధుర్యగానంబు సేయ
విని గోపకాంతలు విహ్వలస్వాంతలై
పతులను సుతులను బరగ విడిచి
వచ్చి భవన్ముఖవనజంబుఁ బొడగాంచి
విరహాగ్నితప్తలై వేఁడుకొనినఁ
గరుణించి యాఘోషకామినీజనముల
కన్నిరూపములఁ బ్రియం బొనర్చి
రాచకేళిని దేల్చినప్రాభవంబుఁ
జూచి వర్ణింపఁగాఁ దమ్మిచూలివశమె
సురుచిరాకార... 59

సీ. ముదముతో రుక్మిణి గదిసి వీడె మొసంగఁ
దగ సత్యభామ గంధంబుఁ బూయ
జాంబవతీకన్య చామరంబులు వీవ
మిత్రవింద విపంచి మేళవింప
భద్ర దా శ్రీపాదపద్మంబు లొత్తంగఁ
బరగ సుదంత దర్పణముఁ జూపఁ
గాళింది నవపుష్పమాలిక లొసఁగంగ
లక్షణ శయ్య నలంకరింప
స్త్రీలు కొలువున్న వేళలఁ జిత్తభవుని
బలెను శృంగారరసము నీకలరె నార
సురుచిరాకార... 60

సీ. బాణునివీటిలోపల ననిరుద్ధుండు
రుద్ధుఁడై పడియున్న రోష మొదవి
చని వానివాఁకిట నొనరంగఁ గావున్న
హరుని బాణాహతి నురువడించి
యారక్కసునితోడ నదరి కయ్యము చేసి
చతురంగబలములఁ జదియఁగొట్టి
సాహసంబున ఘనచక్రధారను బాణ
దనుజునిబాహువుల్ దునిమి వైచి
విజయశంఖంబుఁ బూరించువేళఁ జూడ
వీరరస మెల్ల నీయందె వెలసె నార
సురుచిరాకార... 61

సీ. ధరణిలో నొకవిప్రవరుఁడు కుచేలుండు
నిరుపేద యైయుండి నెమ్మి నొక్క-
నాఁడు భవద్దర్శనముఁ గోరి తనజీర్ణ
పటముకొంగునఁ గొణిదెఁ డటుకు లునిచి
కొనివచ్చి నినుఁ గాంచి యొసర దీవించిన
నేమి తెచ్చితి వని ప్రేమతోడ
నరసి యాపృథుకముల్ కరమున నిడుకొని
భక్షణం బొనరింపఁ దక్షణమున
వితతసామ్రాజ్యవిభవసంగతునిఁ జేసి
నట్టికరుణారసంబు నీ కమరె నార
సురుచిరాకార... 62

సీ. బలభేది యలుకతోఁ బటుతరమేఘజా
లములను విడిచి శిలాప్రయుక్త
వర్షంబుఁ గురియింప వల్లవజనమును
గోవులు భీతి నాకులత నొంద
వీక్షించి మీరేల వెఱచెద రని వారి
నందఱ నావులమందఁ దోలు
కొనుచు రమ్మని పోయి గోవర్ధనాచలం
బిరవుగా నొకకేల నెత్తిపట్టి
సర్వజీవుల నెల్ల రక్షణముచేసి
నట్టియద్భుతరసము నీ కలరె నార
సురుచిరాకార... 63

సీ. రుక్మిణికోఱకు నై రూఢిగా భీష్మక
నగరంబుఁ జొచ్చి యాఖగకులేంద్రుఁ
డమరనాథుని గెల్చి యమృతంబుఁ గైకొన్న
కరణి చైద్యాదుల నురుమడించి
పుష్పగంధిని గొనిపోవఁగ రుక్మకుం
డదె పోకు మని వెంటనంటి వాఁడి
నారసంబుల నేయ నవ్వి యాతనిఁ బట్టి
బావ రమ్మని శితభల్లములను
దలయు మూతియు రేవు లై తనర గొరిగి
నట్టిహాస్యరసంబు నీ కలరె నౌర
సురుచిరాకార... 64

సీ. మధురాపురంబు నెమ్మది నేలుచుండఁగఁ
జతురంగబలసముచ్చయము తోడ
నడరి జరాసంధుఁ డతికోపఘూర్ణిత
హృదయుఁ డై దాడిగాఁ బోదివి నిన్నుఁ
గదనంబునకుఁ బిల్వ మదిలోన నూహించి
నగరంబు వెడలి కాననముఁ జొచ్చి
కొండఁ బ్రాఁకినఁ జూచి ఘోరదావానలం
బిడిన నందుండక కడురయమున
ద్వారకాపుర మరవుగాఁ జేరి యుండి
నట్టిభయరస మవ్వేళ కలరె నౌర!
సురుచిరాకార... 65

సీ. ధరణిఁ బౌండ్రకుఁ డనునరపాలకుఁడు భవ
చ్చిహ్నము ల్దాల్చి ప్రసిద్ధముగను
వాసుదేవుఁడ నేను వసుధలో నాకంటె
విక్రమశాలి యేవీరుఁ డనుచు
దూత నంపిన విని తోడిఁబడ వానిపైఁ
జని రోషమున ఘోరసంగరమునఁ
బటుశరవహ్నిచే బలముల సమయించి
కరితురంగములఁ జీకాకుచేసి
యతనితలఁద్రుంచి వైచినయట్టితతిని
జెలఁగి బీభత్సరసము నీ కలరె నార!
సురుచిరాకార... 66

సీ. కౌరవపాండవుల్ ఘోరయుద్ధముఁ జేయు
తఱి నరసారథిత్వము వహించి
యరదంబుఁ గడపంగ నురవడి భీష్ముండు
విజయునిపై బాణవిసరములను
జొనిపి గర్వము మీఱి సునిశితశరము నీ
యురము నాటించినఁ గెరలి నీవు
ధరణిపైఁ గుప్పించి యురికి చక్రము చేతఁ
బట్టి యామిన్నేటిపట్టిమీఁద
నరుగఁ బార్థుండు మన్నింపు మని మరల్చు
నపుడు రౌద్రరసంబు నీకలరె నార!
సురుచిరాకార... 67

సీ. ధర్మపుత్రుఁడు మహాధ్వరముఁ జేసెడు వేడ్కఁ
బూని నానాదేశ భూపతులను
బిలిపించి హితబంధువులను రావించి పే
రోలగం బుండెడు వేళయందుఁ
బటుమదాంధుఁడు శిశుపాలుండు నినుఁ జూచి
పూర్వవైరముఁ దలపోసి కొన్ని
ప్రల్లదంబులు వల్కఁ బ్రతిభాషలాడక
యూరకుండితి వేమికారణంబొ
కాని తెలియదు లోకప్రకాశ మైన
శాంతరస ముప్పతిల్లె నీసమ్ముఖమున
సురుచిరాకార... 68

సీ. సతులు శృంగారంబు దితిజులు వీరంబు
భూసురు ల్కరుణ యద్భుతము జనులు
హాస్యంబు రుక్మకుం డలజరాసంధుండు
భయము పౌండ్రకుఁడు బీభత్సరసము
రౌద్రంబు భీష్ముండు రమణీయశాంతంబు
శిశుపాలుఁ డెఱుఁగంగఁ జేయునట్టి
నవరసాలంకారభవదీయనామంబు
పగ నైన వగ నైన బాంధవమున
నైన భీతిని నైన యిం పొనరఁ దలఁచు
నరుల కంటనిగందురు దురితచయము
సురుచిరాకార... 69

సీ. న్యాయమార్గముఁ దప్పి నరులను వేధింప
రాజు గాఁ డతఁడు తరాజు గాని
పతిభక్తి విడిచి సంపద నొందుజవరాలు
ఆలు గా దది నీచురాలు గాని
తల్లిదండ్రులమాట దాఁటిన సుతుఁడు దా
సుతుఁడు గాఁ డతఁడు కుత్సితుఁడు గాని
అతిథిభాగవతుల నర్చింపలేనిల్లు
యిల్లు గా దది పట్టిపొల్లు గాని
పరమధర్మజ్ఞుఁడే రాజు భక్తిగలది
యాలు సుగుణుండె కొడుకు పూజార్హ మిల్లు
సురుచిరాకార... 70

సీ. కరణంబు కాఁపులు గలహించుచుండిరా
యూరుగా దది లత్తుకోరు గాని
అర్థులు వేఁడిన నడియాస వెట్టినా
దాతగాఁ డాతఁడు ప్రేత గాని
ధనమిచ్చుదాతపద్యము చదువఁడ యేని
వంది గాఁ డాతఁడు పంది గాని
సురుచిరసచ్ఛబ్దశుద్ధి లేకుండెనా
సుకవి కాఁ డాతఁడు కుకవి గాని
వైర ముడిగిన దూరిదువాఁడె దాత
చదువు గలవాఁడె భట్టు వాగ్ధురిణు సుకవి
సురుచిరాకార... 71

సీ. వినయంబు గలకాంత విడిచి వర్తించెనా
విభుఁడు గాఁ డతఁడు రాసభుఁడు గాని
గురుమంత్ర మెదలోన గుప్తంబు సేయఁడే
నరుఁడు కాఁ డతఁడు వానరుఁడు గాని
ప్రేమతోఁ జన్నిచ్చి పెంచకయుండెనా
తల్లి గా దది మ్రాఁకుతల్లి గాని
ప్రభువు చెప్పినయట్టి పనికి మాఱాడెనా
భటుఁడు గాఁ డతఁడు దుర్భటుఁడు గాని
గుణము గలవాఁడె పతి మంత్రగోప్త జనుఁడు
పెంచినది మాత పసులు గావింప బంటు
సురుచిరాకార... 72

సీ. ఆమయఘ్నం బైనయౌషధజ్ఞుఁడు గాని
వెజ్జు గాఁ డాతఁడు జజ్జు గాని
చతురుపాయంబులసరణిఁ దెలియనిమంత్రి
మంత్రి గాఁ డతఁడు దుర్మంత్రి గాని
విదితనానాశాస్త్రవేది గానిబుధుండు
బుధుఁడు గాఁ డతఁడు బుద్బుదుఁడు గాని
శమదమానుష్ఠానసమితిఁ దాల్పక యున్న
దపసి గాఁ డతఁడు కుతపసిగాని
[1]ప్రాజ్ఞుఁడే వెజ్జు సదుపాయపరుఁడె సచివుఁ
డర్థవేదియె సూరి బ్రహ్మజ్ఞుఁడె మునిసురుచి...

---

1 శాస్త్రివైద్యుండు.

సీ. ప్రియముతో రమ్మని పిలిచిపెట్టనికూడు
కూడు గా దది పుట్టగూడు గాని
భోగదానములనుఁ బొందరానిధనంబు
ధనము గా దది వన్నెదనము గాని
సత్యవాక్యము నిల్పఁ జాలనినరుజిహ్వ
జిహ్వ గా దది గోధిజిహ్వ గాని
పరుల కుపకారంబు పట్టిసేయని బ్రతుకు
బ్రతుకు గా దది రోఁతబ్రతుకుగాని
దయగలది భోజ్య మక్కరధనము ధనము
నిలుకడది నాల్క యుపకృతినియతి బ్రతుకు
సురుచిరాకార... 74

సీ. సరసాన్నములఁ దృప్తిసలుపఁజాలని పెండ్లి
పెండ్లి గా దది దూబపెండ్లి గాని
ఆరసి తారతమ్యము లెఱుంగని పెద్ద
పెద్ద కాఁ డాతఁడు గ్రద్ద గాని
వినయమ్ము లేక వేవే లొసంగిన యీవి
యీవి గా దది మంటిదీవి గాని
బంధువుల్ సమ్మతపడనట్టిశుభము దా
శుభము గా దది విపన్నిభము గాని
తృప్తిఁ బొందినదే పెండ్లి తీర్పె పెద్ద
తనదువినయమె యీవి బాంధవమె శుభము
సురుచిరాకార... 75

సీ. వల పెంతగల్గిన వారకాంతలమాట
మాట గా దది నీళ్లమూట గాని
కుల మెంతగల్గినఁ గులహీనుతోఁ జెల్మి
చెల్మి గా దది పాముచెల్మి గాని
నెల వెంతకల్గిన నీచులతోఁ బొందు
పొందు గా దది పెట్టుమందు గాని
ధన మెంత గల్గినఁ దా విజాతులసేవ
సేవ గా దది చెడుత్రోవ గాని
మానినిది మాట సుగుణిది మంచితనము
ఘనునితోఁ బొత్తు సత్కులజునిది సేవ
సురుచిరాకార... 76

సీ. పరగ శ్రీవైష్ణవార్పణము సేయనికల్మి
కల్మి గా దది పెద్దకొల్మి గాని
పరమభాగవతసంస్పర్శఁ జెందని నోము
నోము గా దది పెనుగోము గాని
హరిదాసచరణానుసరము గానిజలంబు
జలము గా దదియె కజ్జలము గాని
కమలాక్షభక్తసంగతిఁ గోరనిత్రిదండి
దండి గాఁ డతఁడు త్రిదండి గాని
వైష్ణవార్పణసిరి భాగవతమె నోము
ముక్తసంగుఁడె యతి తీర్థములె పదములు
సురుచిరాకార... 77

సీ. స్థిరబుద్ధితో నిన్నుఁ జింతసేయనిదినము
        దినము గా దది యె దుర్దినము గాని
    వితతమౌ నీకథ ల్వినకయుండిన చెవుల్
        చెవులు గా వవి కొండగవులు గాని
    భవదీయనామము ల్పలుకకుండిననోరు
        నోరు గా దది డక్కతీరు గాని
    సొంపుగా నీమూర్తి సొబగుఁ గాననికనుల్
        కనులు గా వవి నీటిదొనలు గాని
    చింతగలదియె తిథి విన్కిఁ జెలఁగు శ్రుతులు
    పఠనగలదియె నోరు చూపరయ కనులు
    సురుచిరాకార.... 78

సీ. సతతంబు నీప్రదక్షిణము సేయనికాళ్లు
        కాళ్లు గా వవి మరగాళ్లు గాని
    అనయము నీపదార్చనము సేయనికరము
        కరము గా దది దర్వీకరము గాని
    భవదలంకృతసుమభ్రమతఁ జెందనిముక్కు
        ముక్కు గా దది పందిముక్కు గాని
    చేరి యుష్మత్కథల్ చింతసేయనిబుద్ధి
        బుద్ధి గా దది పాపవృద్ధి గాని
    వలగొనిన వంఘ్రులును పూజగలవి చేతు
    లలరువాసనఁగొను నాస మతిశమగతి
    సురుచిరాకార... 79

సీ. మంత్రప్రభూత్సాహ మహితశక్తిత్రయం
బును రజస్సత్త్వతమోగుణంబు
లును దానధర్మపరోపకారంబులు
వరభవిష్యద్భూత వర్తమాన
ములు లయస్థితి జన్మములు శైత్యమాంద్యసౌ
రభ్యాది లక్షణత్రయము లెఱిఁగి
సరసవేదపురాణ శాస్త్రేతిహాసాది
విద్యాచతుష్టయ విభవ మరసి
నడచుకొను మానవేశుండు పుడమిలోనఁ
బ్రణుతిఁ గాంచును దా సభాపతి యనంగ
సురుచిరాకార.... 80

సీ. ఘనమనోవాక్కాయకర్మంబులను ధర్మ
కామార్థమోక్షము ల్వేఁడు నెఱిఁగి
రథగజాశ్వపదాతిరమణీయచతురంగ
బలసమేతుఁ డగుచు బ్రహ్మచారి
భిక్షువానప్రస్థపితృమాతృబంధుగృ
హస్థులఁ గరుణచే నరసికొనుచుఁ
దగ సామఋగ్యజురథర్వణవేత్త లౌ
భూసురోత్తములను బూజచేసి
వెలయు నరపాలచంద్రుఁ డీయిలను మిగులఁ
బ్రణుతి కెక్కును దా సభాపతి యనంగ
సురుచిరాకార... 81

సీ. అరయఁ బ్రభాతమధ్యాహ్నసాయంకాల
ములను సంధ్యాదికములను దీర్చి
ఘనతరావాహనీయగార్హపత్యసుదక్షి
ణాగ్ని హోత్రులకు హవ్యము లొసంగి
యంశుకాభరణగంధాదిచతుర్విధ
శృంగారములఁ గడు రంగు మీఱి
ధరణిఁ గృతత్రేతద్వాపరకలియుగ
ధర్మప్రవర్తనఁ దనరఁ బ్రజలఁ
గరుణ నేలినరాజశేఖరుఁడై జగతిఁ
బరిఢవిల్లును దా సభాపతి యనంగ
సురుచిరాకార... 82

సీ. భూజలతేజోనభోవాయుపంచక
భూతాత్మకుఁడ వని బుద్ధి నెఱిఁగి
యలరుప్రాణాపానవ్యానాదిప్రాణవా
యువు లున్నతావుల యుక్తిఁ దెలిసి
రూఢి శబ్దస్పర్శరూపరసగంధంబు
లేనింటియందలి యెఱుక గలిగి
త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణవిర్మల
పంచేంద్రియంబులఁ బదిలుఁ డగుచు
వెలయ భూపాలముఖ్యులఁ డీవిశ్వమునను
బ్రస్తుతికి నెక్కు దా సభాపతి యనంగ
సురుచిరాకార... 83

సీ. మాఘురఘువంశకుమారసంభవమేఘ
సందేశభారవిసముదయార్థ
మెఱిఁగి భాట్టప్రభాకరతర్కమీమాంస
వేదాంతవైశేషికాదికములు
దెలిసి వ్యాకరణజ్యోతిషకల్పశిక్షాని
రుక్తఛందస్సుల యుక్తికలిగి
యాజనాధ్యాపకాధ్యయనదానప్రతి
గ్రహయజనాఖ్యషట్కర్మనిరతు
లైనవిప్రుల నరసినమానవేశుఁ
డతులగతి నొప్పుఁ దా సభాపతి యనంగ
సురుచిరాకార... 84

సీ. ఘనహరిశ్చంద్రసగరపురూరవనల
పురుకుత్సకార్తవీర్యులచరిత్ర
మెఱిఁగి పౌరాణికపరిహాసవిద్వాంస
భటకవిసప్తాంగభరితుఁ డగుచు
ధనధాన్యవస్తువాహనమిత్రసంతాన
బాంధవాద్యష్టసంపదలు గలిగి
నిధితటాకారామనిర్జరాలయకృతి
భూసురస్థాపనపుత్త్రు లనెడు
సప్తసంతానములను బ్రశస్తుఁ డైన
ప్రభువునకుఁ జెల్లుఁ దా సభాపతి యనంగ
సురుచిరాకార... 85

సీ. భోజనవస్త్రతాంబూలగంధప్రియ
        కామినీసంగీతకనకభూష
ణాదుల మృదుశయ్య లనఁ దగునష్టభో
        గము లనుభవింపుచుఁ గటుకషాయ
తిక్తామ్లమధురవార్ధిజముఖ్యషడ్రస
        ముల నెఱుఁగుచు భక్ష్యభోజ్యలేహ్య
పానీయచోష్యసుపంచవిధాహార
        ముల నతిథులఁ దృప్తి బొందఁజేసి
చెలఁగి విహరించుమనుజుఁడే తితితలమునఁ
బ్రతిభఁ గాంచును దా సభాపతి యనంగ
సురుచిరాకార... 86

సీ. వీర బీభత్సశృంగారకరుణాద్భుత
        శాంతాదినవరసస్వాంతుఁ డగుచుఁ
గులరూపయౌవనస్థలధనవిద్యాప్ర
        భుత్వాష్టమదములఁ జెనఁగుగొనక
నిధిజలపాషాణనిక్షేపకక్షోణి
        కాగామిసిద్ధసాధ్యస్వంబు లనెడి
యష్టభోగములతో నైనగృహారామ
        క్షేత్రముల్ భూసురశ్రేణి కొసఁగు
పురుషసింహుండు వెలయు నీపుడమిలోన
వితతయశుఁ డనఁ దా సభాపతి యనంగ
సురుచిరాకార... 87

సీ. శాల్మలిప్లక్షకుశక్రౌంచపుష్కర
శాకజంబూద్వీపసరణి విజయ
శాసనంబులు నిల్పి చంద్రసూర్యాంగార
కాదిగ్రహబలవిహారుఁ డగుచు
సంస్కృతమగధపైశాచికప్రాకృతా
పభ్రంశకాద్యష్టభాష లెఱింగి
శబ్దవిరోధదుస్సంధిపునరుక్తిఛం
దోభంగముఖదశదోషరహితు
లైనకవిరాజులను బ్రీతి నరసికొనినఁ
బ్రాజ్ఞుఁడై యొప్పుఁ దా సభాపతి యనంగ
సురుచిరాకార... 88

సీ. అంగలాటదశార్ణకాంగకాంభోజకే
కయఘూర్జరకిరాతగౌళసాల్వ
బాహ్లీకశాల్మలబార్బరనేపాళ
పాంచాలమలయాళపాండ్యమత్స్య
సౌరాష్ట్రకోసలసౌవీరటెంకణ
కొంకణగాంధారకురుయుగంధ
రాంధ్రకళింగమహారాష్ట్రమాళవ
ప్రముఖషట్పంచాశద్దేశములభాష
లెఱింగి ధర్మప్రవర్తనఁ దిరుగురాజు
భాసిలుచు నుండుఁ దా సభాపతి యనంగ
సురుచిరాకార... 89

సీ. కేశవ మాధవ కృష్ణ హృషీకేశ
వామ నాచ్యుత హరి వాసుదేవ
దామోద రానిరుద్ధ జనార్దన నృసింహ
ప్రద్యుమ్న గోవింద పద్మనాభ
నారాయణోపేంద్ర ధీర మధుసూదన
శ్రీధ రాధోక్షజ శ్రీశ విష్ణు
సత్పుండరీకాక్ష సంకర్షణ త్రివి
క్రమ యనునామముల్ క్రమముతోడ
నేనరుండైనఁ బఠియింప నిహపరముల
సౌఖ్య మొసఁగుదు వఁట యెంతసదయమతివి
సురుచిరాకార... 90

సీ. ధరలోన నేజాతినరుఁడైన శంఖచ
క్రాంకితుఁడై భక్తి నలరెనేని
చిద్రోర్ధ్వపుండ్రంబుఁ జెన్నుమీఱ ధరించి
దాసనామంబునఁ దనరెనేని
మదిని అష్టాక్షరీమంత్రజపం బొన
రించి వనమాల వహించునేని
సద్గురుకృపచేతఁ బరమార్థవిభవంబుఁ
దెలిసి పరతంత్రుఁడై నిలిచెనేని
యతనికలుషము లెల్లను హతముచేసి
పరమపద మిత్తు వఁట యెంత సరసమతివి
సురుచిరాకార.... 91

సీ. ప్రహ్లాద నారద బలి భీష్మ రుక్మాంగ
దార్జున పుండరీ కాంబరీష
సనకసనందన శౌనక వ్యాస ప
రాశర ధ్రువ బాదరాయణ గుహ
విదుర విభీషణ వినతాతనూభవ
గజరాజ వాల్మీకి భుజగనాథ
పవనతనూజ యుద్ధవ వసిష్ఠాదిభా
గవతోత్తములు నీదుకరుణఁ బడసి
తావకీయాంఘ్రిసేవలఁ దగిలి జన్మ
రహితులై కాంచి రంట భవన్మహితపదవి
సురుచిరాకార... 92

సీ. హాలకులిశాంకుశ జలజశంఖరథాంగ
కల్పకరేఖాప్రకాశితములు
అభినవవికసనహల్లకదళనిభ
పరిపూర్ణశోణభాభాసురములు
హారజటాజూటసన్నృత్యత్తరంగోజ్జ్వల
గంగానదీజన్మకారణములు
అఖిలమౌనీంద్రహృదంతర రంగస్థ
లస్ఫురన్నాట్యవిలాసములును
భద్రకరములు భవదీయపదయుగములు
నామనోవీథి నిలుపవే నలిననాభ
సురుచిరాకార... 93

సీ. సకలయోనులయందు జన్మించి జన్మించి
దినమును బొట్టకై తిరిగి తిరిగి
యున్మత్తవృత్తిచే నుప్పొంగి యుప్పొంగి
పంచేంద్రియవ్యాప్తిఁ బరగి పరగి
కలుషజాలంబులు గావించి కావించి
మొగిని సంసారాబ్ధి మునిఁగి మునిఁగి
తనుజరాభారంబుఁ దాలిచి తాలిచి
నరవిఁ గొన్నాళ్లకుఁ జచ్చి చచ్చి
మరలఁ బుట్టంగలేక నీచరణయుగళ
సేవఁ గోరితి నను దయఁ గావవలయు
సురుచిరాకార... 94

సీ. మర్యాదరహితుఁడ మదనపరవశుండ
వంచనాపరుఁడను గొంచెగాఁడఁ
గఠినహృదయుఁడ దుష్కర్ముఁడ నీచుండ
గురుపాతకుఁడ గృతఘ్నుఁడను దురభి
మానిని లోభిని మత్సరయుతుఁడను
దుర్గుణుండను గురుద్రోహి నైన
నావంటియజ్ఞాను నేవిధంబున నీదు
దయకుఁ బాత్రునిగాఁగఁ దలఁచకున్నఁ
బతితపావనబిరుదు యేపట్ల నీకు
నిలువఁబోవదు సుమ్ము భూతలమునందు
సురుచిరాకార... 95

సీ. పుత్త్రమిత్త్రకళత్త్రపూరితసంసార
జలధికి నావ మీచరణసేవ
బహుజన్మసంచితపటుఘోరపాతక
సముదయాభావ మీచరణసేవ
బధిరాంధశాబకపశుపక్షిసుజ్ఞాన
జననప్రభావ మీచరణసేవ
శాశ్వతమహనీయసాయుజ్యపదవికిఁ
జక్కనిత్రోవ మీచరణసేవ
యనుచు వేదాంతసిద్ధమై యలరుచుండుఁ
గాన భవదంఘ్రిసేవయ కలుగఁజేయు
సురుచిరాకార... 96

సీ. కఠినతరాజ్ఞానఘనతిమిరార్యమ
కిరణముల్ మీనామకీర్తనములు
చటులదురింద్రియసర్పసముచ్చయ
కేకులు మీనామకీర్తనములు
కలుషౌఘదుర్గమకాననదావాగ్ని
కీలలు మీనామకీర్తనములు
మహితారిషడ్వర్గమదగజసంచయ
కేసరుల్ మీనామకీర్తనములు
గాన మామకహృదయరంగస్థలమున
నర్తనక్రీడ నల్పు మనాథనాథ
సురుచిరాకార... 97

సీ. జపహోమసంధ్యాదిసత్క్రియల్ జేసిన
నుపవాసములఁ గార్శ్య మొందియున్నఁ
బుణ్యస్థలంబులు పోయి సేవించిన
మానక దానముల్ పోయి సేయఁ
గాశీప్రయాగగంగానదీస్థలముల
సకలధర్మంబులు సలుపు చున్న
సారె ధనుఃకోటి స్నానంబు చేసిన
భక్తి నీయెడ లేక ముక్తి లేదు
కాన నీపదపంకజధ్యానపరుని
గా నొనర్పుము కరుణించి కమలనాభ
సురుచిరాకార... 98

సీ. అల యజామీళునికలుషంబు లెడలించి
యెలమితో సాయుజ్య మీయ లేదె?
అపకార మొనరించినట్టి కాకాసురుఁ
గృపతోడఁ జూచి రక్షింప లేదె?
పగవానితమ్ముని మృగధరార్కస్థాయి
గా లంకఁ బట్టంబు గట్ట లేదె?
సభలోన నపరాధశతము పల్కినయట్టి
శిశుపాలు నాత్మలోఁ జొనుప లేదె
నీదయారస మొరులు వర్ణింపఁ గలరె
నన్ను గరుణింపు మిదె నీకు విన్నపంబు
సురుచిరాకార... 99

సీ. జపహోమసత్క్రియల్ సలుపంగ నోప నే
నుపవాసములఁ గ్రుస్సి యుండ నోప
పుణ్యస్థలంబులు పోయి చూడఁగ నోప
స్నానసంధ్యావిధుల్ పూన నోప
కాశి గంగాప్రయాగములకుఁ బో నోప
సకలధర్మంబులు జరుప నోప
అఖిలవ్రతంబుల నాచరింపఁగ నోప
నిరతాన్నదానంబు నెఱప నోపఁ
గనుక నీదాసపఖ్యంబుఁ గలుగఁజేసి
నీదునామంబు జిహ్వను బాదుకొలుపు
సురుచిరాకార... 100

సీ. నాలుక కేశవనామము నొడువుము
చిత్తమా హరిమీఁదఁ జింత నిలుపు
పాణియుగంబ శ్రీపతిపూజ సేయుము
కర్ణద్వయమ విష్ణుకథలు వినుము
పదయుగ శ్రీధరభవనంబు వలగొను
నయనయుగ్మమ యదునాథుఁ జూడు
నాసాపుటమ జగన్నాయకశ్రీపాద
తులసి నాఘ్రాణించు మలర ననుచు
నవయవంబుల మనవిగా నడుగుకొంటి
విన్నపము లెంత్రచేసియు వేఁడుకొంటి
సురుచిరాకార... 101

సీ. శ్రీరాజగోపాలశేఖరవరమహో
న్నతగోపురంబు ఉన్నవపురంబు
సర్వాంసహాచక్రసంచరద్భారతీ
నాట్యరంగంబు ఉన్నవపురంబు
కామితాఖిలవస్తుకల్పనారుచిరాభి
నవగోపురంబు ఉన్నవపురంబు
సలలితనిర్మలసలిలధారాపూర
నలినాకరంబు ఉన్నవపురంబు
నవనిధిశ్రీకరంబు ఉన్నవపురంబు
నరసఖస్థావరంబు ఉన్నవపురంబు
సురుచిరాకార ఉన్నవపురవిహార
రాజగోపాల రాధామనోజఖేల. 102

తే. శ్రీరమణీకుచకుంభిత
టీరవ్యకురంగమదపటీరసుగంధ
వ్యారోపితవక్షస్థల
గోపతిపరిపాలరాజగోపాలహరీ!

రాజగోపాలశతకము
సంపూర్ణము.

# పీఠిక.

ఈ మానసబోధశతకమును తాడేపల్లి పానకాల రాయఁడను కవి రచించెను. కవి కాలము కులము గోత్రాదికము తెలుసుకొనుటకుఁ దగిన యాధారము లీశతకమునందుఁ గనఁబడవు. చిత్తబోధ శతకమునఁ గల విప్రుఁడనను విశేషమువలనఁ గవి బ్రాహ్మణుఁ డని నిశ్చయింప వీలుచిక్కినది. పానకాలు కవి పై రెండుశతకములే గాక పార్థసారథిశతకము రామ శతకము లక్ష్మీదేవిశతకము నృసింహస్వామిశతకము రుక్మిణీపతిశతకము నేత్రదర్పణమను వైద్యశాస్త్రము రచించెను. నేత్రదర్పణములోనిదగు

"సీ. శ్రీవత్సగోత్రుఁ డంచితపటుశాస్త్ర సం
ఖ్యావసీ దేవకులాగ్రగణ్యుఁ
డగు తాడెపల్లి...
పానకాలరాయుఁ డనువాఁడ..."

అను పద్యమువలన నీకవి శ్రీవత్సగోత్రుఁడనియు నాలువేలనియోగియనియుఁ దెలియును. నేత్రదర్ప ణములోని

"సీ. గీ. సీటుగానెన్నఁదగుఁ గొండవీటిసీమ. ..."

వ. అట్టిసీమాప్రదేశంబునను దగ్భాగంబున...కృష్ణా తీరంబున...

కం. పదపడి ముదమలరు తాడెపల్లిధరిత్రిన్."

అను పద్యములవలన తాడేపల్లి పానకాలుకవి బెజవాడకుఁ జెంతగల తాడేపల్లినివాసి. పానకాలుకవి మానసబోధశతకము వ్రాసి హరికి సమర్పించెను. కాసులపురుషోత్తముఁడు తానొక మానసబోధశతకము రచించెను. అది ప్రకృత మనుపలభ్యమగుటవలన నీకవి దానిని దొంగలించి మార్చికొనియుండునని శతకకవిచరిత్రకారులు వావిడిచియున్నారు. పానకాలకవి చౌర్య మొనరించెననుటకుఁ దగినన్ని దృష్టాంతములు సంపాదింపక పురుషోత్తమకవి శతకము కానరానంతన నిటులనెంచుట ప్రమాదమనఁదగును. నూటయిరువది సంవత్సరములనాఁటి రామదాసుచరిత్రములో నీమానసబోధశతకములోని పద్యము లుదహరింపఁబడుటవలన నీపానకాలుకవి నూటయేబది సంవత్సరముల కించుక పైకాలమువాఁడనితోఁచును. ఇతనిగ్రంథములు లక్షణగ్రంథములలో నుదాహరింపఁబడక పోవుటవలన నంతకుఁ బైవాఁడని తెలుప వీలులేదు.

మానసబోధశతకము కేవలభగవచ్చింతనముతో భక్తిరసప్రతిపాదకముగ నున్నది. ఈశతకము మానససరాజయోగ సంధాయకమని కవి చెప్పినమాట సత్యము. శ్రీమహాత్ముని లీలావతారముల నభివర్ణించుచు మనమునందుఁ జొన్పుటయే నైహికములను దరించువిధమని కవిమృదుమధుర కవితాస్నిగ్ధమగు సుకుమారవచనములతో నుడివి పామరజనుల భగవచ్చింతనమునకుఁ బురికొల్పుచున్నాఁడు. ఇందలిపద్యము లైహికబంధములు నిస్సారములనియుఁ గళేబరము మలమూత్రస్విన్నము గావున దానిపై మమకారము బెట్టుకొనరాదనియు జన్మబంధదూరమగు పరమాత్ముని సన్నిధిజేరుటకుఁ బ్రయత్నించుమనియు బోధించుచున్నవి. ప్రజాసామాన్యమునం దీశతకము మిగుల వ్యాప్తినొందియుంటయే దీని యుత్కృష్టతకొక దృష్టాంతము.

చిత్తబోధశతక మనునది యొకటి యీకవిపేరుతోఁ గానవచ్చుచున్నది. దానిశైలియు ధారయు విషయ సమీకరణము మానసబోధశతకమునకు మిగుల చేరువలో నున్నది. ఈశతకనిర్మాతయగు

పానకాలురాయఁడే బాల్యావస్థలో చిత్తబోధశతక
మువ్రాసి తృప్తికరముగ నుండమిచేఁ బ్రౌఢవయ
స్సులో మానసబోధశతకము వ్రాసెనేమో యని
తోఁచుచున్నది. కవి వృత్తము దెలుపుపద్యము ఇం
చుకమార్పుతో రెండుపాత్తములలో నొకేవిధము
గా నుంటయుఁగూడ శతకద్వయ మేకకర్తృక మన
సాహసము కలిగించుచున్నది.

నందిగామ. }
1-1-25 }

ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు

375

శ్రీ ర స్తు.

తాడేపల్లి పానకాలరాయ కవికృత

# మానసబోధశతకము.

---

ఉ. శ్రీరమణీమణీహృదయసేవితముల్ నవఫుల్లహల్ల
క, శ్రీరమణీయసుందరవిశేషవిలాసము లబ్జసంభ
వో, దారకిరీటరత్నలలితద్యుతిపూర్ణములక్ష్యగాప
గా, సారతరంబు లంచు మనసా హరిపాదము
లాశ్రయింపుమా. 1

ఉ. దండిగఁ జట్టుఱాతిని యథావిధి నంగనగా నొ
నర్చె ను, ద్దండతఁ గొండచిల్వను ముదంబునఁ
జేసెను దివ్యదేహింగాఁ, బండితులైనవారి నెడఁ
బాయక బ్రహ్మపదంబుఁ జేర్చె నీ, చండితనంబు
మాని మనసా హరిపాదము లాశ్రయింపుమా. 2

చ. సనకసనందనాదిమునిసత్తము లుత్తమభక్తియుక్తి
సా, ధనమున నంబుజాక్షునిపదంబుల సేవ యొ
నర్చి ధన్యులై, మనుట యెఱింగి యింకఁ గొఱ
మాలినవారల వేడనేల నీ, వనవరతానురక్తి
మనసా హరి... 3

ఉ. సారము లేనిసంసరణసాగర మీఁదఁగ లేకఁ
జాల వే, సారుచుఁ గర్మబంధములఁ జచ్చుచుఁ
బుట్టుచు సారెసారెకున్, దారుణకాలకింకరుల
దండనకోరువలేవుగాన వి, స్తారసుఖంబు గల్గు
మనసా హరి... 4

చ. పరిపరికర్మబంధములఁ బాయక పుట్టుచుగిట్టుచున్
మహా,దురితకళంకపంకమునఁ దూఁగుచు సంసర
ణానుబంధ దు, స్తరజలధిన్ మునింగి జడతన్
బరతత్త్వముగానలేక వా, సనములు బుచ్చుకింక
మనసా హరి... 5

చ. తను వతిచంచలంబు ధనధాన్యములా సటి యా
ధనం బహో,కనుఁగొనుచుండ నేగ చనుఁ గా
వున భ్రాంతినిఁ బొంది దుష్టన, ర్తనమున సంచరిం
పకు వృథా కని కానిమఱుంగు జొచ్చె ద, చ్చ
న వింక నెల్ల మాని మనసా హరి... 6

చ. అతిమలినంబు లైనవిషయంబులఁ జిక్కి సదాని
జాత్మసం, గతి పరిపంథిబంధుకవికారములం గడు
స్రుక్కి సర్వకా, మితములు దక్కి చక్కనగు మే
లుపదంబుఁ దలంపలేక నీ,చతఁ బడనేల నీవు మ
నసా హరి... 7

చ. మలినపుఁగొంప రోగముల మ్రగ్గెడుసేవపుగంప
జంతుసం, చలనముఁ బొందుదుంప భవసాగర
మీఁదఁగనీనికంప యె, మ్ములు పలలంబు తోలు
నరముల్ మలమొప్పఁదలంప మేను ని, శ్చలము
ని నమ్మఁబోకు మనసా హరి... 8

చ. అనుఁగులు నాలుబిడ్డలును నన్నలుఁ దమ్ములు నా
ద్యియైనవా, రను వగువేళ వెంటఁ బడి యంత
మునం దొకరైనఁ దోడుగా, వెనుకొని రారు
వారికయి వెఱ్ఱిగఁ బం డ్లిగిలింప నేల నీ, యను
చిత్తవృత్తి మాని మనసా హరి... 9

చ. పెనిచినవాని నమ్మి వెనువెంటనె దిర్గుపాటేలు
వానిచే, తన మృతిఁబొందునట్లు సుమి తప్పక కా
లము నిత్యమంచు నీ, వనిశము నమ్మి యుంటి
వకటా యిఁక నేమనుకొందు నింక నీ, వనుపను
వృత్తి గల్గి మనసా హరి... 10

చ. ఋతుమతి నాతి యంటు చెడ నెగ్గగుత్రుధి
రంబు శుక్లసం, గతిఁ గని దేహ మయ్యె నది గ
న్గొన దుర్మలమూత్రమాంసశో, ణితక్రిమిజాలసం
కుల మనిత్య మసౌఖ్యము గానఁ గాయమే, సత
మని నమ్మ కీవు మనసా హరి... 11

చ. తరువులు కొమ్మలున్ విరులుఁ దద్దయుఁ బూచి

యడంగునట్లుగా, సిరు లిల వచ్చుచుం జనుచుం
జిక్కులు బెట్టెడి నట్టిదానికే, పరులను వేఁడు
చుం దిరిగి ప్రాయము రిత్తయొనర్చి వెన్క వా,
చఱచిన లేదు ముక్తి మనసా హరి... 12

చ. పరుసము సోఁకఁగా నినుము భాసురకాంచనమై
నభంగి శ్రీ, హరిపదసేవచే భవభయంబు లడంగి
వినిష్కలంక మౌ, పరమపదంబు గల్గు నని
పాయక కొల్చి తరించి రార్యు లా, సరణిని భ
క్తి గల్గి మనసా హరి... 13

ఉ. పెట్టనికోట ఘోరభవభీరులకుఁ బరమార్థదేహి
కిం, గట్టనియిల్లు పూర్వకృతకర్మలతల్ దెగఁగోసి
వేయఁ జే, పట్టనిమేలివాలునొకపట్టుదలంపఁగ
మోక్షసంపదల్, అట్టి కొనంగవచ్చు మనసా
హరి... 14

చ. అమితజపోపవాసనిగమాగమసంస్తుతికంటె నిత్య
సం, యమనియమాదియోగవిహితాచరణంబు
లకంటె సాధుసం, గమముఖదానధర్మములకంటె
మహోత్తమసౌఖ్యభాగధే, యము లనుచుం
దలంచి మనసా హరి... 15

చ. సిరివిగ రేవెలుంగుదొరవెన్నెలలన్నెల వచ్చు
చుం జనుఁ, గరులుహరుల్ సిరుల్ విరులు కామిం

నులుఁ నిజదేహగేహముల్, స్థిరములుగావు
వానిభ్రమఁ జెంది తుదిం జెడిపోవ కిప్పుడే, యఱ
మర లేక నీవు మనసా హరి... 16

చ. పురమిని నీరుబుగ్గ చెడిపోయెడి నందు జడుండు
లోహపుం, గడియము వేయఁబూనుగతిగా నిజ
దేహము నిల్వఁ గోరి యా, గడమునఁ బ్రాణ
రోధమునఁ గాంచు యొనర్పరుయోగులెప్పుడా,
సడి విడనాడి నీవు మనసా హరి... 17

చ. తనుఁ బెనుబాము పట్టుకొనఁ దద్వదనంబుననుం
డి యీఁగలం, గని తిన నేఁగుకప్పగతిఁ గాల
భుజంగము తన్ను మ్రింగఁగా, ఘనవిషయాళిఁ
గోరెడుజగం బిది నిత్యము కాని దంచు నీ, వని
శముఁ గాంచి నేఁడు మనసా హరి... 18

చ. నిరుపమపద్మపత్త్రమున నీరము లంటకనుండుమా
డ్కిఁ గు, మ్మరపురు వొండు నంటనిక్రమంబున
బూడిద గచ్చకాయనుఁ, దొరయనిరీతి నాత్మ
విదు దుర్భవబంధము లంట వంద్రు నీ,వరసినితాం
తభక్తి మనసా హరి... 19

ఉ. ఎక్కడియర్థచింతనము లెక్కడిసంగ్రహణైకసా
ధనం, బెక్కడిరక్షణక్షమత లెక్కడిహమ్ము మ
తాభిమానముల్, కక్కస మింత యేల యొ

కకార్యము దెల్పెద నిత్యసౌఖ్యముం, జక్కగణిం
పు నీవు మనసా హరి... 20

చ. మనుజుఁ డపథ్యవస్తువుల మానక కొన్న నజీర్ణ
బాధ సం, జననమునొందునంచు మది సంశయ
మొందెడుఁగాని దుర్భవం, బనియెడు పెద్దరోగ
మున కాత్మ దలంకఁడహో విచిత్ర మా,యను
వుఁ దలంచి నీవు మనసా హరి... 21

చ. విటులవృథాభిలాషలను వేడుక దెల్పుచుఁ జిత్త
మర్థసం, ఘటనమునందుఁ జేర్చుగణికానతిరీతిని
లౌకికక్రియా, పటిమను సర్వకార్యములపారము
దంబున నిర్వహింపుచుఙ, జటులతరాత్మబోధ
మనసా హరి... 22

చ. సనమలవేదశాస్త్రము లసంఖ్యలు నేర్చి తదంత
రార్థస, త్పద మెఱుఁగంగలేనియెడఁ బ్రాణము
వాసి పునశ్శరీరివై, యుదయమునొంది యాచదు
వులొప్పఁగ నీకుఁ బఠింపఁ గష్టమహా, నది యిదియం
చు నేఁడు మనసా హరి... 23

చ. ఇలఁ గలప్రాణికోటులకు నెక్కుడు మానవులందు
విప్రుల, త్యలఘులు వారికంటె నిగమార్థవిదుల్
ఘను లట్టివారిలో, జలరుహనాభుపాదజలజా
ర్చకు లుత్తము లండ్రు గాన ని, శ్చలమున భ
క్తిగల్గి మనసా హరి... 24

చ. తొలుతను మాతృగర్భమునఁ దోఁచినతత్త్వవి
చారబుద్ధినే, యలయక చేసి యెల్లవిషయంబుల
రోసి నిజాత్మశత్రులం, దొలఁగఁగఁ ద్రోసి దుర్భవ
ము తూలఁగ మోక్షపదంబుజేరి యింపలర సు
ఖంచెదీవు మనసా హరి... 25

చ. నిలయము కాలఁగా జడుఁడు నీటికి నై యిలు
ద్రవ్వినట్లు నీ, విల నవసానవేళఁ బరమేశ్వరుఁ
గొల్చితరింతునంచు నా,సలఁబడ నేల నేఁడె హరి
సర్వశరణ్య రమేశ పాహి మాం, జలజదళాక్ష
యంచు మనసా హరి... 26

ఉ. అద్దమున న్మనుష్యుఁడు నిజాస్యముఁ దాఁ గనుఁ
గొన్నమాడ్కి లో,నిద్ధపుదృష్టిఁ జూడఁగ విని
ర్మలబ్రహ్మము గానవచ్చు దా, నెద్దియు బొంద
కుండు జగమెల్లను తా నయి వెల్గుచుండునీ,
వద్దరిఁ గాంచఁ గల్గు మనసా హరి... 27

చ. ఇటు నటు పొలుద్రావి పరువెత్తుటకంటెను ని
ల్చి నీరు గ్రోలుట కడు మేలు మే లనెడులోక
హితోక్తిగణించి చాల మి, క్కుటమగుకర్మబం
ధముల గాసిల కచ్యుతుఁ జేరు మంటి వే, నట
బడకింకనైన మనసా హరి... 28

ఉ. ఏనుఁగు నెక్కిదొడ్డి జొర నేల తలంచితివే జ

గత్రయా, నూనపదక్రమోద్యత మహోజ్జ్వల
విక్రమకేళికామసం, థాను జగద్విథాను ఫణి
తల్పశయానునిఁ గొల్చి యన్యవాం, ఛానుభవం
బిఁకేల మనసా హరి... 29

చ. సకలచరాచరావనవిచారుని దివ్యపదాబ్జసేవచేఁ
బ్రకటితమోక్షసంపదలు బొటిలుటాత్మ నెఱింగి
పీదుబూ, టకములు బుగ్గిగాను అకటా వికటం
పుశిఖండివృత్తిరో, యక నెలకొంటివేల మనసా
హరి... 30

చ. గుఱుతుగ నేటియొడ్డు తెగి కూలెడువృక్షము
భంగి దేహ మీా, ధరణినిఁ గూలునేడనో య
థావిధి నేడొనరించఁజూచె దీ,వరయక చన్నవా
రినిధ్రువంబుగఁ జూడఁగలేవో కాలని, స్మరణము
సేయనేల మనసా హరి... 31

ఉ. ఇచ్చె ధ్రువంబుగా ధ్రువున కెన్న మహోన్న
తలోకపాలనం, బిచ్చె విభీషణాదులకహీనసుఖా
స్పదరాజ్యభోగ మం, దిచ్చె పరార్థముఁ శబరి
కిచ్చెఁ గుచేలున కిష్టసంపదల్,సచ్చరితుం డతండు
మనసా హరి... 32

చ. పరసతిఁ గోరి కీచకుఁడు ప్రాణముఁ బాసె పరా
న్నభాదిరై,దురముసఁగార్తవీర్యుఁ డతిదుర్బలుఁ

దై పడె నన్యవస్తు వా, దరమునఁ గోరి మున్ను
శతధన్వుఁడు కూలెనటందు రార్యులా, సరణినిఁ
గోరఁబోక మనసా హరి... 33

చ. వలువ లొసంగి వాయకుఁడు వాసిగ లేప మొ
సంగి కుబ్జ దా, నలరు లొసంగి మాలికుఁడునన్న
మొసంగి ధరాసురాంగనల్, ఫలము లొసంగి
యాశబరి పాయనిసద్గతిఁ గాంచి రట్లు సాం, పల
రఁగ సేవఁ జేసి మనసా హరి... 34

ఉ. కన్నులు లేనివాఁ డడవిఁ గాడ్పడి పంగునిఁ ద్రో
పఁ జూపఁ గై, కొన్న తెఱంగునన్ జడతఁ గోరి
పరేతరు లైనవారి నీ, వెన్నిక జేసి కొల్వ ఫలమే
మిఁక మాటలు వేయునేల త, త్సన్నిధిఁ జేరవ
చ్చు మనసా హరి... 35

చ. పతిని నహల్య పాసి సురపాలునిఁ బొంది దురం
తపాపనం, గతినొకటాయియయ్యె వ్రజకాంత
లుకాంతులఁ బాసి భ్రాంతలై, సతతము శౌరితో
రతులు సల్పి మనోరథసిద్ధిఁ గాంచి రా, చతురతఁ
గాంచి నీవు మనసా హరి... 36

ఉ. కన్నవుదొంగ వాక్కు మది కాయము లేకము
జేసి యర్థసం, పన్నతఁ గాంచు నవ్విధము బల్విడి
నారసి పొంచియుంచిసో, ఖ్యోన్నత మాపదార్థము

ను నొప్పుగ జేకొనవచ్చు మృత్యు వా, సన్నము
గాకమున్నె మనసా హరి... 37

చ. వృకదనుజుండు శంకరుని వేదనఁ బెట్టఁగ వేగ
వచ్చి యా, వికలత మాన్పి ప్రోచె సురవిద్విషు
లౌమధుకైటభాదు లో, ర్వక యలయింప బ్రహ్మ
ను సురతతుఁ జేసినదేవు గొల్వఁ దోఁ, చక
చెడనేల నీవు మనసా హరి... 38

చ. తననిజనాథుని న్వదలి తప్పక దర్పకుబారి గొత్తి
యై, కనుఁగొని జారులం గలసి కామిని దుష్కు
శయైనభంగినిన్, వనరుహనాభుని న్వదలి వారక
యన్యులఁ గోరుచున్ దురా,శను బడనేల నీవు
మనసా హరి... 39

చ. కనికని నూతిలోఁ బడెడికష్టునికైవడి ఘోర
దుర్భవం, బునఁ బడి చచ్చుచున్ మఱలఁ బుట్టు
చు నాత్మసుఖోపభోగతన్, మనుకు వపేక్ష చేసి
పలుమాఱును వేదనఁ బొంద నేల యొ,య్యన
దరిజేరవచ్చు మనసా హరి... 40

చ. అమరనదిన్ సరస్వతి మహాంబుధి నర్మదఁ గృష్ణ
వేణి గో, తమి యమునన్ సువర్ణముఖి ద్వార
వతిం బదరిన్ గయా ప్రయా,గములను గ్రుంకఁ
గల్గుగతిఁ గాంచును శ్రీహరినామ మొక్కమా,
టమరఁగఁ బల్కునేని మనసా హరి... 41

ఉ వెన్న కరంబునం గలుగ వెత్తిగ నేతికి నేగినట్లు
లో,నన్నెఱకొన్న వెన్నుని గనంగ నపేక్ష యొకిం
తలేక యా,పన్నతనన్యులం గొలిచి పందలఁగూ
డక జ్ఞానదృష్టి భా, స్వన్నలినాక్షుఁ గోరి మన
సా హరి... 42

ఉ. బూనుగుమ్రాను గాంచి భ్రమఁబొందినశించుశు
కంబుమాడ్కి సం,సార మపార మంచుఁ గనఁజా
లక నీచులఁ గోరి కొల్చి నే, నూఱక మోసపో
యి తయో యని వంతల నొందనేల వే,సార
కముం దెతింగి మనసా హరి... 43

చ. మొదలను గర్భవేదనల మూర్ఛిలుదుఃఖముపుట్టి
భూమిపై, మెదలఁగ బాల్యదుఃఖ మటమీఁద
వయస్సున కామదుఃఖ మ,య్యదనున సంసృతిం
బొరలు నంతట మృత్యువుచేత దుఃఖమౌ, నది
దలపోసి చూచి మనసా హరి... 44

ఉ. ఎందఱు దేవతల్ చనిరొ యెందఱు తాపసులట్టి
భ్రష్టులై, రెందఱు రాజు లేగిరొ మఱెందఱు
యోగులు జోగులై రొగో,విందునిపాదపద్మము
లు వీడనిభక్తి భజింప నేరకా, చందము నొం
దకీవు మనసా హరి... 45

ఉ. గోవు లనేకవర్ణములఁ గ్రుమ్మఁ బా లొకతైన

భంగి నా, నావిధభూషణంబుల ఘనస్థితి గాం
చుకడానిమాడ్కి లో, కావళిలోనఁ దానును
దదాకృతి లోకము లయ్యు నంతరా, త్మావహుఁ
డచ్యుతుండు మనసా హరి... 46

చ. ఉరుఁడవు నక్షరుండవు నసంగివి శ్రీమహిళాను
షంగి వీ, శ్వరుఁడవు సత్తపోనిధివి శాంతుఁడ
వున్ భయదోగ్రకృష్ణకే,సరివి భవన్మహత్త్వము
నిజమ్ముగ నెవ్వరికేనిఁ గాంచఁగా, నరుదుగఁ
దోఁచు నంచు మనసా హరి... 47

చ. శ్రుతముగ బుద్ధ్యహంకరణచిత్తములార వినుం
డు మీకు నే,హితముగఁ జెప్పెదన్ మన కధీశుఁ
డు నల్వుర కాదిమూల మ,చ్యుతుఁ డతిమాయ
నుం డతనిసొంపుగఁ బట్టెదఁ దోడుగండు మీ,
కతిసుఖ మబ్బు నంచు మనసా హరి... 48

చ. శరమున నొంచినన్ బగపశమ్మునఁ గొట్టినత్రోలఁ
గట్టినన్, దఱివులఁ గాప బంపినను దప్పక వాఁ
కిటఁ గాపువెట్టినన్, మఱువక ప్రోచువానినిను
మంచిగ వేఁడిన నన్ను బ్రోతువే, సరిసరి యంచుఁ
గూర్మి మనసా హరి... 49

ఉ. భక్తినిఁ గొల్వలేఁడు పదుపాయ మెఱుంగని
వాఁడు సంతతా,సక్తిని నేఁడు వీఁడు నను సాదె

కు దూఱుచు వేఁడినాఁడభి, వ్యక్తుఁ డటం
చు నెంచక యవారిత మాచయ నన్నుఁ బ్రోవసు
వ్యక్తుఁడ వీవ యంచు మనసా హరి... 50

ఉ. నేరము లెన్న నేల కరుణింపుము నే నిను వెం
బండించి వే,సారుచు వేఁడినఁ బినవు సామి యొ
కానాక వేళ నైననా, కోరిక దీఱఁ గన్పడవు కూరిమి
జేయ విఁ కేమి సేతు న, య్యా రఘువర్య
యంచు మనసా హరి... 51

చ. సరసిజసంభవాద్యమరసంఘము లాత్మల నీమహా
త్త్వముఁ, దరి గననేర రట్టినినుఁ దప్పక గొల్చి
తరించువార మం,చరయసుధాబ్ధి రేణుగణ మచ్చ
టఁ గ్రోలవె యేనుఁగీఁగ లా,సరణి నటంచు
నెంచి మనసా హరి.... 52

ఉ. చక్కనివాఁడు సర్వగుణసంపదలుం గలవాఁడు
భక్తిచేఁ, జిక్కెడువాఁడు లోకములచిక్కెడ
లించెడువాఁడు దీనులఁ, మిక్కిలిఁ బ్రోచువాఁ
డు కననేర్చినఁ గన్పడువాఁడు గాన నీ, వక్కఱ
పాటుతోడ మనసా హరి... 53

ఉ. వేఁడెద నిన్ను వీడక యె వేదనలఁ గృశియించి
నాఁడ నీ,వాఁడ నెపమ్ము లెన్ని నను వంచనఁ జేసి
తి వేని నింక ది,క్కెఁడ దయాపయోధి వని యెన్ని

తి నాదుమొత్తాలకించు మె, గ్గాడకు మంచు
మ్రొక్కి మనసా హరి... 54

చ. అతులితవర్ణిచర్యల గృహస్థమనీషలఁగానసాంత
ర,స్థితమితవృత్తులం బతివిశేషవిధంబుల ముక్తిగల్గు
నే, వితతదయాపయోధి యగువిష్ణునిఁ గోరి భ
జించువారి కా,యతముగఁ గల్గినట్లు మనసాహరి.

ఉ. తమ్ములమీరుసౌరుకనుదమ్ములు సోమునిఁ గేరు
మోముకుం,దమ్ములచాలుఁబోలురదనమ్ములు నద్ద
పుమేను పద్మరా,గమ్ములడాలు నేలుపదకంజము
లుం గలతమ్మికంటి సౌ,ఖ్యమ్ము లొసంగు నీకు
మనసా హరి... 56

చ. గరళముఁబ్రామి చన్గుడుపు కామిని కిచ్చెను మోక్షు
మాసభాంతరమున నెగ్గులాడినఁ బదంపడి వానికి
నైక్య మిచ్చె భీ,కరగతిఁ బట్టి మ్రింగుభుజగంబున
కిచ్చెను మర్త్యరూప మా,చరితము లెన్నఁగల్గు
మనసా హరి... 57

ఉ. హెచ్చుగుగట్టుమోసి యలయింపక ప్రాణులఁ
బ్రోచినాఁడు తా,నిచ్చనుగొల్చుపాండవుల కేర్పడ
రాజ్య మొసంగినాఁడు కా,ర్చిచ్చును బట్టి మ్రింగి
నిజసేవకులన్ బ్రతికించినాఁడు నీ వచ్చపుభక్తి
గల్గి మనసా హరి... 58

ఉ. ఎన్నిక సంపద ల్గలిగి యొగ్గని చూడక గొల్లయిం
డ్లలో,వెన్నయు జున్ను పా ల్పెరుఁగు వేమఱు
దొంగిలితిన్న చిన్నినీ,చిన్నెల నెన్న: జోద్యమగుఁ
జెల్వుగ నీవిట రాఁగదన్న మా,యన్న యిదేమి
యంచు మనసా హరి... 59

ఉ. నందునిమందయందు వ్రజనందనులందఱుఁగొల్వ
గోపికా, బృందనిపంచికారవము లింపొనరింపఁగ
సుందరాకృతిం,జెంది కళింగజాతటము చెంతను
తాండవకేళి సల్పునీ,చందము లెంతు నంచు మ
నసా హరి... 60

చ. ఎఱుఁగవు ముక్తిమార్గ మిది యొక్కఁడికర్మము
దాఁపురించెఁ జే,పెఱుఁగనిబొట్టె తా మగని కిం
పుగ బెండ్లి యొనర్చినట్లు దు,ష్కర మగుకా
మ్యకర్మములఁ గాలము బుచ్చెదవేల బాపురే,
సరసముగాదు నీకు మనసా హరి... 61

చ. పరుసము లాడఁబోకు పరభామలఁ గోరకు దుష్ట
వృత్తిచేఁ, దిరుగకు యాచకావలిసిఁ దిట్టకు రచ్చ
లపకుపాతముల్,నెఱపకు సాధుసంఘముల నింద
లొనర్పకు కామమోహమ,త్సరముల జెంద కీవు
మనసా హరి... 62

చ. పొలుపుగఁ గోటివిద్యలును బొట్టకుఁ బట్టెడు

కూటికే కదా, యిలనుజయించి పెంపుగనున్నఁ
టికైనను గాటికే గదా, కలిమి నిజం బటంచుఁ
గడఁగానక నిక్కెదవాయు రర్థముల్, జలముల
మీఁదివ్రాఁత మనసా హరి... 63

ఉ. కూరిమితోడ నైనఁ దగుకోరిక నైనను ప్రాణభీతి
చేఁదూఱుదునైన వైరమునఁ దూఁగుచు నైనను
భక్తి నైనవే, మూఱు హరిం దలంప నసమానసు
ఖంబు ఘటిల్లుఁ గాన వే, సారక నీవు నేఁడు
మనసా హరి... 64

ఉ. కోఁతుల నేలినాఁడ వని కోవిదు లెన్నఁగ వింటి
నేనయో, కోఁతిగ నుంటి న న్నటుల గొబ్బున
నేవకుఁగా నొనర్చి సం, ప్రీతిగఁ బ్రోవు మంటి నిరు
పేదలఁ బ్రోదిగ సాఁకుటల్లఁ బ్ర, ఖ్యాతియ కాదె
యంచు మనసా హరి... 65

చ. ఉడుతకుఁ గల్గె ముక్తిపద మూసరవెల్లికి సౌఖ్య
మబ్బె నె, క్కుడుగతి పక్షికబ్బె ధరఁ గోమలిరూ
పముఁ జెందె ఱాయి మేల్, వడసెను పాయకుండు
భవబాధలఁ బాసె నిషాదుఁ డామహా, జడధిశ
యానునాజ్ఞ మనసా హరి... 66

ఉ. ఇల్లని నూతిలోఁ బడితి యేదరిఁగానక తల్లడిల్లినా,
తల్లివి తండ్రి వీవ యని తప్పక నన్ దరిఁజేర్చు

మంటినీ, వెల్లజగంబు లేలుకొను నేలికవై వనుబ్రో
వకున్న నే,వల్ల రిం జేతు నంచు మనసా హరీ...

ఉ. నీసతి యిచ్చు భాగ్యములు నీసుతుఁ డిచ్చుఁ జిరా
యుసంపదల్, నీసుత జేయు పావనము నీవు జగం
బులఁ బ్రోతువౌ భళీ, నీసరిదైవము ల్గలరె నిన్ను
భజించినవారి కేటి దా,యాస మటంచు నీవుమ
నసా హరి... 68

చ. గరుడునిమూఁపున న్నిలిచి ఖడ్గశరాసనశంఖచక్ర
ముల్, కరముల నుల్లసిల్ల మృదుకాంచనచేలము
కాంతులీన సుం,దరమణిభూషణావళు లుదారకి
రీటముఁ దాల్చి వచ్చి నీ, సరసను నిల్చి ప్రోచు
మనసా హరి... 69

ఉ. దాఁకొని జన్మకర్మపరితాపములం గృశియించి ది
క్కు నీ,వే కరుణింపవే మనుపవే యని వేఁడితి
నన్ను బ్రోవవే, యాఁకటిబాధచేఁ దనయుఁ డన్న
ముఁ దెమ్మనిపోరుచేసినన్, సాఁకదె తల్లియంచు
మనసా హరి... 70

చ. భవదుదరప్రభూతమగుపద్మభవాండముఁ నం దనే
కజం,తువు లుదయింపఁ జేసి కృపతోడను బ్రోవ
ననేకభంగులన్, భువిజనియించు విశ్వపరిపూర్ణుని
నిత్యుని నిన్నుఁ గూర్చి సం,స్తవ మొనరింతు నం
చు మనసా హరి... 71

ఉ. ఆఁకొని సత్త్వముం దొఱఁగి యట్టిటుఁ గ్రుమ్మరలే
నికాలమం, దాఁకొని కుంభికుంభపిశితస్పృహావీడని
గంధసింధురా, నేకపవైరిమాడ్కి గను నేహ్యపుసం
సరణానుబద్ధుఁడై, యాకమలాక్షుఁ గోరు మనసా
హరి... 72

ఉ. పాకిటఁ దమ్మిలో నలువ పుట్టువుఁ గూర్చినవాఁ
డు ఫాలమం, దెక్కుడుకంటివేల్పు జనియింపఁ
గఁ జేసి యతండు దాల్పఁ బెం, పెక్కిన మెట్టు
దమ్మిఁ జెదలేటివధూటినిఁ గన్న మేటి నీ, యక్క
ఱ లెల్ల దీర్పు మనసా హరి... 73

చ. వలను మృగంబు నోఁదమున వారణ ముచ్చున
నంబుజంబు భూ, తలమునఁ జిక్కిన ట్లనితరస్థితి
నిర్మలభక్తిసూత్రధా, రుల కనువొంద లభ్యుఁ
డగు రూఢిగ నీశ్వరుఁ డంచు నెప్పుడో, జ్జలు
పరికింతు రట్లు మనసా హరి.... 74

చ. సలలితశంఖచక్రజలజాభయహస్తము లొప్పువా
ని ను, జ్జ్వలదురురత్నకీలితసువర్ణకిరీటశిరంబు
వానిఁ గో, మలతులసీవిభాసురరమాయుతవ
క్షమువానిఁ గొల్చినం, జలనము లేనిముక్తి మన
సా హరి... 75

చ. హరచతురాస్యషణ్ముఖసహస్రము ఖేభముఖాది

దేవతా, వరులు సమస్తవేదములు వర్ణన సేయఁ
గ లేరు నిన్నయో, నరుఁడను జ్ఞానహీనుఁడను
నాథుఁడ వెన్నఁగ నాకు శక్యమే, శరధిశయాన
యంచు మనసా హరి... 76

ఉ. పాపము లెల్లఁ దీఱు భవబాధలు గొందులఁదూ
ఱు ఘోరసం, తాపదవాగ్ను లాఱు విపదంబు
ధులింకఁగఁబాఱు మోక్షము, ద్దీపితవృత్తిఁదేఱు
మనదీనత మాన్పెడివారు లేరు నీ, యాపదలె
ల్లఁ దీఱు మనసా హరి... 77

చ. తిరుమలలోఁ బ్రభాతవిధిఁ దీర్చి నీలగిరిన్ భు
జించి కే, సరిగిరిఁ జందనం బలఁది చల్లనిదాహ
ము మంగళాద్రిలో,గురురుచిఁ ద్రావి రంగపురిఁ
గోమలితోఁ బవళించినట్టియా, సరసుని జేరె
దీవు మనసా హరి... 78

ఉ. శ్రీకరముల్ సుధీజనవశీకరముల్ రిపులోకభేద
ద, ర్వీకరముల్ శ్రుతిప్రకరవేద్యలసత్పరతత్త్వ
నిత్యల, క్ష్మీకరముల్ సతీపతి శచీపతి వాక్పతి
యోగ్యభోగ్యభా, గ్యాకరముల్ దలంప మన
సా హరి... 79

చ. తొలిచదువుల్వడింగొనుచుఁ దోయధిఁజొచ్చిన
సోమకాసురున్, బలిమిగ మీనరూపమునఁ బట్టి

వధించి రయంబునన్ శ్రుతుల్, నలువ కొసంగి
లోకముల నర్మిలి బ్రోచిన మత్స్యమూర్తిసాం,
పలరఁగ నిన్నుఁ బ్రోచు మనసా హరి... 80

చ. కులగిరి కవ్వ మంబునిధి కుంభము పాములతేఁ
డు త్రాడుగాఁ, దలపడి దేవదానవులు తత్పర
తన్ మథియింప భార మ, గ్గలమయి క్రుంగు
శైలము సుఖస్థితిఁ దాల్చిన కూర్మమూర్తి ని,
శ్చలముగ నిన్నుఁ బ్రోచు మనసా హరి... 81

ఉ. పుత్తడికంటిరక్కసుఁడు బొత్తిగ నీధరఁ జాఁప
జుట్టిన, క్లొత్తుక తా రసాతలికి నేఁగఁగ వాని
వరాహరూప మై, కుత్తుకఁ ద్రుంచి భూతలముఁ
గొమ్మునఁ దాల్చినదంష్ట్రి సత్కృపా, యత్తత ని
న్నుఁ బ్రోచు మనసా హరి... 82

ఉ. సర్వమయుండు విష్ణుఁ డని చాఁటిన యాపసిబా
లుఁ గావఁగా, శర్వముఖామరు ల్వొగడ స్తం
భమునన్ బ్రభవించి నిష్ఠురా, ఖర్వనఖాళి దా
నవుని గర్భము జీరిన శ్రీనృసింహుఁడే, సర్వఫ
లంబు లిచ్చు మనసా హరి... 83

చ. బలి బలిమిన్ దివౌకసులఁ బాఱఁగఁదోల జగం
బు లెల్ల రం, జిలునటువేష మూని బలిఁ జేరి
పదత్రయభూమిదానమున్, వలనుగ వేఁడి తత్ప

దవి వజ్రికోసంగినయాత్రివిక్రముం, దలయక
నిన్నుఁ బ్రోచు మనసా హరి... 84

చ. ఇరువదియొక్కకయ్యముల నిట్టులఁ గంటకులైన
రాజులన్, దఱలఁగఁ గూల్చి తద్రుధిరధారల
నేలు లోనర్చి పైతృకా, చరణము సల్పి శాశ్వ
తయశస్కరుఁడౌ భృగురామమూర్తి ని, న్స్మరసి
కృతార్థుఁజేయు మనసా హరి... 85

చ. రవికులమందుఁ బుట్టి బలురక్కసి తాటకఁ గొ
ట్టి మౌనిరా, ట్సవనము చక్కఁబెట్టి గురుసమ్మ
తిఁ గానను ముట్టి వార్ధి దో,ర్జవమునఁ గట్టి రా
వణు ధరం బడఁ గొట్టినరామమూర్తి ని, న్నవి
రళలీల నేలు మనసా హరి... 86

చ. అలవసుదేవరోహిణుల కద్భుతలీల జనించి మిం
చిచే, హలముసలాస్త్రశస్త్రముఖరాయుధముల్
ధరియించి ముష్టికా, దుల వధియించి భూభర
ముఁదీర్చిన శ్రీబలరామమూర్తి తా, సలలిత లీల
నేలు మనసా హరి... 87

చ. ఘనతరబోధలం ద్రిపురకాంతలనిష్ఠలు మాన్పి
పార్వతీ, శునకు శతాంగశస్త్రశరశూలధనుః
ప్రముఖోగ్రదివ్యసా, ధనము లొసంగియుఁ ద్రి

పురదైత్యులఁద్రుంచినబౌద్ధమూర్తి నిన్ననవరతం
బుఁ బ్రోచు మనసా హరి... 88

ఉ. మిత్రుల మంచు దేవత లమేయసుఖస్థితి నిల్చి
యుండఁగా, శత్రుల మంచు రాక్షసులు సంగర
భూములయందుఁ జావఁగా, శత్రులు మిత్రులుం
గలరె సర్వసముం డురగేంద్రశాయి తచ్ఛాత్ర
నిఁ జేయు మంచు మనసా హరి... 89

చ. తెలియక పాపకర్మములఁ దెంపునఁ జేసితి మంద
బుద్ధినై, మెలఁగితి కాలుఁ డేమిమిడిమేల మొన
ర్చునో యంచు భీతిచే, నిలిచితి నాకు దిక్క
నుచు నీవె మఱెవ్వరు లేరు బ్రోపవే, జలనిధిశా
యి యంచు మనసా హరి... 90

చ. చిలుకకు రామరామ యని చెప్పినవేశ్య తరించె
ముద్దుచేఁ, దలపడి పుత్త్రుపే రిడుట ధన్యతఁ గాం
చె నజామిళుండు పే, రెలుఁగున బోయ చక్రి
స్మరియింప భవాంబుధి దాఁటె నట్లు నిష్కలుష
తఁ గాంచె దీప్ర మనసా హరి... 91

ఉ. గాలము మ్రింగినట్టిఝషకంబు తుదిం జెడిపోయి
నట్లు నీ, వేల భ్రమించి సంసరణహేయసుఖంబు
లఁగోరె దక్కటా, కాలుఁడు పోరఁజొచ్చెఁ

గడకాలము దాఁకొనవచ్చెఁగాన దోషాళి నడం
చి వేగ మనసా హరి... 92

చ. హరి భజియింతు నే నహరహంబు హరి స్మృతి
యింతు భక్తిచే, హరికి సపర్య సేతు హరి కం
జలు లిత్తు మనోహరంబుగా, హరి సరియైనదై
వత మజాండమున న్నహి యంచు నెంచ శ్రీ,
హరిపురిఁ జేరవచ్చు మనసా హరి... 93

చ. బలిమిగ నూహలుꣳ మిగుల ప్రౌఢి గలంగి చె
లంగి జీవితా, శలు దలపోయుచుꣳ వవలఁజా
లక నంబుధిమధ్య మీనముం, బలె నిగళాంత
రాస్థిగతి బాధల నొంది కృశింప నేల నుజ్జ్వలత
రభక్తి గల్గి మనసా హరి... 94

చ. కరివరు నేలినాఁడు మునికాంతవిపద్దశ మాన్పి
నాఁడు దు, ర్భరశరవహ్నిఁ గ్రాఁగ సుదరస్థుని
బాలునిఁ బ్రోచినాఁడు త, త్తరపడి వేఁడ త
త్క్షణమె ద్రౌపది మానము గాచినాఁడు ని, న్న
అమఱచేయఁబోడు మనసా హరి... 95

ఉ. తల్లికిఁ గల్గినట్టిదయ దాదికిఁ గల్గునె యెన్ని
చూడ నీ, చిల్లరవేల్పులు న్నెవరు చిక్కఁగ బ్రో
చుట కల్లగాదె నే, జెల్ల జగత్కుటుంబి వెడ

చేయక తొల్లిటివారియట్ల నే, యల్లనఁ బ్రోవు
మంచు మనసా హరి... 96

ఉ. ఊడుగవిత్తు లత్తరువు నొయ్యనఁ జేరినరీతి వా
హీనుల్, వీడక వార్ధిఁజొచ్చిన ప్రవీణత నుత్త
మసాధ్వివల్లభుఁ, గూడఁగ నేఁగుమాడ్కి లత
కూనమహీజముఁబ్రాఁకినట్లు నూ, రాడకఁగోర్కు
లూర మనసా హరి... 97

ఉ. శ్రీదము లాశ్రితావనవిశేషవినోదము లాగ
మాంతస,మ్మోదము లబ్జజాద్యమరముఖ్యమనశిక
మలార్చనాంతరా, హ్లాదము లార్తరక్షణమహా
త్త్వపటుత్త్వసమస్తశిష్టక, ష్టాదములోఁ దలంప
మనసా హరి... 98

ఉ. ఏదయ నీదయాభిమత మొందుకు నాపయి యా
దిరాదయా, నాదయ నీపదాశ్రయము సమ్మితి
దబ్బరమాట గాదయా, నీదయ నే నకించనుఁడ
నీవు ప్రపూర్ణుఁడ వంచు భక్తర,క్షా దయ బ్రోవు
మంచు మనసా హరి... 99

ఉ. పూర్వభవంబునందనరుపుణ్యగతిఁ లభియించి నీ
మహా, ఖర్వచరిత్రము ల్నుడువఁ గల్గెను పెన్ని
ధిఁ గన్న పేదవాఁ, డుర్విఁ సుఖించినట్లు ముద

మెప్పుఁ గృతార్థుఁడ నైతి నోవిహం, గార్వ ర
మేశ యంచు మనసా హరి... 100

ఉ. పాయక తాడెపల్లికులపావనుఁడై విలసిల్లు పాన
కాల్, రాయనిచేఁ బ్రణీత మయి రంజిలు మా
నసరాజయోగసం, ధాయకవంద్యసంస్తవశతం
బనిశంబుఁ బఠించి మోక్షసం, ధాయతఁ బొం
దెదీవు మనసా హరి... 101

ఉ. మంగళ మబ్జజాసహిత మన్మథకోటిస్వరూపసుం
దరా, మంగళ మార్యలోకహిత మంగళ మగ్ని
రవీందులోచనా, మంగళ మభ్రకేశనుత మంగళ
మాహవరంగభీమ దై, త్యాంగవిభంగయంచు
మనసా హరిపాదము లాశ్రయింపుమా! 102

మా న స బో ధ శ త క ము
సంపూర్ణము.



# పీఠిక.

ఈచిత్తబోధశతకము, మానసబోధశతకము నొక్కఁడే రచించినటులఁ దోఁచుచున్నది. విషయమునందు రచనమునందుఁ బదముల గూరుపునం దీరెండుశతకములందు సామ్యమెంతయేగాక వంశవృత్తము దెలుపుపద్యము మంగళపద్యము ఇంచుకమార్పులతో సమముగా నున్నవి. కాని చిత్తబోధశతకము మానసబోధశతక మంత ప్రౌఢముగా నుండకపోవుటచే చిత్తబోధశతకము ప్రథమప్రయత్నమని యూహింప నవకాశము కలుగుచున్నది.

శతకము రచించినకవి తాడేపల్లి పానకాలురాయఁడు. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. మంగళగిరి పొన్నూరు క్షేత్రములను పలుమాఱు వర్ణించుటబట్టియు శ్రీకాకుళక్షేత్రమాహాత్మ్యము వ్రాసెనుటబట్టియు నితరాధారములఁబట్టియుఁగృష్ణాతీరమునందలి తాడేపల్లి నివాసియేమొ యని నిర్ణయింపవచ్చును.

కవి యీశతకమును "సకలపురాణసంగ్రహ" మని చెప్పికొనినాఁడు. విశేషముగాఁ బద్యములలో విష్ణు మహిమానుభావమును దెలుపు పురాణాంశములే కలవు. ప్రతిపద్యము రసాస్పదమై సుబోధకమగు భక్తిరసమును కొటపట్టుగ నుంటచేఁ జదువుటకుఁ జవులూరుచుండె ననుటకు సందియము లేదు.

హృదయమును ఐహికములనుండియు విషయాదులనుండియు మఱలించి భగవచ్చింతనమునకుఁ బురికొల్పుట కీశతకము ముముక్షువులకుఁ దోడ్పడఁ గలదు. కవిజీవితము మానసబోధశతకమునఁ దెలుపఁబడియున్నది.

నందిగామ.
1-1-25

ఇట్లు, భాషాసేవకులు,
శేషాద్రి రమణకవులు.

శ్రీ ర స్తు.

తాడేపల్లి పానకాలరాయకృత

# చిత్తబోధ శతకము

---

ఉ. శ్రీరమణీయవైభవవిశేషములై సనకాదియోగి
వ్రాచ్ఛారుతరమ్ములై గగనశైవలినీజననప్రవర్ధనా
గారములై జగత్త్రితయగణ్యములై బుధలోక
జీవనా,ధారము లైనశ్రీహరిపదమ్ములు కోరిభజిం
చు చిత్తమా. 1

చ. హల కులి శాంకుశ ధ్వజ శరాసన తోరణ శం
ఖ చక్ర,కోమలజలజాత మత్స్య యవ మంజుల
రేఖల సుందరమ్ములై, జలజభవాభవాద్యమర
సంఘము సంతతభక్తియుక్తినా, దలల ధరించు
శ్రీహరి... 2

ఉ. నందసునంద సేవిత సనందనవందితసుందరాంగ
గో,వింద ముకుంద భాస్వదరవిందదళాంబక కం
దవర్ణ, శ్రీమందిర విశ్వతుంద ధృతమందర వం
దనమయ్య వేదవి,ద్వందిత యంచు శ్రీహరి...3

ఉ. తమ్ములఁ దమ్ములంచు విదితమ్ముగ లాలనసేయు
చుం బ్రవా,హమ్ములడాలు డీలుపడులక్షణకాం

తులమించిపద్మరా, గమ్ముల ప్రస్తరమ్ముల నగ్రమ్మిన
విమ్ములనొంచి హల్లకా, ర్థమ్ములఁబోలు శ్రీహరి...

చ. యమున సుకాళిఘోరగవిశాలఫణాంతరసీమఁ
జేరిదిం, ధిమికిటడింధిమింధిమిత తెయ్యని తాండవ
కేళిసల్పు నీ, యమలినకోమలాంఘ్రియుగము
ల్లనఁ జూపఁగదయ్య మ్రొక్కెదఁ, దమిఁగొని
యంచు శ్రీహరి... 5

ఉ. దండము పాండుతుండరథ దండము పాండవరా
జ్యదాయకా, దండము చండికేశనుత దండము
కంజభవాండ నాయకా, దండ మఖండతత్త్వమ
యదండము కుండలిరాజతల్పకా, దండ మటంచు
శ్రీహరి... 6

ఉ. దేవ మహానుభావ వసుదేవతనూభవ వాసుదేవ
రా, జీవభవాదిదేవగణసేవిత మాధవ సర్వలోక
సం, భావిత నీగుణత్రయము బ్రస్తుతిఁజేసెద
నంచునాత్మబో, ధావశవృత్తి శ్రీహరి... 7

చ. ఉరమున లక్ష్మి నాభినలినోద్భవుఁ డంగములందు
దేవతల్, కరముల శంఖచక్రములు కంఠమున
న్మణిహారకాంతులున్, శిరమున రాజరత్నరుచి
చిత్రకిరీటము గల్గువేల్పు నా, దరమునఁ బ్రోచు
శ్రీహరి... 8

ఉ. నల్లనివాఁడు కుందరదనమ్ములవాఁడు సమస్తలోక
ముల్, చల్లఁగనేలువాఁడు రిపుసంఘములన్బొలి
యించువాఁడువ్రే, పల్లెవ్రజాంగనామణులభావజ
కేలినిఁ దేల్చువాఁడు నీ, తల్లడమార్పు శ్రీహరి.

చ. సిరిఁజెలువొందుపెన్నురము, చిందముచందము
నొందుకంఠము, న్దరదరవిందనేత్రములు దర్పకు
సింగిణిఁబోలు కన్బొమల్, సురుచిరకుందబృంద
ముల సొంపగుపల్జవగల్గుదైవ మూ, దరముఁబ్రో
చు శ్రీహరి... 10

ఉ. లౌకిక మింతెచాలు నతిలౌల్యమున న్గతిదూలు
నీశ్వరా, లోకనసేయమేలు ప్రవిలుబ్ధమదూర్మలు
గూలుమోఁక్షముల్, గైకొనవీలు దుర్భవనిరా
యములన్నిరసింపఁజాలు మే, ధాకృతి నేలు
శ్రీహరి. 11

చ. క్రమమున సర్వలోకములఁ గల్పనఁజేసెడి చో
విధాతవై, సమతను సర్వరక్షణము సల్పెడు
కాలను నందు విష్ణుఁడై, యమరినవృత్తిసర్వవి
లయం బొనరించెడువేళ రుద్రుఁడై, తమిఁజెలు
వొందు శ్రీహరి... 12

ఉ. సోహముపీడు భాగవత శూరులఁగూడుతదియ
భక్తిదా, సోహమటంచు వేఁడు పరిశుద్ధిగ విష్ణు

నీఁ బాడుమింక సం,దేహము లేదు చూడు హరి
దీనులపాలిటివాఁడు సంతతో, త్సాహత నేఁడు
శ్రీహరి... 13

చ. సిరులుచెలంగు లో నిరిపుచేష్ట లణంగు మహో
గ్ర కాలకిం,కరభయము ల్దొలంగు సుకరమ్ముగ
సంపద లింపెసంగు దు,ర్భరభయము ల్దలంగువి
వరమ్ముగ ముక్తి గలుంగు కల్మషో,త్కరములు
ద్రుంగు శ్రీహరి... 14

ఉ. సారెకుసారెకుఁ దనుజసంహరుదివ్యకథామృతం
బు వే,సారక క్రోలుచు న్వినుచు సంతత మ
చ్యుతదివ్యమంగళా, కారము ధారణావశతఁ గ
ట్టిగనాత్మనుజేర్చి భక్తి బో,ధారతగల్గి శ్రీహరి...

చ. నిరుపమ నిత్య నిర్విషయ నిర్గుణ నిర్మల నిర్వికల్ప
ని, ర్జర నిగమాంగ నిర్మమ నిరంజన నిశ్చల నిర్వి
కార ని,ర్భరణ నిరావలంబ నిరుపద్రవ నీసుగుణ
మ్ము లెంతు స,త్వరముగ నంచు శ్రీహరి... 16

చ. బలి జన కాంబరీష ధ్రువ పార్థ విభీషణ భీష్మ
దాల్భ్య పి,ప్పల హనుమ త్పరాశర సుపర్ణగ
జేంద్ర వసిష్ఠ వత్సదే, వల శుక నారదప్రముఖ
భాగవతో త్తములం దలంచినం, దలఁగక మెచ్చు
శ్రీహరి... 17

చ. కరివరుదైన్యముం హరిణిగండము ద్రౌపది భంగ
ముత్తరో, దరశిశుబాధ కుబ్జమదితాపము విప్రు
నిపుత్త్రచింత భూ, భరము నృపాలకోటిచెఱ
బాపినదైవము నేఁడు నిన్ను సత్వరముగఁ బ్రో
చు శ్రీహరి... 18

చ. కరివరునిం జలగ్రహము గట్టిగఁబట్టిన డస్సి వే
యిూ సత్సరములు కుయ్యిడంగ విని సర్వమయ
త్వములేమి వేలుపుల్, వెఱఁగుపడంగ నచ్యుతుని
వేఁడిన నక్రము ద్రుంచి హస్తినా, దరమున బ్రో
చు శ్రీహరి... 19

చ. వలలు నిషాదుఁడేసిగమినపిన్నియుఁ గర్మఁ బ్ర
సూతివేదనం, కళవళమందుచుం హరిణకామిని
మోహరిమోరమేశ్వరా, విలయముఁ బాపవే
యనుచు వేఁడ దయామృతదృష్టిముష్టిచేఁ, దలఁ
గక బ్రోచు శ్రీహరి... 20

చ. పడపడి కౌరవుల్సభకు బల్మిని ద్రౌపది నీడ్చి
తెచ్చి దు, ర్మదమున వల్వ లొల్వఁగ రమావర
నాదురవస్థఁ బాపవే, యదువర కావవే యనఁగ
నక్షయచేలము లిచ్చిబ్రోచు భ, ద్రదుఁ డగు
నట్టి శ్రీహరి... 21

చ. తరలని ద్రౌణిబాణశిఖ దార్కొనియేఁచఁగఁదా

శజాలనో, మురహారకృష్ణ యోభువనమోహన
కావవె యంచు వేడ ను, త్తరజఠరస్థబాలుని
ముదంబునఁ బ్రోచిన శౌరి నిన్ను స, త్వరముగ
నేలు శ్రీహరి.... 22

ఉ. కామముఁ జెంది శూర్పణఖ కంసునిదాసిగఁ బుట్టి
కుబ్జయై, యామధురాపురిఁ మధుమదాంతకుఁ
బొంది ధరించె నింక నీ, కేమిటి కీవిచార మెవ రె
ట్టులఁగోరిన నట్లు ప్రోచు శ్రీ, ధాముఁడు గాన
శ్రీహరి... 23

చ. పరుస కుశస్థలీపురనివాసుఁడు విప్రుఁడు పుత్త్రులీ
ల్గినఁ, నరునిప్రతిజ్ఞ దూలెనని నందకుమారుని
వేఁడినంతనే, కరుణను దత్తనూజశతకంబు సజీ
వముఁ జేసి తెచ్చి స, త్వరముగ నిచ్చె శ్రీహరి.

ఉ. ఆలమునందుఁ దోల్లి దెగటారిన దైత్యులు ద్వా
పరంబునం, దోలిఁ బ్రలంబ కంస నరకోరగ కౌరవ
సాల్వ చేది భూ,పాలక దంతవక్త్రముర పౌండ్ర
కులఁ బడఁగూల్చిమాన్చె ను,త్తాలభరంబు శ్రీ.

చ. సురవరులం జయించి బలశోభితుఁడై నరకాసురుం
డు భూ, వరులను బట్టి యాఁకగొని పంచపనే
యఁగ కావవే హరీ, శరణని వేఁడి వారి చెఱ

---

* లైనను ద్రుంచి.

సయ్యనఁ బాపినదేవదేవుఁడా,దరమునఁ బ్రోచు
శ్రీహరి... 26

చ. విను మొకరక్కసుండు తనవీనుల కెయ్యెడవిష్ణు
నామముల్, వినఁబడకుండుఁగా కనుచువిక్కుచు
నెప్పుడు రెండువీనులకు, ఘనముగ జంటగంట
లొగిఁగట్టినవాని నెఱింగి సత్కృపం, దనియఁగ
బ్రోచు శ్రీహరి... 27

చ. తొలుత మహాపరాధులయి తూలిగయాఖ్యుఁడు
దాఁకదానవుం, డలభృగువుం బురందరుఁడు పా
టకగర్భుఁడు దీనవృత్తిచే, వెలువడి కావవేయను
చు వేఁడినఁ దప్పుతమించిప్రోచెఁ గొం,దలమణఁ
గించి శ్రీహరి... 28

చ. చెలిమిని యాదవుల్ భయముచేతను గంసుఁడు
భక్తితో మునుల్, వలపున గోపకామినులు వై
రము మానక పెక్కురక్కసుల్, తలపడి శౌరినిం
దగిలి ధన్యతఁ గాంచిరి గాదె నీవిదే, తలఁగని
ప్రేమ శ్రీహరి... 29

ఉ. తన్నినఁ బట్టికొట్టినను ద్రాటనుగట్టిన జాలరువ్వి
నన్, మిన్నకదుండఁగిఁ దనిన మిండఁడన స్మటు
మాయివన్న సం, పన్నులగా నొనర్చినకృపాళుఁ
డు వెన్నుఁడుగాన నన్యచిం, త నొనిగిలేవు
శ్రీహరి... 30

చ. తలఁప నహల్యఁ దార కురుదార దశాననదార ద్రౌపదీ, లలనను నమ్మహాత్ముఁడు విలాసయశోగి పరిపూతగాత్ర లై, వెలయఁగఁ జేసినాఁ డనుచు వింటివి సంశయ మెందుకింక నం,తలఁ బడ నేల శ్రీహరి... 31

చ. అడవుల నొక్కలుబ్ధకుఁ డహర్నిశలం దతిక్రూర కృత్యముల్, నడుపుచు రామ రామయని నర్మిలిఁ బల్కుటచేతఁ బూతుఁడై, వడి జడదారియై కడకు వాసికి నెక్కుట వింటి వీవయో, తడఁబడ నేల శ్రీహరి... 32

ఉ. నింగికి నేగి దైత్యుల ననిం దెగటార్ప సురాళి మెచ్చిఖ, ట్వాంగుఁడు వేఁడినట్టుల నిజాయువుఁ దెల్ప నతండు ధాత్రి దీ, ఙ్ఞం గమలాక్షుసంస్మరణసల్పముహూర్తములోఁ దరించెఁ దద్భంగిని నీవు శ్రీహరి... 33

ఉ. భూసురదాసిగర్భమునఁ బుట్టి సదా హరిభక్తుఁ డౌటచే, భాసురవృత్తి నారదుఁడు బాగుగ దేవ ఋషిత్వ మొంది దే, వాసురమర్త్యలోకముల నందఱికిన్ గురుఁ డయ్యెఁ గాన నీ, దాసి నటంచు శ్రీహరి... 34

ఉ హేయపుబానిసెం గలసి హీనుఁ డజామిళభూ

సురుండు లేఁ, బ్రాయమునందు సంతుగని ప్రాణ
ముఁ బాసెడివేళఁ బుత్త్రునా, రాయణ యంచుఁ
దానుడువ నచ్యుతలోకముగల్గెఁదత్కథా, ధ్యా
యివి యేౘు శ్రీహరి... 35

చ. పరువడికోసలాత్మజయుఁ బంక్తిరథుం డరయంగ
దేవకీ, వరవసుదేవులై పొడమి వారిజనేత్రుని
గాంచి పెంచి ర, చ్చరితములెంచి ఘోరభవసం
ఘముల న్నిరసించి ముక్తి స, త్వరగతిఁ గాంచి
శ్రీహరి... 36

ఉ. పాండుగద్రోణుఁ డన్వసువిభుండునుభార్యధరా
భిధానయుఁ, నందయశోదలై బొడమి నందను
గాఁ గని పెంచి ముక్తులై, రందురుగాదె భావ
మెట్టులైనను నతఁడుఁ డంచు నమ్మి యే, తం
వర లేక శ్రీహరి... 37

చ. అలన సుమిత్రరోహిణిసమాఖ్య వహించి జనిం
చి కొంతుచే, హలధరుఁగాంచికాంచెనఖిలామరు
లందఁగలేనిసౌఖ్యముఁ, దలఁగక తచ్చరిత్రము
యథావిధిగా నుడువంగ నీకుఁ దత్ఫలము గలుం
గు శ్రీహరి... 38

చ. నయమును బాసి పూతనయు నందునిమందిరమం
దువెన్నునిఁ, రయమున నొంపఁబట్టఁగను రంజ

నందత్కుచ దుగ్ధరక్తముల్, ప్రియమునఁ గ్రోలి
కూల్చి దయపెంపున నైక్య మొసంగె నేమివిం,
తయొ తలపోసి శ్రీహరి... 39

చ. మదమునఁ గాలనేమి హనుమంతునిచే హతుఁ
డౌచు ద్వేషిగాఁ, బదపడి కంసుఁడై పొడమి పంక
జనాభునిఁ జేరె మాయురే! యదనున భక్తినైనఁ
బగనైనను బన్నగతల్పుఁ గోర భద్రదముగుఁ
గాన శ్రీహరి... 40

ఉ. *ధాతృశిరోవిఖండనకృతంబున ద్రౌపదిగా నొ
నర్చి యా, నాతికిఁ దుష్టిదీఱగ రణస్థలి కౌరవసే
ననిచ్చి బల్, జాతరజేసి రుద్రగతజాడ్యముఁబా
పితి వీవ హేజగ, త్రాత యటంచు శ్రీహరి...

చ. చతురతగాధినందనుని జన్నము గాచె నహల్య
శాపమూ, తతమునఁ బాపె నాజటలతన్వికి మో
క్షమొసంగె నత్యుదం, చితముగసర్వలోకములఁ
జేకొని యేలినదేవదేవుఁ డు, ధ్ధతినినుఁ బ్రోచు
శ్రీహరి... 42

ఉ. కోరిక దీఱ నొక్కపరి కోమలసౌరభపుష్పదామ
ముల్, గూరుప మాలికు న్మనిచెఁ గొంగుపసిం

* ఈకథ పురాణాంతరములవలన దెలిసికొనవలయును.
భారతాదులలో మృగ్యము.

డిగమోక్షమిచ్చి య, య్యారె! నిరంతరార్చకు
లు నైనమహాత్ములకేమిలోపమా, ధారుణి నందు
శ్రీహరి... 43

చ. కలిమి కుచేలుఁ జేర్చె వ్రజకాంతలకిచ్చెను భో
గభాగ్యముల్, వలువ లొసంగె ద్రౌపదికి వైభ
వమూసరవెల్లికిచ్చె దో, ర్బలమలపాండవేయు
లకు రాజ్యమొసంగిన శౌరిదీక్ష చేఁ, దలఁగక బ్రో
చు శ్రీహరి... 44

ఉ. క్రేపులఁబాపల స్గృహాను గీష్పతిదాఁచ గణించి
ప్రోవఁడే,బాఁపనిబాణవహ్ని పసిబాలుని నేఁచఁ
గ నాచికావఁడే,పాపగతి న్గతాసులగు బ్రాహ్మణ
పుత్త్రుల నుద్ధరింపఁడే, దాఁపురమేల? శ్రీహరి...

చ. వ్రత మొనరించి సాత్రజితి వాసిగనిచ్చినభర్తృ
దానము, ధ్ధతిసురమాని యమ్ముతరి తత్పతితుల్య
ధనమ్ము లేనిచో, వెతఁబడి సత్య రుక్మిణిని వేఁడఁ
గఁ దత్తులలోన భీష్మక, క్షితిపతిపుత్త్రి యొక్క
తులసీదళ ముంచిన తుల్యుఁడౌ జగ, త్పతి నిను
బ్రోచు శ్రీహరి... 46

చ. విరివిగ రంగమందిరము వేంకటశైలము తోత
శైల పుష్కరబదరీ వనమ్ములను గండకి నైమిశ
నీలశైలముల్, హరినిజమూర్తులౌ నెనిమి దార

య నేఁగఁగలేవు ముందునా, దరిచెట్టు లంచు
శ్రీహరి... 47

చ. పొరిపొరి పైఁడిపువ్వులను పూజలుచేసిన భూమి
పాలునిఁ, విరివిగమంటి పువ్వులను వేడ్కనొ
నర్చినకుంభకారునిఁ, సరసతమల్లెపూవుల నొసం
గిన భూసురవర్యునిఁ మహా,దరమునఁ బ్రోచు
శ్రీహరి... 48

ఉ. పొందున మేనమామ తనపుత్త్రికనిచ్చె నటంచు
మాని గో, విందునకీయకున్న వెనువెంటనె సా
టిఁగఁ గాశినుండి పే, రొందగ వచ్చి పెండ్లి నిగ
మోక్తుని పొన్నురిలో నొనర్చి త, ద్వందితుఁడైన
శ్రీహరి... 49

చ. విరిసరు లీయఁగై కొనుచు వింతనెఱుల్ సరులం
దుఁగాంచిభూ,వరుఁ డలుగఁ దదర్చకునివాక్య
ము నిక్కముగా శిరోజముల్, విరివిగఁ జూపి
యా వెడఁద వీడఁగఁజేసెను మున్ను కాకుళాం
తరమున నట్టి శ్రీహరి... 50

ఉ. తేనె ఘృతంబు పాలు గడుతీర్థము నాల్గుయుగ
క్రమంబులం, దానును శంఖచక్రముఖరాయుధ
ముల్ స్వకరాంబుజంబుల, న్బూనుచు సాధునం

గనులఁ బ్రోదిగసాఁకుచు మంగళాచలా,స్థాన
కుఁడైన శ్రీహరి... 51

ఉ. పొంగుచు నొక్కవిప్రకులపుంగవుఁ డంగజకేళిఁ
దేల్చుచు, రాంగన వీడిన వ్యగదుడంతటి కుం
టనవేషధారివై, బంగరుగిన్నెఁ దా నొసఁగి
బాగుగఁ బ్రోచినరంగఁడావ్యయా,దసంగతుఁ డం
చు శ్రీహరి... 52

ఉ. పాతకురాల నోపతితపావన నీమహనీయరూప
ముల్, ప్రీతిగఁ జూపుమంచు మొఱఁబెట్టఁగ నీల
ధరాధరంబునన్, ఖ్యాతిగఁ జేర్చి దాని గతకల్మ
షురాలినిజేసితౌ జగ,త్త్రాతవటంచు శ్రీహరి...

ఉ. కోరితి నీపదాబ్జము లకుంఠితభక్తిని బూజసే
యఁగాఁ, జేరితి నీమహోన్నతవిచిత్రచరిత్రము
లాలకింపఁగా, దూరతిఁ గావలెన్ దురితదూర
దయామృతదృష్టిఁజూడు నా, దారితినంచు శ్రీ
హరి... 54

ఉ. నీగుణముల్ నుతింపఁగ ఫణీంద్రుఁడు చాలఁడు
నీచరిత్రము, ల్బాగుగఁ గార్తవీర్యుఁ డొగివ్రా
యఁగనేరఁడు నీదుసోయగం, బాగిరిభేది నిక్క
ముగ నారయనోపఁ డజాండపాలనో,ద్భాగుఁడ
వంచు శ్రీహరి... 55

ఉ. నీకు నమస్కరించెదను నిర్మలభక్తిని నిన్నుఁ గొ
ల్చెదన్, నీకథ లాలకించెదను నీపదభక్తుల సేవఁ
జేసెదన్, నా కిలువేల్పునీవ నిను నమ్మితి నన్నుఁ
గృతార్థుఁజేయఁగా, దాకొనుమందు శ్రీహరి.

ఉ. నీవు సమస్తలోకముల నెమ్మి సృజించితి వందు
లోన న,న్నే వసుధ న్మనుష్యునిగ నేఁటికొనర్చితి
వట్లుగాక నా,నావిధదుష్కృతమ్ములఁ బెనంగొ
నఁజేసితి వేమిసేతు నీ,భావన కంచు శ్రీహరి...

ఉ. నిక్కము దాతనీవు కరుణింపఁగఁ బాత్రము నేన
సుమ్ము వే,ఱొక్కటి వేఁడ నీదుపదయుగ్మమున
న్విడరానిభక్తియే, తక్కఁగొనంగఁగోరితి కృత
జ్ఞుఁడవై దయసేయకుండుటే, తక్కువ యందు
శ్రీహరి... 58

ఉ. అక్కట జన్మవేదనలనాఱడిఁబొందితినయ్యనీకు
నే, మ్రొక్కెదనయ్య నేనిటులమోసముపుచ్చు
టెఱుంగనయ్య నా, దిక్కటుచూడుమయ్య మది
దీనతఁబాపఁగదయ్య నీకు నే, దక్కెదనయ్య
శ్రీహరి... 59

ఉ. మన్ననఁ గుంభకారకుఁడు మంచిఘటమ్ము లొన
ర్చినట్లు భా,స్వన్నిగమోక్తి లోకమునసంఖ్యముఁ
గల్పనఁజేసిప్రోచు సం,పన్నుఁడవీవు సన్నొకవిప

న్నని మన్ననసేయరాదె విద్వన్నుతయంచు
శ్రీహరి... 60

ఉ. మానసమా! వృథావిషయమగ్నత నందఁగనేల
పూరకై, కానక మేఁక నూతఁ బడుకై వడిఁగన్ప
డె నీ ప్రచారముల్, మానుము మాధవు
న్గొలువ మంచిసుఖంబు ఘటిల్లుఁ గాన వి,ద్యా
నయవృత్తి శ్రీహరి... 61

ఉ. ఉత్తమధర్మముల్ నడుపనోప వనుత్తమధర్మ
కర్మముల్, మొత్తముగానొనర్చెదవు మోసము
వచ్చు టెఱుంగవైతివే, యెత్తునమోక్షమందె
దవా? యెందుకు జాగిఁక నీదువృత్తిత,ద్ధత్తము
చేసి శ్రీహరి... 62

ఉ. ఎత్తఁగరానిజన్మముల నెన్నిటఁద్రోచితి వన్ని
యెత్తినే, దుత్తలమంది కుంది యిపు డోరువఁ
జాలక నిన్నువేడ న,న్నిత్తఱి నిర్నిమిత్తముగ
నేఁటికి యేఁచెదవయ్య మాన్పనా,తత్తఱమంచు
శ్రీహరి... 63

ఉ. దాఁకొనుపుణ్యపాపములఁ దప్పక మానవలోక
మందు దు,ర్వ్యాకులవృత్తిఁ బుట్టి యపవర్గముఁ
గానక గోరుచుట్టుపై, రోఁకలిపడ్డరీతి నెదరో
యక సంసృతిఁ జిక్కి యింక నెం,దాఁకఁ జరింతు
శ్రీహరి... 64

ఉ. ప్రాయము కాయముం సతమె భక్తిఁ బఠించిన వారిఁ బ్రోవ నా, రాయణుఁడుం దదీయ మగు రాజ్యము లుండఁగ ఘోరదుర్గతి, న్బాయక గూలు మానవుల బాధలు చూడ సహింప విచిత్ర మా,దాయము లేదు శ్రీహరి... 65

ఉ. ఆర్వురుచక్రవర్తులు పదార్వురురాజులు రాజ్యమేలిరీ, యుర్విఁగలంతకాల మిటులుండిరె నీబ్రతుకెంతలోని దీ,పర్వులు పర్వనేల మురభంజను సేవయె ముక్తికర్వుకా, దర్విగ నెంచి శ్రీహరి.

ఉ. వేమరు మాధవుస్తలఁపవే యని నీచెవిఁజాఁటి చెప్పఁగా, నేమముపాటుఁజెంది వినవేమిపురా కృతకర్మ మయ్యయో!, పామరవృత్తి మైమఱచి భామలకే యొడిగట్టుకొంటి వీ, తామసమేల శ్రీహరి... 67

చ. ప్రకటితవేదశాస్త్రముల భాసిలుతత్త్వ మెఱుంగలేక యీ, వికటతమంబులందగిలి వెక్కిరిచేష్టల పిచ్చిపీగుచుం, సకలము నాది నే ననుచు సంసృతిఁజిక్కి చరించువారితోఁ, దకబికలేక శ్రీహరి.

ఉ. ఆతతముక్తిమార్గము నయం బుపదేశముఁజేసిఁ చూడఁగాఁ, గోఁతికి రత్నహారములు గొంకక వేసినమాడ్కిఁ దోఁచె నీ, నీతికి నేమనందు

నీకు నేర్పరివై భయభక్తితో నుంచి, ధ్యాతము
లైన శ్రీహరి... 69

ఉ. నీరము వృక్షమూలమున నించినఁ జల్లఁదనంబు
కొమ్మలం, జేరినమాడ్కి విష్ణునకుఁ జేయుసపర్యల
సర్వదేవతల్, భూరిత రేష్టభోగపరిపూర్ణతఁ గాం
తురు నీకుఁగల్గు వి,స్తారసుఖమ్ము శ్రీహరి... 70

చ. ఉరమునఁగల్గు రత్నరుచిరోజ్వలహారము వెజ్జి
వాఁడు దా, నరయఁగలేనిమాడ్కి భవదంతరు
త్మనుగానవైతి వ,స్థిరముసుమీ యొకల్ తెలివి
దెచ్చుక యింతటనైనభక్తిత,త్పరతఘటిల్లు శ్రీ
హరి.... 71

చ. పనుపడ లౌకికక్రియలు పాయక సల్పఁగవచ్చు
నంటివా, విను మొకనీతిదెల్పెదను విప్రగవా
మరభూతకోటికిఁ, గొనకొని యెగ్గుసేయక య
కుంఠితవృత్తిని జిడ్డు నాలుక, న్దసరనినీతి శ్రీహరి.

చ. కలఁగనిలేచి తద్విధము గానని కైవడి దైవ
మాయచేఁ, దలపడి దేహధారులము తప్పడు మో
హముఁజెంది తత్త్వము, ల్దెలియక మోసపోయెడి
గతిం జరియింపక మోక్షకాంక్షచేఁ, దలఁపు
వహించి శ్రీహరి... 73

చ. ఎన్నికఁ జేసినిన్నిటుల నెన్నివిధంబుల బోధఁజేసి

నఁ, జెన్నలరంగ హీనునకుఁ జేసినమేల్ చెడు
నట్లు గన్పడెన్, గన్నడఁబుద్ధిలోఁగలపె కాలముఁ
బుచ్చక నింకనైన వి,ద్వన్నుతుఁ డైన శ్రీహరి.

ఉ. అంధతమంబులోపలఁ బదార్థగవేషణమెల్ల సైం
ధవ, గ్రంథి జలంబులోనిడుటగావున నాత్మజ
నావనైకహృ,ద్బంధుఁడుసంస్మృతోగ్రభవబంధుఁ
డు లౌకికగాథమానుమీ,బంధనలేల శ్రీహరి.

ఉ. గానము మేళవించి మరుగాళ్లనటించు మనుష్యుఁ
డౌదల,న్బానినదొంతులన్ మఱపుఁ బొందనిడెం
దముభంగి సంసృతి, న్మానక సర్వకర్మము లమంద
ముగా నొనరించుచో సదా, ధ్యానముగల్గి శ్రీ
హరి... 76

ఉ. తరణినమస్కృతుల్ సలుపు ధన్యులఁగన్గొనివాన
రంబు ద,త్సరణినొనర్చుచందమున సాధుల సే
ళనఁజేయకెంతయున్, పరమపదాధినాథు పద
భక్తులఁగూడి విశిష్టవర్తివై, తరలనిభక్తి శ్రీహరి.

ఉ. బట్టలఁగొట్టిచిట్టెలుక పట్టెఁడుపొట్టకుఁ గాంచ
నట్టులి,ట్టట్టుమెలంగి మోహగతులారయనేరని
చెట్టనైతి పీ,వెట్టులగట్టుబట్టెదవొ? ఏఁటికిబు
ట్టఁగ గిట్టఁగా నయో, దట్టపుభక్తి శ్రీహరి...

ఉ. తంతువునన్ గృహంబు బలితమ్ముగఁజేయుచు నం

దుఁజిక్కి తా, రెంతయు లేకబున్నిపురు వేర్పడ
నంతమునొందినట్లు వి, భ్రాంతివహించి సంసృతిని
బాల్పడి గోల్పడ నేలకల్లయా, ధ్వాంతమణం
చు శ్రీహరి... 79

చ. చిరిగినచీరమాని మఱుచీరధరించినచూడ్కి మా
టికిఁ, విరివిగదేహమువ్విడచి వేఱొకదేహము
లోనఁ జొచ్చు తాఁ, దరలనిమాయలోనఁబడి త
ల్లడపాటునఁ దన్నుఁ గాడుచుఁ, దరిఁగన వే
ల శ్రీహరి... 80

ఉ. కూసముగప్ప నేర్పునను గొబ్బునచూడ్చెడి చి
ల్వపోలికఁ, వేసటనేయు జన్మపరివేదన వీడు
నుపాయమార్గ ము, ల్లాసమున న్ననుంగొనినలక్షు
ణవంతులఁ గూడి నిర్మలో, ద్భాసురవృత్తి
శ్రీహరి... 81

ఉ. అన్నముధాత్రి యందమృతమావులమందలయం
దుపావకం, బెన్నసమిత్తులందునరు లేర్పడఁగాంచి
నభంగిబుద్ధిచేఁ, గ్రన్నన మోక్షము న్వడయఁగా
నగుఁగావున భక్తిచేత వి, ద్వన్నుతుఁడైన
శ్రీహరి... 82

చ. నిరతము నీరుపక్కియలు నీరములందుమునింగి
యీల్లు నే, గుఱుతుగ మేడిపండ్లఁ గ్రిమికోటు

లు పుట్టుచులోనఁజిక్కునే, విరివిగ సంసృతిఁ బొరలి వెల్వడుమార్గమెఱుంగవన్న నీ, తరమె తరింప శ్రీహరి... 83

ఉ. మాయురె! జెందమూ హరికి మార్పడియన్యుల గోరుటందమా, పాయకగంగచేరువను బావి యొనర్పఁగబూనుటందమా, కాయము నమ్మి కాలగతి కానిచందమదేల ముక్తిసం, ధాయకుఁడైన శ్రీహరి... 84

ఉ. మిథ్య సుమీ జరామరణమేదురమైన యొడల్ దురంతశా, స్త్రార్థ్యయనమ్ములెల్లను మహాఫలదమ్ములు కావుసుమ్మి యీ, మధ్యమలోక మింతటిది మర్త్యకుమస్మదుదీరిత మ్మిదే, తథ్యము వేగ శ్రీహరి.... 85

ఉ. జారుని దుష్టవర్తనుని సజ్జనదూరు నసత్యవాదినిఁ, జోరుని లుబ్ధు నిర్దయుని జూదరి బ్రాహ్మణవృత్తిఘాతుకుఁ, న్గారుని ధర్మదూషకుని గూడక నిత్యము సర్వకల్మషో, త్తారము లైన శ్రీహరి.

ఉ. భూసురవృత్తిపోషకుల భూతదయాళుల పుణ్యావర్తనా, భ్యాసుల మాతృభక్తిపరిపాలననిష్ఠుల నాత్మతత్త్వవి, న్యాసుల సత్యభాషుల ననంతుని

దాసులఁ గూడి నిర్మలో, ద్భాసురలీల శ్రీహరిప
దమ్ములుకోరిభజించుచిత్తమా. 87

## దశావతారవర్ణనము.

ఉ. అండజ కూర్మ సూకరమృగాధిపకుబ్జకుఠారి ధారి
మా, ర్తాండకులాచ్యుతాగ్రజపురాసురభేదక
తాదిచర్యలన్, తాండవచండిమన్ దితిజదర్ప
ము లార్పఁగనేర్చుదంట నీ, దండఁగలండు శ్రీ
హరి... 88

ఉ. నీరజసంభవుండలసి నిద్దురఁబోయినరాత్రి చోరుఁ
డై, యారసి వేదముల్గొనుచు నంబుధిఁజొచ్చిన
సోమకాసురు, న్వారకత్రుంచి వేదములు నల్వకొ
సంగినమత్స్యమూర్తి మ, ద్భారముఁ బూను
శ్రీహరి... 89

చ. కడువడి మందరా చలము కవ్వముగా ఫణిరాజు
త్రాడుగా, జడధిమధింప నంబుధిని శైలముగ్రుంగఁ
గ దేవదానవుల్, తడఁబడివేఁడ గూర్మమయి త
ద్గిరిఁదాల్చినశౌరి విన్నహో, తడయక ప్రోచు
శ్రీహరి... 90

ఉ. ఈత్రితిఁ జుట్టిపట్టుకొని హెచ్చిరసాతలచారి
యైన హే, మాక్షుని బట్టికొట్టి సకలామరులెన్నఁ
గ భూమిఁకోఅపై, దక్షతఁదాల్చినట్టి క్రతుదంష్ట్రి

దయామతి నిన్నుఁ బ్రోచు నే, తత్‌క్షణమందు శ్రీహరి.

చ. హరిగిరిసింధుఁజూపుమన హంకృతిఁ స్తంభముఁ జర్వ
నందుభీ, కరనరసింహుఁడై వెడలి గ్రక్కున రక్క
సు డొక్కఁ జించిని, ర్భరముగఁ దత్సుతున్నెనరు
బాయకప్రోచుమహానుభావుఁడి, త్తఁడెనిను బ్రో
చు శ్రీహరి... 92

చ. సురలను బాఱఁదోలి బలిసుస్థిరతన్ భువనంబులేల
నుం, దరవటువేషియై ధర పదత్రయదానము
వేఁడి తద్బలిం, గరుణగలంచి వజ్రికి జగత్రయ
మిచ్చినశౌరి నిన్ను నా, దరమునఁబోషించు శ్రీ
హరి... 93

ఉ. కంటకులైన రాజులను గట్టిగ నాలములందు గం
డ్రగొం, డ్డంటను జక్కడంచి ప్రకటంబుగఁ ద
ద్రుధిరప్రవంతులై, దింటను బైతృకంబు లొసఁగిఁ
దీఱిచి భార్గవరాముఁడైన బ, ల్దంటనెఱింగి శ్రీ
హరి... 94

చ. తరణికులంబున న్బొడమి తాపసి జన్నముగాచి
తాటక న్బొరిగొని శంభువి ల్లునిమి భూమిసుత
న్వరియించి కానల, న్దిరిగి పడంతికై యని నెదిర్చి
న రావణకుంభకర్ణుల, న్దఱిగినజోదు శ్రీహరి...

చ. హలధరమూర్తియై హరికి నగ్రజుఁడై జనియించి

ముష్టికా, దులవధియించి రేనతిని దొయ్యలిగా
వరియించి ధాత్రికా, నలజడిమాన్పి లోకముల
నన్నిఁటిఁ గాచినసీరి నీదుకొం, దలము నణంచు
శ్రీహరి... 96

చ. నలువవరమ్మునన్ జలమునం ద్రిపురాసురు లెల్ల
లోకముల్, గలఁచిన బౌద్ధశాస్త్రములు కల్పనఁ
జేసి తదంగనామనస్స్ఖలనమొనర్చి వారి నడఁచన్
ద్రిపురారికి సాయకాకృతిన్, దలఁకొనునట్టి
శ్రీహరి... 97

చ. గుఱ్ఱమునెక్కి క్రూరులగు ఘూర్జరబర్బరపార
సీకులన్, గొట్టెలకైవడిన్నఱికి ఘోరతరప్రకట
ప్రతాపియై, మొఱ్ఱలడంచి దేవతల మ్రొక్కు
లు గైకొను సామిగల్గనీ, తట్టెలవీడి శ్రీహరి....

చ. అరయఁగ బిందుమాధవుప్రయాగరమాధవు సే
తుమాధవున్, వరదునిపద్మనాభుని జనార్దను
రంగని . వేంకటాధిపున్, బరమపదార్థసిద్ధికయి
ప్రార్థనఁజేసి తదీయభక్తిత, త్వరతను జెంది శ్రీ
హరి... 99

చ. పాలుననెయ్యి కాష్ఠములఁ బావకుఁడశ్మమునందు
లోహమున్, బూలను విత్తనం బలరుపోలిక
విష్ణునియందు నీజగ, జ్జాలమునుండు విష్ణుఁడు

త్రిశక్తియుతుండగుఁగానఁ దత్త్వబో, ధాలలి
తోక్తి శ్రీహరి... 100

చ. పన్నగవైరివాహనము పన్నగరాజఫణాతపత్త్రి
డై, పన్నగభూషణాద్యమరపాలురుగొల్వఁగ
సుప్రసన్నుఁడై, కన్నులఁగానుపించెనదె కాంతి
యుఁగాంచి ప్రసన్నవృత్తినే, తన్నిగమోక్తి
శ్రీహరి... 101

ఉ. ధాతలిఖించు ఫాలలిపి తాపసులెన్నినవేదశా
స్త్రవి, ఖ్యాతము మత్పురాకృతశుభాధికపుణ్య
ము లొక్కటౌటని, స్నీతటిగొల్వఁగల్గె ఫలి
యించెను నాతపమంచు నుద్భవో, త్ప్రాతమడం
చు శ్రీహరి... 102

ఉ. అంగములో వెలుంగు విమలాంగుఁడటం చెఱుఁ
గంగఁజాలకి, బ్భంగిమెలంగి లొంగి పటుభంగుల
బాముల బ్రుంగనేల శ్రీ,రంగని యంతరంగబహి
రంగముల న్గనకున్ననెట్లు త, త్సంగతిగల్గు
శ్రీహరి... 103

చ. సురుచిరగోపవేష మధుసూదన మాధవ రాధి
కామనో, హర సురభూరుహాపహ మహాసురవీ
ర మదాపహార సుం, దరతర హేమచేల శుక
నారదవంద్య జగన్నివాస మం, దరధరయంచు
శ్రీహరి... 104

చ. మునుకొనినీయనుగ్రహముపొందునన ర్తకుభంగి
హంగుగా, నెనుబదినాల్గులక్ష లిల నేర్పడువేష
ము లేనుదాల్చితిఁ, గనుఁగొనిమెచ్చితేని మది
కాంక్షలొసంగుము మెచ్చకున్న, వద్దనుమవియం
చు శ్రీహరి... 105

చ. పుడమిని తాడెపల్లికులముఖ్యుఁడ విప్రుఁడపాన
కాలురాయుఁడ భవదంకితమ్ముగశతోత్పలచంపక
వృత్తముల్ ముదం, బడర రచించినాఁడను దయా
మతిఁ గైకొని ధన్యుఁ జేయవే తడయక యంచు
శ్రీహరి... 106

చ. సకలపురాణసారరససంగ్రహ మీశతకంబుగాపు
నః, బ్రకటముగావినః జదువ వ్రాయఁగవా
గలు తత్త్వవేత్తలై, ప్రకృతినిదాఁటిబ్రహ్మమయ
భావముగాంచుట కేమివింత సా, ధకమిదెయం
చు శ్రీహరి... 107

చ. మంగళ మద్రిజాభినుత మంగళ మంబుదనీలవి
గ్రహా, మంగళ మంబుజాక్ష హరి మంగళ మా
శ్రితకల్పభూరుహా, మంగళమచ్యుతా యని ర
మారమణీశుని కానతిచ్చినం, తంగరుణించు శ్రీ
హరిపదమ్ములు కోరిభజించు చిత్తమా. 108

చిత్తబోధశతకము సమాప్తము.

---

# పీ ఠి క.

ఆంధ్రనాయకశతకమును కాసుల పురుషోత్తమకవి రచించెను. ఇతఁడు బందరు సమీపమునందున్న శ్రీకాకుళమునందలి ఆంధ్రవిష్ణునిగూర్చి యీశతకము రచించెను పురుషోత్తమకవి భట్టురాజుకులమువాఁడనుటకు శతకములోని "రట్టుసేయుదుఁగనుము నాబట్టుతనము" అనుపద్యభాగము సహాయము చేయుచున్నది. ఈకవినివాసము శ్రీకాకుళముచెంతఁ గల పెదప్రోలు. ఇతఁడు కాశ్యపగోత్రుఁడు. అప్పలరాజు రమణాంబల కుమారుఁడు. అద్దంకి తిరుమలాచార్యులశిష్యుఁడు. ఈయంశమీకవిరచించిన హంసలదీవి గోపాలశతకములోని యీక్రిందిపద్యమువలనఁ దెలియును.

సీ. కాశ్యపగోత్రుఁడఁ గాసులవంశచం
ద్రముఁడ నప్పలరాజు రమణమాంబ
కూర్మితనూజుండ గురుపులౌనద్దంకి
తిరుమలాచార్య శ్రీచరణపద్మ
భవ్యతీర్థమరందపానద్విరేఫాయ
మానమానసుఁడను మాన్యహితుఁడ
పురుషోత్తమాఖ్యుఁడ పూదండవలె నీకు
శతకంబుఁ గూర్చితి శాశ్వతముగ

తే. చిత్తగింపుము మీపాదసేవకుఁడను
భావజవిలాస హంసలదీవివాస
లలితకృష్ణాబ్ధిసంగమస్థలవిహార
పరమకరుణాస్వభావ గోపాలదేవ.

దేవరకోట సంస్థానములో సుప్రసిద్ధమైయున్న ఆంధ్రనాయకాలయము పూజాపురస్కారశూన్యమై హీనదశయందున్నపుడు పురుషోత్తమకవి మిగులఁ బరితపించి సుప్రసిద్ధుఁడు ప్రత్యక్షరూపుఁడగు దేవున కిట్టి విపరీతస్థితి చేకూరుటకుఁ గినిసి నిత్యోత్సవములు చేయించికొనక చేతఁగానివానివలె నూరకుంటఁ బ్రతిష్ఠగాదనియుఁ బూర్వకీర్తి నిలుపుకొమ్మనియు నిందాస్తుతులతో నీశతకమును ఆంధ్రనాయకునిఁగూర్చి రచించెను. ఇతఁడు మానసబోధశతకము. హంసలదీవి గోపాలశతకము భక్తకల్పద్రుమశతకము ప్రకృతాంధ్రనాయకశతకము వ్రాసినాఁడు. "మనసా హరిపాదములాశ్రయింపవే" యని యీకవి మానసబోధశతకము రచించితినని చెప్పుకొనుచున్నాఁడు. ప్రకృతము మానసబోధశతకమొకటి తాడేపల్లి పానకాలరాయకవికృతము కనఁబడుచున్నది. పానకాలరాయకవి చిత్తబోధశతకము వ్రాసెనుగదా! ఇఁక మానసబోధశతకమేల వ్రాయవలసివచ్చెను? పురుషోత్తమకృతికే యెవరేని కర్తృత్వము మార్చి

రా యని మేమూహించుచున్నారము. లేక పురుషోత్తముని మానసబోధశతక మంతరించినదేమో! నిశ్చయ మెఱుంగరాదు.

కాసుల పురుషోత్తమకవి దేవరకోట (చల్లపల్లి) సంస్థానమునకు క్రీ. శ 1791-లోఁ బట్టాభిషిక్తులైన శ్రీమంతు రాజా అంకినీఁడు బహద్ధరువారి యాస్థానకవి. కవిముని మనుమలిపుడున్నారుగావున నీకవినూటపాతికసంవత్సరములక్రిందట జీవించియుండును.

పురుషోత్తమకవికవిత మృదుమధురముగా శ్రావ్యముగా సాధ్యమగునంతవఱకు నిర్దుష్టముగా నుండును. ప్రవాహపాతమున నాలయముచెడి పూజాపురస్కారము లంతరింప నాంధ్రవిష్ణునిగూర్చి యీకవి శతకము వ్రాసి ప్రభువగు అంకినీడుగారికి భక్త్యుత్సాహములుగల్గించి యాలయ పునర్నిర్మాణమునకుఁ బ్రేరేపెను. కవులకవితాసహాయమునఁ జేయరాని పనులుండవనుట కిది యొక నిదర్శనము.

నందిగామ. } ఇట్లు, భాషాసేవకులు,
1-1-25 } శేషాద్రి రమణకవులు.

433

శ్రీ ర స్తు.

కాసుల పురుషోత్తమకవివిరచిత

# ఆంధ్ర నాయకశతకము.

---

సీ. శ్రీమదనంతలక్ష్మీయుతోరఃస్థల!
చతురాననాండపూరితపిచండ!
దరచక్రఖడ్గగదాశరాసనహస్త!
నిఖిలవేదాంతవర్ణితచరిత్ర!
సకలపావననదీజనకపాదాంభోజ!
రమణీయఖగకులోత్తమతురంగ!
మణిసౌధవత్ఫణామండలోరగతల్ప!
వరకల్పకోద్యానవనవిహార!
గీ. భానుసితభానునేత్ర! సౌభాగ్యగాత్ర!
యోగిహృద్గేయ! భువనైకభాగధేయ!
చిత్రచిత్రప్రభావ! దాక్షిణ్యభావ!
హతవిమతజీవ! శ్రీకాకుళాంధ్రదేవ!. 1

సీ. వైజయంతీదామ! వర్ణితసుత్రామ!
శోభననామ! లోకాభిరామ!
కువలయశ్యామ! వికుంఠపట్టణధామ!
శ్రుతిహితనామ! దైవతలలామ!

కృతదైత్యసంగ్రామ! గీతార్థపరిణామ!
యదుకులాంబుధిసోమ! యఘువిరామ!
సంగరజితభీమ! రంగద్గుణస్తోమ!
త్రిభువనక్షేమ వర్ధిష్ణుకామ!
గీ. దాసులము గామ నీపేరుఁ దలఁచుకోమ?
కొసరితిమి ప్రేమ కోరినకోర్కు లీను. చిత్ర. 2

సీ. మానుషహర్యక్ష! మార్తాండసోమాక్ష!
త్రిభువనాధ్యక్ష! కౌంతేయపక్ష!
మదనకోటివిలాస, మంజులదరహాస!
శ్రీవృష్ణినాప! కౌశేయవాస!
శార్ఙ్గకోదండ! పిచండభృతాజాండ!
వినుతవేదండ! రవిప్రచండ!
దీనశరణ్యా! విద్వన్మనశ్శైవపుణ్యా!
భక్తానుగణ్యా! దిక్పతిభువరేణ్యా!
గీ. సిద్ధసంకల్ప! యవికల్ప! శేషతల్ప!
నిష్కళంక! నిరాతంక? నిరుపమాంక!. చిత్ర. 3

సీ. గోవింద! మునిబృంద సేవితపాదార
వింద! నిత్యానంద! విశ్వతుంద!
శ్రీమంత! విజయలక్ష్మీకాంత! నిర్మల
స్వాంత! భక్తోద్యానవనవసంత!

యఘనాశ! కోటిసూర్యప్రకాశ! పరేశ!
విజితాశ! సన్మనోంబుజనివేశ!
సద్గుణగేహ! వాసవనీలసమదేహ!
బంధురోత్సాహ! సుపర్ణవాహ!
గీ. పండితస్తోత్రచారిత్ర! పద్మనేత్ర!
మధురమంజులభాష! సమస్తపోష!. చిత్ర. 4
సీ. శ్రీకాకుళము భక్తలోకచింతామణి
శ్రీకాకుళము సుకృతాకరంబు
శ్రీకాకుళము ధరాలోక వైకుంఠంబు
శ్రీకాకుళము మర్త్యసేవితంబు
శ్రీకాకుళము వేదసిద్ధాంతమహిమంబు
శ్రీకాకుళము హతవ్యాకులంబు
శ్రీకాకుళము మహాక్షేత్రావతంసంబు
శ్రీకాకుళము సర్వసిద్ధికరము
గీ. తెలియ శ్రీకాకుళంబు నీదివ్యదేశ
మాంధ్రనాయక! నీవె శ్రీహరివి నిజము. చిత్ర.
సీ. ఇంద్రనీలచ్ఛాయ లీనునెమ్మేనిపైఁ
గనకాంబరప్రభ గ్రందుకొనఁగఁ
బర్వసుధాంశుశోభాసముజ్జ్వలవక్త్ర
మున నూర్ధ్వపుండ్రము ముద్దుగుల్క
నెగుభుజంబుల ధగద్ధగితాంగదద్యుతుల్
మూర్ధరత్నకిరీటమునఁ జరింప

వర్ణితోరస్థ్సలివైజయంతిక కౌస్తు
భాంతరశ్రీదేవియంద మమర
గీ. రమ్ము దర్శన మిమ్ము ఘోరములఁ జిమ్ము
మభయ మిమ్ము భవత్తత్వ మానతిమ్ము. చిత్ర.
సీ. కలిగినప్పుడె కన్నతలిదండ్రు లెన్న నే
నిసువు మాటాడంగ నేర్చె జగతి
బయలిజగంబు లంబకు నిజోదరమునం
దేబిడ్డ చూపించె నిద్ధరిత్రిఁ
దౌడలపై ముద్దుగా నిడుకొన్న జనని కే
పసిపిల్ల కొండంతబరువు దోఁచెఁ
దల్లిచెంగటనుండి యిల్లిల్లుఁ జొచ్చి యే
కుఱ్ఱఁ డింతుల బల్మిఁ గూడ నేర్చె
గీ. నాబుడుత వీవెరా యబ్బ! యబ్బురంపు
కతలమారివి నీ వెఱుంగనివి గలవె? చిత్ర. 7
సీ వరమిచ్చినట్టిశంకరుని కెగ్గు దలంచు
భస్మాసురునిపేరుఁ బాపినావు
తనయిల్లుఁ గాచుసుగ్రుని బోరుటకుఁ బిల్చు
బాణుచేతులు తెగఁ బఱికినావు
తొలుమిన్కు లజుని మ్రుచ్చిలి గొన్నసోమకుఁ
జంపి విద్యలు ధాత కంపినావు
బలిమి దైత్యులు సుధాకలశము గొన వారి
వంచించి సురలకుఁ బంచినావు

గీ. నిఖిలదైవతకార్యముల్ నిర్వహించు
నీకు నిజకార్యము భరంబె నిర్వహింప?. చిత్ర. 8

సీ. అచటలే వని కదా యఱచేతఁ జఱచెఁ గు
ద్ధత సభాస్తంభంబు దానవేంద్రుఁ
డచటలేవని కదా యస్త్రరాజం జేసె
గురుసుతుం డుత్తరోదరమునందు
నచట లేవని కదా యతికోపి నవిచెఁ బాం
డవు లున్నవనికిఁ గౌరవకులేంద్రుఁ
డచట లేవనికదా యాత్మీయసభను ద్రౌ
పదివల్వ లూడ్చె సర్వధ్వజుండు

గీ. లేక యచ్చోటులను గల్గలేదె ముందు
కలవు కేవల మిచ్చోటఁ గల్గు టరుదె?. చి. 9

సీ. అంచితాఖండదీపారాధనల చేత
దీపించు నెప్పుడు దేవళంబు
అగరుసాంబ్రాణిధూపార్పణంబుల చేత
భవనం బదెప్పుడుఁ బరిమళించు
నతినృత్యగీతవాద్యస్వరంబుల చేత
నెప్పుడుఁ గోవెల యెసక మెసఁగు
నఖిలోపచారసమర్పణంబుల చేత
మెఱయు నెప్పుడుఁ దిరుమేను కళల

గీ. నిపుడు డాకించుక లోభిత్వ మెనసినట్లు
దోఁచుచున్నాఁడ విట్టియద్భుతము గలదె?. చి

సీ. భక్తిఁ జేసిన శిలాప్రతిమమాత్రమె గాని
హరి యిందుఁ గలుగునా యనెడువారు
స్వామి యిందుండిన సత్యంబుఁ జూపక
యుండునే యని పల్కుచుండువారు
బుద్ధావతారంబుఁ బూనినాఁ డఖిలంబుఁ
గని కనన ట్లుండు ననెడువారు
దేవతామహిమంబుఁ దెలియునో యేమేమి
నడుమ నున్నదో యని నుడువువారు
గీ. నీకు నిత్యోపచారముల్ లేక యున్న
లోకు లిట్లాడుకొందు రపరా కిదేమి?. చిత్ర. 11
సీ. ధరనూటయెనిమిదితిరుపతులందు శ్రీ
కాకుళం బరయఁ బ్రఖ్యాత మేని
యాంధ్రనాయకుఁడవం చఖిలదేశంబుల
నిన్నుఁ గీర్తించుటే నిజమ యేని
వైఖానసోక్తికి వంచన రాకుండ
నెలలు చూపినమాట నిజమ యేని
వైకుంఠుఁడవు స్వయంవ్యక్తిగా నర్చావ
తార మొందినమాట తథ్యమేని
గీ. వివిధపూజోత్సవములు నిర్విఘ్నములుగఁ
జేసికొనకున్న నీకుఁ బ్రసిద్ధి గలదె. చిత్ర. 12
సీ. మానితంబుగ గరుత్మద్ధ్వజారోహణం
బెప్పు డొనర్తువో సెప్పుమయ్య!

గరిమతో నీ తిరుకల్యాణసంభ్రమం
బెప్పుడెప్పుడో వేగ చెప్పుమయ్య!
రమతో మహోన్నతరథ మెక్కి తిరువీథు
లెప్పు డేతెంతువో చెప్పుమయ్య!
ధరణి సభ్యాగతదాసప్రజాబృంద
మెప్పుడు బలియునో చెప్పు మయ్య!
గీ. వత్సరోత్సవవీక్షణవాంఛ జనుల
కెపుడు ఫలియించునో యాన తీఁగదయ్య.! చిత్ర.

సీ. తగునట్లు తిరుమేను తా నామతింపుచు
మిన్నపీతాంబరం బున్న దనుచుఁ
గమలతోఁ బుట్టినకౌస్తుభం బదిపోవఁ
దక్కు సొమ్మది నీకుఁ దక్క ననుచు
లలితరత్నద్యుతి మొలచినట్లు కిరీట
ముత్తమాంగముఁ బాయ కున్న దనుచు
మండితమాణిక్యకుండలంబులు కర్ణ
యుగళితోఁ బుట్టిన ట్లున్న వనుచు
గీ. నిందుకొన్నావు గడియించు నేరుపరివె
ప్రావలువ బ్రారువాణముల్ బ్రాఁతియేమి?-చిత్ర.

సీ. వంచన గాదె దివ్యక్షేత్రపతులలో
మంత్రార్థకృత్యము ల్మానియున్న?
నపకీర్తి గాదె లోకాలోకములయందు
వత్సరోత్సవములు వదలియున్న?

నగుబాటు గాదె యన్యమతస్థజనులలో
నిజదాసకోటి మన్నింపకున్నఁ ?
బరిపాటి గాదె యల్పజ్ఞానమతులలో
దేవతామహిమంబుఁ దెలుపకున్న ?
గీ. నేఁటిదా నీప్రతిష్ఠ? వర్ణించి చూడఁ
బాడి దప్పిన బలునిందపాలు గావె ? చిత్ర. 15

సీ. తిరునాళ్ళతఱి వచ్చెఁ బలుపరివిధముల
నెలమి సామగ్రిఁ జేయింప వేమి ?
సేవకు లందందు సేవింప భావింపఁ
దిరువీథుల రథంబుఁ ద్రిప్పవేమి ?
పూజిత మెల్లఁ దొలంగు నిజ మందుఁ బ్రజ లెంచు
పరమప్రసాదంబుఁ బంచ వేమి ?
దివ్యదేశం బది తీర్థంబు సార్థంబు
చక్రతీర్థము కృప సలుప వేమి ?
గీ. హరిమ గావించి నీయన్వయంబు లెత్తి
కీర్తినిండఁగ వర్ణించి తెలిపఱతు. చిత్ర. 16

సీ. చెల్లింపఁ దగునె ప్రేపల్లెలోఁ గలవెత్తి
గొల్లయిల్లాండ్రను గొల్లగొనఁగ ?
మెక్కఁగఁ దగునె మున్నొక్కిండ్లలో నుట్ల
కెక్కుపాల్వెన్నలు డొక్కనిండ ?
మ్రుచ్చిలఁ దగునె మ ళ్ళచ్చి జలక మాడు
మచ్చెకంటులకోక లిచ్చకముగ ?

మ్రొక్కంగఁదగునె ముం దొక్కపువ్వునకుఁదాఁ
గక్కసించిన యాలి కక్కజముగ?
గీ. నిట్టి నగుబాటుపనుల నీ వెన్ని కలుగఁ
జేసినాఁడవు మంచిప్రసిద్ధుఁడవె. చిత్ర. 17
సీ. అబ్బురో గలవా కాయక్లేశ మొనరించు
దేవాసురు లెటుండ దివ్యరమను
దోఁచుకో గలవా చేసాచి లోకము లాఁచి
బలిమహోదాత్తవైభవము లెల్ల
రాఁదీయఁ గలవా సత్రాజిత్తుఁ డీకున్న
మణిశమంతక మొక మమతఁ గొల్పి
నాటించఁ గలవా సన్న కసన్నె వనంబు
పెట్టు మ్రాస్పకరించి పెరటిలోనఁ
గీ. దెచ్చుకొన వేమి వస్త్రాన్న దీపధూప
గంధతాంబూలములకైన గడన దెలిసె. చిత్ర.
సీ. తలను బింఛెపుదండ ధరియించవలెఁ గాని
మణికిరీటముఁ బెట్ట మనుజపతివె?
గళమున వనమాలికలు పూనవలెఁ గాని
హారము ల్వేయ దేశాధిపతివె?
కరమున మురళి చక్కఁగఁ బూనవలెఁ గాని
శాతాసిఁ బూనంగ క్షత్రియుఁడవె?
తనువు గోక్షీరవాసన గుప్పవలెఁగాని
చందనం బలఁద రాజవె తలంప?

గీ. నెల్లలోక మెఱింగినగొల్లవాఁడ
వేది కులమింత రాజస మేమి నీకు?. చిత్ర. 19

సీ. కన్నవారల ముస్ను గారాగృహంబున
విడిచి పాఱితివి నీ కడిమి యేమి?
పగవాఁడు పురిటిలోఁ బట్టి నెత్తుకపోవఁ
దమకించుచున్న నీధైర్య మేమి?
ముద్దుమన్మని గోప్యముగ నొండు బంధింపఁ
దెలియన ట్లున్న నీ తెగువ యేమి?
వైరిఘాటికి నోడి వనధిమధ్యమునందు
నిలు గట్టుకొన్న నీబలిమి యేమి?

గీ. విఱిగి తిరి గెన్నఁడెన్నఁడో తఱి యెఱింగి
యొరుల నడఁచితి వది యేమి భరము నీకు ?-చిత్ర.

సీ. భిల్లాంగనాదంతపీడితఫలభు_క్తి
హేయంబు దోఁచలే దింత నీకు
సంక్రందనాత్మజస్యందనసారథ్య
మెరుసుగాఁ దోఁచలే దింత నీకు
గోపాలకానేకగోవత్సపాలనం
బెగ్గుగాఁ దోఁచలే దింత నీకు
వ్రజబాలికాము_క్తవస్త్రాపహరణము
హీనమై తోఁచలే దింత నీకు

గీ. నుచ్చనీచంబు లెఱుఁగక యిచ్చఁజేయు
చేష్ట లివి భ_క్తహితమతిఁ జేసి తండ్రు. చిత్ర.

సీ. విమతభూపతు లెట్లు విముఖులై పాఱిరో
రాజపీఠం బెక్క రానినీకుఁ
గుంభినీధవు లెట్లు కూఁతుండ్ర నిచ్చిరో
కుల మొల్లకయె నీకు గోపకునకు
సుందరీమణు లెట్లు చూచి మోహించిరో
కప్పుగు మైచాయ గలుగునీకు
దాసజనం బెట్లు దాస్యంబు సలిపిరో
తిరియువానిని మాఱుతిరియునీకు
గీ. మమత నీలీల లటు సూచి భ్రమసిరేమొ
తగుదువే యిట్టిఘనతకు దంభరూప. చిత్ర. 22

సీ. విక్రమాక్రమితభూచక్రుఁడా హేమాక్షుఁ
బొం గణంచుటలు కోణంగితనము
కరగతామృతకుంభగర్వితాసురకోటిఁ
దూలఁగొట్టుటలు గయ్యాళితనము
కుచపూర్ణవిషదుగ్ధకుటిలయా పూతన
పేరుమాయించుట పిల్లతనము
కంసపురీద్వారగమనావరోధి యా
మదకరి నీడ్చుట మకురుతనము
గీ. వడిగలతనంబులా యివి? గడన యేమి
కొద్దిపను లివి నీ కిది పెద్దతనమె? చిత్ర. 23

సీ. కెరలి కంసుఁడు నిన్ను నఱుకఁ గాచిన వాని
శౌరి సోదరిఁ ద్రోచి పాఱినావు

సరిపోర నరకు నొంచఁగలేక చేతివి
ల్లాలిచే నిడి దండ నలరినావు
తెగడి బంధువు లాజిఁ దిట్టికొట్టఁగ నోర్చి
వైదర్భిఁ జేపట్టి వచ్చినావు
దర్పకోద్ధతి కెంతో తత్తరపడి నిజ
స్త్రీపదాబ్జములఁ జే మోపినావు
గీ. నీపరాక్రమ మిట్టిది నిఖిలజగము
రాజ్ఞ మీఱక నిల్చుట యద్భుతంబు. చిత్ర. 24
సీ. వ్రేపల్లెలో గొల్లవెలఁదులు గొట్టరా
దొడిదొడి యిల్లిల్లుఁ దూఱలేదా!
రాసకేళికయందు రమణులా యెందఱో
చుట్టిపట్టినఁ బాఱఁజూడలేదా!
పదియాఱువేలభూపకుమారికలు తేరి
పాఱఁ జూచిన మతి భ్రమయలేదా!
ప్రణయవాదంబున భార్యలా యెనమండ్రుఁ
గసరివేసినఁ గూర్మిఁ గొసరలేదా!
గీ. తలిరుబోఁడులయెదుటఁ దత్తరము గలుగ
నీవు పరరాజముఖమున నిలువఁ గలవె? చిత్ర.
సీ. ఆలు విద్యావిహీనురాలు భూదేవియై
యఖిలభారకుఁ డనునాఖ్యఁ దెచ్చె
నిష్టసంపన్నురా లిందిర భార్యయై
కామితార్థదుఁ డన్న ఘనతఁ దెచ్చెఁ

గమలగర్భుఁడు సృష్టికర్త తనూజుఁడై
బహుకుటుంబకుఁ డన్నబలిమిఁ దెచ్చెఁ
గలుషవిధ్వంసిని గంగ కుమారియై
పతితపావనుఁ డన్నప్రతిభఁ దెచ్చె
గీ. నాంధ్రు బిడ్డలు దెచ్చుప్రఖ్యాతి గాని
మొదటి నుండియు నీవు దామోదరుఁడవె. చిత్ర.

సీ. కడలిరాయనిముద్దుకన్నియఁ బెండ్లాడి
యూఁచఁగా నిల్లట ముండు టేమి?
సహజ నొక్కర్తెను షండపాండవులకుఁ
బెండ్లిఁ జేసితి వీవు పెద్దవేమి?
చిరరతిప్రౌఢను జిన్న బిడ్డని కీవు
గూర్చితి వారీతి గూడునేమి?
యుగములనాఁటి పెన్ముగుసను ముసలన్న
కౌఁగిఁ జేసితివి తగుం దగు మతేమి?
గీ. తెలియ నవ్యక్తుఁడవు గావు తెలిసికొన్న
నిట్టివాఁడని తెలియలే దెవ్వరికిని, చిత్ర. 27

సీ. నీజ్యేష్ఠపుత్త్రుఁ డెన్నికకురానియశాశ్వ
తపుఁ బనుల్సేయు సంతతము జగతి
వేరొక ముద్దుకుమారుఁ డందఱిమోహా
లతలస్త్రీపురుషుల లంకెఁ బెట్టు
సీతలోదరి లోకమాత పతిపాపతు
దృష్టిఁ జంచలవృత్తిఁ దిరుగుచుండు

సీ వనస్యకృతాదినిబిడమాయావిథా
నులఁ జేయు దెవ్వరిఁ దొలఁగనీక
గీ. నాకరికంటె గుణాధికు లౌకరు మీరు
ఇంతచక్కన దెలిసె మీయింటివరుస. చిత్ర.28
సీ. సకలంబు నీవయై యొకమఱ్ఱియాకుపై
నిచ్చఁ బరుండునాఁ డెంత గలవొ!
తన బిడ్డఁ డని యశోదాదేవి పొత్తుల
నిడుక ముద్దాడునాఁ డెంత గలవొ!
తక్కులమార త్త దక్కించుకొనఁగ ని
న్నెత్తుక పెంచునాఁ డెంత గలవొ!
భయలేశ మెఱుఁగక బల్పాముపడగపై
గంతులు వైచునాఁ డెంత గలవొ!
గీ. పరువు గలవాఁడ వేమి ప్రాఁబల్కులందుఁ
దెలియ వరిముక్కుముల్లంతగలవొలేవొ! చిత్ర.
సీ. కల్లరు ల్గాని ప్రేపల్లెవా రందఱు
హర్షింప నచట నీయాట సాగె
మధురాపురీవరమనుజు లామోదించి
మన్నింప నచట నీమాట సాగె
ద్వారకాపట్టణధన్యులు నినుఁ గోరి
కొల్వఁగా నచట నీకొల్వు సాగెఁ
గరిపురధర్మజుం డురురాజసభ నిన్ను
భూషింప నచట నీమురువు సాగె

గీ. నెఱుకమాలినవారు నీపరువుఁ దలఁతు
రేమి నీపాంకములు సాగు నేమి యచట?. చిత్ర.

సీ. దూడలలోఁ బెంఁదూడ మేయఁగఁ జూచి
యట్టె పట్టుక చావఁగొట్టవలెనె
పొడవరావేగ నాఁబోతుకొమ్ములు పట్టి
విడువక దానిపే రుడుపవలెనె
ముక్కుతోఁ జెనకినకొక్కరాయినిఁ బట్టి
వెరవొప్పఁగా మెడ విఱువవలెనె
తన్నఁబోతని మృగాధమ మంచు నెంచక
తొడరి గార్దభమును ద్రుంపవలెనె
గీ. యేమి ఘనకార్యములు చేసి తిద్ధరిత్రి
నెన్నటికి నీ వొనర్చిన విట్టిపనులె చిత్ర. 81

సీ. కవ్వడి కెంత చక్కఁగబోధ చేసిన
నితరహింసాకర్మ మిష్టపడుప
రాయబారం బెంతరసికత నడపిన
ననికి భారతుల నాయత్తపడుప
విశ్వరూపం బెంత విమలతఁ జూపిన
నోర్వనికురురాజు నులుకుపడుప
విలుఁ బట్టనని యెంతొ చెలిమిగఁ బలికిన
నవల సుయోధను నాసపడుపఁ
గీ. బోరు చంపక చుట్టముల్ పోర నీల్గఁ
జూచుచుంటివి యేనాఁటిచుట్ట మీవు. చిత్ర.

సీ. శ్రీమద్వైకుంఠపురీవరేశుఁడ వయ్యు
గొల్లపల్లెల నుండఁ గోరు టేమి
యక్షీణలక్ష్మీకటాక్షవీక్షుఁడ వయ్యుఁ
ద్రోవలే కింటింటఁ దోఁచ నేమి
భూరిచతుర్దశభువనావనుఁడ వయ్యుఁ
గడు వేడ్కఁ దొట్టెలఁ గాయ నేమి
సన్మునిదేవతాసంభావితుఁడ వయ్యు
నాలగాపరులతో నాడ నేమి?
గీ. గొప్పలో గొప్పవాఁడవు కొలఁదిలోనఁ
గొలఁదివాఁడవు నిన్నెట్లు గొలువవచ్చు.? చిత్ర.
సీ. దుర్యోధనుం డవధ్యుఁడ వంచు మానెఁ గా
కలుక బంధింపఁగాఁ దలఁప లేదె?
గోపాలుఁడవు పూజఁగొందు వేరా యని
సభ నిన్నుఁ దిట్టఁడే చైద్యుఁ డెదిరి?
పీలాంఛనంబులఁ బోలుచిహ్నాలు దాల్చి
తానె నీ వనఁడె యుద్ధతినిఁ బౌండ్రుఁ?
డెవ్వరుఁ బట్టలేరేను బట్టెద నంచు
యవనుండు దఱుమఁడే యాహవమున
గీ. నృపులు కొందఱు వెఱచిరే నీకు మున్ను
ప్రాణముల కాసపడరేని భండనమున. చి. 34
సీ. రాజు లెవ్వరుఁ బక్తిభోజన మిడకున్న
దాసునింట భుజించి తనియలేదా?

బంధువు లెవ్వరు గంధ మీకుండిన
ముప్వంకలది పూయ మరియ లేదొ?
దొర లెవ్వరును బూలసరము లీకుండినఁ
దెలిసి మాలికుఁ డీఁగ వలర లేదొ?
ప్రభువు లెవ్వరు వస్త్రబహుమాన మీకున్నఁ
దెచ్చియిచ్చినచాకి మెచ్చ లేదొ?
గీ. పాటి సేయంగ నేరాజు బందుగుఁడవొ?
మున్నె నీపస దెలిసిన దెన్న నేమి?, చిత్ర. 85
సీ. నాఁగలి రోఁక లన్నకు నిచ్చి శంఖాది
పంచాయుధము లీవు పట్టినావు
తాటిటెక్కెంబు కోత్తలపెద్ద కెత్తించి
గరుడధ్వజం బీవు గట్టినావు
వెలరాని కలివోనివలువ జ్యేష్ఠున కిచ్చి
కనకాంబరం బీవు గట్టినావు
మద్య మగ్రజునకు మత్తిలఁ ద్రావించి
జున్నుబాల్ పెరుఁగీవు జుర్రినావు
గీ. తగవరివె యన్నదమ్ముల ధర్మ మీవె
తీర్పవలెఁగాని మఱియొండుతీర్పఁగలఁడె?, చిత్ర.
సీ. అప్పనంబులు గొను నఖిలదిక్కుండలే
శ్వరులచే వేంకటాచలనివాసుఁ
డరుదుగా నలువదా అవసరంబులు మహా
భోగంబుఁ గొనునీలభూధ్రవరుఁడు

పానకంబాలు సాంబాలు భక్తుల కిచ్చి
యెసఁగును మంగళాద్రీశ్వరుండు
పుట్టకోలంది మైపూఁతఁగాఁ గొను మంచి
గంధంబు సింహనగప్రభుండు
గీ. సాటిసాములరీతి నిచ్చోట నీవు
మూర్తిమంతంబుఁ జూపక కీర్తి గలదె?, చిత్ర. 27
సీ. బొచ్చెచేఁపకు నైన మచ్చరం బున్నది
తాఁబేటి కైన సత్త్వంబు గలదు
డోకొన్న నడవిపందికిఁ గల్గు రోసంబు
తెఱనోటినరుఁ డైనఁ దెగువ సేయుఁ
బొట్టివానికి నైన దిట్టతనం బుండు
బాఁపని కైన దర్పంబు గలదు
చుంచురాజున కైన శూరత్వ మున్నది
ముసలికి నైనఁ జేపుష్టి గలదు
గీ. సిద్ధ మాభీరుఁడవు నీవె బుద్ధి నెంచఁ
గల్కివై యేమి సేయంగఁ గలవొ కాని?, చిత్ర.
సీ. మును నందగోవత్సములఁ గాయునప్పుడు
ననునయించిరె కంజజాదిసురలు ?
విటచోరచేష్టల వ్రేపల్లెఁ దిరుగునీ
దగుమ్రోల నచ్చర లాడినారె ?
వరరథాశ్వముల సంగరవీథిఁ దోలునాఁ
డెంచి దిక్పతులు భావించినారె?

మగధేశుఁడాడికి మథుర వీడిననాఁడు
దేవర్షు లెల్లఁ గీర్తించినారె?
గీ. యల్పునిగ నెంచినారె లోకైకనాథ
నాథునిగ నెంచినారె ముద్ధరణిఁ జెపుమ?, చిత్ర.
సీ. పూతనాకుచకుంభపూర్ణవిషస్తన్య
పాయివై బ్రదికినభాగ్యమేమి?
కాళియాశీవిషగ్రసదప్రమాదంబు
గడచి జీవించిన ఘనతయేమి?
చాణూరమల్లదోస్తంభ ఘట్టన కోర్చి
లబ్ధజయుఁడ వైన లాభ మేమి?
సాళ్వరాజామోఘశక్తిప్రయోగంబు
మరలించుకొనిన సామర్థ్యమేమి?
గీ. బడుగుదాసరివలె సన్నవస్త్రములకుఁ
బరుల కాశించి యిచట నీపంతమేమి?, చిత్ర.

సీ. పట్టి గొల్లది రోటఁ గట్ట నోపిననీకు
రోసంబు లేదన్న సీసు గలదె?
జారచోరాదిచేష్టలఁ బ్రవర్తిల్లునీ
కపకీర్తి యన్న భయంబు గలదె?
భార్యచేఁ దన్నులుఁ బడ్డవానికి నీకు
లజ్జ లేదని యన్న లాఘవంబె?
కుడంటులేదని కొసరి మెక్కిన నీకు
హీనత లెంచిన న్యూన మగునె?

గీ. శౌరి దాసులు నిన్నెంత దూఱుచున్నఁ
బంత మున్నదె నీ కిసుమంత యైన ?, చిత్ర. 41

సీ. కడు దొంగతనమునఁ గని తల్లి వైచినఁ
దనబిడ్డనిగఁ బెంచె నిను యశోద
జనని గర్భము డించుకొనిన వేఱొకతల్లి
కడుపుఁజేసికొనంగఁ గలిగె నన్న
తండ్రివివాహయత్నము సేయ నొల్లక
తగులుక వచ్చె నీధర్మపత్ని
యన్న రారాజుకీనున్న నీసోదరి
యింటికి జోగిరా నంటుకొనియె

గీ. నిట్టినీసంప్రదాయంబుగుట్టు బెట్టు
రట్టు సేయుదుఁ గనుము నాభట్టుతనము,చిత్ర.

సీ. పక్షంబు గల దండ్రు పాండుపుత్త్రులయందుఁ
బాండవుల్ పడినట్టిపాటు లేమి!
పూర్వజన్మమునందుఁ బూజించె గజ మండ్రు
గజరాజు పొందినగాసి యేమి!
యలకుచేలునకు బాల్యస్నేహితుఁడ వండ్రు
నెఱిఁ గుచేలుఁడు పడ్డనెవ్వ లేమి!
ప్రహ్లాదుఁ డాజన్మభక్తియుక్తుం డండ్రు
ప్రహ్లాదుఁ డొందినబాధ లేమి!

గీ. యెంత యాలస్యమున వారి నేలినాఁడ
విట్టిదే నీదయారసం బెంచి చూడ, చిత్ర. 43

సీ. అనఘమహావిప్రసత్రాన్న మెంగిలిఁ జేసి
తీవె ముక్క గ్రతుభోక్త నేనె యనుచు
సవతితల్లికొమాళ్ళ సమయించి తండ్రిఁ
దలుగని రాక్షసాంతకుఁడ ననుచు
బంధువు లన్యోన్యవైరానుహతులుగా
నడచితి భూభారహారి ననుచు
బలిమి నన్యస్త్రీలఁ బట్టితి వెందఱి
నష్టలద్బ్రహ్మచర్యమతి ననుచు
గీ. లోకమున నడ్డ మెవ్వరు లేక యునికి
హద్దు లేకిట్లు నడచితి నళికుమాలి, చిత్ర. 44

సీ. ఆదియోగ్యంతరంగాలానబంధంబు
వదలించుకొన నీకు వశముగాదొ!
వేదాంతసకృదచుంబితులమంత్రావర్ణ
నల గుహనుండి రా నలవిగాదొ!
నిమిషార్థనిమిషాదినిత్యవేళాచక్ర
గతి నిరోధించి రాఁ గ్రమము గాదొ!
నక్రకంటకపంకవత్పూర్వరజనమనః
కాపథంబులను గా ల్మోపరాదొ!
గీ. యేమి యాలస్య మిది నీకు నేల సకల
జంతుసంతానరక్షావిచక్షణునకు, చిత్ర. 45

*సీ. కఠిన స్తనంబుల ఘట్టించి దట్టించి
జడలచే మోది నున్నొడల నదిమి

పలుగంట్లు చేసి గోరుల నాటి దొమ్మిగా
యువతీసహస్రంబు లుపరతాది
బంధనంబుల నిన్నుఁ బైకొని తమిరేఁచి
రమియింప నిదురింప రాక నాఁటి
బడలిక దీఱ నాపఁగరాని సుఖనిద్రఁ
బవళించియున్నట్టి భావ మిచటఁ
గీ. దోఁచుచున్నది సంఫుల్లతోయజాక్ష!
మేల్ బళా! యింక జాగేమి మేలుకొనవె, చిత్ర.

సీ. నీబొడ్డుదమ్మిలోనికిఁ జొచ్చి చూచిన
నలువకు నీలోఁతు దెలియకున్నె?
బహుసహస్రాంగనాగృహముల నినుఁ గన్న
మునిరాజు నీమాయఁ గనకయున్నె?
నీవిశ్వరూప మెన్నికఁ జేసి పొడఁగన్న
నరుఁడు నీయురువుదా నెఱుఁగకున్నె?
తనమనఃపీఠి ని న్ననిశ మారాధించు
హరుఁడు భవత్తత్త్వ మరయకున్నె?
గీ. గరువ మేటికి నీమర్మ మెఱుఁగ రనుచుఁ
దెలిసిన మహాత్ములకు నైనఁ దెలియకున్నె?, చిత్ర.

సీ. పురుషాకృతిగ నిన్ను గుఱుతుఁబట్టఁగరాదు
స్త్రీమూర్తి వనుచును జెప్పరాదు
పరగ నపుంసకభావ మెన్నఁగరాదు
రూపంబు గల్గు టెఱుంగరాదు

గుణవంతుఁడ వటంచు గణుతింపఁగా రాదు
మర్యాద దెలియ నేమతికి రాదు
కులజుఁడ వనుచు నిక్కువముఁ జెప్పఁగ రాదు
స్థల మెక్కడనొ కాని తెలియరాదు
గీ. వస్తునిర్దేశ మొనరింప వశము గాని
నిన్ను వర్ణింపరాదయా నిశ్చయముగ, చిత్ర.
సీ. నమ్ముదు రేరీతి నారదు నాత్మజు
మానినిఁ జేసినమాయవానిఁ?
దలఁతు రేరీతి నల్దలలదయ్యము నోలి
బొద్దుదమ్మినిఁ గన్న పురుషమణిని ?
భూషింతు రేరీతి పుష్పబాణవిరోధి
విషయభ్రమితుఁ జేయువేసగాని ?
భాషింతు రేరీతి బ్రహ్మాదిమశకప
ర్యంతంబు గలిగినవింతవాని?
గీ. నిన్నెఱిఁ గెఱింగి యంచలు సన్నుతింతు
రెవ్వరికి నీవు కావలె నెంచిచూడ!, చిత్ర. 49
సీ. ఎక్కడ నీకన్న దిక్కు లేనట్లని
న్నర్చింతు రబ్జగర్భాదిసురలు
మఱి యెందు గతిలేనిమాడ్కి మహాముసు
ల్నీయందె లక్ష్యము న్నిలుపుకొందు
రిలఁ దరణోపాయ మెందున లేనట్లు
సజ్జనుల్ నీకథల్ చదువుకొంద్రు

పగతుర మెయ్యెడ బ్రతికెన మన్నట్లు
దునిసిరి నీచేత దనుజు లెల్లఁ
గీ. దత్త్వమరసిన శుద్ధబుద్ధస్వరూప
మింత యధికార మెన్నటిదేమి చెపుమ?, చిత్ర.

సీ. ఆడించెదవు బొమ్మలాటవాఁడునుబోలె
సర్వచరాచరజంతువులను
గనుకట్టుఁ గట్టెదు గారడీఁడునుబోలె
మిథ్యాప్రపంచంబు తథ్యముగను
వేర్వేఱఁ దోఁతువు వేషధారియుఁబోలె
బహువిధ దేవతాభద్రకళలఁ
దెలివి మాన్పుదువు జక్కులవానిచందానఁ
బ్రజల సంపద్రంగసల్లిఁ జేర్చి
గీ. ఇట్టివేకద నీవిద్య లెన్నియైన
నింక నేమిట ఘనుఁడవో యెఱుఁగరాదు, చిత్ర.

సీ. కూరిమి నల తంతెగొట్టుసన్యాసితో
ముచ్చటించెద వేమి పుణ్యమూర్తి
సాటిగా వెలిగొండపీటిజంగము చెల్మిఁ
బచరింతు వేనాఁటిబాంధవుండు
వెలిపాఁపపాన్పుపై పేడ్కతోఁ బవళింతు
వది యేమి భోగిభోగాంతరంబు
పొరుగిండ్ల కే ప్రొద్దు బోరాఁ దలఁచునింటిఁ
బాయ కుండెద వేమిభాగ్యలక్ష్మి

గీ. మంచిసహవాసములు గల్గె నెంచి చూడ
నీకె తగ నట్టివారితో నెనరు నెఱప, చిత్ర. 52

సీ. అఖిలపోషకుఁడవ న్నాఖ్యమాత్రమె కాని
కర్తవు నీవె భోక్తవును నీవె
యక్షరుండ వనుప్రఖ్యాతిమాత్రమె కాని
చర్చింప వేఱొండు సాక్షిగలఁడె
సుగుణాబ్ధివని నిన్ను స్తుతి యొనర్చుటె కాని
నిర్గుణుం డెవ్వఁడు నీకు మించ
విశ్వాత్ముఁడ వటంచు వినుతించుటయె కాని
చొచ్చి నిన్నెవ్వఁడు చూచినాఁడు
గీ. వినికిడియెగాని నిన్ను నీ విశ్వములను
మొద లెఱుంగుదురే నిజంబునకుఁ బిల్వ, చిత్ర.

సీ. ఒకగుణంబున నీవె సకలప్రపంచంబుఁ
గల్పించితి వభూతకల్పనముగ
వేఱొకగుణముచే విశ్వవిశ్వప్రాణ
రక్షణం బొనరింతు వక్షయముగ
మఱియొండు గుణముచే మండలంబులు గూడఁ
జెఱిపి వేయుదువు నిశ్శేషముగను
నిర్గుణంబున నీవె నిరవకాశంబుగాఁ
బట్టకయుండుదువు బయలు మెఱసి
గీ. గుణ మొకటిగాదు తెలిసిన గుణము లేదు
చేరి నినుఁ గొల్వరాదు వచింపరాదు, చిత్ర. 54

సీ. జీవిని జీవి భక్షింపఁ జేసితి వింతె
కొనిపెట్టినావె చేతనుల కెల్లఁ?
జేసినంత భుజింపఁ జేసినా వింతెకా
కెక్కువ లెవ్వరి కిచ్చినావు?
కర్మసూత్రంబునఁ గట్టి త్రిప్పెదవుగా
కిచ్చు నొక్కనిఁ బోవ నిచ్చినావె?
వేసఁ బృథక్ప్రకృతుల వేఱుఁ బెట్టితివి గా
కందఱి కైకమత్య మిడినావె?
గీ. తెలిసె నీ రక్షకత్వంబు దేవదేవ!
వేఱె గతిలేక నిన్ను సేవింపవలసె, చిత్ర. 55

సీ. నీరుపట్టుగ నుంట నారాయణుఁడ వంద్రు
నారాయణాఖ్యాధికార మేమి?
బలిసి యంతట నీవె గలుగ విష్ణుఁడ వందు
రావిష్ణునామప్రభావ మేమి?
ముగురు నీవై వెలుంగఁగఁ గేశవుఁడ వంద్రు
కేశవాభిఖ్యాప్రకాశ మేమి?
సిరికి మగండవై మెఱయ శ్రీపతి వంద్రు
శ్రీపతినామప్రసిద్ధి యేమి?
గీ. పెట్టుపేరు లనేకముల్ పుట్టుపేరు
గుఱుతెఱింగిన నీమూల మెఱుఁగవచ్చు, చిత్ర.

సీ. వేఁడని చూడక విపినవహ్నిజ్వాలఁ
ద్రావెదో తేనియఁ ద్రావినట్లు

భారమం చనక గోవర్ధనపర్వతం
బెత్తైదో పూబంతి యెత్తినట్లు
విషపుంజ మనక నాభీలాజగరజిహ్వఁ
జింపెదో ప్రాఁబట్టఁ జింపినట్లు
వెస నసాధ్యం బని వెఱువక నరకుని
నఱకెదో పార్వేఁట నఱికినట్లు
గీ. భక్తసంరక్షణత్వరాపరవశతను
జేసినావేమొ యూరక సేయఁగలవె?, చిత్ర. 57
సీ. వత్సాపహరణగర్వము మాని యజుఁడు దా
నపరాధి ననుచు సాష్టాంగ మెఱఁగె
భవుఁడు బాణున కాజి బాసటయై వచ్చి
భక్తునిఁ బట్టిచ్చి ప్రణుతిఁజేసె
వజ్రి శిలావృష్టి వర్షించి లజ్జించి
తప్పుఁ జేసితి నంచు దండ మిడియె
సమవర్తి భీతి నంజలిఁ జేసి యాత్మలో
కస్థితు గురుపుత్త్రుఁ గాను కిచ్చె
గీ. క్షోణిఁ బుట్టుకమాలినగొల్లవాని
నిన్ను నావేల్పు లోడింప నేర రేమి?, చిత్ర. 58
సీ. కొనముట్ట పొద్దుచెగ్గుల ప్రాఁతసుద్దుల
తాతపుస్తక మొకఁ డాతతాయి
మ్రుచ్చిలి నీటిలోఁ జొచ్చి డాఁగిన వాని
పావన మేమి! వెంబడిగఁ బెద్ద

కోఅమీనంబ వై యాఁటోండుసంద్రము
ల్నిముసంబులో నీఁది నెమకి వాని
డొక్క వ్రక్కలు గాఁ గఱుక్కన బరిఁ గోసి
కడలేనినుడువు లెక్కటికి నోట
గీ. మాట వెళ్లనివానికి మగుడ నిచ్చి
యింతపనికిని నవతార మెత్తి తేవు, చిత్ర. 59
సీ. అబ్ధిపయఃపాత్ర మద్రిరాణ్మంథాన
మహిరాజగుణము దా రమరఁ గూర్చి
యమృతాభిలాష దేవాసురుల్ మథియింప
గిరి మున్గఁ గచ్ఛపాకృతి వహించి
నిర్వహించుట గాని సర్వకార్యములలోఁ
బక్షభేదముఁ జేసి పల్మ అాన
కొల్పి దైత్యులనోరఁ గొట్టి యాదిత్యుల
కమృతాన్న మిడితి వాయమరులందుఁ
గీ. బక్షపాతివి గావె? యభక్తిఁ బడిరి
నమ్ముదురె యానిశాటు లెన్నటికి నిన్ను?, చిత్ర.
సీ. ఉక్కనఁ బసిఁడికఱరక్కసుఁ డొకఁడు ప
ల్దిక్కు లొరిచి బొల్లిపక్కిమావు
నెక్క రాతెక్కడఁ జిక్కెడు నంచునీ
యిక్కవ లరయంగఁ గిక్కరించి
నక్కితి విలక్రిందఁ జొక్కపుఁ బందివై
కొక్కరింపుచు నాతఁ డక్కడికిని

మొక్కరింపఁగఁ జోరఁ బొక్క లేకట వాని
డొక్క గఱుక్కునఁ జెక్కిపట్టి
గీ. నొక్కి పుడమింతనీటిపై కెక్కఁదీయ
మక్కువ దనర్ప నది యేమి రక్కరింపు?, చిత్ర.
సీ. అయవారు చదివించినట్లుగాఁ జదువక
మఱికొట్టి తిట్టఁగ వెఱపుఁ గొనక
తనయుఁ డెంతో పరధ్యానంబుగా నున్నఁ
దండ్రి వల్దని చెప్పఁ దగఁడె ధాత్రి
నీకుఁ గోపం బేమి నృహరిరూపంబున
స్తంభంబులోఁ బుట్టి చటులనేత్ర
దంష్ట్రానఖప్రభదహనకీలలఁ బోలి
భగ్గు రనంగఁ బైఁ బడి హిరణ్య
గీ. కశిపుఁ దునుమాడి ప్రహ్లాదుఁ గరుణ నేలి
తండ్రిఁ గసహ్యమయ్యెని న్నపుడె కనఁగ, చిత్ర.
సీ. కశ్యపుఁ డదితి నిన్గన్నవారలు గారె
పెంచిరే మరుగుజ్జుబిడ్డ వనుచుఁ
గుండిక దండంబు గోఁచితో వచ్చిన
కపటవటుండు నిక్కముగ భూమి
సురుఁడు గాఁ డని యాత్మ గురుఁ డీయ వలదనఁ
గరుణించి బలిదాత కామితార్థ
మొసఁగంగ నభివృద్ధి నొంది మే లోర్వక
ధర్మంబు నాల్గుపాదముల జరుపు

గీ. నట్టిదాతను దిగఁ ద్రొక్కి యతనిసిరులు
దెచ్చి కులగోత్రభేది కీ నిచ్చుకంబొ, చిత్ర. 63

సీ. జపతపోనిష్ఠుఁడౌ జమదగ్ని కుదయించి
కరము దారుణవృత్తిఁ గత్తి గట్టి
కినుక రాజద్రోహమునకు శంకింపక
సకలభూపతులగొంతుకలు గోసి
కార్తవీర్యార్జునుకరసహస్రం బొందు
తతి గండ్రగొడ్డంట నఱికి వైచి
వసుధపై రక్తప్రవాహంబు లొనరించి
తజ్జలంబులఁ బితృతర్పణములు

గీ. సేసి యిల విప్రులకు ధారఁ బోసినట్టి
కీర్తియే కాని బ్రాహ్మణకృత్య మగునె?, చిత్ర.

సీ. తా వచ్చెద నటంచు ధైర్యలక్ష్మి మహీజ
వెంట రా నడవికి వెడలినావు
సుగ్రీవుఁ డున్నచో స్వామ్ముఁ దా నిడ సీత
యాజాడ నతనిపొం దతికినావు
ముందు జానకి లంక మూర్ఛించి చొచ్చి నీ
దెచ్చినరిపుల సాధించినావు
వైదేహి భవదంకవసతిఁ గూర్చున్నచో
భువనసామ్రాజ్యముల్ పొందినావు

గీ. గట్టిగా మైథిలినిఁ జెట్టఁ బట్టినట్టి
పౌరుషము లబ్బె నేనాఁటిపూరుషుఁడవొ, చిత్ర.

సీ. ధర్మవిఘాత మిద్ధర నీ వొనర్చిన
మూఁడులోకంబులు మ్రొసె నపుడె
జనకునికూఁతు నిచ్చును బెండ్లియాడంగ
నరనాథుకోటులు నవ్వె నపుడె
పుణ్యజనంబులఁ బోరి బాధింపంగ
సుర లద్భుతము నొంది చూచి రపుడె
సంతతాశ్రితవిభీషణు రాజుఁ జేయంగ
నల రవీందులు సాక్షి నిలిచి రపుడె
గీ మంచినడవడి నడిచినా వెంచిచూడఁ
గీర్తి గలమూర్తివే యిట్టివార్త లరయ, చిత్ర.
సీ. సన్ముని నధ్వరసాఫల్యుఁ గావింప
జానకీపరిణయోత్సవము గలిగె
రవినందనునిఁ గిశరాజ్యాధిపతిఁ జేయ
సేతుబంధనకీర్తిఁ జెందఁగలిగె
బహుదేవతాస్త్రీల బందిగంబులఁ బాపఁ
జెఱ నున్నవై దేహిఁ జెందఁ గలిగె
నలవిభీషణుని లంకాధినాథునిఁ జేయ
నెలమి నయోధ్య నీ వేలఁ గలిగె
గీ. నట్టి నీకుఁ బరోపకారైకఫలము
లంతియే కాక నీచేత నైన దేమి?, చిత్ర. 67
సీ. ఒకపినతల్లి మే లోర్వలే కనిచిన
విపినంబులకుఁ బోవుటెట్టి గలఁడె?

తండ్రి మృతుం డైనఁ దనరాజ్య మత్తఱి
నేల రాకుండనిచేల గలఁడె?
యనుజుండు వలదన నాలిమాటలు విని
చెడుగిత్తిఁ బట్టఁ బోవెడఁగు గలఁడె?
పరదేశముననుండి బలవద్విరోధంబు
బలిపించుకొన్న వెంగలియుఁ గలఁడె?
గీ. నీవు సేసినపను లిట్టివేరుపరివె
జగదుపద్రవమెట్లు పోఁ జఱచినావొ, చిత్ర. 68

సీ. నినుఁ గోరి కన్నతండ్రిని నీనిమి త్తమై
చింతించి మృతిఁ బొందఁ జేసినావు
నిను వని న్సేవింప ననుజు నాఁకటి కేమి
యొసఁగ కీవే పండ్లు మెసఁగినావు
నినుఁ గవు ల్గొల్చి తల్చినకార్య మీడేర్పఁ
బిదప వారలఁ జెట్లఁ బెట్టినావు
నినుఁ బాయ కడవికిఁ జనుదేర నిల్లాలి
నొరుపంచఁ గొన్నాళ్లు లుంచినావు
గీ. రాజకళఁ జూచి ని న్నొకరాజు వనిన
మానుషంబేది? యిదియంత మాయగాని, చిత్ర.

సీ. కులగురుద్వేషి నొజ్జలుగ వెన్కొని కాచి
నిష్ఠురమంత్రము ల్నేర్చినావు
పూర్వదేవతలు కాపుర మున్నపురియందు
వంచించి యగ్గిఁ బెట్టించినావు

తాతలతరమునఁ ద్రవ్వించినపయోధి
పేరుగాఁ గొంత పూడ్పించినావు
మోసమౌ టెఱుఁగక మోహించి వచ్చిన
యెలనాగముక్కుఁ గోయించినావు
గీ. బళిర ! నీవంటిధార్మికుఁ బ్రస్తుతింపఁ
గొదువ లింకేమి కైవల్య మెదుటవచ్చు, చిత్ర.
సీ. శౌర్య మెక్కించి విశ్వామిత్రుఁ డూరకఁ
దోడరింపఁ దాటకఁ దునిమినావు
వైదేహి వాక్యనిర్బంధంబుఁ ద్రోయలే
కలిమిలేని మారీచు నలికినావు
వెనుకంజ వైచిన విడువక పైకిరా
నరుదుగా ఖరుతలఁ దరిగినావు
మెట్టో యనుచు దేవమునులు వా రెన్నాళ్లొ
యనుసరింప దశాస్యుఁ దునిమినావు
గీ. కాని రోసంబు గలదె నిక్కముగ నీకు?
మనసు మెత్తనివాఁడ వేమనఁగ వచ్చు?, చిత్ర.
సీ. కొంచెపుఁబని దాసి నించుకదండింపఁ
బగఁబట్టి యది యెన్ని పాట్లు వెట్టె
బలిమినిఁ బట్టి శూర్పణఖ నాసికఁ గోయ
నది నీకుఁ బిదప నెంత తలఁతఁ దెచ్చెఁ
జిన్నతనంబునఁ జెనకి పోఁ దోలిన
మారీచుఁ డొనరించె మాయ లెన్ని

నిరపరాధునివాలి నురుశరాహతిఁ గూల్చి
వానియిల్లాలెంత వగచి తిట్టె
గీ. స్వామివై యేమి యెఱుఁగవు స్వల్పకార్య
కారణంబున నెన్నెన్నికతలు పుట్టె, చిత్ర. 72

సీ. నీపేరు వినుటకే యోపక చెవి గంటఁ
గట్టుకున్నాతనిఁ గావనేమి?
కలన నీతోఁ గత్తిఁ గట్టుకపోరాడు
వాని సోదరునిఁ బ్రోవఁగఁ బనేమి?
బాధింపఁ దగుమహాపాతకుం డటు చేరి
నీవాఁడ నంటె మన్నింప నేమి?
మాయవేసముల నీమర్మ మారయుచున్న
విమతదూతలఁ బట్టి విడువనేమి?
గీ. పతితశరణాగతావనప్రకటదీక్ష
లోకముల కబ్బురంబుగ నీకె కలదొ?, చిత్ర. 73

సీ. పఱపిన శస్త్రంబె బహుముఖంబుల దైత్య
వాహినీమర్మము ల్వ్రచ్చి వెడల
ముందు దూసిన బాణమునకన్న సరిమించి
వెనుకమ్ము దైత్యుల విఱుగఁ బొడువ
నేసినమార్గణం బెదు రెక్కి యితరాస్త్ర
మడఁచి క్రవ్యాదుల మగుడఁ జేయ
నిగిడించినశరంబె నిర్జరారులఁ ద్రుంచి
తోడిదోడిఁ దనకుఁ దా దొనకుఁ జేరఁ

గీ. దొలఁగి రసురులు కొంత నీబలిమి దెలిసె
ముష్టి నీకెంత నీయస్త్రములదె వింత, చిత్ర. 74

సీ. అడవిలోఁ దెరువర్ల నుడుగక తినుచున్న
యాఁడుదాని వధించు టర్హ మగునె?
చిక్కినవారికిఁ జేతు లెంతయుఁ జాఁచు
మొండివాని వధింప ముఖ్య మగునె?
యెక్కడెక్కడ నైన నేలుక తినుకాకి
కన్ను బోఁ బొడుచుట ఘనగుణంబె?
కడు వ్రేటుఁ బడి గడ్డి కఱచినమారీచుఁ
దఱిమి బాధించుట నెఱతనంబె?
గీ. యెన్నే రేరాజు లానరించి రిట్టిపనులు?
చేసితివి యింక నెద్దేని సేయఁగలవు!, చిత్ర. 75

సీ. రాజకార్యపరుండు తేజోబలాధికుఁ
డాంజనేయుఁడు భృత్యుఁ డగుటఁ జేసి
యమితశౌర్యుఁడు ప్లవంగమకులేశుఁ డినజుఁ
డఱలేనిస్నేహితుఁ డగుటఁ జేసి
విమతమర్మజ్ఞుండు విశ్వాసభరితాత్ముఁ
డల విభీషణుఁ డాప్తుఁ డగుటఁ జేసి
సుమనస్కు లమనస్కు లమృతవాక్యంబులఁ
బొసఁగ నాశీర్వదింపుటను జేసి
గీ. లంక సాధించితివి గాని లావుచేత
నిర్జరారుల గెలువంగ నీతరంబె?, చిత్ర. 76

సీ. నడుమఁ జాలదని జానకి నెత్తుకొని ముందు
నడచువిరాధుని నఱకుటేమి?
చనవున వైదేహిచను బిడ్డవలె నోటఁ
బట్టినయైంద్రి కన్గొట్టుటేమి?
సీత సంతోషింపఁ జిత్రవేషముఁ దాల్చి
తిరుగుమారీచుని నఱకుటేమి?
తల్లినివలెఁ దెచ్చి ధరణీజను నశోక
వని నిల్పు రావణుఁ దునుముటేమి?
గీ. కోప మిటులేమి? వారు మహాపరాధు
లైనము క్తిప్రసాదార్హు లగుటయేమి?, చిత్ర.77
సీ. పరరాజ్యకాంక్షలోఁ బట్టకుండెద వైన
సుగ్రీవునగరంబుఁ జూడరాదె?
పరధనంబున కాస పడకయుండెద వైన
నాలంక నొకఱాయి యంటరాదె?
పరయోషపై నిచ్చఁ బాయకుండెద వైన
నలశూర్పణఖముక్కు నిలుపరాదె?
పరదానవులఁ ద్రుంపఁ బంతగించెద వైన
మూల దైత్యులఁ దోలి పుచ్చరాదె?
గీ. చేసిన ప్రతిజ్ఞలో నొండు వీస మైనఁ
దప్పిపోకుండ నడచినధార్మికుఁడవా!, చిత్ర.78
సీ. నిర్దయాత్ములె కాని నిత్యాగ్నిహోత్రాది
కర్మనైష్ఠికు లైనఘనులు గారె?

శుచివిహీనులే కాని శ్రుత్యాదిపాఠక
ప్రకటవేదార్థబోధకులు గారె?
సత్యహీనులె కాని చంద్రశేఖరపాద
పద్మపూజానందపరులు గారె?
మాయికులే కాని మంత్రప్రయోగోప
సంహారణక్రియాచణులు గారె?
గీ. కులము బ్రాహ్మణ్య మగు దైత్యకులము నెట్లు
గూల్చితివి బ్రహ్మహత్యకుఁగొంక కహహ!, చిత్ర.

సీ. ఒక్కవ్రేటునఁ గూలునో వాలి బలశాలి
చెట్టుమాటొగ్గి వేసితివి గాని
మొనసి నీల్గునె పఙ్క్తిముఖుఁడు తన్నాభికా
మృతకుంభ మగలఁ గొట్టితివి గాని
కుంభకర్ణుఁడు రణక్షోణిలోఁ దీఱునే
తీఱని నిద్ర నెదిర్చెఁ గాని
చిక్కునే యింద్రజిత్తుక్కున సోదరుం
డశనని ద్రలు మాని యడఁచెఁ గాని
గీ. యింద తాయంబు లెఱుఁగుదు వందువలన
మడిసి రసురులు నీచేత మడియువారె?, చిత్ర. 80

సీ. మొసలిఁ బెట్టినకస్తి మొఱ్ఱఁబెట్టినహస్తి
రక్షరించితి నన్న రమ్య మేమి?
తులువ పల్వురిలోన వలువ విప్పఁగఁ జాన
సిగ్గుఁ గాచితి నన్నఁ బగ్గె యేమి?

బలువు శాపముచేత బండఁబాఱిననాతి
అంకుఁ బాపితి నన్నుబింక మేమి?
పెద్దమోదినభీతి బెగడివచ్చిన కోఁతి
కండఁ జేసితి నన్నుయందమేమి?
గీ. భవభయంబున నిన్నెంత ప్రస్తుతింపఁ
గరుణఁ జేపట్టలేని నీఘనత యేమి?, చిత్ర. 81
సీ. నీచువాసనచేత నీటిలో నుండుట
యెక్కు వప్పులను ఱాయెత్తుకొనుట
కడుపాఁకటికిఁ దుంగకాయలు మెక్కుట
యని నోరు దెఱచి వెళ్లఱచుచుంట
సిరి గల్గి బిచ్చపుఁజిప్పఁ జేపట్టుట
చేకత్తి పరరాజుచేతి కిడుట
పట్టణప్రజకుఁ జెప్పక పాఱిపోవుట
కలుద్రావి నిను నీవె తెలియకుంట
గీ. మ్రానువై యుంట గుఱ్ఱపుమనిసివంట
పుడమినాడిక సేయక విడువ నిన్ను, చిత్ర. 82
సీ. ఖరు నాజిలోఁ జొచ్చి శర ముచ్చి పో నేయ
వెనుకకు లంఘించి వెఱచె ననిరి
యనిఁ బాలునో కోఁతి యని మ్రానిమాటున
నేయ వాలినిఁ బొంచి యేసె ననిరి
గరుడధ్వజుం డన్న గుఱుతుఁ దెల్పుట కున్న
బలభీతి శస్త్రాహి బద్ధుఁ డనిరి

బలినిఁ జంపఁగరానివరమున యాచింప
వృత్తి నాతని భిక్ష మెత్తె ననిరి
గీ. యశ మదెంతొ ప్రయాసలభ్యంబె కాని
యెంతలో వచ్చునపకీర్తి యెఱుఁగ వేమి!, చిత్ర.
సీ. ఘోరకబంధునిదీర్ఘోరుదోర్దండముల్
దరిగి వచ్చిన మాట తథ్య మేని
పక్షికంఠాత్మజఫణిరాజబంధమో
చనుఁడవై వచ్చుట సత్య మేని
మైరావణాభేద్యకారాగృహముఁ గూల్చి
బ్రదికి వచ్చినపల్కు భద్ర మేని
మారీచుదుస్తరమాయాభ్రమతఁ బాసి
విజయ మొందినసుద్ది నిజమ యేని
గీ. కలితరాజోపచారభోగములఁ గీర్తి
శాలివై యుందు మెఱయుట సాక్షి జగతి, చిత్ర.
సీ. నీశాంతి యంభోధినిర్భరాంబుస్రులు బా
ణముఖంబునకుఁ దెచ్చునాఁడె తెలిసె
నీకోప మరిరావణైకానుజన్మునా
నగరి రాజుగఁ జేయునాఁడె తెలిసె
నీకీర్తి కపటదుర్నీతుఁడౌ ధ్వాంక్షుదా
నవుతప్పుఁ గాచిననాఁడె తెలిసె
నీయభిజ్ఞత యవినిందిత నీతస్వ
నగ్నినిఁ జొరు మన్నయపుడె తెలిసె

గీ. నెంచరానిగుణాఢ్యుఁడ వీవె యనుచుఁ
దెలిపి మ్రొక్కెద నితర మౌ దిక్కు లేక, చిత్ర.

సీ. జనకువాక్యమున రాజ్యవిసర్జనమె కాని
యడరుశౌర్య మొకింత విడిచినావె?
దీక్ష నాభరణము ల్దివియుమాత్రమె కాని
వర ధనుర్బాణము ల్వదలినావె?
వ్రత మని కాంచనాంబరముఁ గట్టవు గాని
బిగువు వజ్రాంగిమై విడచినావె?
ప్రతినఁ బదార్థమే యితర మొల్లవు గాని
యభిమానధనముపై నలిగినావె?

గీ. నిఖిలరక్షోవిదారణనిర్భరైక
వేషధారివి నీ మునివృత్తి యేమి?, చిత్ర. 86

సీ. వెలిపింపఁగలవా చేవిలు నీ కొసంగి తా
విగతరోషం డైనవిప్రవరునిఁ
గట్టింపఁ గలవా సాగరముపై సేతువు
మలలఁ గోఁతులమూఁక లలరఁ బట్టి
ఘనత నీఁ గలవా యన్నను గొట్టి తమ్మున
కారాజ్య మాచంద్రతారకముగ
వేంచేయఁ గలవా విస్ఫూర్తిఁ దేరఁగ నున్న
పుష్పకం బెక్కి నీపురికి మరల

గీ. జగతి నిటు సంతతోత్సాహచరణమునకు
యుక్తిసేయుదు వోహొ నీశక్తి దెలిసె, చిత్ర.

సీ. నిన్నె దుర్భాషలాడి నాని నెపమునఁ గోపించి
కోపితహితు సూతుఁ గొట్టవలెనె?
సంబంధినోటఁ గొంచపుమాట రా వాని
కరిపురం బలుకఁ బెకల్పవలెనె?
నిను జూచి వేడ్కఁ నొందిన గర్వముగ నెంచి
నిండిపాఱెడునేఱు నిలుపవలెనె?
చెలికానివలె నొద్దఁ జేరి మొత్తుకొనంగ
గినుకఁ బ్రలంబునిఁ దునుమవలెనె?
గీ. ఎంతరోషంబు గలవాఁడ వేమినీవు
తెలివికాఁడవె బలరామ! తెలిసె నిందు, చిత్ర.

సీ. పరపురుషాకృతి గుఱుతుగాఁ జూడక
త్రిపురపతివ్రతాతిలకములను
విటపయుక్తి భ్రమించి విఫలభ్రమతఁ జేసి
తత్సతీపతుల దుర్దాంతబలుల
హతము సేయించితి నల మహానటునిచే
రథరథాంగాశ్వసారథిశరాది
గుణనిషంగాస్త్రము లొకరినట్లుండునే
సమకూర్చి యసురుల సంహరించి
గీ. సాహసుఁడ వైతి నిన్నుంచి శంకరుండు
త్రిపురసంహారుఁడనునాఖ్యఁ దెచ్చుకొనియె, చిత్ర.

సీ. సకలవర్ణంబులు సంకరంబులు సేసి
యఖిల ధర్మములు శూన్యములు సేసి

భూతలంబును బాపభూయిష్ఠముగఁ జేసి
పరగఁ బ్రపంచంబు భ్రష్టు సేసి
కలి విజృంభించినకడపటనా నీవు
తురగవాహనుఁడవై దోర్వి రాజి
ఖడ్గచంచద్ధారఁ గలుషాత్ముల వధించి
శిష్టసంరక్షణ సేయు టెల్ల
గీ. ననిశము చరాచరాదిజీవావనైక
జాగరూకుఁడవా నీవు జాగు దెలిసె, చిత్ర. 90
సీ. భువనమోహన! కృష్ణమూర్తివి నీవేని
నాలీల లిచ్చట నాడవలదె?
బలసముజ్జ్వల రామపాలుఁడ వీవేని
దీపించి యాబల్మిఁ జూపవలదె?
వీరనృసింహావతారుఁడ వీవేనిఁ
దత్తేజ మింతైనఁ దాల్పవలదె?
సత్యవిక్రమ! రామచంద్రుఁడ వీవేని
నాపౌరుష మొకింత చూపవలదె?
గీ. యెంచ దేవర దైవమో యీవె కాని
చూపఱకు నీదుమహిమను జూపవలదె?, చిత్ర.
సీ. ఆలగాపరివాఁడ వనక నిన్నఖిలవే
దాంతమార్గవిహారి వందు నేమి?
హాలముఁ బట్టినవాఁడ వనక నిన్నఖిలవిధా
జాండనిర్వాహుఁడ వందు నేమి?

యల్లసారథివాఁడ వనక నిన్ను సమస్త
సాస్త్రప్రపూర్ణుఁడ వందు నేమి?
యడవి ద్రిమ్మరివాఁడ వనక ని న్సకలలో
కాపన్నివారుఁడ వందు నేమి?
గీ. పుడమి నీదగుకొంచెపునడత లెంచ
కభినుతింతునె లోకైకవిభుఁడ వనుచు, చిత్ర.
సీ. మామయింటికిఁ బోవ మంచితీర్థము పుట్ట
దతఁ డంత కారువాఁ డతఁడె సుమ్ము
పునుకకంచము తోలుపుట్టంబు గలమిత్రుఁ
డెందు నన్నముఁ బెట్టు నేమి గప్పు
మాటమాత్రం బైన మగువ నోరాపదు
కొడుకుపెట్టునె తలగొట్లమారి
యన్నది మేపాండ మున్న దిచ్చేదొక్క
తొట్టిగొడ్డది నీకుఁ దోలు నేమి
గీ. ఎవ్వరింటికిఁ బోయిన నేమిఫలము
ఉన్నచోనుండి సిరులఁ బెంపొందుమయ్య, చిత్ర.
సీ. దుర్జనభంజనోద్యుక్తసుదర్శన
ధారివే నీవు యథార్థముగను
శాత్రవభయదనిస్స్వనపాంచజన్యభూ
షితకరాంబుజుఁడవే సిద్ధముగను
మత్తారిభేదనాయత్తకౌమోదకి
నిజకరభరితమే నిశ్చయముగ

ఘోరవిద్విడ్రక్తధారార్ద్రనందక
సంధానపాణివే సత్యముగను
గీ. సన్నుతామోఘబాణైకశార్ఙ్గచక్ర
శయుఁడవే నమ్మవచ్చునే స్వామి! నిన్ను, చిత్ర.
సీ. ఇల్లు రత్నాకరం బెన్నాళ్ళకును జాలు
జీవనం బొరుల యాచింపవలెనె?
యింట మహాలక్ష్మి యెప్పుడుఁ దాండవం
బొనరించు నొకఁడు నీ కొసఁగవలెనె?
స్థిరత లోలోన నిక్షేపించుధనము నెం
చఁగరాని దొకరిఁ జేఁ జాపవలెనె?
పంటపైరులకాఁపు కంటఁ గాయుచునుండు
కోరికఁ బెఱసొమ్ముఁ గొనఁగవలెనె?
గీ. ధాత్రి నెవ్వరి రక్షింపఁ దలఁచినావొ
కోరువారలచేఁ బూజఁ గొందు వింతె, చిత్ర.
సీ. అబ్ధికన్యావివాహమహోత్సవము నాఁడుఁ
జూడలే దిచ్చోటఁ జూడఁ గలిగె
జానకీకళ్యాణసంభ్రమం బానాఁడుఁ
జూడలే దిచ్చోటఁ జూడఁ గలిగె
భోజసుతోద్వాహభూరివైభవమందుఁ
జూడలే దిచ్చోటఁ జూడఁ గలిగె
రేవతీపరిణయశ్రీవిలాసం బప్డు
చూడలే దిచ్చోటఁ జూడఁ గలిగె

గీ. ననుచు నిట రాజ్యరమఁ బెండ్లియాడ నిన్నుఁ
బ్రజలు సేవించి సంతోషభరితులైరి, చిత్ర. 96

సీ. అఖిలలోకస్థాపనాచార్యమణి వయ్యు
నిజభక్తగురునిచే నిలుపుకొన్న
గర్భస్థితానేకకమలజాండుఁడ వయ్యు
నొండుకోవెలను జెలొందుచున్న
బహుచరాచరభూతపరిపాలకుఁడ వయ్యు
భక్తార్పితార్థము ల్బట్టుచున్న
హరచతుర్ముఖదేవతాగోచరుఁడ వయ్యు
నెప్పుడు దర్శనం బిచ్చుచున్న
గీ. నిన్ను సేవింప నెవ్వరో పెన్నిధాన
మెదుటనుండంగఁగనుమూసియేగువారె?,చిత్ర.

సీ. కైలాసమేరుసంకాశనాగాశన
స్కంధంబుపై రథోత్సవము గల్గఁ
జందనమందారసంతానకల్పక
వనముల మృగయోత్సవమ్ము గల్గ
రంగత్పయఃపయోరాశివీచికలపై
వర్ణింప డోలోత్సవంబు గల్గ
బహుఫణారత్నశుంభద్భుజంగమభోగ
వసతిఁ బర్యంకోత్సవంబు గల్గఁ
గీ. బరకృతోత్సవ మిచ్చుట భ్రాంతె నీకు
భక్తజనులకు నేత్రోత్సవంబె కాని, చిత్ర. 98

సీ. కోరిక లీను వైకుంఠంబులోనిలో
నగరిలో నామూల నవ్యదివ్య
సౌధంబుదాపలిసరసమందారవ
నాంతరామృతసరఃప్రాంతచంద్ర
కాంతోపలోత్పలకల్పితపర్యంక
సకలసౌభాగ్యలక్షణనివాస
లక్ష్మీమనోజ్ఞవిలాసవశీకృత
సంభోగసామ్రాజ్యసంతతాభి
గీ. రామమూర్తికి వాంఛేతరప్రపంచ
మేమి గావలె లీలార్థ మింతెకాని, చిత్ర. 99

సీ. గుఱుతుగ సద్భక్తికోటి కీనాఁటికి
విడరానిబహుయుణస్థుఁడవు నీవు
సేవకు లెన్నెన్ని త్రోవలఁ జనుచున్న
వదలక యనుసరించెదవు నీవు
నిజదాసు లాత్మేచ్ఛ నిలిపి రెచ్చో నిన్నుఁ
దోలఁగ నచ్చోటనే నిలచె దీవు
శ్రితు లంబలియు నైనఁ జేఁజూప నది యెంత
యమృతభోగంబుగా నలరె దీవు
గీ. జగము లన్నియు నీకు వశ్యము లటంటి
వీవు నిజదాసవశ్యుఁడ వెంత ఘనత?, చిత్ర.

సీ. వెనుక వేసికొని యుర్వీనాథకోటులు
సైంధవుఁ గావంగఁ జాలినారె?

ధరనేయుతనసుతు శిర మెవ్వఁ డతఁ డీల్గ
శాపించి సింధురా జోపినాఁడె?
సాటించునాసర్వసైన్యంబు లని కర్ణు
చే శక్తి నరు నేయఁ జెప్పినారె?
పరులచే నొవ్వనిపంతంబు గలభీష్ముఁ
డర్జునాస్త్రంబుల కాఁగినాఁడె?
గీ. మనుజయత్నంబు బలమెంతమాత్ర మీవు
నిజము కరుణించునాతఁడే విజయుఁడరయ, చిత్ర.
సీ. జనితరంగాపారసంసరణాబ్ధియే
తఱిఁ దరింపఁగలేక యెఱుఁగ గలిగెఁ
జేపట్టి దరిఁ జేర్తు వాపదుద్ధారి వీ
వనుచుఁ గుయ్యిడు చున్న నభయదాన
మీక యుపేక్షించె దింతదయాబ్ధివి
యితరకార్యభరం బ దెంత యున్న
శరణాగతులఁ బ్రోచు బిరుదు నీకున్న దే
కరిరాజుఁ బ్రోవ నిందిర రహస్య
గీ. కేళిసంహర్షితాంతరంగికుఁడ వయ్యు
రమను జేకొని వేంచేయు టవ్వి యేమి?, చిత్ర.
సీ. ఆగామిసంచితప్రారబ్ధము లటుండ
నిజజన్మమందు నే నెల్లవేళ
నఘములే చేసితి నన్నియుష్మత్సనాథా
సదృశనిర్హేతుకజాయమాన

కరుణాకటాక్షవీక్షణ మెంచ కెప్పుడో
ప్రసరింపవలె నే నపారదురిత
వారిధిఁ దరియింపవలెఁ గాని గతి యితః
పర మెఱుంగను భక్తపాలనాంక!
గీ. శేషపర్యంక! రాజ్యలక్ష్మీసహాంక!
ప్రథననిశ్శంక! యదుకులాంబుధిశశాంక!, చిత్ర.

సీ. ప్రాణులకర్మము ల్పరికింపఁ బదునల్గు
రంట ధర్మదేవత లవి లిఖించి
చిత్రగుప్తులు లెక్క సేయుదురంట యవి
ధర్మరాజాదుల దండ నునిచి
చేసినవారిచేఁ జెప్పించి భటులచే
బాధించి నరకకూపములయందుఁ
ద్రోయింతురంట యట్టి దుర్గతిఁ దప్పింప
దక్షుఁడ వాపన్నరక్షకుఁడవు
గీ. కలవు కలవని నీపాదకమలములకు
శరణుశరణంటి నభయం బొసంగుమయ్య!, చిత్ర.

సీ. పూర్వకవీంద్రులు పుణ్యఫలం బేమి
సాక్షాత్కరించి యస్మత్వరంబు
గా గద్యపద్యముల్ గల్పించు మనిన వే
వర మొసంగితి వంద్రు వాంఛఁ జేసి
నేర్చినట్లుగఁ గూర్చి నేఁటి కవిత్వంబు
నీ కంకితముఁ జేసి నెనరు దోఁపఁ

జేదోయి యొగ్గినశ్రీపాదరజ మింత
నామీఁదఁ జాఱ నీ వేమి సామి!
గీ. కృపకుఁ బాత్రముఁ జేయు మక్షీణభాగ్య
లక్షణాంచితపాదపల్లవకరాబ్జ!, చిత్ర. 105
సీ. కావ్యదోషము లెఱుంగనిమత్కవిత్వంబు
విద్వన్నుతంబుఁ గావించినావు
బహిరంత రింద్రియ పరిశుద్ధి లేని నా
తలఁపులోపల వచ్చి నిలచినావు
పుణ్యకర్మ మొకింత పూని సేయనినన్నుఁ
బెద్దలచేత మెప్పించినావు
పురుషప్రయత్నంబు గుఱుతెఱుంగనినన్ను
భుక్తి గల్గఁగఁ జేసి ప్రోచినావు
గీ. పతితుఁ జేపట్టినావు చేపట్టినావె
యన్యగతిఁ బోవనీయకు మార్తరక్ష!, చిత్ర.
సీ. శబరి యెంగిలిపండ్లు చవిఁ జూచుననుకంప
కుబ్జగందము పూఁతఁ గొన్నకరుణ
పాంచాలికూర సాపడినదయారతి
గోపమ్మ యుగ్గుఁబాల్ గ్రోలుకృపను
మాలికుఁ డొసఁగుతోమాలెఁ దాల్చినప్రేమ
ద్విజుని కొంగటుకులు దిన్నకూర్మి
గుహుఁడు పాదములు గట్టుట కుబ్బునెనరును
నుడుత దాస్యమునకుఁ బొడముప్రేమ

గీ. శతక మంగీకరింపుము జగతి జనకుఁ
డర్భకావ్యక్తభాషల నలరినట్లు, చిత్ర. 107

సీ. శతక మొకటి మనసా! హరిపాదము
లాశ్రయించవె యని యల్లినాఁడఁ
గరిమ రామా! భక్తకల్పద్రుమా! యని
యొప్పుగా శతకంబుఁ జెప్పినాఁడ
నలరులదండ మీఁకనఁగ హంసలదీవి
గోపాలశతకంబుఁ గూర్చినాఁడ
యుష్మదంకితముగా నూహించి శతక మే
నంచితంబుగ రచియించినాఁడ

గీ. భవదనుగ్రహకవితచేఁ బ్రబలువాఁడ
నవనిఁ గాసుల పురుషోత్తమాఖ్యవాఁడఁ
జిత్రచిత్రప్రభావదాక్షిణ్యభావ!
హతవిమతజీవ శ్రీకాకుళాంధ్రదేవ!. 108

శ్రీమదాంధ్రనాయకశతకము

సంపూర్ణము.

---

# పీ ఠి క.

ఈ ప్రసన్నరాఘవశతకము వ్రాసినది నరసింహ కవియను నామాంతరముగల వంగూరి ముద్దునరస కవి. ఇతని తండ్రిపేరు లక్ష్మయ్య; ఈశతకమునందు రామాయణకథయంతయు నిముడ్పఁబడియున్నది. ఇందు రెండువందలపద్యములుంటచేఁ గవి దీనినొకచో ను శతకద్వయమనికూడ వ్యవహరించియున్నాఁడు. రాక్షసులచేఁ బీడింపఁబడి దేవతలు తమదుర వస్థలు శ్రీమహావిష్ణువితో విన్నవించుట మొదలు కొని రాముఁడు సీతాసహితుఁడై పట్టాభిషిక్తుఁడగు నంతవఱకుఁ గలకథప్రధానాంశములు పోవనీక యీ శతకమున నిముడ్పఁబడియున్నది.

ఇక్కవి తాను సరసులు మెచ్చునట్లు వ్రాయు చుంటిననియు వరకవిననియుఁ జెప్పుకొనెనుగాని యీవిశేషణములకుఁ బుస్తకమునందుగల రచన మునకు సంబంధములేదు. పద్యములలోఁ జాలతా వుల యతిగణప్రాస లేకున్నవి. ధారయు తృప్తికర ముగలేదు. గణనియమమునకు లోనై శబ్దములనే తారుమాఱుఁజేసి పద్యములలో నిమిడ్చికొనియు న్నాఁడు. శతకకవులలోఁ గొందఱు లాక్షణికులయ్యు రసపారవశ్యమున వ్యాకరణ నియమము నుల్లంఘిం చుటచే వారికవితకది యలంకారముగనె చూపట్టు చున్నది. ఈకవి యట్లుగాక భాషావిషయమున సా

మాన్యపరిచయముగలవాఁడగుటచేఁ బద్యములలో భావలోపములు, శబ్దలోపములు, వ్యాకరణలోపములు విరివిగాఁ గనుపడుచున్నవి. సామాన్య జనులకు రామాయణకథ నెఱుంగఁజేయుట కీశతక ముపకరించును.

కవినివాసము కాలము కులము నిరూపింపఁదగిన యాధారము లీశతకమున లేకుంటచే శాఖాచంక్రమణము చేయవలసివచ్చినది. ఇతఁడాధునికుఁడయి యుండవచ్చును. "రాఘవేశ్వరు చారిత్రము నెందఱెన్నిగతులఁ వర్ణించినఁ గ్రాలదే" యన్నటుల పావనమగు రామకథ నెవరెటులవ్రాసినను బఠనయోగ్యమనుటలో నపవర్గదాయక మనుటలో ఆస్తికులు సంశయింపరు.

"ఛందము లక్షణంబెఱుఁగఁ జక్కఁగ ధైర్యముతోడఁ జెప్పితిఁ, దొందరలేదు తప్పులనితోఁచిన" యని కవి తనశక్తిసామర్థ్యములు ధైర్యస్థైర్యములు స్వయముగఁ జెప్పికొనెను తప్పులతడకగానుండి పఠనయోగ్యముగాని పూర్వముద్రితప్రతుల సంస్కరించిముద్దులొలుకునటు లీశతకము ముద్రించిన వావిళ్లవారు ఆంధ్రసోదరులకు స్మరణీయులు

నందిగామ.
3-3-26 } ఇట్లు, భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు, శతావధానులు.

శ్రీ ర స్తు.

వంగూరి ముద్దునరసకవిప్రణీత

# ప్రసన్నరాఘవశతకము.

---

ఉ. శ్రీహరి జానకీరమణ శ్రీరఘునాయక మీమహా
త్త్వముఁ, బాహుబలంబు శౌర్యమును భాను
కులంబునఁ బుట్టురీతియుం, బోహాణఁజేసి రాము
కథ పూర్వులు చెప్పఁగ విన్నయంత నా, దాహ
ముతీఱె సూక్ష్మముగఁ దల్చెద నేను ప్రసన్నరా
ఘవా. 1

ఉ. మానవజన్మమెత్తి బహుమాయలతోఁ బచరించు
మాటకే, కానల కేఁగి జానకిని గానక తంత్రముఁ
బన్ని ప్రాపుగా, వానరసేనఁ గూర్చుకొని వాలిని
జంపి పయోధిదాఁటియుం, దానవులందఱిం దుని
మి ధన్యుఁడ వైతి ప్రసన్న... 2

ఉ. రామునిపుట్టుపూర్వమును రాముఁడు వచ్చుట
సీతఁ దెచ్చుటల్, రాముఁడు కానకేఁగుటలు రా
క్షసులంపఱి సంహరించుటల్, రాముఁ డయో
ధ్య నేలుటయు రాజ్యముఁజేసి సుఖాననుండు
టల్, రాముకథంతఁ జెప్పెదను రంజిలువేడ్కఁ
బ్రసన్న... 3

చ. ఇరువదినాల్గువేలకథ యిన్ను లుపద్యములన్
ముగించెదన్, అరయఁగ నాలుకాండగల యర్థ
ము నొక్కదినున్నుపద్యముల్, వరుసయుఁ దప్ప
నీక కథవర్ణనఁ జేసెద సూక్ష్మమార్గముల్, సర
సులు చూచియుం జదివి సంతసమందఁ బ్రసన్న.

చ. వరతనయుండ నేఁ గనుక వర్ణనఁ జేసెద నిన్ను
వేడుకన్, వరకవి చెప్పె పద్యములు వాక్కున
నీవును వెల్లనాడఁగా, నిరతము నీకటాక్షమును
నిశ్చలము న్మముఁ బ్రోచుచుండఁగా, సరసిజనా
భ నామనసు సంభ్రమమాయెఁ బ్రసన్న... 5

ఉ. సంగతిగాను రామకథ సల్పియు భక్తులఁ గొల్చి
లోపలన్, వంగురుముద్దునర్సకవి వర్ణనగా శత
కద్వయంబునున్, బొంగుచు విన్నవించెదను
బొం దెడఁబాయక లక్ష్మీనాయకుల్, రంగుగ
నుండి దగ్గఱను రంజిలుచేడ్కఁ బ్రసన్న... 6

ఉ. ఇంచుకయంతఁ జెప్పెదను యిష్టముఁ జేసుక చిత్త
గింపుమీ, యెంచక [1]రామచంద్ర రఘు*నాయక
న న్గరుణించి వేగమే, వంచనసేయ కీవు [2]జన*రక్ష
క యింతటినుండి మమ్ములన్, అంచితభోగభాగ్య
[3]ముల*సొంపునఁ బెంపు ప్రసన్న... 7

---

1 మాధవారఘుకులేశ్వర. 2జనపాలక. 3నిచయంబులఁబెంపు.

ఉ. దానవులంత దేవతల దారుణకర్మముఁ జేయఁ
జూచి పో, వానరులై జనింపుఁడని వారికిఁ గట్టడఁ
జేసి లక్ష్మితో, లోన రహస్యముం దెలుప లోకు
లు సీతయనంగ లంకలో, మానవజన్మమెత్తి జన
మంత వెలుంగఁ బ్రసన్న... 8

ఉ. తారక బ్రహ్మమూర్తియును ధారుణిలో నొక
రూపు నాలుగై, ధీరుఁడు భానువంశకులదీపుఁ
డయోధ్యను నేలురాజుకుం, గారవమొప్ప
వేడ్కగలకారణజన్మమునెత్తిలీలఁగా, భూరమణీ
విలాసముగఁ బుట్టఁగఁ దల్చెఁ బ్రసన్న... 9

ఉ. పుత్త్రులు లేమికి న్వగచి పూర్వవిధానముఁ జేయ
జన్నముఁ, మిత్త్రుఁడు నగ్ని హోత్రుఁడును
మెచ్చి ప్రసాదము నిచ్చినప్పుడే, శత్త్రుపలాయ
నంబుగను శంఖము చక్రము శేషుఁడుఁ
హరిఁ, పుత్త్రులు నల్గురై వరము పూనిక దీర్పఁ
బ్రసన్న... 10

ఉ. రాముఁడు లక్ష్మణుం డనఁగ రంజిలుచు న్నొక
యంశభూతులై, తాను జనించి రాక్షసుల
దండనఁ జేయఁగ సత్వసిద్ధిగా, రామునిఁబట్టి
పృథ్వినిఁక రాక్షసులందఱిసంహరించు నా, రాముఁ
డె యాదివిష్ణుఁడని *యందఱునండ్రు, ప్రసన్న...

ఉ. బాలురరీతి నల్వురును బాలును నేయియుఁ
బండ్లు దేనెలన్, జాలఁగఁ దృప్తినొందుచును
సారెకు స్తన్యములానుచున్ గడున్, మూలము
దెల్పకేమిగుల మోహము వారికిఁ బుట్టఁ జేయు
చున్, లీలగనుండి రయ్యెడను లీల నటించి
ప్రసన్న... 12

ఉ. అద్దును ముద్దుఁజూపి జనులందఱుఁ జూడఁగ
గంతులేయుచున్, బ్రొద్దునలేచుచున్ నగుచు
పూర్ణశశాంకముఖుండు వేడుకన్, ముద్దుగఁ
దల్లులందఱును మోహమునొందుచు భ్రాంతి
నొందఁగా, వద్దను బాయకుండుదురువారని
ప్రేమఁ బ్రసన్న... 13

ఉ. అన్నిటఁ గీర్తిమించి విలునమ్ములు చాలధరించి
తేజము, న్వెన్నెలకన్నమించి విలువిద్యఁ బ్రతా
పమునందు మేటినై, యున్నజగద్గురుం గనియు
నుబ్బుచు దేవతలెల్ల నాత్మలో, నిన్ను స్మరించి
గాంచిరిల నీటుసుఖంబు ప్రసన్న... 14

ఉ. లంకలో సీతపుట్టె యిది లక్షణయుక్తమొ
కీడొ యంచు బ, ల్లంక మెలంగి రావణుఁడు
చయ్యన విప్రులఁ బిల్వఁబంచి యీ, పంకజగంధి
యున్న మనపట్టణమందిఁక నెగ్గురాదుగా, శంకను
వీడి పల్కుఁడనె సాదరదృష్టిఁ బ్రసన్న... 15

ఉ. చెప్పిరి పెద్ద లప్పుడును సీతయు లంకను బుట్టిన
ప్పుడే, ముప్పగు లంక కంచు మఱి మోసము
నీకును బ్రాణహానియుఁ, దప్పక రాక్షసావళికిఁ
దత్పరత న్వధియింపఁ బాపమా, నిప్పు డుపాయ
మిద్దియని యెంచరె చెప్పఁ బ్రసన్న... 16

ఉ. చందుగలోన బెట్టి యది సాగరమందున లోఁతు
నీళ్లలో, ముందుగ నుంచుమంచు మునుమున్ను
గఁ దెల్పిరి పెద్ద లింతలో, సుందరిసీతరాఁగ నల
సొంపుగఁ జందుగ నుంచి యెంతయుఁ, సందడి
లేక నిల్పి యట సాఁగఁగఁజేసెఁ బ్రసన్న... 17

ఉ. పెట్టె మునుంగనీక తనబిడ్డయటంచు సముద్రుఁ
డప్పుడుఁ, గట్టున దెచ్చి పెట్టినను గ్రక్కున
నెత్తుక భూమిదేవి తా, గట్టున గర్భమం దునిచి
*కొన్ని దినంబులు దానివేడ్కతో, మట్టియు
మీఁదఁగప్ప సుఖమగ్నతనుండెఁ బ్రసన్న... 18

ఉ. యాగముసేయఁబూని భువి యందెది మంచిదో
చూడుమంచుఁ దా, వేగమె వెంట వచ్చియును
విశ్రమమై బయలున్న దియ్యెడఁ, నాఁగలి గట్టి
చూడుఁడని నాథుఁడు సెప్పఁగ దున్నుచుండఁ
గాఁ, గాఁగలకార్య మున్నగతిఁ గానఁగవచ్చె
ప్రసన్న... 19

ఉ. కట్టిను దాఁకి మందసము కంగుమనం జనకుండు చూడఁగా, మిట్టిన ద్రవ్య లోఁతునను మేదిని లోపల నున్న పెట్టెయుం, బుట్టినఁ దెచ్చి కాను కగ భూపతి ముందటఁ బెట్టి వారికిన్, గుట్టము లిచ్చి తాఁ దొడుగఁ గోకలనిచ్చెఁ బ్రసన్న...20

ఉ. తాళముతీసి చూడఁగనె తామరసానన మేనికాంతియుఁ, జాలభయమ్మున న్మఱియు సంభ్రమమున్ మెలివేసినట్లుగా, బాలను జూచిచూచి తనభాగ్యముకున్ దఁయూఁచి యూఁచియున్, జాలునటంచు సంతసిలె సంతతిఁగాంచి ప్రసన్న.

ఉ. స్వామికటాక్ష మావఱకుఁ జక్కఁగఁజూడఁ గొ మార్తెగల్గె యీ, భూమిజ యాదిలక్ష్మి ననుఁ బూజ్యునిజేయఁ బ్రసన్నఁజేయఁగా, నేమిట నాకుఁదక్కు వికనిందుని భానన సీతయుండఁగాఁ, గామిత మైనవస్తువులు కావలె నంచుఁ బ్రసన్న.

ఉ. శ్రీకర మైనయాజనకశేఖరుఁడున్ సుతపుట్టి వేగ మే, భీకరశాలిత్రమ్మునికి బిడ్డలు నిర్వురు గల్గినంత కున్, ప్రాకటవస్తుసంపదలు భాగ్యములున్ మితి లేనివేడ్క లున్, ఆఁకలి దప్పి దీఱి విభుఁ డాత్మ సుఖించెఁ బ్రసన్న... 23

ఉ. సీతను గూడి నల్వురను జిన్నికుమార్తెనుజూచి

యాత్మలోఁ, బ్రీతిమెలంగి యాఁకులుకు బిడ్డలకు
న్నికఁ బెండ్లికావలెన్, ఖ్యాతిగ నొక్కనిర్ణయ
ము కట్టడఁజేతునటంచుఁ బెద్దలన్, బ్రీతినిఁ బిల్వఁ
బంచి వినిపింతునటంచుఁ బ్రసన్న... 24

ఉ. మూఁడుపురంబుల న్గెలిచి మూర్ఖులనందఱి సంహ
రించి యా, నాఁడు హరుండు దా విలును నా
పురిలోపల వేసె నద్ది యీ, నాఁడు తొడంగఁ
జాలునరనాథునకిచ్చెద నాదుబిడ్డ నే, నాడిన
మాటతప్పనిఁక నమ్ముఁడనంగ ప్రసన్న... 25

ఉ. రామునిరూపురేఖయును రాజసమున్నతి ప్రీతి
భక్తియున్, రామునికీర్తి శౌర్యమును రాజగు
ణంబుల నన్నిచూచియున్, రామ గుణాభిరామ
రఘురామునికేతగు నంచు నాత్మలో, రామునిఁ
జూడ తండ్రిమది రంజిలుచుండెఁ బ్రసన్న...26

ఉ. దేహము కోటిసూర్యకళదీప్తియుఁ జూచి మహా
ద్భుతంబుగా, సాహసమెంచిచూచినను సాధ్యుఁ
డు కాఁడు సురారికేనియున్, బాహుబలుండు
నేండ్లకును బాలుఁడు భక్తులపారిజాతమున్,
శ్రీహరి నాకుమారుఁడని చెప్పఁగనేల ప్రసన్న.

ఉ. తమ్ములయందుఁ బ్రేమయును తథ్యముగాఁ దన
యందు భక్తియున్, తమ్ములు దాను నొక్కటిగఁ

దాల్చిరి రూపును నల్గురై తగన్, దమ్ములఁ గూడి
రాఘవుఁడు ధారుణిలో జనియించి వారు క్రొత్త
మ్మలసేవసేయుదురు తప్పక వారు ప్రసన్న....

ఉ. తప్పకయన్నమాట విని దాసులరీతిగ సేవఁజే
యుచున్, ఎప్పుడు పిల్చునోయనుచు నేమప
చారముసేతునోయటంచు,చొప్పుగఁ బిల్చునప్పటికి
నోరిమి ముగ్గురు గొల్చుచుండఁగా, నప్పుడు
చూచువార లతియబ్బురులైరి ప్రసన్న... 29

ఉ. ఇక్కడ రామభద్రుఁ డోకయీశ్వరుఁడై జగ
మంత యేలఁగా, నక్కడ సీత లక్ష్మియయి యం
దఱికి న్పరిభుక్తాప్తి నొందఁగా, గ్రక్కున రామ
చంద్రునకుఁ గన్న ప్రయత్నముఁ జేసి తండ్రి
యున్, జక్కనిసీతపెండ్లి యని చాటిరి వారు
ప్రసన్న... 30

ఉ విల్లును దెండి పొండియన వేగమ తెచ్చిరి కోటి
మందియున్, దల్లడమంద దేవతలు దానవరుద్ర
పయోధియంచు భీ,తిల్లఁగ రాజవల్లభుఁడు తెచ్చి
టు విల్చిరి యజ్ఞశాలలో, నెల్లవిధంబుల న్విఱువ
నేరికిఁగాదు ప్రసన్న... 31

ఉ. కౌశికు ధర్మయాగమును గావఁగఁదెచ్చెనటంచు
రామునిన్, కౌశికుఁ డప్పుడు న్మదిని కాంగలయర్థ

ష్ముచూచి యందఱుఁ, గౌశికుఁడంత యోధ్యకును
గ్రక్కునవచ్చియు రాముఁ దెమ్మనెఁ, గౌశిను
రాజుచూచి భయకంపితుఁడయ్యెఁ బ్రసన్న. 32

ఉ. రాముఁడు సీతకే తగును రామునికే తగు సీత
యంతకుఁ, రామునిసీతయంచు రఘురాముని
దేవి యటంచు దేవతల్, దామును మోదమంది
యును దత్పరతఁ మదిసంభ్రమంబునఁ, రాముని
సీతఁ జేకొనును రాజిలుమాకుఁ బ్రసన్న... 33

ఉ. బాలుఁడు రామభద్రుఁడన బాణము చక్కఁగఁ
బట్టలేఁడు నీ, కేలను నేనె వచ్చెదను కీర్తిని యా
గము నేనె కాచెదఁ, గాలఖరాసిఁ దాటకిని ఖం
డనచేసి జయించి వచ్చెదఁ, జాలదళంబుగూడి
యిదె చయ్యనవత్తుఁ బ్రసన్న.... 34

ఉ. అందుకుఁ గౌశికుండు గడు నాగ్రహదృష్టిని
జూచి రాజ నీ, వెందుకువచ్చి నీబలము నెందుకు
పంపవు రాముఁ బంపుచుం, ఇందుమతీసుతు న్బ
లుక నిప్పుడ యోర్చెద రాక్షసాళి నా, చందమె
ఱుంగవా యనుచుఁ జక్కఁగఁబల్కె బ్రసన్న.

ఉ. కంపమునొంది రాజు గడు గౌరవదృష్టిని రాము
లక్ష్మణుఁ, దెంపునొసర్చి పంపె నతిదీర్ఘతరంబగు
దృష్టిలో జనుల్, పంపుమటన్న తల్లు లతిభార

ముగా మదిఁ జింతిలంగ నా, శాంతయశోవిరాజి
ఘనశక్తి యెఱింగి ప్రసన్న... 36

ఉ. రాముఁడు మ్రొక్కెఁ దల్లులకు రామ లొసం
గిరి దీవనల్ గడుక్, రామప్రసాదమంది యల
రామునితమ్ముఁడు లక్ష్మణుండు దా, మోమున
కౌశికార్యుఁ డతిమోదము గన్పడ నిచ్చె నస్త్ర
ముల్, కామితమౌ బలాతిబలకార్ముకవిద్య ప్రసన్న.

ఉ. దూరము లేదు రాక్షసులదుందుడు కిచ్చట మీా
రు బాలు రే, నారయ మానివర్యుఁడను నారజనీ
చరు లేమిచేయ లే, రారయ మమ్మనక్ ఋషివరా
తమసద్దయయున్నయంతటక్, వైరులు ముట్టలే
రనుచు వారకయంటి ప్రసన్న... 38

ఉ. దేవర యేలచింతిలఁగ దీనపువాక్యము లాడనే
టికిక్, కావరపడ్డరాక్షసులగర్వమడంచెదఁ గార్ము
కంబులక్, దేవులు దానవావళులు దెంపుగ సా
యమువచ్చి రేనియుక్, భావములోన వేఁ వెఱచి
పాఱనటంటి ప్రసన్న... 39

ఉ. బాలురుచూడ నివ్విధిని భద్రములాడుటఁ జూ
చితిచ్చటక్, బాలురు కారు మీారు గుణభాసురు
లంచు నుతించి మౌనిస, చ్ఛీలురు మిమ్ము నేఁబో
గడఁ జెప్పఁగ శక్తుఁడఁగాను శ్రీరమా, లోలుఁడ
వీవు శేషుఁ డితఁడు న్గనసంచుఁ బ్రసన్న... 40

ఉ. ముందఱ రామలక్ష్మణులు ముచ్చటలాడుచు
మౌనివెంటయుం, సందడిఁ జేయుచు న్నడువఁ
జయ్యనవచ్చెను రాక్షసాళి న,య్యెందఱుఁ గూ
ల్చె లక్ష్మణుఁడు నంపఱు మెచ్చి నుతించుచుం
డఁగా, జిందరవందరఁ సలిపి శీఘ్రము చంపె
ప్రసన్న... 41

ఉ. రామునిపాదపద్మములు ఱాతికి సోఁకినయంత
మాత్రమే,రాముని బ్రాణమో యనఁగఁ గంజద
ళాక్షి స్వకీయరూపమై, ప్రేమను మ్రొక్కి నిల్చి
తనపేరును గౌతముఁ డిచ్చుశాపమున్, భామ
వచించె మేటి తన భాగ్యమటంచుఁ బ్రసన్న.

ఉ. కోపముఁబూని యామునియుఁ గొండశిలాకృతిఁ
దాల్చి పొమ్మనన్, శాపమునకున్ బ్రతిక్రియను
సాగిలి మ్రొక్కి వచించుమంచనన్,బాపముపోవు
రాఘవునిపాదరజంబది యంటినప్పుడే, శాపవి
మోక్షమం చనెను సన్నుతి తొల్లి ప్రసన్న. 43

ఉ. అంతయు విన్నవించుటకు నాజ్ఞ యొసంగెను
రాముఁ డింతికిన్,అంతయుఁజూచి యామునియు
నచ్చెరువున్ భయమంది యప్పుడే, సంతసమంది
యామునియు సర్వజగత్ప్రభుఁడంచు నమ్మి తా
నంతట యజ్ఞశాలకడ కాతఁడు నేఁగెఁ బ్రసన్న.

ఉ. రాక్షసబాధ లేక యలరాముకటాక్షము చేత యా
గముల్, రక్షణగా నొనర్పఁబడె రామునికిచ్చె
సదస్త్రపంక్తిఁ దా,రాక్షసులన్ జయింపుమని రాజి
తకీర్తిమునీశ్వరుండు ప్రత్యక్షములైరి యస్త్రము
ననా సురలెల్ల ప్రసన్న... 45

చ. మిథిలకు నేలికైన యలమేటిప్రతిజ్ఞలఁ జేసియుం
డినన్, బృథివిని బ్రోచురామునకుఁ బెంపుగ నె
ట్లయినన్ స్వకన్యకన్,విధిగ నొసంగ నెంచికొనె
వేయువిధంబుల విఘ్న మొచ్చినన్,మధుహారుభక్తి
చేత నిఁకమాయును బుద్ధి ప్రసన్న... 46

ఉ. వేగమె రామలక్ష్మణులు వెంటను గొల్వఁగ నమ్ము
నీంద్రుఁడున్,రాఁగనె రాజుఁదోడుకొని రమ్యము
రాజ్యముపూజ్యమాయటం, చాగతిఁబల్కి మ్రొ
క్కి యలయర్ఘ్యము కావలెనంచుఁ బల్కి సం,యో
గము చేయమంచనె †జనావళిలోనఁ బ్రసన్న. 47

చ. దశరథరాజపుత్రులును ధర్మపరు ల్మరిధీరశౌర్యు
లున్,విశదము నీకుఁ దెల్పెదను విల్లుప్రభావము
నీప్రతిజ్ఞయున్,దశదిశలందుఁ జెప్పఁగను దాము
ను జూచెదమంచు వచ్చిరి,విశదసుకీర్తివంతులనె
విశ్వము మెచ్చ ప్రసన్న... 48

---

† జనౌఘములోన.

ఉ. వాలిని నాతిఁ జేసి బలురాక్షసులందఱి సంహరిం
చిపి, ఖ్యాతిగ నాదుయాగమునుగాచె మహాత్ముఁ
డటంచుఁబల్కఁగాఁ, బ్రీతిఁ బెనంగి నాకులుకుబి
డ్డలకుఁ దగఁ బెండ్లిఁ జేసెదన్, రాముఁడెయల్లుఁ
డైనఁ గడురంజిలు నంచు ప్రసన్న... 49

ఉ. సీతనుజూచి గమ్మనుచుఁ జెప్పెను లక్ష్మణుతోడ
రాముఁడున్, భూతదయాపరుం డయినభూనుతకీ
ర్తి మునీంద్రుఁడెంతయున్, చేతములోన సమ్మతిలె
సీతను సజ్జనపూతఁ జూడఁగా, నాతఁడు సమ్మతిం
చెఁ జనె లక్ష్మణుఁ డంత ప్రసన్న... 50

ఉ. రాముని జూచి రమ్మనుచు రమ్యసఖీజన మంపె
సీతయున్, రాముని వారు సీత నలరాజసుతుండు
ను దెల్ప రాముఁడున్, బ్రేమమునింగె సీతయును
బెంపుగ సంతసమందె భూమిలో, రాముని బుద్ధి సీ
తయని రామలుపల్క ప్రసన్న... 51

ఉ. చూచియు రాముఁడమ్మగువ చోద్యముగాఁ దన
పూర్వపుణ్యమం, చాచెలినోముపంట యనియాత
నినెమ్మది మెచ్చె నంతలోఁ, దోఁచెను సూచనం
బులవి తోడనె మంగళచిహ్నితంబులై, లేచిరి
యమ్ముహూర్తమది వేగమెయాటఁ బ్రసన్న. 52

ఉ. తల్లడమంద దేవతలు దానవులున్ రఘురాముఁ డి
ప్పుడున్, విల్లవలీలఁ గాఁదునిమె వేడుక మెచ్చ నృ
పాలుఁ డాత్మలో, నల్లుఁడు రామభద్రుఁడన నాది
సురేశ్వరుఁడంచు సీతయున్, బల్లవపాణి యాత్మఁ
దనభాగ్యము మెచ్చెఁ బ్రసన్న... 53

ఉ. శ్రీమదయోధ్యయేలికకుఁ జెన్నుగఁ గమ్మలిఖించి
పంపెనా, భూమిసుతాసుతుండు తమపుత్త్రునకిచ్చె
దనాదుపుత్త్రికన్, గామితవస్తుజాతములగౌరవదృ
ష్టిని గైకొనంగ మీ, కామినులు న్సుబంధుహితు
కారు లటంచుఁ బ్రసన్న... 54

ఉ. సంతసమంది పెండ్లికని సంభ్రమలీలఁ బెనంగి రా
జు దా, నింతులు ముగ్గురున్సుతులు నిష్టజనంబును
బంధువర్గము, ల్దంతితురంగవాద్యములు తప్పెట భే
రిమృదంగవాద్యముల్, మంతన మాడుచు న్వెడ
లె మంత్రులతోడఁ బ్రసన్న... 55

ఉ. పున్నమనాఁటి లగ్నమునకుఁ బోవలెనంచు ససంభ్ర
మంబునన్, వెన్నెలలోఁ బ్రయాణముల వేడుక
మీఱఁగఁ జేయుచున్ గడు, న్వెన్నెలమీఱు వార
జనవారము వారకసేవఁ జేయ నా, పన్నశరణ్యు
రాముపయి భక్తిని గూడి ప్రసన్న... 56

ఉ. వచ్చిరి పెండ్లివారనిన వార్తల నాజనకుండు తా

ను ము,న్మచ్చటగా నెదుర్కొనుచు మ్రొక్కుచు
నారఘువంశనాయకుఁ, గ్రుచ్చి కవుంగలించు
కొనఁ గోరికమీరఁగ రాముతండ్రియుఁ, మె
చ్చి కవుంగలించుకొనె మిక్కిలి ప్రేమ ప్రసన్న.

చ. విడిదులుచూపి వారలకు విందులఁబెట్టఁగ మో
దమంది యా, కొడుకులఁ దోడుకొంచు ముని
గొబ్బునరాఁగ ససంభ్రమంబున, న్విడిదిని వారిఁ
గూడికొని వేడుకమీరఁగ మ్రొక్కె మానికిఁ,
బడి సుఖవార్తలఁ బలికి భద్రము గాంచెఁ
బ్రసన్న... 58

చ. వరుస మునీంద్రులుం గొలువ వచ్చె వసిష్ఠమునీ
శ్వరుండు దా, నరుదుగ ఋష్యశృంగుఁడును
నత్రిమునీశ్వరుఁడాది పెద్దలుఁ, బరువడి రాఁగఁ
జూచి తనభాగ్యమటంచు నిజాత్మజాతుఁడుఁ,
గురునకు వచ్చినట్టిమునికోటికి మ్రొక్కె ప్రసన్న.

ఉ. రాముని పెండ్లిసంభ్రమము రాజులు కాంతలు
వారకాంతలుఁ, బ్రేమను జూడ వచ్చి రిలఁ
బెంపుగ మేటిసుగాయకో త్తము, ల్సాములు
న ర్తకుల్ విటులు చేటులు బీదలు భాగ్యవంతు
లుం, గోమలవందిపాఠకులు కూర్మిసభాళి ప్ర
సన్న... 60

ఉ. అంగనలెల్లఁగూడి తలలంటిరి వేడ్కను రామ
చంద్రుకుఁ, మంగళహారతిచ్చి తగ మజ్జన మా
డఁగఁ జేసి రప్పుడుఁ, పొంగుచుఁ బట్టువస్త్ర
ములు భూషణస్రగ్వరచందనంబులుఁ, రంగు
గఁ దాల్పఁజేసి రలరాముని వేడ్కఁ బ్రసన్న.

ఉ. పెండ్లికుమారుఁ డంచుఁ దగఁ బెట్టిరి బొట్టును
కండ్లఁ గాటుకఁ, బెండ్లికుమారు రామ యని
వేడ్కను బిల్చిరి పెద్ద లందఱుఁ, బెండ్లికుమా
ర్తెఁ జేసి కడుఁ బెట్టిరి సొమ్ములు చాల సీతకుఁ
బెండ్లి కలంకరించియును బేరిమిఁజూచి ప్రసన్న.

చ. మదగజయానసీతకును మంగళసూత్రము గట్టి
రాముఁడుఁ, మదనునితండ్రికిఁ మగువ మచ్చి
కతోఁ దలఁబ్రాలువోసె యా, ముదితశిరంబున
న్బ్రియుఁడు ముత్యములఁ దగ నిల్పి యప్పుడీ,
మదవతి కండ్లుచేతులును మాటికిఁ జూచె
ప్రసన్న... 63

ఉ. దేవతలెల్ల రక్తిచేని దివ్యసుమావళిఁ జల్లుసే
యఁగా, భావజరూపుఁ బెండ్లికయి వచ్చినబంధు
జనంబు మెచ్చి రా,భావజమాతసీత తనభావము
లో రఘురాముమెచ్చి సద్భావముతోడఁ గో
ర్కులను బాగుగఁగోరి ప్రసన్న... 64

చ. ముదమున రాముఁ డవ్విధిని ముద్దియఁ గైకొనె
నంతఁ దమ్ములున్, సదమల నూర్మిళన్ బిదప
సాధ్విని మాండవి నత్యుదారయై, గెనలుమహా
నుభావ శ్రుతకీర్తిని సాధ్విని సజ్జనావనన్, విదిత
సుకీర్తులన్ జనము వేడుకఁజూడఁ బ్రసన్న...

ఉ. కల్గెను నాకుమాత్రైలకు గారవమైనటువంటియ
ల్లురున్, గల్గెను నాదుభాగ్యమునఁ గంజదళా
క్షునివంటిప్రాపు మున్, గల్గెను భుక్తిముక్తి
యును గర్మవిమోచన మాయె నేఁటికిన్, గల్గె
నటంచు బిడ్డలను గ్రక్కున నంప ప్రసన్న...

ఉ. వారికి వీరు వీరికిని వారు నొసంగిరి యన్నివస్తు
వుల్, కూరిమితోడ వియ్యములు కోరికగా బిగి
కౌఁగిలింతలున్, దారకమూర్తి రాఘవుఁడు
తమ్ములుఁ దండ్రియుఁ దల్లులు న్దగన్, జేనక సీత
వచ్చె (నంత) తన *మిత్రులుగొల్వ ప్రసన్న...

ఉ. భార్గవరాముఁ డంతఁ గని భంగముఁ జేతునటం
చు నుగ్రుఁడై, మార్గము గాచియుండెఁ బలు
మాఱును రాముఁడు రాముఁడేఁడియన్, భార్గ
వుగర్వమున్నణఁచి బాహుబలంబునుజూపి వేగ
మే, మార్గముఁబట్టెయోధ్యకును మత్తవిలోక
ప్రసన్న...

ఉ. పట్టణమందునున్న పరివారము లందఱుఁ దోడ్కొ
సంగ దాఁ, బట్టముఁ జొచ్చి రాఘవులు భార్యలు
గూడను రాఁగ రాఘవు, ల్పట్టముఁ జూచుచుం
జనకుపట్టియుఁ దాను రథంబునెక్కి రాఁ, బట్టణ
వాసు లంగనలు పాటలు బాడ ప్రసన్న... 69

ఉ. వీథులు తోరణంబులును విప్రజనంబులు వేద
మంత్రముల్, వీథులలంకరించి తగ వేడుక
లన్నియుఁ జేయుచున్నయా,వీథుల వారకన్య
కలు వేడుక నాడిరి పాడి రంత నా, వీథుల
నన్నిఁ జూచుచును వేడ్కను వచ్చెఁ బ్రసన్న.

ఉ. మేళములున్ మృదంగములు మిక్కుట మైనటు
వంటిబూరగల్, తాళముతప్పెటల్ మిగుల తద్ధి
మిలాడెడువారకాంతలున్, వీళవిచిత్రనాట్య
ములు వింతవినోదపుటాటపాటలున్, గేళికలా
డుచున్ మిగులఁ గేళులఁగూడెఁ బ్రసన్న...

ఉ. ద్వారమునందు రాముఁడును *సీతయు తేరును
డిగ్గి రెంతయున్, ధీరులు తమ్ములందఱును దేరుల
నుండి డిగంగఁ జూచియున్, వారును వారిభా
ర్యలును వచ్చిరి మంత్రిపురోహితావళుల్,
గూరిమి గొల్వఁగా నృపుఁడు కోర్కులమీఱఁ
బ్రసన్న... 72

* ధాత్రిజ.

ఉ. సీతను వెంటఁబెట్టుకొని శీఘ్రముగా రఘురా
ముఁ డప్పుడున్, ఖ్యాతిగ నిల్లుఁ జొచ్చి కనకా
ననులై రఘురామ సీతలున్, బ్రీతిగనుండి రిద్ద
ఱును బ్రేమయు మిక్కుటమై చెలంగఁగా, నా
తతకీర్తిశాలు రతియాదర మొప్పఁ బ్రసన్న...

చ. సకలగుణాభిరాముఁడగు సారసనేత్రుఁడు రా
ముఁడు న్సుమిత్రకుఁ దనయుండు లక్ష్మణుఁడు
రాజితకీర్తియుఁ గైకపుత్రుఁడున్, ప్రకటగు
ణుండు నాభరతరాజు శత్రుఘ్నుఁడు పత్నులంద
ఱున్, బ్రకటితభక్తిఁ గొల్వ సుఖభావమునందె
ప్రసన్న... 74

చ. భరతసుమిత్రనందనులు భాషితులై తన మేనమా
మల, న్నరుదుగఁ జూడఁ బోయి మఱి యక్కడి
నుండి ప్రమోదలీలల, న్నిరవు నయోధ్య పట్ట
ణము నిష్టజనంబులతోడ రాజులుం, బరువడి
రామభద్రునికిఁ బట్టముఁగట్ట ప్రసన్న... 75

ఉ. రాజపు డానతిచ్చె రఘురాముని రాజును
జేయ నంతలో, రాజును జూచి కైకయును రా
జ్యము నాసుతుకిచ్చి రామునిన్, రాజిగఁబంపు
కానలకు రంజిలునామదిలోన వేగమే, రాజుగఁ
జేయవే భరతు రాజ్యముఁగట్టి ప్రసన్న... 76

చ. పిసుగులవంటిమాటలకుఁ బిమ్మటఁ బో యటు
రాజశేఖరుం, డుసుగక తాఁ జలించె మఱి యొ
ప్పుగ నిప్పులఁ గ్రాఁగురీతిగా, నడవడివించు రాఘ
వుఁడు నాకిది ధర్మము నీతిమార్గముఁగా, బడి
యడవిం జరింప నగుపద్ధతి యంచుఁ బ్రసన్న.

ఉ. తల్లికి ముందుగాను బినతల్లికి దండము పెట్టి కన్ను
లన్, గొల్లున నేడ్వఁగా నపుడు ఘూర్ణిలుచు
న్నది యేమినేతు నే, నొల్లను రాజ్యభోగముల
నోరిమి వచ్చెదఁ బాయలేను నా, తల్లడమంద
నాకొడుక తాళఁగఁ జాల ప్రసన్న... 78

ఉ. సత్యము దప్పరాదు జనసంఘనుతా మఱిచింత
యేల నా, నిత్యపరాక్రముండు మదినిశ్చలతన్
వరమిచ్చినప్పుడే, సత్యము తండ్రివాక్యముకు
సమ్మతినొందినవాఁడె పుత్త్రుఁడుఁగా, సత్యము శీల
మా పురుషసన్నిధినుండఁ బ్రసన్న... 79

ఉ. ఒక్కఁడె రాముఁ డావసము నొందుటఁ జూ
చియు లక్ష్మణుండు దాఁ, గ్రక్కున తర్లగా
మఱియుఁ గంజదళాక్షియు సీత పైనమై, యి
క్కడ నేమి నాకుఁ బతి యెక్కడనుండిన నక్క
డుండెదన్, జక్కనివార్త కాంతుకడ సాధ్వి
మెలంగ ప్రసన్న... 80

ఉ. తెమ్మనె రాముఁడున్ రథము తెచ్చిన సూతుఁ
డు నల్వురెక్కినన్, సమ్మతి పట్నమున్ వెడలి
చయ్యన తర్లి గుహాశ్రమంబునన్, శామ్మసిలంగఁ
జేరి రిఁక సూతుఁడు నీవు రథంబు దీసికో,పో
మ్మని పంపవచ్చెఁ బురి*జొచ్చుట కేడ్చె ప్రసన్న.

ఉ. రాముఁడు తర్లిపోయెనని రాజుకు సూతుఁడు
వచ్చి చెప్పినన్, భామల మాటవింటి నెడఁ బా
సితి రాము గుణాభిరామునిన్, రాముని దల్చి
తల్చి మది అంపముగాఁ దెగఁ గోసినట్లుగాఁ
బ్రేమను జీవము న్విడచిపెట్టెను రాజు ప్రసన్న.

ఉ. సంగతి రాత్రియు న్నిలిచి చయ్యన నాగుహుఁ
గూడి వేడుక, న్గంగయుదాఁటి తా జడలు గ్ర
క్కునఁ దాల్చియు రాముఁజూచియు, న్నంగన
చాలదుఃఖపడె నందుకు లక్ష్మణుతోడఁ గైక హా
భంగముచేసె నిట్టిరఘుపట్టముఁ గట్ట ప్రసన్న.

ఉ. అక్కడినుండి రాఘవుఁడు సంగనఁ జూచి విచా
రమంది తాఁ, గ్రక్కునఁ జెట్టఁ బట్టుకొని కంజద
ళాక్షుని గారవించియు,న్మక్కువ నూఱడించి పలు
మాఱును మోమున మోముఁ జేర్చె నా, చక్కె
రబొమ్మ కాల్నడలఁ జయ్యనవచ్చె ప్రసన్న. 84

ఉ. వచ్చి భరద్వాజాశ్రమము వద్దనుజేరి మునీంద్రుఁ

గాంచి తా, మచ్చటఁజేరి రాత్రి సుఖమందియు
వేడుక దర్శిలేచియున్, ముచ్చట లాడుచు న్న
దువ ముందరజూచియుఁ జిత్రకూటము, న్నచ్చ
ట పర్ణశాల నొకఁ డప్పుడు గట్టె ప్రసన్న... 85

చ. భరతుని వేగరమ్మనుచుఁ బంపిరి లేఖలువ్రాసి వేగ
ముక్, వరుసను దమ్ముఁడు న్గొలువ వచ్చుటఁ
జూచి రయోధ్య పట్నముస్, సిరి తొలఁగింది
యేమొయని చింతిలుచుండిన నాడకాడకున్,
గుఱుతులు చెప్పఁగాను విని గొబ్బునవచ్చె
ప్రసన్న... 86

ఉ. తల్లినిఁ జూడరోసి తమతండ్రికి నగ్నిముఖంబుఁ
జేసియున్, సల్లలితంబులైన నృపసాధ్వులకాంతు
లు మాయఁజూచియున్, మెల్లఁగ రాముఁ దెత్తు
మని మిక్కిలిప్రేమను మంత్రివర్గమున్, వెళ్లిరి
రామమార్గమున వేడుకనంత ప్రసన్న... 87

ఉ. వచ్చినమూకఁ జూచి గుహుఁ *డోడయు వేయక
యున్న నాతనిన్,సచ్చరితుండునౌ భరతసాధుఁడు
సంగమమైత్రిఁ జూపియున్, వచ్చె భరద్వాజుంగ
నియు వార్తల నెల్ల నెఱింగి యంతటన్,వచ్చిరి
చిత్రకూటముకు వారిని జూచి ప్రసన్న... 88

చ. భరతుఁడు రాముపాదములఁ బట్టుకయేడ్చియుఁ

గన్న తండ్రియుఁ, పరమపదంబు కేగెనని పల్కిన
రాముఁడు శోకచిత్తుఁడై, పరక్రియలగ్నిఁ జేసి తన
పాదుకలిచ్చియుఁ బంపెఁ దమ్మునిఁ, భరతుఁడు
రామపాదుకల భక్తిని దెచ్చె ప్రసన్న... 89

చ. భరతుఁడు దీక్షఁజేసి యలపట్టముఁ జేరక తాను
తాపసుఁడై, భరమువహింపఁ దమ్ముఁడును భారతపా
దము గొల్వసాగె నా, భరతుఁడు రాముపాదు
కలె భద్రమటంచును సేవఁజేసె నా, భరతునిఁ
బంపి రాఘవుఁడు పైనముఁ జేసె ప్రసన్న...90

ఉ. అత్రిమహామునీశ్వరుని యాశ్రమముం దగఁజేరి
వేడుకఁ, శ్రోత్రియుఁ డాతఁడిచ్చినసుశోభితమౌ
సరసంపుటన్నముఁ, పాత్రగఁబొంది యాయతిథి
భాగము రాముఁడు సీత లక్ష్మణుల్, శ్రోత్రియవర్గ
మంపఁ జనె సొంపుగ నెప్డు ప్రసన్న... 91

ఉ. చొచ్చిరి దండకాటవిని జూచి విరాధుని జంపి
యంత భీ, మచ్చరశూన్యులైన మునిమండలి
నా శరభంగుఁ డాదిగా, ముచ్చటలాడవచ్చుముని
ముందు నగస్త్యమునీంద్రుఁ గాంచి యా, సచ్చరి
తాత్ములఁ గొలిచి శస్త్రములందె ప్రసన్న...92

ఉ. మాయమృగంబుఁ జూచి పలుమాఱును సీతయుఁ
బట్టితెమ్మనెఁ, బాయక దానివెంబడిని బట్టెదనం

చును బోవుచుండఁగా, మాయయటంచు రాఘ
వుఁడు మర్మ మెఱింగియుఁ గోపచిత్తుఁడై, సాయ
కమేయ లక్ష్మణుఁడ చచ్చితినంచు ప్రసన్న...

ఉ. రాముఁడు నిన్నుఁ దల్చె మఱి రాక్షసులందఱు
నేమొ లక్ష్మణా, తామసమేల వేగచను *వేగము
వేగమటంచుఁ బల్కినన్, ఏమిభయంబులే దనఁగ
నించుకమాటల నాడె సీతయున్, రాముని జేర
లక్ష్మణుఁడు రావణుఁ డంత ప్రసన్న... 94

చ. కపటముచేసి వచ్చుటయుఁ గంజదళాక్షియు
జూచి వేడుకన్, దపసియటంచు వచ్చుటయు
దగ్గఱవచ్చిన రూపుఁజూపుటన్, విపదమునొంద
సీత తన వేడుకగాలిరథంబునం దిడెన్, చప
లుఁడు తిన్నఁగా జనెను సాగరలంకఁ బ్రసన్న.

ఉ. పాటలగంధి సీతయును బాష్పజలంబులుగా
ర్చవించుచున్, మాటికిమాటికిం దలఁచు మాన
సమందున రామరామ ఘూ, రాటజటాయువంత
విని రావణుగుట్టవుఁగ్రొందలంబునున్, వాటము
పేర్చి తన్నె మఱి వాఁడునుఁ గూలె ప్రసన్న.

ఉ. లంకకుఁ గొంచుఁబోవ తన లక్షణయుక్తము
లైన సొమ్ములన్, బంకజగంధి తీసికొని పైఁటచె
ఱంగునఁ గట్టివేసినన్, శంకయులేక రావణుఁడు

సాగరు దాఁటి వనంబులోపల, న్పంకజగంధి నుం
చెఁ దనపాలిటిమృత్యు ప్రసన్న... 97

ఉ. వచ్చినఁజూచి తమ్మునిని వారిజనేత్రను సీతడించి
యే,వచ్చితివన్న నావడినె యాడనిమాటల నాఁడి
పొమ్మనెన్,వచ్చితినంచు నిద్దఱును వార్తలనాఁ
డుచు నున్నచోటికిన్, వచ్చిన సీతగానకను వారఁ
లునేడ్చె ప్రసన్న... 98

చ. అడవిని జాడల న్వెదుక నక్కడఁబడ్డజటాయుఁ
జూచి సీ,వెవఁడ వటంచుఁబల్క నవు డేర్పడఁ
జెప్పెను సీతజాడలన్,వడిదహనంబుఁ జేయుఁడని
వారిజనాభుని వానిగాల్చి తా,కడపటతర్లి రాక్ష
సుఁ గ*బంధునిఁ జంపె ప్రసన్న... 99

ఉ. వచ్చిరి పంపతీరమున వాసముకున్ శబరుండు
వేగమే, వచ్చియు పండ్లుఁదెచ్చియును వారిజ
నాభుని కిచ్చి భక్తితో, నచ్చటనుండి తర్లియును
నప్పుడు చూచిరి ఋష్యమూకము, న్వెచ్చెడి
వాయుపుత్రు ననివారణఁజూచె ప్రసన్న...

ఉ. ఎక్కడినుండివచ్చితిరి యెవ్వరుమీరు కులంబు
నెద్ది యే,దిక్కులనేలు మీమహిమ తేటఁగ
దెల్పుఁడు రాకకుం గతం, బిక్కడి కన్న లక్ష్మ
ణుఁడు సీతఁడు రాముఁడటంచు సర్వమున్,

జక్కఁగ స్వీయమహాకథను చాటి వచించె ప్రసన్న... 101

చ. ధరణి నయోధ్య నేలునృపు ధర్మపుటాజ్ఞకు బద్ధుఁ
డై విభుం,డు రయముతోడ దండకను దొడ్డఁగ
నిల్చి ఖరాదివీరులఁ, బోరిగొనవచ్చి యిచ్చ
టను పూతచరిత్రను సీత రావణుం,డు రహిని
గొంచు నేఁగఁ గను దోరపుదృష్టి ప్రసన్న...

ఉ. తమ్ముఁడ నేను లక్ష్మణుఁడ దాసుఁడ సేవయొన
ర్పవచ్చితిఁ, మమ్మదుగంగఁ దెల్పితిమి మాన్యుఁ
డ నీచరితంబుఁ దెల్పవే, యిమ్మహి నన్న మ్రొక్కి
యిదె యేర్పడఁ దెల్పెద వాయుపుత్రుఁడ,
న్నమ్మతి సూర్యపుత్త్రునకు సన్నిధిబంటు ప్రసన్న.

ఉ. అంజనదేవిపుత్రకుఁడ నాప్తుఁడ నీకును బంట
నేను మీ, కంజదళాక్షిఁ జూపెదను గ్రక్కున
రం డిఁక ఋష్యమూకముఁ, మంజులవాణి సీత
గనుమార్గము సేతు నటంచుఁ బల్కినఁ, రంజి
తమైన ప్రేమయది రాజిలఁబోయె ప్రసన్న...

ఉ. అందుకు రామలక్ష్మణులు నాతఁడు సంతస
మంది రప్పుడే, కొందలమందు నాతఁ డిఁకఁ గొం
కక సర్వచరిత్ర దెల్పినఁ, ముందుప్రయోజనం

బనఁగ మోదముతో నలవాలికోడుటన్, గొం
దఱితోడ ఋష్యగిరి కూడుట దెల్పె ప్రసన్న.

ఉ. అంజనిపుత్త్రుఁ డాపిదప నారవిసూనున కన్ని దెల్పి
యున్, రంజితమైనచిత్తమున రాఘవుఁ జేర్చెను
సూర్యపుత్త్రునిన్, మంజులరీతి రామునకు మా
టికి మ్రొక్కెను వానరేశుఁడున్, శింజితమైన
వాక్యములఁ జేరిచె నంత ప్రసన్న... 106

ఉ. వాలికి నీకు నిద్దఱికి వాదమదేలనువచ్చె నన్న
నా, యాలిని లోనవేసికొని నన్నువు డట్టులఁ
జంపవచ్చినన్, జాలక నాదుబల్మి యగచాట్లను
బొం దిటు డాఁగినాఁడ నా,పాలిటిదైవ మీ
వనుచుఁ బల్కెను బ్రేమ ప్రసన్న... 107

ఉ. మంచిది వాలిఁ జంపెదను మర్కటనాథ యటం
చుఁ బల్కినన్, సంచితమైనసొమ్ములను సామికిఁ
జూపిన మోహతాపమున్, మించియు మూర్ఛ
పోయె మఱి మెల్లన తాఁ దెలివొంది లేచియు,
న్నించుక సేపు దుఃఖపడి యింతిదలంచె ప్రసన్న.

ఉ. వాలియు నీవు నిద్దఱును వాదములాడుచుఁ
బోరుచుండినన్, వాలిని సంహరించెదను వచ్చెద
వెంటను దర్శిపొమ్మనెన్, వాలినిఁ బిల్వ రోషపడి

వచ్చియు యుద్ధముసేయునప్పుడుఁ, వాలినిఁ
గూల్చి సూర్యసుతు వైరముదీర్చె ప్రసన్న.109

ఉ. వాలినిజూచి తారయును వారకమాటికి మోదు
కొంచుఁ దా,వాలి ప్రతాపశాలియని వర్ణనసే
యుచు నెట్లుతాళుదుఁ,జాలఁగఁ బ్రేమఁ జూచి
నను సారెకుసారెకు గారవించి నీ,బాలునిఁ
జూడు మంగదుని భద్రునినంచు ప్రసన్న... 110

ఉ. రామునియాజ్ఞచేత కపిరాజ్యము నా రవిపుత్త్రు
కిచ్చినఁ,బ్రేమను తారఁగూడి యతిప్రీతి యొన
ర్చుచునుండి వేడుకఁ, వేమఱు వానకాలమును
వెళ్లఁగ రాముఁడు పిల్వఁబంపినఁ, భూమిని
నున్న వానరులు బోరునవ్రాలిరి యప్రసన్న. 111

ఉ. వానరకోటి గొల్వఁగను వచ్చె దివాకరపుత్త్రుఁ
డప్పుడుఁ, వానరులందఱిం గనియు వారిజనా
భుఁడు సీతఁజూడఁగా, నానయుఁజేసె సీతగని
యచ్చటివార్తలఁదెల్ప సంగదుం,బూనెను మారు
తాత్మజుఁడు *సంగ్రముఁబట్టె ప్రసన్న... 112

చ. పడమర తూర్పు నుత్తరము బంపఁగఁబోయిరి
వానరాధిపుల్,వడి తనచేతిముద్రికయు వాయు
తనూజునిచేతి కిచ్చినఁ,దడయకపోయె వానరు

లతండము నప్పుడు దాటీణంబుగన్, బుడమిని
జాడల న్వెదుకం బోయిరి వారు ప్రసన్న...113

ఉ. వచ్చి సముద్రతీరమున వానరులు న్బవళించి
నప్పుడున్,జటాయుజటాయువాక్యములు సారెకుం
జెప్పంగ దుఃఖమంది తా, వచ్చి జటాయువన్న
మఱి వారితోం జెప్పెను సీతపోలికల్, మెచ్చుగ
లంకమార్గమును నేటిగం జెప్పె ప్రసన్న...114

ఉ. ప్రొద్దునలేచి వానరులు పోయి సముద్రపుందీర
మంతయున్, దద్దయుం జూచి యంగదుండు దాం
టంగలేమని చెప్పుచుండంగాం, బద్దుకు నాంజనే
యుండును బర్వతమెక్కె మహాద్భుతంబుగాం
బెద్దయుం బెంచి వాలమును భీకరమంద ప్రసన్న.

ఉ. పాదములూని బిట్టెగసి పావనిదాంటి సముద్ర
మప్పుడున్, మోదమునొంది రాఘవుల మూర్తి
మహత్త్వమటంచు వేగము,న్పాదుగలంకం జొచ్చి
యును బల్లవపాణిని సీతంగానకన్, లేదని నిశ్చ
యించియును లేకటురాత్రి ప్రసన్న... 116

ఉ. రావణుభోగమున్ సుఖము రాజ్యవిలాసము
రూపురేఖయున్,భావజాకేళిముచ్చటయు భామ
లుచేసెడు మంగళార్తియున్, భావములోనం

జూచి యిఁక భాగ్యములు న్పైడఁబాయు వీనికిఁ
గావరమంది రాఘవులకాంతను దెచ్చె ప్రసన్న.

చ. తెలతెలవాఱవచ్చినను ధీరుఁడునౌ హనుమం
తుఁడప్పుడుఁ, గలవరమంద సీత నటుగానక రావ
ణుఁ డేమిచేసెనో, తెలియ దిఁకేమిసేతు నని దీన
తతో వనమంతఁ జూడఁగా, నెలఁతనుఁ గాంచె
నొక్కతెను నేడ్చుచునుండ ప్రసన్న... 118

ఉ. అన్నిట రూపురేఖలును నందముచందము మో
ముకాంతియుఁ, నన్నియు నానవాలులును నక్క
డ రాముఁడు చెప్పినట్లుగా, నున్నవి సీతయేయ
నుచు నుబ్బుచు భూజము నెక్కుచుండఁగాఁ
గన్నులఁగప్ప రావణుఁడు గ్రక్కునవచ్చె ప్రసన్న.

ఉ. వచ్చినవానిమాటలును వారిజనాభునిదేవిమాట
లుఁ, మెచ్చియు రాక్షసాధముఁడు మేలుగ నా
శది దీఱ కేగుటల్, ఇచ్చట సీత యేడ్చుటయు
నింతులు కావలియున్న చందముఁ, ముచ్చట
దీఱఁజూచి యలముద్రిక నిచ్చెఁ బ్రసన్న...

ఉ. రాముని చేతిముద్రికను రామకు నిచ్చి శుభంబుఁ
జెప్పియుఁ, భామశిరస్సునందుఁ గలభాసురరత్న
ముఁ దాల్చి పిమ్మటఁ, వేమఱు నాజ్ఞఁదీసికొని

వేగమె తా వనమంతఁగూల్పఁగా, తామసమంది
రావణుఁడు దానవమంపె ప్రసన్న... 121

ఉ. వచ్చినరాక్షసావళిని వాలమునం దెగటార్చి
వైచి తా, నిచ్చకు వచ్చినట్లుగను నెల్లర వచ్చిన
వారిఁ జంపె నా, వచ్చినయక్షయుం దునిమె
వారక వానికిఁ బెద్దవాఁడు నా, మ్రుచ్చును
నింద్రజిత్తు నొకమూలకుఁ జేసె ప్రసన్న...122

ఉ. ఏమిర వానరాధముఁడ యెచ్చటనుం డిటు వచ్చి
తన్న నే, భూమిజఁ గాంచ వచ్చితిని కోయెదరా
నినుఁజూచి రావణా, భామినిసీతనిమ్మనఁగఁ బాప
ము నెంచక పంపుఁడన్న స, త్ప్రేమవిభీషణుండు
వినిపించెనురీతి ప్రసన్న... 123

ఉ. తోఁకయుఁ గాల్చిన న్నెగసి ధూళిగ దున్ముగఁ
జేసె మేడలన్, వీఁకను పట్నమంతయును వేగ
ముగా దహనంబుఁ జేసి ని,ర్భీకరవృత్తిఁ జూచి
యల భీతమృగాక్షిని రాముపత్ని న,స్తోకవిధాన
మూని యలతోయధి దాఁటి ప్రసన్న... 124

ఉ. వచ్చినవాయుపుత్రుఁ గని వానరు లున్నతిఁ బ్రీతి
నొందఁగా, వచ్చటివార్తలం దెలిపి యాదరబుద్ధిని
వారిఁగూడి మే, లచ్చుపడంగ నంగదునియాజ్ఞను

వానరపంక్తిc గూడియుక్, మెచ్చుచు నా మథూ
పవనమిత్తులరైరి ప్రసన్న.... 125

ఉ. అంతకుమున్ను వానరులు నందఱువచ్చిరి సీతc
గాన క,త్యంతపుc బ్రేమనుండిరి ఘనాత్ములు
రాముcడు లక్ష్మణుండు ప్ర,త్యంతమునందునున్న
యలయార్యుల పల్కులచేత.వీరికై, ప్రాంతము
లం గనుంగొనcగ వారునువచ్చెc బ్రసన్న...126

ఉ. సీతనుc జూచివచ్చితిమి శ్రీరఘునాయక లంక
లోపలన్, బ్రీతిగ ముద్రికిచ్చితిమి ప్రేమనొసం
గcగc దెచ్చినార మా,నాతియొసంగురత్నము
ను నాతి మిముం దలపోయుచుండు బ్ర,ఖ్యా
తిగ లంకcగాల్చితిమి కాంచితి మిమ్ము ప్రసన్న.

ఉ. వచ్చి సముద్రతీరముకు వానరులారఘురాము
నాజ్ఞచే, నచ్చటc దెచ్చి పర్వతములన్నియు
నీలునిచేతి కిచ్చినన్, మెచ్చుగc గట్టగట్టి యల
మేటిపరాక్రమశాలి వేడుకన్, ముచ్చటతోడ
వానరులు మూcకలుగాంచె ప్రసన్న... 128

ఉ. అంతవిభీషణుండు తనయన్నకుcజెప్పెను రామ
సీత నీ, వింతటనిచ్చినన్ బ్రతుకు నిష్టజనంబుల
టన్న నుగ్రుcడై, యంతటc దన్నెc దమ్ముునిని

నప్పుడె లంకయుఁ బాసె నాతఁడు, న్నాఁడింతము
నందు రాముపరి భద్రముగాంచె ప్రసన్న...

ఉ. రమ్ము విభీషణా యనుచు రాఘవుఁడుం దయఁ
జేసినప్పుడే, హనుమ్మనువానరావళియు నోర్వను
జెందెను లంకపట్టముల్, సమ్మతిఁగట్టి రాఘవుఁడు
సైన్యముతోడను బంపె లంకపై, యమ్మహితుం
డు వానరుల నంపతిఁగూడెఁ బ్రసన్న... 130

ఉ. ఉత్తరగోపురంబునకు నొప్పఁగఁబోయెను దాన
వుండు దా, నత్తఱిఁబట్టుఛత్రములు నాకసమం
దునఁదోఁచె నెండకున్, సత్తువపోయె వానరులు
సారెకు వానిని గొట్టఁబోవఁగా, నత్తఱి కాద
టంచనియె నాసురవైరి ప్రసన్న... 131

ఉ. చూడు విభీషణా యనుచు సుస్థిరుఁడై రఘు
రాముఁ డప్పుడున్, వేడుకబాణ మొక్కటియు
వేసినతోడ ననేకమస్త్రముల్, గూడియు ఛత్ర
సంఘములఁ గుంభినిఁ గూల్చినఁ జూచి రావణుం,
డాడెను రాముసాటి యెవరంచును దాను
ప్రసన్న... 132

ఉ. రావణుతోడ నంగదుఁడు రామునిశీతను బుచ్చి
లంకయున్, కావఁగ నేలుకొమ్మనినఁ గావర
మందియు రావణుండు తా, భావములోన నంగ

దుని * జంపెదనంచుఁ దలంచ రావణా, చావది
నీకు సిద్ధమనె సాగుచు నంత ప్రసన్న... 133

ఉ. అండజయాన రావణుని యంగన సీతను బుచ్చు
మంచనెఁ, మండుచు రావణాధముఁడు మాని
ని వేగమె లేచి పొమ్మనెఁ, దండధరుండు నా
యెదుటఁ దాళఁగ లేఁ డిఁక వీరు లెక్కయే,
పొండనె రాక్షసాధములఁ బోయిరి పోర ప్ర
సన్న... 134

ఉ. వచ్చినరాక్షసావళిని వాలమునం దెగటార్చు
చుండినఁ, జచ్చుచు రాక్షసావళులు సారెకు
సారెకు వచ్చుచుండఁగా, జచ్చితి రింక మీర
లని చయ్యన మూలబలంబుతోఁడుగా, వచ్చెను
రావణాసురుఁడు వాసవవైరి ప్రసన్న... 135

ఉ. రావణుఁ డివ్విధంబునను రాజితమౌ బలపంక్తిఁ
బోఁగఁగా, రావణుపైకిఁబోయె నల రావణుతమ్ముఁ
డు రామునాజ్ఞచే, రావణుఁ డాగదఁ విడచె
రాముఁడు చూచుచునుండినంతలో, రావణు
తమ్ముఁ డాగద ధరాతలిఁ జేర్చె ప్రసన్న...

చ. తరలనిశక్తినేసి యిఁక తప్పకపాపుము నాఁగ
నంతలో, మెఱుపులు గ్రమ్ముబాణముల గ్రిం
గుచు వచ్చెడిశక్తిఁ జూచియు, న్గరుణదలిర్ప

లక్ష్మణుఁడు గ్రక్కున నడ్డము వచ్చి నిల్చినన్,
బొరలుచు దాఁక లక్ష్మణుఁడు మూర్ఛయుఁ
బోయె ప్రసన్న... 137

ఉ. తమ్మునిఁ జూచి రాఘవుఁడు తాలిమిదూలఁగఁ
బట్టియేడ్చియు, న్నిమ్మహి రావణాసురుని నిప్పుడె
కూల్చెద నంచు నుగ్రుఁడై, క్రమ్మశరంబు లేసి
నను కాఁకకుఁ దాళఁగలేక లంకకున్, సమ్మతి
నిల్వలేక చనెఁ జచ్చితి నంచు ప్రసన్న... 138

ఉ. సంజివి తేను బంపవలె జాగిఁకసేయక వేగ మి
ప్పుడే, యంజనిముద్దుబిడ్డనని యంపిరి రామసు
షేణు లాతఁడు, న్నంజలిఁజేసిపోయి కడు నాదర
మొప్పఁగ విక్రమంబునన్, సంజివికొండఁదెచ్చెఁ
దనసాహసమొప్పఁ బ్రసన్న.... 139

ఉ. ఆక్షణమందు సంజివియు నాతని కిచ్చిన యంత
లోపలన్, వీక్షణజేయుచుండఁగనె వేగమె
లక్ష్మణుఁ డొక్కమాఱు ప్రత్యక్షము నయ్యెఁ
దెల్విగను *కొండనుమారుతి డించివచ్చె నా,
రాక్షసమూఁకచింతఁగనె రాముఁడు నవ్వె
ప్రసన్న... 140

ఉ. లంకయు నెప్పటట్ల మఱిలగ్గుల కెక్కఁగఁజూచి
రాక్షసుల్, ఇంకమఱేమిజీవమని యేడ్వఁగ రావ

ణుఁ డంతలోపలన్, శంకయుఁదక్కి వానరులు
సారెకు రాక్షసపంక్తిఁ దున్మఁగా, లంకను బ్రోచు
రావణుఁడు లజ్జ వహించె ప్రసన్న... 141

ఉ. రాతిరి నింద్రజిత్తు రఘురాముని తమ్ముని సేననం
తయున్, ఖ్యాతిగ నాగపాశములఁ గట్టియుఁ
బ్రీతిని లంకఁజొచ్చియున్, సీతది దక్కెఁగా
యనుచుఁ జెప్పఁగ మిక్కిలి ప్రీతిఁజెందె ది,వ్యా
తతకీర్తి రావణుఁడు నాతఁడు పోయె ప్రసన్న.

చ. గరుడుఁదలంప రాఘవుఁడు గ్రక్కునవచ్చినఁ బా
ఱిపోయె నా,ఖరతరసర్పసంచయము కాంక్షను
గొన్నిఁటి జంపి రాముచే, సరగున నాజ్ఞఁ
గైకొనుచు సాగె నతంశును వానరాళియున్,
బరువడి తొల్లియున్న యటు భాసురులైరి ప్రసన్న.

చ. భయముఖులైన రాక్షసుల భగ్నముఁ జేసిరి వాన
రాధిపుల్, చెలువతనంబడంగఁగను చింతవహిం
చెను రావణుండు తా, బలమదిపోవ రోయు
చును బంపెను పుత్రుల లక్షమంది నా,బలము
నుజచ్చె వానరులు భద్రము గాంచె ప్రసన్న.

ఉ. అంతట రావణాసురుఁడు నాత్మవిచారము నొం
దుచుండఁగా, నింతవిచార మొంది యిటు లేల
కృశించెదు భూమిలోన నీ, యంతటివాఁడె

చింతిలఁగ నానాకా కార్యములంచు నింద్రజి,
త్తంతరథంబు నెక్కి ఘనతంతయుఁ జూపె
ప్రసన్న... 145

చ. కొడుకులు చచ్చిపోయిరని కోపముతోడను
రావణుండు తా, నడలుచునుండఁగా నపుడు
నగ్రసుతుండగు మేఘనాదుఁడు, న్వడివడి నూఱ
డించియును భర్గునిగూర్చి తపంబుఁజేసి యా,
గడియనువచ్చుతద్రథము గ్రక్కుననెక్కి ప్ర
సన్న... 146

ఉ. గుంపులరాక్షసావళులఁ గూల్చిరి వానరు లంత
వేగమున్, దెంపుగ రావణాసురుఁడు దీనతనొం
దియు నావలించియున్, గంపముచేతవచ్చె నల
*కోటలనేడిటి దాఁటి రాము పై, నంపలగుంపు
లేయుచును నందఱిఁగూల్చి ప్రసన్న... 147

ఉ. ఇక్కడివార్తయంత విని యింద్రవిజేతయు నీక్ష
ణంబునన్, గ్రక్కున వారిసంగరముఖమ్మున ఖండ
నఁజేసి వచ్చెదన్, జక్కనఁ జూడు తండ్రియని
చాపముచేతనె పూని తేరునుం, గ్రక్కునఁ
దోలె యుద్ధమునకై చనె నయ్య ప్రసన్న...

ఉ. వాఁడు మహోగ్రకోపమున వానరులం దిగ
ద్రుంగ నార్చుచు, న్నేఁడు వధింతు రాముఁ డతఁ

డెచ్చుటనుండె నటంచు రాఁగ నా, వేఁడిమిఁ
జూచి రాఘవులు వీఁడు విభీషణ యెవ్వఁడన్న
దా, వాఁడనె కుంభకర్ణుఁ డని వాఁడనిచెప్పె
ప్రసన్న... 149

చ. బలమగుదివ్యబాణములఁ బాపునిపై నటుపంప
నంతలో, బలమును వానిమాయలును భగ్నము
లయ్యెను బ్రహ్మబాణముఁ, దలఁచియు వాని
పైఁ బనుపఁ దత్క్షణమే యది వాని ద్రుంచె నా,
కులగిరికూలినట్లుగను గూలెను వాఁడు ప్రసన్న.

ఉ. వచ్చెను గుంభకర్ణుఁడన స్వాంతమెఱుంగక మూ
ర్ఛవోయి తా, నచ్చటలేచి రాఘవుల నందఱఁ
జంపెద నంచు నుగ్రుఁడై, మచ్చరకొంతదీర్చు
మని మానక నయ్యతికాయుఁ బంపెఁ దా, వచ్చె
ను రాముఁ డే డనుచు వానిని జూచి ప్రసన్న.

ఉ. కోపముచేత లక్ష్మణుఁడు కూల్చిననాయతికాయుఁ
డప్పుడుఁ, బాపము మేఘనాథునకు భగ్నము
చేయఁగ హోమమంతయుఁ, గోపముఁ బూని
వచ్చె నలఘుర్మిలుహోమము నవ్విభీషణుం
డోపికఁ జెప్ప వానరులు నొద్దికఁజేరె ప్రసన్న.

ఉ. అంగదవాయుపుత్రకులు నప్పుడు దెచ్చిరి ధాన్య
మాలినిఁ, రంగుగ యజ్ఞవిఘ్నమును రక్తిగఁ

జేయఁగ నెంచి యంతలో, మ్రింగుచు వానరా
వళుల మ్రింగఁగ నాజ్ఞయొసంగి సేనకున్, భం
గముసేయఁగాఁ దివిరి వచ్చెను వాఁడు ప్రసన్న.

ఉ. ముందఱ రావణాసురుఁడు మూలబలంబు లనేక
రాక్షసుల్, కొందలమందవచ్చియును గూయు
చునుండ విభీషణుండు తాఁ, జిందులు ద్రొక్కు-
మూఁకలను జెప్పెను రావణుసేనయందు నా,
చందమునంతయు న్వినియె సారెకు నప్డు
ప్రసన్న... 154

ఉ. ఒక్కొకరాక్షసాధముఁడు నొక్కొకరాముఁ
డనంగ నప్పుడు, స్వేచ్ఛ విధంబులం బలిమి భీకర
మూర్త్యవతారమైనతా, నెక్కడఁజూడ రాఘ
వుఁడు నేమిమహత్త్వమొ రాక్షసాధము, ల్గ్రి
క్కునఁగూడిరందఱును గయ్యముదీఱె ప్రసన్న.

చ. రథమును నెక్కి రావణుఁడు రాఁ గని యింద్రుఁ
డు రామచంద్రుకు, న్రథమును మాతలిం
బనుప రాఘవుసన్నిధి కొచ్చి నిల్చినన్, రథమది
యెక్కి రాఘవుఁడు రంజిల నాకవులంత వేడు
కన్, రథముల రామరావణులు రాజిలఁజూచె
ప్రసన్న... 156

ఉ. రాముఁడుగెల్చునంచు సురరాజును వానరు
లంతవేడుకన్, వేమరుగెల్చురావణుఁడు వేగ
మటంచు పిశాచరాక్షసుల్, భూమిని జూచు
చుండఁగను బోరిరి సింహము నేన్గుచాడ్పునన్,
రాముఁడు రావణుండు నలరాక్షసమూఁక
ప్రసన్న... 157

ఉ. అంతట రామలక్ష్మణులు నస్త్రములం దగఁ బోరి
పోరియు, న్నంతటఁబోక నిద్దఱును నయ్యిరువాఁ
గులవారుఁ బూన్కితో, వింతగఁ జూచుచు
న్నిగుల విభ్రమమూనియుఁ బోరుచుండఁగా, నం
తటరావణాసురుని యాయువు దీఱె ప్రసన్న...

చ. పదియుశిరంబులు న్దునిమి బాహులు నిర్వదిద్రుం
చివేసిన, న్నదరిపడంగ నంతటను నప్పుడె మా
టికిఁ బుట్టుచుండఁగా, మదిదలపోసి రాముఁగని
మర్మముఁజెప్పి విభీషణుండు నా, సదయుఁడు
నగ్ని బాణమున సత్తువ దీసె ప్రసన్న... 159

ఉ. దేవతలుం బిశాచములు దిక్కులుకొండలు వాన
రాధిపుల్, భావజవైరియున్ మఱియు బ్రహ్మలు
నందఱు భీతినొందఁగా, భావములోన నస్త్రమున
బాహులదీసియుఁ దీవ్రముష్టిచే, జావుము రావ
ణా యనుచు జయ్యన నేసె ప్రసన్న... 160

ఉ. అంతట మూలె రావణుఁడు నద్భుతసంతస మంది
దేవతల్,వింతగఁ బుష్పవర్షములు వేడుకరాఘవు
ముంచి దేవ మా,కెంతసుఖంబుఁజేసితివి కేశవ
రామయటంచు మ్రొక్కుచుఁ,గాంతలు మంగ
ళార్తులను గౌరవమిచ్చె ప్రసన్న... 161

ఉ. రాముఁడు విల్లునంబులును రంజిలుతమ్మునిచేతికి
చ్చినఁ, భామయుపచ్చి రావణునిభామినిబాష్ప
జలంబు కారఁగా,ప్రేమను బ్రాణవల్లభునిపేర్మి
యుఁ జూచుచు మీఁదవ్రాలియుఁ,గామినియే
డ్చె రాముఁడును గాంచెను దాని ప్రసన్న...

ఉ. అన్నకు రావణాసురుని కగ్నివిధానము నాచ
రించి యా,సన్నుతగాత్రినంపె నలసర్వజనంబుల
తోడ లంకకుఁ,సన్నుతులైనవానరుల జాగ్రతఁ
జెప్పెను రాఘవుండు నా, సన్నులఁజూచి యిట్టు
లనె సారెకుఁ ప్రేమ ప్రసన్న... 163

ఉ. భీకరలంక నిప్పుడు విభీషణుఁ బట్టముఁగట్టి రమ్మ
నెఁ,బ్రాకటవానరాధిపులఁ బావనిమున్నగువా
రలఁ గడుఁ, భీకరమొప్పఁ దోడ్కొనుచు
భేరిమృదంగములుం జెలంగఁగా,శ్రీకరమైనరాజ్య
మును జెల్వుగఁగట్టె ప్రసన్న... 164

ఉ. అప్పుడు సీతఁ దెమ్మనుచు నాజ్ఞయొసంగెను

రాఘవుండు నా, కప్పురగంధి దోడుకొని గ్రక్కు-
నవచ్చె విభీషణాదులుఁ, జెప్పఁగఁజూచి రాఘ
వులు తెంపుగమాటలనాడె లక్ష్మణా, చెప్పుము
సీతనగ్నిఁజొర సీతయుఁబూనె బ్రసన్న... 165

ఉ. రాముని చిత్తముం దెలిసి రంజిలునగ్నిని సీతచొ
చ్చియుఁ, భామను వీతిహోత్రుఁడును బట్టిఁ
గరంబులఁ దెచ్చి యప్పుడే, స్వామికి నప్పగించి
నను సంభ్రమమందిరి దేవదానవుల్, ప్రేమతోఁ
గన్నతండ్రి మునిపీఠముఁ జొచ్చె బ్రసన్న...

ఉ. వచ్చినవారికందఱికి వందనమప్పుడు చేసె రాముఁ
డు, న్వచ్చినవారు సీతకును వారకబుద్ధులుసెప్పి
రెంతయుఁ, ముచ్చటదీఱ నాముదిత మోదము
నందరిఁ జేర్చి యప్పుడే, సచ్చరితుండు రాఘవుఁడు
సమ్మతి నుండె బ్రసన్న... 167

ఉ. వేగమయోధ్యఁ జూడవలె వేకువ లేచియు మూఁ
డునాళ్లకుఁ, ఏగతిఁ జేరవచ్చు నన నిష్టముతోడ
విభీషణుం డనుఁ, పోఁగలయట్టి పుష్పకము పూ
ర్వమునుండియు నున్నదిచ్చటఁ, శ్రీగలభాగ్య
శాలియది శీఘ్రముచేరు బ్రసన్న... 168

ఉ. తెమ్మనె రామచంద్రుఁడును దెచ్చి విభీషణుఁ
డంత వేడుకఁ, సమ్మతి సీత రాముఁడును సైన్య

ము లక్ష్మణుఁడేగ నంతయుఁ, గొమ్మయుఁ జూ
చుచుండఁగను కోరికదీఱఁగ రాముఁ డంతవే,
గమ్మున వార్తలం దెలుపఁ గాంచెను సీతప్రసన్న.

ఉ. లేచటుతర్లెఁ బుష్పకము లెక్కయు లేనటువంటి
దూరముఁ, జూచినవృక్షముల్ నదులు పూర్వ
మువచ్చినయట్టిమార్గముఁ, జూచియు దాను
నాతికిని జూపుచు రాముఁడు వేడ్కలన్నియుఁ,
యోచనఁజేసి రందఱును యోధులుగూడి
ప్రసన్న... 170

ఉ. చేరిరి చిత్రకూటమును జెల్వుగ రాముఁడు
మున్నుగాఁగ నా, ధీరుఁడునైనతమ్మునకుఁ దెల్పఁగ
మారుతి నాతఁడేగి యా, భారతరాజ్యభూమికిని
భద్రములన్నియు కేకయాత్మజుం, గూరిచిచెప్పె
నాతఁ డతికూర్మివహింప ప్రసన్న... 171

ఉ. తల్లుల దమ్ములం గనియు దండములం బిగికౌఁగి
లింతలఁ, జల్లఁగఁగ్గలై సీతకును జక్కఁగ మ్రొ
క్కినరాష్ట్రపుంజనుల్, చల్లనిచూపులం దనిపె
జానకి వారల నంత దేవతా, వల్లభుఁడాదిగా జను
లు వారకమెచ్చె ప్రసన్న... 172

ఉ. వచ్చి రయోధ్యపట్నముకు వాద్యములుం జెలఁ
గంగ వేడుక, న్వచ్చిరి యిష్టభృత్యులును వానర

సేనలు గొల్వఁగా మఱి,నవ్వచ్చియు నిల్లుఁజొచ్చి
యును వారిజనాభుఁడు కొల్వుదీర్పఁగా, వచ్చిరి
దేవసంఘములు వర్ణనఁజేయ ప్రసన్న... 173

ఉ. రాముఁడు సీతఁ గూడుకొని రంజిలుచు న్మణిపీ
ఠమందునన్, ప్రేమతో నున్న నందలును బ్రీతి
యొనర్పుచుఁ గొల్చుచుండఁగా,రాముని జూడ
వచ్చిరటు రాజకుమారులు బంధువర్గమున్,భూ
మినిగల్గు నాప్రజలు పొందుగ రాఁగఁ బ్రసన్న.

చ. గురువువసిష్ఠుఁ గౌశికుఁడు కూరిమిబంధుఁడు ఋ
ష్యశృంగుఁడున్, వరుసమునీంద్రవర్గములు వచ్చి
రి వేడ్కను రాముఁజూడఁగా,సరసులు రాజవల్ల
భులు సత్కులజాతులు బంధువర్గమున్, గరుణ
తోవచ్చి యాజనకుఁ గ్రక్కున జూడఁ బ్రసన్న.

చ. పరువడి బ్రహ్మనారదులు పార్వతిఁగూడి సదాశి
వుండునున్,మఱి శశిదేవి యింద్రుఁడు విమాన
ములెక్కియు వేడ్కఁజూచుచున్, మెలువడిరం
భయూర్వశియు మేనకముందుగ నాట్యమాడఁ
గాఁ, దరుణులుచూచి వేడుకలఁ దర్లకఁ జూచె
ప్రసన్న... 176

ఉ. కిన్నరయక్షముఖ్యు లొకగీతముఁ బాడఁగ నష్ట
దిక్కులున్, జెన్నుగ మండలాధిపులు సిద్ధులు

సూర్యశశాంకు లెల్లరుఁ, †సన్నను నావిమాన
ములఁ జక్కఁగఁ జూచుచునుండ నెవ్వరుఁ,
‡తన్నట వేడ్కఁ జూచు టది తప్పకయుండె
ప్రసన్న... 177

ఉ. మింట మృదంగనాదములు మిక్కుటమై చెలఁ
గంగ నిక్కడఁ, దంటబలీయమేళములు తప్పె
టబూరలు పిల్లఁగ్రోవులఁ, మింటనె గప్పి పు
ష్పముల మేదినినాముని శేషభాషలఁ, అంటె
చెలంగుభాషణుల సంతటనప్డు ప్రసన్న... 178

ఉ. వీథు లలంకరించిరటు విప్రులు రాజులు వైశ్యశూ
ద్రులుఁ, వీథుల తోరణంబులును వింతవినోద
ము లైనచోద్యముల్, వీథులఁ బచ్చికస్తురియు
వేడుకగా మఱి మేళవాద్యముల్, వీథులవీథు
లం బ్రజలు వేడ్కలు సేయఁ బ్రసన్న... 179

ఉ. ఏనుఁగులు న్రథంబులును నెక్కుడుగుఱ్ఱములు
న్మహాస్త్రముల్, మానుగ మంత్రివర్గమును
మంచిపదాతులు సర్వసేనలుఁ, వానరసేనలు
న్మఱియు వారలభేదము భల్లుకంబులుఁ, దాన
వమూఁకలుం గదిసి తర్లకయుండెఁ బ్రసన్న...

† సరగున. ‡ తిరుణాలు.

ఉ. అప్పు డయోధ్యపట్టణమున న్నియునొప్పెను రా
జధానియై, యెప్పుడు చూచినన్ భ్రమసి
యెవ్వరినెవ్వరితాముచూచుచున్, అప్పురమం
దుఁ గాంతలను నందముఁజూచిన జందమామ
నున్, దప్పులఁబట్టువారు పరతంత్రులుకారె
ప్రసన్న... 181

ఉ. అందు వసిష్ఠకౌశికులు నత్రిమహామును లాదిఁ
బెద్దలు, న్నందఱుఁగూడి రామునకు నన్నిట మం
చిదినంబుఁ జూచియున్, బొందుగ జైత్రశుద్ధ
మగుపూర్ణిమ సుత్తమవేళ వేడుకన్, అందముఁ
జూచి పట్టమును నప్పుడు గట్టి ప్రసన్న... 182

ఉ. తెచ్చి సముద్రతీరమున ధీరతతోడుత నాంజనే
యులున్, ముచ్చటఁ బూర్ణకుంభముల ముంద
ఱగా మునులంతగూడియున్, అచ్చట సీతరా
ములకు నందఱుగూడియుఁ దానమార్చిరా,
నెచ్చుగఁ జేయువేడుకల నెంతనిచెప్ప ప్రసన్న.

ఉ. కట్టిరి బాసికంబులను గంజదళాక్షికి రామచం
ద్రునకున్, బెట్టిరి చేతముద్రికను భీకరమై జగ
మంత వెల్గఁగాఁ, బట్టిరి ఛత్రచామరము ప్రాంత
ములందునఁ దమ్ములున్ హితుల్, కట్టిరి చేత
కంకణము కాపుమటంచుఁ బ్రసన్న... 184

చ. భరతుఁడు లక్ష్మణుండు నెలబాలుఁడు శత్రువి
హంత భక్తితో, నిరవుగనిల్చి రాఁ బిదప నెంత
యు రాముఁడు సత్కటాక్షముల్, పఱపెను వారి
యందు సతిపంకజనేత్రులఁ జూచెఁ బ్రేమతో, సర
సముతోడ నిష్టముల సాగఁగఁ జేసి ప్రసన్న...

ఉ. సన్నిధినున్న యట్టియలసాధ్వికి కోసలరాజపుత్త్రి
కిన్, పన్నుగ నాసుమిత్త్రకును బాగుగ దండముఁ
బెట్టి రందఱున్, అన్నము భక్ష్యభోజ్యములు
నందఱుగూడియు నారగించిరా, యన్నిట సౌఖ్య
మంది రలయాప్తులుగూడి ప్రసన్న... 186

చ. గురువులకున్ సువిప్రముఖకోటికి రాముఁడు
మ్రొక్కి నిల్చియున్, అరయఁగ మీకటాక్ష
ముచ నన్నిశుభంబులుగల్గె వేడుకన్, దిరముగ
దివ్యవస్త్రములు దివ్యసుమాళులు కోర్కెతీఱఁ
గా, సరగునఁ బంచె నందఱికి సారెకు రాజు
ప్రసన్న... 187

చ. గురువు వసిష్ఠుఁ డత్రిమునికూటములెల్లను వేద
మూర్తులై, పరగెడువారి రాఘవుఁడు భక్తిని
మ్రొక్కిన యంతలోపలన్, వరమునివర్గమెల్లఁ
గృప వర్ధిలుమంచును దీవనంబిడన్, సురుచిర
మందహాసమున శోభిలె నంత ప్రసన్న... 188

ఉ. సీతనుగూడి రాఘవుఁడు చిత్తజుకేలిని నోలలాడుచుం, బ్రీతిగనుండి రిద్దఱును బ్రేమను మించి సమానరూపులై, ఖ్యాతిగఁ దమ్ములందఱును గాంతలుగూడి సుఖంబునొందియుణ్, సీతకు రామచంద్రులకు సేవలుచేయు ప్రసన్న... 189

చ. దయగలవాఁడు రాఘవుఁడు ధన్యుఁడు రాముఁడు రాజ్యమేలఁగా, భయమును లేదు కల్మి యెడఁబాయదు సర్వవిధంపుభాగ్యముల్, ప్రియమును ధర్మము న్గలిగి ప్రేమఁబెనంగి మహావిభూతులై, ప్రియసఖులుణ్ సఖీజనులు పేర్మిని గూడి ప్రసన్న... 190

ఉ. అట్టిదయాపరుండవని యంజలిఁజేసితి నన్నుఁగావుమీ, గట్టిగ లేదుపామ్మనక కంజదళాక్షకటాక్షముంచుమా, పట్టిననాదుదుర్దశలఁ బాఱఁగఁ గొట్టి భయంబుదీర్చుమా, చుట్టములేదు నిన్విడువఁ జుట్టము నీవె ప్రసన్న... 191

ఉ. దాసజనానుపోష ఫలదాయక పాయక రావె కావవే, యీసమయాన నీకరుణ యించుక నిల్పుము జాగుసేయకణ్, దాసులదాసదాసుఁడను ధన్యునిగా నను జేయువేగమే, మాసరివారిలో మిగుల మన్నన నిమ్ము ప్రసన్న... 192

ఉ. కీడొనరించిన న్మఱియుఁ గ్రిందికిఁ ద్రోయక
నన్నుఁగావవే, వేఁడఁగ నీవె కాక మఱివేఱెవ
రింకను దిక్కు దేవ నా,తోడ వసించి యెప్పటికిఁ
దోడును గావఁగదయ్యదేవ నా, పోఁడిమిఁ
దీర్చి బంధువునిపూనిక దీర్పు ప్రసన్న... 193

ఉ. కింకరులెల్లఁగూడి యొకకీడుదలంచక వేసియు
న్నయీ, సంకెలలూడఁదీసి నను జక్కఁగ మొ
క్కలిపీడ్చితెచ్చి యో, పంకజనాభ నీకృపకుఁ
బాత్రుఁడ నే గరుణించి యేలి యో, వేంకట
శైలనాథ గృపవేడుకఁగావు ప్రసన్న... 194

ఉ. ఇంతట మ్రొక్కిన న్విడచి యీప్సితమున్ రఘు
నాథుఁ డిచ్చె నే, సంతసమంది యీసుకవి సన్ను
తుఁడైన ప్రసన్నరాఘవుం, డెంతమహాత్ముఁడైన
మఱియెంతటివారయినన్ మహాత్మునిన్, బంత
ముతోడ గొల్చియును భద్రములందు ప్రసన్న.

ఉ. శ్రీకరమైనరామునకు సీతకుఁ బ్రీతిగఁ బద్యవా
క్యముల్, బ్రాకటమైనవైభవము భాష్యముగో
రికఁ జెప్పికొంటిఁ దాఁ, జేకొని చిత్తగించు మిఁక
చెల్వముగా నెడబాయకుండుమీ, లోకము
లోన నీవె గతి లోలుఁడప్రోవు ప్రసన్న...

ఉ. మంగళమౌను రామునకు మంగళమౌ ననుఁగన్న
తల్లికిన్, మంగళమౌను లక్ష్మికిని మంగళమౌ
మముఁగన్నసీతకున్, మంగళమౌను జానకికి
మంగళమౌ ననుబాయకుందుమీ, మంగళ
మౌను నిద్దఱికి మమ్మునుగావు ప్రసన్న... 197

ఉ. ఛందము లక్షణంబెఱుఁగఁ జక్కఁగ ధైర్యము
తోడఁ జెప్పితిన్, తొందరలేదు తప్పు లనితోఁ
చినఁగాని రఘూత్తమాది మీ, యందఱిపాద
భక్తుఁడను లక్ష్మణపుత్త్రుఁడ నారసింహుఁడన్,
వందన మాకవీంద్రులకు వారిజనాభ ప్రసన్న.

ఉ. రాజులమేటిరాజు రఘురాజమహాత్మకు రాజ
మాన్యుఁడై, రాజితకీర్తిశాలి యగు రాముఁడు
రాజ్యపుప్రేమయుక్తుఁడై, యీజగ మేలు రాజు
లకు నిష్టజనంబులు నింపొనర్చె మా, భూజన
భక్తరతుఁడయి భూతిఁదలంచె ప్రసన్న రాఘవా.

ప్రసన్న రాఘవశతకము సంపూర్ణము.

---

## పీ ఠి క.

రామతారకశతకము రచించినకవిపేరు నివాసము కాలము నెఱుంగినగునాధారము లీశతకమున లేవు. ఈశతకములో తొంబది తొమ్మిది పద్యములు మాత్రమె కనుపించుటవలన నింకను గొన్నిపద్యములు లభింపవలసియున్నవనియుఁ బ్రత్యంతర సహాయమునఁ బరిశోధించిన కడమపద్యముల తోఁబాటు కవిచరిత్రముగల పద్యముగూడ లభించునేమో యని తోఁచుచున్నది. భాషాభిమానులగు సోదరులలో నీశతకమాతృకలు గలవారు మిగిలినపద్యములనుజూచి పంపుదురేని కృతజ్ఞతాపూర్వకముగఁ బరిగ్రహించి ప్రకటించెదము.

ఈశతకము వ్రాసినవాఁడొక పరమభక్తుఁడు. శ్రీరామనామామృతపానముపై మక్కువదీఱకతనకు వచ్చిరానికవితతో నీశతకమురచించి కృతార్థుఁడయ్యెను. ఈశతకకర్త కవితానైపుణ్యము గలవాఁడు కాఁడు. భావములగ్రహించి సుశబ్దముల సమకూర్చి కవితాసుందరి నలంకరించుటయే కవికర్తవ్య

మని యీాకవితలంపక తనకు భక్తిపారవశ్యమున నెటులఁ దోఁచిన నటులఁ బద్యములు వ్రాసియున్నాడు. కవి ఛందోనియమములు వ్యాకరణ నిబంధనలు పొత్తిగాఁ బాటింపక యెటులో పద్యములు వ్రాసి తన భక్తిభావనమాత్రము ప్రకటించుకొనెను గాన నిందుఁ గొన్నిచోటుల నపశబ్దప్రయోగములు గలవు. వానిని సవరింతుమేని గణనియమము చెడి పద్యము నడకపోవుచున్నదిగాన వాని సంస్కరింప వీలైనది కాదు.

రామభక్తులు పెక్కండ్రీశతకము భక్తిశ్రద్ధలతోఁ బఠించుటఁజూచి జనాకర్షణమగు నీశతకమును కవ్యభిప్రాయానుగుణముగ ముద్రించితిమి.

నందిగామ.
5-3-26.

ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు, శతావధానులు.

శ్రీ ర స్తు.

# శ్రీరామతారకశతకము.

---

సీ. శ్రీరామనామమే శృంగారవర్ణన
  సకలశాస్త్రవివేకసాధనంబు
శ్రీరామనామమే శృంగారచారిత్ర
  సకలదానవిశేషసంగ్రహంబు
శ్రీరామనామమే శృంగారధ్యానంబు
  సకలతీర్థాదృతసత్ఫలంబు
శ్రీరామనామమే శృంగారచింతన
  సకలమంత్రరహస్యసమ్మతంబు
గీ. అనుచు బ్రహ్మాదిసురలెల్ల ననుదినంబు
భక్తితో రామమంత్రంబు పఠనజేసి
మ్రొక్కి సేవించి చెందిరి మోక్షపదవి
రామతారక దశరథరాజతనయ. 1

సీ. శ్రీరామ నాయొక్క జిహ్వపై మీనామ
  యక్షరబీజము లమరవ్రాసి
వాని నాపలుకుల వసియింపఁగాఁ జేసి
  శత్రుసంహారంబు సలుపఁ బూని

యుక్తియు బుద్ధియు నూహ దాసున కిచ్చి
భక్తితో మీపాద భజనయందు
నాసక్తి బుట్టించి యమృతసారంబెల్లఁ
దారకశతకంబు త్వరితముగను
గీ. బలుకు పలికించు వేవేగ పరమపురుష
యింపుగఁ బఠించువారికి నిహము పరము
దాతవై యిచ్చి రక్షించు ధన్యచరిత... ౨

సీ. నరులార సేయుఁడీ నారాయణజపంబు
మ్రొక్కి సేవించిన మోక్షకారి
జనులార పల్కుఁడీ జయరామనామంబు
కార్యార్థములకెల్లఁ గల్పవల్లి
ప్రజలార సేయుఁడీ పంకజాక్షునిపూజ
సాయుజ్యపదవికి సాయకారి
మానవబుధులార మఱువక దలఁచుఁడీ
పరమాత్మశబ్దంబు పాపహారి
గీ. పెక్కుమార్గంబులను బోక ప్రేమచేత
భక్తితో రామమంత్రంబు పఠనజేసి
మ్రొక్కి సేవించి చెందుఁడీ మోక్షపదవి... ౩

సీ. తలఁచుఁడీ జనులార తారకనామంబు
గోవిందనామమే కొల్లగొనుఁడి
కృష్ణనామం బెపుడు కీర్తనజేయుఁడీ
మాధవనామంబు మఱువకండి

హరినామకీర్తన లందందు సేయుఁడీ
వాసుదేవస్మృతి వదలకండి
విష్ణుసంకీర్తన విడువక సేయుఁడీ
నరసింహనామంబు నమ్ముకొనుఁడి
గీ. కలియుగంబున జనులార కష్టపడక
నామకీర్తనపరులౌట నయముసుండి
మఱలజన్మంబు గాంచరు మహిని మీరు... 4
సీ. ఓపిరోపకనైన నొక్కసారైనను
వెఱచి వెఱపు లేక వేడ్కనైన
'హా రామ! హా కృష్ణ! హా యచ్యుతా!' యని
భయముతోనైనను భక్తినైనఁ
బ్రేమతోఁ బుత్త్రులపేరు బెట్టియినను
బిలుకను బెంచైన చెలిమినైన
భువిలోన కీర్తికిఁ బురము గట్టియినను
వనతటాకములుంచి వాంఛనైన
గీ. నీదునామంబు బలుకుట నిఖలసుఖము
గలుగు వర్ధిలు పురుషుండు ఘనత మెఱయ
జన్మకర్మంబు లతనికిఁ జెప్పనేల... 5
సీ. నీనామమే కదా నిఖిలశాస్త్రములెల్ల
పరలోకప్రాప్తికిఁ బట్టుకొమ్మ
నీనామమేకదా నిఖిలజీవులకెల్ల
నఖిలవైభవముల కాలయంబు

నీనామమేకదా నిర్మలాత్ముల జేయ
నజ్ఞానజీవుల కౌషధంబు
నీనామమేకదా నిశ్చలభక్తుల
కార్యసిద్ధికి నాదికారణంబు
గీ. తునిమి ఛేదించు దారిద్ర్యదుఃఖమెల్ల
వాసికెక్కించు సంసారవార్ధి గడుప
శాశ్వతంబైనపదవిచ్చు జగతియందు... 6
సీ. హరిరామ నీవు నాయంతరంగమునందు
సాక్షివై యుండుట సత్యమైనఁ
బావనంబాయెను బాంచభౌతికమెల్లఁ
గాయంబు జలముల గడుగ నేల
మమకార ముడిగిన మానును కర్మంబు
వేధించువేల్పుల వెఱువనేల
విత్తక్షీణంబైన పీడును గర్మంబు
మోహంబు లుడిగిన మోక్ష మదియె
గీ. నిష్ఠ యీరీతి నిజముగా నిలిచెనేని
మనసు గట్టిన చాలదా మాయగెల్వ
భ్రాంతు లుడిగిన బ్రహ్మంబు బట్టబయలు... 7
సీ. కామితార్థము నిచ్చు కామధేనువుగల్గ
వెలబెట్టి గోవుల వెదక నేల
మరణంబు లేకుండ మందు దాఁ గల్గఁగా
సభయులై యమునికి జడియ నేల

కల్యాణ మొసఁగెడి కల్పవృక్షము గల్గ
వనపుష్పఫలముల వాంఛ యేల
అమరులకబ్బని యమృతంబు సేవించి
మధురసంబుల మీఁద మమత లేల.
గీ. తారతమ్యంబు లేరీతి తథ్య మనుచు
భజనజేతురు మిమ్ముల బ్రహ్మవిదులు
స్తుతులు జేయుదు రెప్పుడు సురలుగూడి... 8
సీ. భూపతి యైపుట్టి భూమి యేలఁగవచ్చు
శత్రుసంహారంబు సల్పవచ్చు
చౌషష్టివిద్యలు చదివి చెప్పఁగవచ్చు
బహుమంత్రసిద్ధులఁ బడయవచ్చు
కోటికిపడిగ_త్తి కొల్లబెట్టఁగవచ్చు
సకలమంత్రంబులు చదువవచ్చు
గంగాదినదులకుఁ గ్రక్కునబోవచ్చు
ను_త్తమాశ్రమముల కుఱికవచ్చు
గీ. మగుడ జన్మంబు రాకుండ మాయగెలుచు
విద్య సాధించి శత్రుల విఱచికట్టి
అరసి బ్రహ్మంబు గనుగొను టంతెగాక... 9
సీ. సతమని దేహంబు సంతసిల్లఁగ నేల
నిలుచునా యిది వట్టి నీరుబుగ్గ
కాయంబు నిలువదు కడు బ్రహ్మకైనను
బ్రాణంబు నిలుచునా భ్రాంతిగాక

విభవంబు జూడకు విశ్వంబులోపల
సంపద లెప్పుడు సతముగావు
పరులు నావారని పాటింపఁజెల్లదు
వెళ్లంగఁ దనవారు వెంటరారు
గీ. అనుచు తలపోసి బుధులెల్ల యాశ లుడిగి
మోహజాలంబు లోఁబడి మోసపోక
నిన్ను సేవించుచుందురు నీరజాక్ష... 10
సీ. ఆవేళ యమునిచే నాపదబడలేక
జడిసి యిప్పుడ మిమ్ము దలఁచుకొంటి
అపరాధి నపరాధి నపరాధి నని మ్రొక్కి
యాశ్రయించితి మిమ్ము నప్రమేయ
శరణన్నమాత్రాన శంకలన్నియు మాని
భయనివారణమాయె భజనచేత
నింత సులభుఁడగు టెఱుఁగనైతినిగాక
యేమరియుందునా యెఱిఁగియున్నఁ
గీ. దెలిసె మీకృప నాకెల్ల తేటపఱచె
మర్మ మెఱిఁగితి మీకీర్తి మహిమ వింటి
గట్టుదాఁటితి నీవె నాగతియటంటి... 11
సీ. పరము దప్పక ధర్మవర్తన వర్తించి
వేదోక్తమర్మముల్ వెదకి చూచి
శిష్టశీలుర యొక్క శుశ్రూషణము చేసి
సర్వప్రదానంబు సంగ్రహించి

శాంతదయాగురుస్వాముల మది నుంచి
హరిజేరు మార్గంబు సరవి నడిగి
వారిచేఁ బడసిన వరమంత్రరాజంబు
పరచిత్తుఁడనుగాఁ బఠనజేసి
గీ. మఱచి యేమియుఁ గోరక మర్మమెల్ల
హరికి నర్పించినట్టి యా యధికపుణ్యు
మరసి రక్షించు టదియెల్ల నంతెగాక... 12
సీ. హరినామకీర్తన లానాడుచేసిన
నావేదనత్రయ మంటకుండు
నీక్షించి మదిలోన నినకులోత్తమయన్న
నీషణత్రయములు నీడ్వకుండు
దశరథాత్మజుఁ గూర్చి ధ్యానంబు జేసిన
దారిద్ర్యదోషముల్ తలఁగియుండు
జానకీపతిమంత్రజపము నొనర్చిన
జన్మకర్మంబులు చెందకుండు
గీ. భక్తిపుష్పంబు పక్వమై పండుఁగాక
అమితకాలంబు లిన్నాళ్లు హరణమయ్యెఁ
బాతకుఁడ నన్ను రక్షించు పరమపురుష... 13
సీ. మఱిమఱి జిహ్వకు మాధుర్యమైయుండు
మనసు మీస్మరణకు మఱిగియుండు
వీనులు మీకథ ల్వినవేడ్క లయియుండుఁ
జూడ్కులు మీరూపు చూచుచుండు

బుద్ధి మీాఁతత్త్వంబు పొందఁగోరుచునుండుఁ
బూజింప హస్తము ల్పొంగుచుండు
గామ్యంబు మోక్షంబు కాంక్ష జేయుచు నుండు
భక్తి యీరీతిని బ్రబలుచుండు
గీ. ఇతరనామంబు పలుకుట కింపుగాదు
సతతమును నీదు నామంబు సంస్తుతింప
హర్ష మానందమగుచుండు ననుదినంబు... 14
సీ. నీప్రభావంబులు నిగమంబులే కాని
పలికి వర్తింప నా బ్రహ్మవశమె
నీనామమధురుచి నీలకంఠుఁడె గాని
వేయికన్నులుగల వేల్పువశమె
నీపాదనఖముచే నిర్భిన్నమయినట్టి
బ్రహ్మాండకటక మెవ్వారికి వశమె
నీకీర్తిఁగొనియాడ నిశ్చలులయినట్టి
నారదాదులుగాని నరులవశమె
గీ. యెన్నఁగూడదనితారల నెన్నవచ్చు
జలధికణముల గణుతించి చెప్పవచ్చు
పరమతారకమంత్రంబు పలుకవశమె... 15
సీ. నిన్నాశ్రయించితి నీవాఁడ ననియంటిఁ
బాహి మాం కోదండపాణి యంటి
రఘుకులదీపక రక్షించు మనియంటిఁ
గరుణసాగర నన్ను గావుమంటి

దైవము నీవని దిక్కు నీవనియంటి
దుష్కృతకర్మముల్ ద్రుంచుమంటి
అఖిలలోకారాధ్య యఘయమిమ్మనియంటి
నీప్సితార్థము లిప్పు డియ్యుమంటి
గీ. అడుగ నెంతయు వితరుల నమరవంద్య
పరుల యాచింప నాకేల పరమపురుష
దాతలకునెల్ల దాతవో దైవరాయ... 16

సీ. యెచ్చోట హరికథ లచ్చోట సిద్ధించు
గంగాదితీర్థముల్ గన్నఫలము
ఎచ్చోట సత్యంబు లచ్చోట నిత్యంబు
లక్ష్మిసరస్వతు లమరియుండు
రెచ్చోట ధర్మంబు లచ్చోట దైవంబు
జయము నెల్లప్పుడు జెందుచుండు
నెచ్చోట భక్తుండు నచ్చోట హరియుండు
నిధులఫలంబిచ్చు నింటనుండు
గీ. నీదుభక్తునిగుణములు నిర్ణయింప
ఫలముభాగ్యము నింతని ప్రస్తుతింప
వశమె యెవ్వారికైనను వసుధలోన... 17

సీ. పదివేలగోవులు ప్రతిదినం బొసఁగిన
పంచభక్ష్యాన్నము ల్పరగనిడిన
గ్రహణపర్వములందు గజదాన మొసఁగిన
నశ్వదానంబులు నమితమైనఁ

బెక్కుయాగంబులు ప్రేమతోఁ జేసిన
నితరధర్మంబులు నెన్నియైనఁ
గీ. దుల్యమగునట్టి మీనామతుల్యమునకు
హస్తిమశకాంతరముసాటి యవునుగాక
యింతఫలమని వర్ణింప నెవ్వఁ డోపు... 18
సీ. నాపాలిదైవను నామనంబున నిన్నుఁ
దలఁచి సేవించెద తండ్రివనుచు
నామూల ధనమని నమ్మి యుప్పొంగుచు
దండ మర్పించెద దాతవనుచు
నాతోడు నీవని నవ్వుచుఁజేరుచు
రంజిల్లుచుండెద రాజవనుచు
నాకును గురుఁడవై నాతప్పు లెన్నక
కాచి రక్షింపఁగఁ గర్త వనుచుఁ
గీ. పెంచి పోషించు కాపాడు పెద్దవనుచుఁ
బుత్రుపై ప్రేమ తండ్రికిఁ బుట్టినట్లు
కృపకు పాత్రునిగాఁ జేసికొనుము దేవ... 19
సీ. బహుజన్మములనెత్తి బాధనొందఁగనేల
పరమపురుషునిగొల్చి బ్రతుకవలయు
శేషవాసనచేతఁ జిక్కి వగవ నేల
శ్రీనివాసునిపూజ సేయవలయు
విషయభోగంబుల విఱ్ఱవీఁగఁగనేల
విష్ణుచరిత్రంబు వినఁగవలయు

అస్మదాదులకొంటి కస్మృతమాడఁగనేల
హరినామకీర్తన లాడవలయుఁ
గీ. దనువు తథ్యంబు గాదని తత్వవిదులు
సంతతధ్యానులై మిమ్ము సంస్మరించి
నిరతమును గొల్చుచుందురు నీరజాక్ష... 20
సీ. ఈప్సితార్థము లిచ్చి యిహమందు రక్షించి
పరమందు మీసేవప్రాప్తి జేసి
అగణితం బైననీయాశ్రయవంతుల
గణుతించి గ్రక్కున గారవించి
భక్తుని కృపజేసి పరిపూర్ణముగ నుంచి
నిజముగా దాసుల నిర్వహించి
ప్రియముతో బిలిచినఁ బ్రేమతోఁ బొడసూపి
యభయహస్తము లిచ్చి యాదరించి
గీ. యొరుల యాచింప సేవింప నోర్వలేక
వెదకి కనుగొంటి నాపాలివేల్పువనుచు
మగుడ జన్మంబు లేకుండ మందుగోరి... 21
సీ. మూఢులరక్షించి మోక్షమిచ్చుట కీర్తి
ద్రోహులఁ గాచుట దొడ్డకీర్తి
పాపకర్ములకెల్ల పదమిచ్చు టదికీర్తి
ఆత్మసంరక్షణ యమితకీర్తి
నీవాఁడవనియంటె నిర్వహించుట కీర్తి
ప్రేమ దీనులఁ బ్రోవఁ బెద్దకీర్తి

సామాన్యజీవుల సంతసించుట కీర్తి
మునుల రక్షించుట ఘనతకీర్తి
గీ. పెద్దలైనట్టి సంసారపామరులకు
నరసి సాయుజ్యపదమిచ్చు టంతెకాక
యనుచు సేవింతు రీరీతి ననుదినంబు... 22

సీ. జంతుజాలమునందె జన్మించి కొన్నాళ్లు
ఇతరజన్మంబుల నెత్తియెత్తి
మానవదేహంబు మఱిమఱి యెత్తుచు
నన్నివర్ణంబుల నరసిచూచి
యేపుణ్యవశమున నీజన్మ మెత్తితి
విప్రదేహం బిప్డు విమలచరిత
ఈజన్మమందైన నిప్పుడు నీసేవ
మానక జేసెద మౌనివంద్య
గీ. వేదశాస్త్రంబులన్నియు వెదకిచూచి
తప్పుగాకుండ నడువ నాతరముగాదు
శరణుజొచ్చితి నిఁక నాకు శంకయేమి... 23

సీ. దశరథాత్మజ నీకు దండంబు దండంబు
వైదేహిపతి నీకు వందనంబు
కౌసల్యసుతనీకుఁ గలుగుఁ గల్యాణంబు
జానకీపతి నీకు జయము జయము
అమరవందిత నీకు నాయురారోగ్యముల్
శరధనుర్ధర నీకు శరణుశరణు

నీలమేఘశ్యామ నీకుసాష్టాంగంబు
సురరాజపూజిత శుభముశుభము
గీ. అనుచు వర్ణించి భజియించి యాత్మదలఁచి
నిలచి సన్మార్గవంతుండు వి న్నెలుంగు
నతని గనుగొన్నఫల మెన్న నావశంబె... 24

సీ. భానువంశమునందుఁ బ్రభుఁడవై జన్మించి
యఖిలవిద్యల నెల్ల నభ్యసించి
తాటకి మర్దించి తపసియాగముగాచి
శిలను శాపముమాన్పి స్త్రీని జేసి
శివునిచాపము ద్రుంచి సీతనుబెండ్లాడి
పరశురాముని త్రాణ భంగపఱచి
తండ్రివాక్యమునకై తమ్మునితోఁగూడి
వైదేహితోడను వనముకరిగి
ఖరదూషణాదుల ఖండించి రాక్షస
మారీచమృగమును మడియ జేసి
రాక్షసరాజగు రావణుఁ డేతెంచి
సతిగొనిపోవంగ శాంత మలర
సుగ్రీవుగనుగొని సుముఖుఁడై యప్పుడు
వాలిని వధియించి వరుసతోడ
రాజ్య మాతనికిచ్చి రాజుగాఁ జేపట్టి
కిష్కింధ యేలించి కీర్తివడసి

గీ. వాయుసుతుచేత జానకివార్త దెలిసి
తర్లి సేతువు బంధించి త్వరను దాఁటి
రావణానుజు కభయంబు రయమునొసఁగి
ఘోరరణమందు రావణుఁ గూలఁ జేసి
యతనితమ్ముని రాజుగా నమరఁజేసి
సతిని జేకొని సురలెల్ల సన్నుతింప
రాజ్యమేలి తయోధ్యకు రాజ వగుచు... 25

సీ. దేహంబు విడుచుట దినము తా నెఱుఁగఁడు
కర్మంబువచ్చుటఁ గానలేఁడు
మూఁడవస్థలలోన మునిఁగి తేలఁగలేఁడు
ఆఱువైరుశత్రుల నణఁచలేఁడు
మగువల రతులందు మమతమానఁగలేఁడు
వాఁడు వీఁడనిపల్కు వదలలేఁడు
అభిమానరహితుఁడై యాసలాపఁగలేఁడు
ఇంచుకహరిమాయ యెఱుఁగలేఁడు

గీ. నందు బ్రహ్మంబు తానగు టరయలేక
బుద్ధిహీనులకడకేఁగి పొందుఁజేసి
యుదరభరణంబు గానక యుర్విలోన:... 26

సీ. నీతి యెఱుంగవు నిందకు నోడవు
చంచలం బెప్పుడు చెడ్డగుణము
వాయువేగముకంటె వడిగలవాఁడవై
పాఱెద వెప్పుడు పడుచుతనము

పేరుపే రొక్కటి పిలుచుట యొక్కటి
చేరువకర్మంబు చెప్పలేవు
పుత్రమిత్రాదులే పుణ్యలోకం బని
సద్గతి యెఱుఁగవు జడుఁడ వగుచు
గీ. మనసు నీరీతి వర్తించు మందమతివి
నడచి నగరంబు కేగుట నయమె నీకు
ముందు తెలియక విహరించి మోసపోక... 27

సీ. యమునిచే బాధల నెట్లోర్వఁగావచ్చు
నగ్నికంబంబున గంటగట్టి
పాపంబు నానోటఁ బల్కించి యొప్పించు
చిత్రగుప్తునిబిలచి చెప్పుమనుచుఁ
దప్పక వారు నాతప్పులన్నియుఁ జెప్ప
నుగ్రుఁడై దూతల కొప్పగించి
బాధించువేళ నాబ్రతు కేలొకో యని
యేడ్వంగ నెవ్వరు నచటరారు
గీ. తెలిసి వర్తించు మిప్పుడే తెలివి గలిగి
యనుదినంబును శ్రీరాము నాశ్రయించి
మ్రొక్కి సేవించి కనుగొంటి మోక్షపదవి...

సీ. మఱిమఱి నాయొక్క మర్మకర్మంబులు
ప్రఖ్యాతిజేసెద పాపహరణ
ధరశీలుఁడయినట్టి ధన్వంతరిదారక
దేహారోగం బెల్ల దెలిపినట్లు

గురుశిష్యుఁడయినట్టి గురువును గనుగొని
ముక్తిమార్గమునకై మ్రొక్కినట్లు
రక్షింపఁదలఁచిన రాజులఁ గనుగొని
యార్తుఁడై యన్నంబు నడిగినట్లు
గీ. విన్నవించెద నావార్త విమలచరిత
అగణితంబైన కలుషంబు లణఁగఁజేసి
నిర్మలాత్మునిగాఁ జేయు నిగమవేద్య... 29

సీ. ఎన్నిజన్మంబుల నెత్తితి నేనని
తప్పకబలుకు నాతపసి యొకఁడు
శత్రులమిత్రుల సమముగాఁ జూచుచు
శ్రీహరి నమ్మిన సిద్ధుఁ డొకఁడు
సకలేంద్రియంబులు సాధకంబునఁ బట్టి
ముక్తుఁడైయుండు నా మునియు నొకఁడు
గీ. బ్రహ్మ యీరీతివాఁడని పలుకవచ్చుఁ
గాని యితరులు నేర్తురే కనుగొనంగ
సకలవేదాంతములగల్గు సార మిదియ... 30

సీ. జపము దేవార్చన చెందనట్టి మతంబు
తామసంబునఁజేయు తపసితపము
పతిభక్తిలేనట్టి పడఁతుల వ్రతములు
యజమానుగూర్చనియాగములును
గురుభక్తిలేనట్టి గూఢమంత్రంబును
విత్తమార్జించెడి వేదములును

కాసులార్జించెడి కన్యకాదానంబు
ధనము వాటునగొన్నధర్మములును
గీ. నెంచిచూచిన నవియెల్ల నేమిఫలము
ఫలము దెలియంగ నేరక పాటిదప్పి
నడచి నరకంబుకేఁగుట నయమె నీకు... 31
సీ. అఖిలాండకోటి బ్రహ్మాండనాయక నీవు
ముచుకుందునకు మోక్ష మిచ్చినావు
అకుచేలువిచేతి యటుకులు భక్షించి
యింపైన సంపద లిచ్చినావు
శరణాగతత్రాణ శబరి దెచ్చినపండ్లు
అంచితంబుగ నారగించినావు
వేదవేదాంగ యావిదురుని యన్నంబు
కోరి వేడుకతోను గుడిచినావు
గీ. జానకీనాథ మీదాసజనులయిండ్లఁ
దులసిదళమైన మాజిహ్వ తృప్తిఁబొందు
నచ్యుతానంద గోవింద హరి ముకుంద... 32
సీ. ఆశ్రమధర్మమం దాసనొందనివాఁడు
పాపవాక్యం బెప్డు పలుకువాఁడు
శ్రీరాము నర్చించి సిరియుఁ గోరినవాఁడు
మమకారబుద్ధియు మానువాఁడు
లబ్ధపదార్థంబు లాభంబులనువాఁడు
పరులకు హితముగాఁ బలుకువాఁడు

పరులద్రవ్యమునకై పరుగులెత్తనివాఁడు
చెడుగుచేష్టల కొడఁబడనివాఁడు
గీ. యోగసంసారి కీగుణ మెంచవలయుఁ
గాక కడుభక్తివేషంబు గణనజేయ
వలదు సంసారబుద్ధుల వాంఛగాక... 33

సీ. విష్ణుప్రసంగముల్ విడువక విని గడు
పులకాంకురంబులు పొడమువాఁడు
హరి గానములయందు నాసకల్గినవాఁడు
సకలోపచారముల్ సలుపువాఁడు
అతనికర్పించి తా ననుభవించెడివాఁడు
సుమతునికై వడిఁ జూచువాఁడు
సాధులమాన్యుల సౌఖ్యపెట్టెడివాఁడు
మనసులో శ్రీరామ యనెడివాఁడు
గీ. పుణ్యపురుషుండు భక్తుండు పూజితుండు
ధర్మమార్గుండు ధన్యుండు ధార్మికుండు
కలఁడు వేయింట నొక్కఁడు కడమ లేఁడు... 34

సీ. తల్లిదండ్రులఁ గన్న తాతముత్తాతలు
తర్లిపోయినవార్త తాను దెలిసి
జీవించు పెక్కండ్రు జీవకోట్లను జూచి
జననమరణముల జాడలెఱిఁగి
సర్వకాలము నిల్చి సంపదనుండు నా
విభవంబు రాజులవింత జూచి

పారంబులేనట్టి పాపపుసంసార
మావేదనలచేత ననుభవించి
గీ. కనియుఁ గానంగజాలరు కర్మవశులు
అస్థిరం బెల్ల స్థిరమన కవనిబుధులు
సన్నుతింతురు మిమ్మును సంతతంబు... 35
సీ. ఈషణత్రయమును నీక్షించి మదిలోన
మేలు లేదని వీడు మేటియొకఁడు
సద్గుణంబు తనకు సామాన్య మనియెంచి
స్వస్థుఁడై యుండు నా సాధుఁ డొకఁడు
అష్టభోగంబుల నాభాసమని యెంచి
తుచ్ఛంబుగాఁ జూచు దొడ్డ యొకఁడు
విషయంబులనుబట్టి విరహింపఁజాలక
సూటి దప్పకజూచు సుముఖుఁ డొకఁడు
గీ. వనము పురమని కోరక వాన యనక
యెండ మంచు లటంచును నెఱుక లేక
యుండు నీరీతి యవధూత యుర్విలోన... 36
సీ. జన్మదాల్చుఫలము జగదీశ్వరుని మేటి
భవ్యంపుగుణకథల్ బలుకనైతి
బుద్ధిగల్గుఫలము బుధులచెంతనుఁ జేరి
హరిజేరుమార్గంబు లడుగనైతి
కాయమొందుఫలమ్ము కర్మసంసారినై
నీయందు చిత్తంబు నిలుపనైతి

బహువత్సరంబులు బ్రతికిన బ్రతుకుకు
సకలతీర్థపుసేవ సలుపనైతి
గీ. బాల్య కౌమార యౌవన భ్రాంతిచేత
వ్యర్థమాయెను గాలంబు వాసవనుత
ద్రోహి శరణంటి ననుఁ గావ దొడ్డఘనత... 37
సీ. సంభ్రమించుఫలము సంసారరహితుఁడై
భజియించి నిశ్చలభక్తుఁ డగుచు
భక్తివాత్సల్యంబు భావంబున నెఱింగి
యేటుమీఁద సంతాన మమరజేయ
సంతానమార్గంబు సతమని నెఱనమ్మి
యమృతస్వరూపుఁ డై యలరుచుండు
నిన్నది నెంచక నిత్యంబునై చాల
దుష్కర నరకమందునను పడక
గీ. చదువుఫల మిది జగమున నరులకెల్ల
కోటివిద్యలు నవి యెల్ల కూటికొఱకు
కోన భేదించి యెలుకను గొనఁగవలెనె... 38
సీ. మధుశర్కరక్షీరదధిఘృతంబులకంటె
రామనామామృతరసము రసము
పనసజంబూద్రాక్షఫలరసంబులకంటె
రామనామామృతరసము రసము
కదళికామకరందఖర్జూరములకంటె
రామనామామృతరసము రసము

నవసుధాపరమాన్న నవనీతములకంటె
రామనామామృతరసము రసము
గీ. రామనామంబునకు నేమి రాదు సాటి
రామనామంబు సేవించి *నారదుండు
బ్రహ్మఋషియయ్యె నిహమందుఁ బదవినొంది.
సీ. శ్రీమంతుఁ డగు రామచంద్రుని దలఁచిన
నజుచేత మోక్షంబు నందినట్లు
జయరామనామంబు జపము గావించిన
జీవాత్మకును ముక్తి జెందినట్లు
కాకుత్థ్సతిలకుని గన్నులఁ జూచిన
బహుపేదలకు ధనం బబ్బినట్లు
శ్రీరామచంద్రుని సేవింపఁగలిగిన
నష్టభోగంబులు నమరినట్లు
గీ. గరుణగలయట్టి సద్గురు గలిగినట్లు
జీవనదులందు స్నానంబు జేసినట్లు
కుటిలమది లేక జ్ఞానంబు కుదిరినట్లు... 40
సీ. ఓరాఘవా! యని యొకసారి దలఁచిన
దుఃఖావళు లవన్ని దొలఁగిపోవు
ఒనర రెండవసారి యోరాఘవా! యన
బహుభోగభాగ్యసంపదలు గల్గు
చెలఁగి మూఁడవసారి శ్రీరామ! యన్నను
ముక్తుఁడై వైకుంఠమున వసించు

రమణ నాలవసారి రామచంద్రా! యన
నతిసీ ఋణస్థుఁడ వయ్య నీవు
గీ. అల్పసంతోషసులభుఁడ వగుదువయ్య
యెలమి యాజీవపర్యంత మరయ మిమ్ము
దలఁచువారికి నాపదల్ దొలఁగు టరుదె...
సీ. కీడు మేలని రెండు క్రిందటిజన్మంబు
సంగ్రహించినయట్టి సంచితంబు
అనుభవించుచు నరు లాత్మతథ్యము లేక
మేనెల్ల తమ దని మెచ్చుకొనుచుఁ
గీడువచ్చినవేళ క్రియ కోర్వఁజాలక
పాపంబుదలఁతురు భ్రాంతిచేత
నట్టిపాపంబు తా ననుభవించుచునుండుఁ
బాయనిసంసారపాశములను
గీ. బద్ధులై యుండు దుర్జనుల్ పందలగుచుఁ
బాపఫలములు భాసుర భ్రాంతిగాక
వలదు యితరులవలె వట్టివాంఛగోర... 42
సీ. కర్మశేషమ్మునఁ గల్గుజన్మంబును
జన్మహేతువుచేతఁ జెడు నతండు
మూఢుఁడై ముందటి ముచ్చటఁ దెలియక
బద్ధుఁడై యుండును భ్రాంతితోడఁ
దనువు సంసారంబు తథ్యం బని తలంచి
హరినామభజన నా*సక్తిలేక

అనుదినంబును నరుఁ డాసక్తుఁడై నట్టి
పుత్రమిత్రాదులే పుణ్యమనుచుఁ
గీ. బరుల యాచించి పీడించి పాపమొంది
పుట్టు నీరీతి కాలంబు *పృథివిలోన
నిన్ను చింతింపఁ జేకూరు నీపదంబు... 43

సీ. రామరామాయని రంజిల్ల నావంతు
నిజముగా రక్షింప నీదువంతు
అపరాధి నని పల్కి యాచింప నావంతు
నిజముగా రక్షింప నీదువంతు
నీపాదపద్మంబు నెఱనమ్మ నావంతు
నిజముగా రక్షింప నీదువంతు
ఒరులసేవింపక యోర్చుట నావంతు
నిజముగా రక్షింప నీదువంతు
గీ. నేను పంతంబు దప్పక నిన్ను గొలుతు
నీవు పంతంబు దప్పక నిర్వహించు
పంత మిది నీకు నాకును పరమపురుష... 44

సీ. గోవుమందల కోటిగోదాన మొసఁగిన
సరిరావు మీనామసంస్మరణకు
కాశీప్రయాగయు గంగాదితీర్థముల్
సరిరావు మీనామసంస్మరణకు
బహుయజ్ఞములుచేసి ప్రస్తుతికెక్కిన
సరిరావు మీనామసంస్మరణకు

వేదశాస్త్రంబులు వెదకిచూచినగాని
సరిరావు మీనామసంస్మరణకు
గీ. నెంచఁగా నిన్ను వశమె బ్రహ్మేంద్రులకును
బుధజనస్తోత్ర సద్గుణపుణ్యచరిత
అఖిలసురవంద్య దివ్యపాదారవింద... 45
సీ. అల్పులమాటల కాసపడఁగ నేమి
ఫలము బూరుగజూచి భ్రమసినట్లు
నీచులమాటలు నిశ్చయింపఁగనేల
నీరుగట్టినమూట నిలిచినట్లు
గుణవిహీనునిమాట గుఱిసేయఁగానేల
గొడ్డుగోవులపాలు గోరినట్లు
కపట ఘాతకుమాట కాంక్షసేయఁగనేల
కలలోను మేలు దాఁ గన్నయట్లు
గీ. పామరునిమాట నెంతైన పాటిజేసి
అడుగఁగోరెడివారిదే యల్పబుద్ధి
నీతిమంతుల కివి యెల్ల నిశ్చయములు... 46
సీ. శ్రీరామనామంబు చిత్తాబ్జముననిల్పి
ఫాలలోచనుఁ డిల బ్రణుతికెక్కెఁ
గాకుత్స్థతిలకుని కరుణారసంబునఁ
గల్పాంతరస్థితి కపివహించె
ఖరవైరిపదరేణుకణములు సోఁకినఁ
గలుషము ల్బాసెను గాంత కిపుడు

పులుగురాయఁడు రఘుపుంగవు నుతియించి
నిర్వాణపదమందు నిలిచె వేడ్క
గీ. హాటకాంబరు లక్ష్మీశు నాత్మ దలఁచి
కూర్మి నరులార మోక్షంబు గొల్లకొనుఁడి
రామనామామృతంబున కేమిసమము... 47
సీ. సకలభూతవ్రాత సంఘవిధ్వంసంబు
రామతారకమంత్రరాజ మరయ
సకలరక్షోవీర జాలనిర్మూలంబు
రామతారకమంత్రరాజ మరయ
సకలతీర్థామ్నాయ సారసంగ్రహవేది
రామతారకమంత్రరాజ మరయ
సంతత ఘోరాఘసంఘవినాశంబు
రామతారకమంత్రరాజ మరయ
గీ. సకలమునిజనచిత్తాబ్జసారభృంగ
మైన శ్రీరామనామంబు ననుదినంబు
స్మరణసేయుఁడి జనులార సత్ఫలంబు... 48
సీ. గాధినందనుయజ్ఞకార్యంబు సమకూర్పఁ
బ్రకటితంబయిన యాప్రాభవంబు
వాసవతనయుని వసుధపైఁ బడవైచి
వర్ణనకెక్కిన వైభవంబు
రావణుఁ డాదిగా రాక్షసావళినెల్ల
నాశమొనర్చిన నైపుణంబు

... ... ... ...
... ... ...

గీ. నిట్టికార్ముకదీక్షాధురీణుఁ డయిన
భూమిజాధిప మిమ్మును బుద్ధియందుఁ
దలఁచి కైవల్యమందిరి తత్త్వవిదులు... 49

సీ. నాముద్దులయ్యను నాదేవదేవుని
నాపిన్నయన్నను నామురారి
నారత్నమునుబట్టి నాబంగరయ్యను
నానిధానము రాము నాదువిష్ణు
నాకూర్మిశౌరిని నాబ్రహ్మతండ్రిని
నాదీననాథుని నాదువిభుని
నామనోనాథుని నానోముఫలమైన
నాజానకీధవు నామహాత్ము

గీ. వెదకి కీర్తించి హర్షించి వేఁడుకొనిన
నఖిలసంపద లిప్పుడు నమరినట్లు
తప్పుత్రోవలఁ బోయిన ధన్యుఁడౌనె... 50

సీ. చెడిపోక నామాట చిత్తమం దుంచుఁడీ
దేవాధిపుని మహాదేవుజపము
నియమంబుతోనైన నిష్ఠతో నైనను
భయముతోనైనను భక్తినైన
శక్తితోనైనను యుక్తితోనైనను
శాంతంబుతోనైన సరసనైన

రాకపోకలనైన రమ్యంబుగానైన
నాటపాటలనైన నలసినైన
గీ. సాక్షినైనను మిక్కిలిసోలినైన
సురతినైనను భక్తుని జూచినైన
జేసి కైవల్య మందుఁడి సిద్ధముగను... 51

సీ. శ్రీజానకీనాథ శ్రీరామ గోవింద
వాసుదేవ ముకుంద వారిజాక్ష
శ్రీరంగనాయక శ్రీవేంకటేశ్వర
ప్రద్యుమ్న యనిరుద్ధ పంకజాక్ష
శ్రీరుక్మిణీశ్వర శ్రీహృషీకేశవ
నారాయణాచ్యుత నారసింహ
శ్రీరమావల్లభ శ్రీజగన్నాయక
శ్రీధర భూధర శ్రీనివాస
గీ. రామ జయరామ రఘురామ రామరామ
యనుచుఁ దలఁచిననామము లాత్మయందుఁ
గష్టములుదీర్చి రక్షించు గారవించు... 52

సీ. కడవాఁడనా నీవు కన్నులఁజూడవు
నీబంటుబంటును నీరజాక్ష
చెడ్డవాఁడని నన్ను సరకుసేయవదేమొ
పతితపావనకీర్తి పద్మనాభ
వీఁడెవ్వఁడని నన్ను విడనాడి బాయకు
కరుణాసముద్ర యోకమలనయన

వేఱుజేసియు నన్ను వెరవుగాఁ జూడకు
గోపాల భూపాల గోపవేష
గీ. ఆదిదేవ పరంధామ యవ్యయాత్మ
శ్రీరమానాథ శ్రితపోష శ్రీనివాస
కాచి రక్షించు మీఁక నన్నుఁ గామజనక... 53

సీ. చిన్నముద్దులయన్న చిన్నారిపొన్నారి
సురభూజమా రార సుందరాంగ
నన్నుగన్నయ్య నీ కన్యుఁడఁగాను వే
నవ్వులుసేయకు నాగశయన
దిక్కుమాలిన నన్ను దేవర బ్రోవుమీ
చక్కని నాపాలి చక్రపాణి
అక్కఱతో నన్ను ఆదరింపుము వేగ
నిక్కంబు నీవాఁడ నీలవర్ణ
గీ. అనుచు వేఁడితి రక్షింపు మరసి నన్ను
నెంతలేదని నీమది నెంచవలదు
కరుణజూడుము నామీఁద కామజనక... 54

సీ. ఎంతనివేఁడుదు నెంతనిదూరుదు
నెంతనిభాషింతు నేమిసేతు
నెంతనిచింతింతు నెంతనిభావింతు
నెంతనిసేవింతు పంతమలర
నెంతెంతనగవశ మిందిరారమణ నీ
సచ్చిదానంద సౌం*దర్యమహిమ

చెప్పను చూడను చెవుల వినంగను
శక్యమెవ్వరికి నా స్వామినీదు
గీ. వేషభాషలు వర్ణింప వేయినోళ్ల
శేషునకునైన వశమానె శ్రీనివాస
గాన మనుజుండ వర్ణింపఁగా నెఱుంగ... 55
సీ. మాయలవాఁడవే మాయలన్నియు జూడ
జలధులన్నియు మాయ జనులు మాయ
సూర్యుండు నీమాయ చుక్కలు నీమాయ
యింద్రుండు మాయ చం*ద్రుండు మాయ
మెఱయ నగ్నియుమాయ మేఘంబులునుమాయ
యురుములు నీమాయ మెఱపు మాయ
వర్షధారలు మాయ వానకాలము మాయ
చలికాలమును మాయ చలియు మాయ
గీ. యిట్టిమాయలు గట్టిగా *నుర్వినిలిపి
జనులకెల్లను గర్వము *గ్గలుగఁజేసి
జగతినడుపుదు నీరీతి శాశ్వతముగ... 56
సీ. నీచమీనములోన నీచవృత్తినిజొచ్చి
సోమకుజంపిన సుభగరామ
తల లేనివాఁడవై తగకొండమోసిన
పతితపావననామ పద్మనాభ
మిట్టరోమంబుల మేదిని మూతితో
ద్రొబ్బుచు విహరించు దుష్టహరణ

సగము సింగంబవై జగదపకారుని
యుదరంబు భేదించు నురగశయన
తిరిపెంపువాఁడవై మురియుచు గొడ్డంట
తిరుగుచు హాలివై తివిరి గొల్ల
గీ. తనువు గైకొని వ్రతములు తలఁగఁజేసి
గుఱ్ఱమెక్కిన శతకోటి కోటిమదన
మోహనాంగ దయానిధి ముద్దులయ్య... 57
సీ. కేశవదేవుని కీర్తనానలముచేఁ
గలుషాటవులనెల్లఁ గాల్పవచ్చు
దామోదరునిస్మృతి తరణిచే సంసార
వార్ధి దాఁటఁగవచ్చు వసుధలోన
శ్రీరామదేవుని చింతనజేసినఁ
బాపసంఘముల భంజింపవచ్చుఁ
బద్మనాభస్తోత్ర భవ్యగొడ్డలిచేత
దురితవనాటులఁ ద్రుంచవచ్చుఁ
గీ. గాన గుమతులు మిమ్మును గానలేక
వెఱ్ఱిత్రోవలబోదురు వెఱపులేక
తెలిసి సేవించువారికి దివ్యపదవి... 58
సీ. మహిలోనఁ బొట్టకై మానవిహీనుని
వెంటనే దిరుగుచు వెఱ్ఱిబట్టి
నటువలె రాక్షసి యంటినకైవడి
గ్రహముబట్టినరీతి కష్ట మతని

నడుగఁబోయినవార లదలించి పొమ్మన్న
గద్దించి తలవంచి కండ్లనీళ్లు
గ్రుక్కుచు మదిలోన సొక్కుచు నటుమీఁద
వినుజీరు కొందఱు నిజముగాను
గీ. దీనజనమంది రాంగణ దేవభూజ
వెనక కడతేరఁజూతురు వేడ్కతోడ
నట్టి నిన్నును సేవింతు నహరహంబు... 59
సీ. ఎందులకేగిన నేపనిచేసినఁ
జలముచేనైనను శాంతినైన
బంగారుపనినైన శృంగారములనైన
సుద్దులనైనను ముద్దునైన
యాత్రలనైనను శాత్రులనైనను
ఉపవాసములనైన నుబ్బునైన
జపములనైనను తపములనైనను
కలుగదు నీదివ్యఘనపదంబు
గీ. భక్తిచే నిన్నుఁదలఁచినభాగ్యవంతు
లిందు నందును వేడ్కతో నెనయుచుండి
ప్రబలుదురుగాన ననుగావు పంకజాక్ష... 60
సీ. రావణుజంపిన రామభూపాలుని
సేవించుఁడీ మీరు సిద్ధులార
సేతుబంధనురాము చేరమెచ్చుఁడి మీరు
తలఁప రదేటికో ధన్యులార

ఘనజటాయువు కిచ్చె గాంభీర్యపదమని
విని యెఱుంగ రదేమి విమతులార
యొక్కబాణంబున వాలిని బడవేసి
సుగ్రీవుబ్రోచెను సుజనులార
గీ. యట్టిత్రైలోక్యధాముని నాదరమునఁ
దలఁప రదియేమిపాపమో ధన్యులార
భూమిజానాథుఁ డొసఁగును బుణ్యపదము...61
సీ. పద్మనాభునిమీఁద పాటలుపాడుఁడీ
భవబంధములు పోయి భద్రమగును
కమలామనోనాథుఁ గన్నులజూడుఁడీ
నేత్రఫలంబయి నెగడియుండు
శ్రీగదాధరుసేవఁ జేయుఁ డెల్లప్పుడు
రోగముల్ దొలఁగి నీరోగి యగును
కోదండరాముని కోరి భజించుఁడీ
శత్రునాశనమగు సమ్మతముగ
గీ. నిట్టిలీలావతారుని నీశు హరిని
బలునితమ్ముని గోపాలబాలవిభుని
బరగ నుతియించి సంపూర్ణపదవిగొనుఁడి... 62
సీ. పాతెడిపాతెడి బాపమణంచికి
బండిదోలినయట్టి పరమచరితు
గొల్లముద్దుల చిన్నగుబ్బెతలను గూడి
విహరించు గోపికావినుతకృష్ణు

అడవియెంగిలిమేఁత యావంతబోకుండ
యెత్తిమ్రింగినయట్టి యేపుకాని
దనపాటివారల తగుబాలురను గూడి
పామునుమర్దించు భవ్యచరితు
గీ. దేవు నాశ్రితధేనువు దేవదేవు
జగములన్నియుఁ బుట్టించి సంహరించి
పోసఁగ రక్షించువాని నాబుద్ధి నలఁతు... 63
సీ. కౌసల్యసుతురాముఁ గరుణాసముద్రుని
గంగాదినదిపాదకమలయుగళు
ఖండేందుధరచాపఖండను జగదేక
మండను బ్రహ్మాది మానివంద్యుఁ
దాటకాంతకు రాము దైత్యసంహారుని
మునియాగరక్షుని మోహనాంగు
బరశురాముని గర్వభంజను లోకైక
రంజను రఘురాము *ఘనతమాలి
గీ. నెందు సేవింతు కీర్తింతు నేర్పుతోడ
బుద్ధిగల్గిన నీదగుపుణ్యపదము
గని ప్రమోదింపవలయును గష్టపడక... 64
సీ. ఏల సేవింపరో యేలభావించరో
శ్రీరామనామంబు చిత్తమందు
మాటలాడుచునైన మఱచియునైనను
యెఱుకనైన దినంబు నెఱుఁగలేరు

దినమునందైనను తివిరి రాత్రులనైన
సంధ్యవేళలనైన సంజనైన
భ్రమతచేనైనను భయమునొందైనను
నోపకనైనను నోపిరైన
గీ. సకలలోకాధినాథుని సర్వసాక్షి
యాదిదేవుని జిన్మయానందమూర్తి
బుద్ధిదలఁచిన దురితము లోప్పుటరుదె... 65
సీ. తెలిసితెలియఁగలేరు తెల్విచేనొల్లరో
మాయలఁబడి లోకమదుతతోడ
రామభూపాలుని రమ్యాక్షరంబులు
నేవేళనైనను నెప్పుడైనఁ
బనిసేయువేళైనఁ బనిలేక యున్నను
జనువేళనైనను జదువునైన
భయమునొందైనను భ్రమతోడనైనను
గలయిక యందుల కలిమినైన
గీ. పరమకల్యాణపరిపూర్ణభద్రమూర్తి
వెన్నదొంగను గోపాలవిభుని ఘనుని
బుద్ధిదలఁచిన కనులకుఁ బుణ్యపదవి... 66
సీ. పరకాంతలనుగూడి భంగంబునొందక
పరధనంబులఁ గోరి పట్టుపడక
పరులను వేడక పరిహాస మెంచక
పరుల నిందింపక భయములేక

పరులయిండ్లను జేరి పాపము ల్సేయక
పరదారలనుబట్టి భ్రమలఁబడక
సిరుల కాశింపక పరులవెంటను బోక
పర సేవ సేయక పట్టుగాను
గీ. మన్మథుని గన్నవానిని మాయకాని
శంఖచక్రాబ్జములవాని శౌరి నెపుడు
వర్ణనను జేసి పల్కుఁడీ వందనముగ... 67
సీ. మీనమై జలధిలో మేనును దడియక
వేదముల్ దెచ్చిన వేల్పువాని
తాఁబేటిరూపున తగ మందరాద్రిని
వీఁపునఁ నిల్పిన విభవశాలి
పందిరూపంబునఁ బరిపంథిఁ బరిమార్చి
కోఱమీఁదను నిల్పు గోత్రధరుని
మెకములసామియై మేటిదైత్యుని బట్టి
చించి చెండాడిన సింహమూర్తి
గీ. పొట్టితనమున బలిదైత్యు భూమి ద్రొక్కి
రామ రఘురామ బలరామ *బౌద్ధ కలికి
రీతులను నుతి సేయు దీరీతిగాను... 68
సీ. రుక్మిణీనాథుని రూపవర్ణనజేసి
సత్యభామను గూడు శౌరి గనుఁడి
జాంబవతీవన సంచారు వేఁడుఁడీ
సూర్యవంశేశుని సుభగమూర్తి

మిత్రవిందావిభు మేటికీర్తించుడీ
భద్రపుత్రానాథు పాదుఁ దెలమి
శ్రీశుధాత్రీశుని చెలువుగ్గడించుఁడీ
లక్ష్మణాగ్రజు జగద్రక్షణాఢ్యు
గీ. నట్టి శృంగారవంతుని నట్టిఘనుని
నిట్టివీరుని దలఁచిన నెవ్వఁడైన
చెలఁగి కైవల్యపదవిని జెందవచ్చు... 69

సీ. అంధునిచేతికి నద్దంబునిచ్చినఁ
జూచునా తనమోముసుందరంబు
కుంటివానికి నొక్కగుఱ్ఱంబు నిచ్చిన
నెక్కునా తనశక్తి నెన్నఁడైన
షండునకు యువతి సమకూర్పఁగల్గిన
కామంబుతీర్చునా కాంతకిదీఱ
అల్పుల కొకవేళ నర్థంబు గలిగినఁ
దెలివితో నిచ్చునా తెగువతోడ
గీ. తనను తెలిసికొనఁగ తగు*శక్తి లేక
ధరణి సంపదలన్నియు తనవటన్న
లేదు లాభంబు తన కొక లేశమైన... 70

సీ. శ్రీరామజయరామ సింధుబంధనరామ
కారుణ్యసింధుగంభీరరామ
వారిజోదరరామ వైకుంఠపతిరామ
దీననాయక దేవ దేవ దేవ

కౌసల్యసుతరామ కాకుత్థ్సకులరామ
కంసమర్దన శుభాకారరామ
మావధూవరరామ మానవేశ్వరరామ
యాదిత్యకులజ సర్వాత్మ రామ
గీ. కర్మభంజన లోకలోకాభిరామ
నిర్మలాత్మక సదయోాభ్యనిలయ రామ
నీవె గతి మాకు రక్షించు నిగమవినుత... 71

సీ. యెన్ని జన్మంబులు నెత్తితినో కాని
మాధవుఁ దలఁపక మందమతిని
అతివిహీనుఁడనైతి నవనిమీఁదను నిప్డు
కాకుత్థ్సుఁ గానక గర్వమతిని
గాయంబు లన్నియు మాయంబు లాయెపో
గోపాలు నుతిలేక గూలుచుంటిని
యెందఱు తలిదండ్రు లేమైరి యిప్పుడు
రాఘవు దలఁపక రట్టుపడిరి
గీ. ఇంకనైనను రఘురాము నెప్డు మదిని
బుద్ధిలో నవ్యమార్గంబు బొడమనీక
యనుదినంబును శ్రీరాము నాత్మఁ దలఁతు... 72
సీ. ఓర్పుగాంచఁగ నెంచి యొరసి చూచెదవేమొ
పట్టదగినకొమ్మ పట్టినాను
వదలంగవలె నని వాదంబులాడిన
మేల్కాని గట్టిగా మెదలువాఁడ

నాలాగుగాదని యాయాసపెట్టిన
ముకుళితహస్తుఁడై మ్రొక్కువాఁడ
మొగి నన్నుఁ గైకోక మోస మిచ్చెద నంటె
పాదారవిందము ల్బట్టువాఁడఁ
గీ. దల్లివయినను నీవె నాతండ్రివైన
దాత మ్రొక్కితి నిన్ను నాదైవ మనుచు
పాహి మా మని పలుమాఱు పలుకువాఁడ...
సీ. వాసుదేవునిపూజ వదలక జేసిన
వైభవంబులు గల్గు వసుధలోన
గోవిందు నెప్పుడు గొల్చి సేవించిన
సంపద లెప్పుడు చాలగల్గు
నారాయణస్మృతి నమ్మకముండిన
భుక్తిముక్తియు రెండు పొసఁగ నిచ్చు
విష్ణుసంకీర్తన విడువక జేసిన
దారిద్ర్యదుఃఖముల్ తలఁగియుండు
గీ. నరుల కెల్లను హరిసేవ నయము సుమ్మి
యఖిలసంపదలును గల్గు నాశ్రితులకు
సకలదురితము లెల్లను సమసిపోవు... 74
సీ. పంకజాసనవంద్య బ్రహ్మాండనాయక
పంకజలోచన పరమపురుష
శంకరవందిత సంకర్షణవతార
పంకజాక్షవిలోల పద్మనయన

లక్ష్మీశ యోగీశ లక్ష్మణాగ్రజ రామ
ధాత్రీశ యోగీశ ధర్మహృదయ
సకలలోకాతీత సర్వగుణాతీత
సుప్రభాసూర్యకోటిప్రకాశ
గీ. సకలజీవదయాపర సార్వభౌమ
క్షీరసాగరశయన రక్షింపవయ్య
నిన్ను నే నమ్మియున్నాను నీరజాక్ష... 75
సీ. నీలమేఘశ్యామ నిగమగోచర రామ
ఫాలలోచననుత పరమపురుష
దశరథనందన తాటకిమర్దన
ఇందీవరేక్షణ యినకులేశ
అయోధ్యపురవాస యాశ్రితజనరక్ష
కల్యాణగుణహార కంసహరణ
విధిశివరక్షక విష్ణుస్వరూపక
బుధజనపాలక పుణ్యపురుష
గీ. జానకీనాథ మీకును జయము జయము
సకలబ్రహ్మాండనాయక శరణు శరణు
కాచి రక్షించు నన్నును గామజనక... 76
సీ. రామనామామృతరసము ద్రావేకదా
ము న్నజామిళుఁడు తా ముక్తుఁడగుట
రామనామామృతరసము ద్రావేకదా
మునిపత్ని శాపవిముక్త యగుట

రామనామామృతరసము ద్రావేకదా
యపవర్గమందె ఖట్వాంగుఁ డిలను
రామనామామృతరసము ద్రావేకదా
యొప్పుగా మోక్షంబు నొందె శబరి
గీ. రామనామామృతంబును రక్తిఁ గ్రోల
ముక్తిమార్గంబు గలుగును మూఢులకును
రామనామామృతంబున రసికుఁడగును... 77

సీ. పంకజాక్షునిపూజ పలుమాఱు చేయక
పరుల నిందించుట పాటియగునె
విష్ణుసంకీర్తన లింపుల వినకను
బరుల మెచ్చుట నీకుఁ బ్రాతియగునె
శేషశయను చాల చెలఁగి కీర్తింపక
పరుల కీర్తించుట భవ్యమగునె
నారాయణస్మృతి నమ్మిక యుండక
పరదేవతల గొల్వఁ బాటియగునె
గీ. శ్రీరమానాథుఁ డెప్పుడు జిహ్వయందు
పుణ్యపరులైనవారలెన్నఁ బొందుమీఱ
తలఁచువారికి మోక్షంబు తథ్య మరయ... 78

సీ. సాకేతపురిరామ శరణు జొచ్చితి నీకు
రక్షింపవే నన్ను రామచంద్ర
దయతోడ బ్రోవవే దశరథాత్మజ నన్ను
కరుణతోఁ బ్రోవవే కమలనయన

కౌసల్యసుత నన్నుఁ గావి రక్షింపవే
మన్నింపవే నన్ను మదనజనక
జానకీపతి చాల సత్కృపతో నాకు
విజయంబు లియ్యవే వేదవేద్య
గీ. పరమపదరామ గోవింద పద్మనాభ
భక్తవత్సల లోకేశ పరమపురుష
ధర్మచరితారిషట్కవిదారకసూర... 79
సీ. నేత్రముల్ గల్గియు నెమ్మితో మీచూపు
సుస్థిరత్వంబునఁ జూడనైతి
జిహ్వ గల్గియు నోట శ్రీహరినామము
తాల్మితోడుత నెప్డు తలఁపనైతి
శిర మదిగల్గియు క్షితిమీఁద సాష్టాంగ
ముగఁ జక్కఁగా సాగి మ్రొక్కనైతి
కర్ణముల్ గల్గియు ఘనమైన మీకథ
ల్వివరించి నేనెప్డు వినఁగనైతి
గీ. హస్తములు గల్గి మిము చాల ననుదినంబు
శాంత మొనరంగ పూజలు సలుపనైతి
చిత్తశుద్ధిని మీసేవ జేయనైతి... 80
సీ. నాస మున్నందుకు నయముగా నీపాద
తులసి వాసనజూచి చెలఁగనైతి
సంసారమను మహాసాగరంబున మున్గి
శ్రీరామభజన నే జేయనైతి

బాల్యంబునను చోరబాధకత్వముజెంది
నీయనుభక్తియు నిలుపనైతి
యౌవనంబునఁ గామ్యమానసమును నొంది
నాహారంబున బుద్ధి నడుపనైతి
గీ. నెంతపాపినో గాకున్న నెన్నఁడైన
దేవుఁడని నీవెదిక్కని దెలియఁదగనె
గాన దుష్కృతమెంచక కావునన్ను.... 81

సీ. శ్రీరామ వినుము నేతీతిని జన్మించిన
విధము నెవ్వరితోను విన్నవింతు
తల్లిదండ్రుల నాత్మతనయుల బంధుల
సతులసోదరదేహసుతుల సఖుల
అక్కల చెల్లెండ్ర నాప్తుల హితులను
నితరబంధువులను నిష్టసఖులఁ
బరుల నావారని బాటించి యెప్పుడు
జనము లోకము నెల్ల సత్యమనుచు
గీ. భార్యరతికేళిసంబంధభరిత మమర
దీనికన్నను గల్గునె దివ్యమైన
బంధ మన్యంబు ద్రుంచ నీపదమె చాలు... 82

సీ. ఇలను బుట్టినవార లెంతేసిబుధు లైరి
వీరితో నెటువలె విన్నవింతు
తల్లి తండ్రి సుతుండు దాతవు భ్రాతవు
ప్రభుఁడవు గురుఁడవు బాంధవుఁడవు

నీవుదక్కఁగ నింక నెవ్వరితో నేని
బల్కుటదెట్టుల పరమపురుష
ఆత్మరక్షక నిన్నె యాశ్రయించితి దేవ
కాచి రక్షించుమీ కమలనయన
గీ. నీదులాభంబుఁ గోరిన నిక్కముగను
గోర్కెలెల్లను నాకు చేకూరుచుండు
దీనరక్షక భువి నాకు దిక్కు నీవె.... 83
సీ. తోఁచి తోఁచక నేను తోడరి మీచింతన
చేయక సంసారజలధి మున్గి
యడఁగని తృష్ణల నాహారవాంఛలఁ
బడపడి మోహసంభ్రాంతిఁ జెంది
తెలిసియు తెలియక దేహవాసనజెంది
తరిగోరి మిమ్ములఁ దలఁచనైతి
మఱచి మర్వక నిత్యమార్గంబులను మిమ్ముఁ
దల్చక యింద్రియతతులఁ దగిలి
గీ. నట్టిపాపాత్ముఁడను నన్ను నెలమి నెల్ల
కాచి రక్షించు మన్నించు ఘనతమీఱ
కృపకుఁ బాత్రునిగాఁ జూడు కువలయేశ.... 84
సీ. జననిగర్భమునందు జన్మించినది మొదల్
బాల్యంబునను గొంత ప్రబలుచుండి
యటమీఁదఁ గౌమరుప్రాయంబునఁ గొన్నాళ్లో
తల్లిదండ్రులప్రేమ దనరియుండి

యౌవనప్రాయంబునందు సతిక్రీడ
నింద్రియంబుల ప్రేమ నెవ్వ దగిలి
ముసలితనంబున మునుఁగుచుఁ గొన్నాళ్లు
కార్పణ్యములచేతఁ గష్టపడుచు
గీ. నింతకాలంబులను నిన్ను నెఱుఁగలేక
వృద్ధిబొందితి ప్రకృతిచే విశదముగను
గరుణజూడుము నన్ను దుష్కర్మి యనక.... 85
సీ. శ్రీరామ నామీఁద చిత్తంబు రాదాయె
నాతల్లిదండ్రని నమ్ముకొంటి
దశరథాత్మజ నీకు దయయింతలేదాయె
నాయిలువేల్పని నమ్ముకొంటి
సత్యసంధుఁడ నీదు చనువింత లేదాయె
నాప్రాణవిభుఁడని నమ్ముకొంటి
భక్తవత్సల నీకు భావంబు లేదాయె
నామూలధనమని నమ్ముకొంటి
గీ. దొరవు గావున బ్రోవుము దురితహరణ
నిందలేకుండ చేపట్టి నిర్వహించు
పరుల నిందింప నాకేల పరమపురుష... 86
సీ. మూర్ఖుఁడు మూర్ఖుఁడు ముచ్చటాడఁగ వింత
దీనులకల్పు లదొక్కవింత
కోతికొణంగులు గూడియుండఁగ వింత
కుక్క నక్కలు గూడి కూయ వింత

కోపితోఁ గుటిలుండు కూర్మి జేయుట వింత
కపటఘాతకు లెఢ్డ కలయ వింత
మంత్రులతో మంత్రి మచ్చరించుట వింత
కీడు మే లెఱుఁగని కీర్తి వింత
గీ. యెంతవారికి లబ్ధంబు లంతెగాక
ననుభవింపఁగ నేర్తురె యధములెల్ల
కలుగు జ్ఞానులసంగతి ఘనతయశము... 87

సీ. శ్రీరామ నీవు నాచిత్తమందే నిల్చి
రక్షింపవయ్యా న న్నక్షయముగ
నన్ను రక్షింపను నాథు లెవ్వరు లేరు
నాస్వామి నీవని నమ్మినాను
తల్లివైనను నీవె తండ్రివైనను నీవె
వేదాంతవేద్య ని న్వేఁడినాను
అయోధ్యావాసా యనంతస్వరూపక
ఈవేళ నీవు నన్నేలుకొనుము
గీ. వేగ రక్షించుమని నిన్ను వేఁడినాను
నమ్మఁగాఁజాల నెవ్వరి నెమ్మితోడ
నీకుఁ బ్రియుఁడను మ్రొక్కెద నీరజాక్ష... 88

సీ. దీనదయాకర దీనరక్షణ నీవు
కావవే నన్నిఢ్డు కమలనయన
పరమాత్మ పరమాత్మ పలుకుఁ బొంకించకు
పనులకు మీపాదపద్మసేవ

కమలేశ కమలాక్ష కరుణతో రక్షింపు
వరములియ్యవె నాకు వరద ఈశ
లక్ష్మీశ లక్ష్మీశ లలిమీఱఁగను నాత్మ
దలఁచి రక్షింపవే నీరజాక్ష
గీ. పద్మలోచన పరమాత్మ పారిజాత
స్వామి రక్షించు మిఁక నన్ను సార్వభౌమ
నిన్ను నెప్పుడు సేవింతు నీలవర్ణ... 89

సీ. నిను గొనియాడితి నీకృప గనుగొంటి
నిజముగా రక్షింప నీవె యంటి
నీప్రాపు గలదని నీదులోకంబులఁ
గొనియాడ నేవేళఁ గోరియుంటి
బ్రహ్మంబు నీవని పలుమాఱు నిన్ను నే
బ్రస్తుతిసేయుదుఁ బరమపురుష
దాసుండనని యంటి దయకుఁ బాత్రుఁడ నంటి
నీకు నే వశుఁడను నేర్పుగంటి
గీ. తల్లితండ్రియు నీవని తలఁచి యుంటి
నేను నీవాఁడనై యుండి నిన్ను గొల్తు
కాచి రక్షించు మిఁక నన్ను కరుణతోడ... 90

సీ. ఆనాఁడె తెలియక యాయాసమందితి
నెన్నఁడు మీసేవ యెఱుఁగనైతి
ముక్తికి మొదలని మూలంబు తెలిసిన
నీపాదకమలంబు నెమ్మికొల్తు

నింతసులభుఁడని యిన్నాళ్లెఱిఁగిన
నానాఁడె మిమ్ము నే నాశ్రయింతు
కర్మంబు లెడబాపి కరుణతోడుత నన్ను
నరసి రక్షించుమీ యాదిపురుష
గీ. తలఁపులో జాల నమ్మితిఁ దండ్రివనుచు
పుత్త్రవాత్సల్యమును నుంచి పొందుమీఱ
నిలిపి రక్షించు మిఁక నన్ను నీరజాక్ష... 91
సీ. హారామ హాకృష్ణ హాయచ్యుతా యని
కోరి కొల్చెద మిమ్ము కోర్కె లలర
యీవేళ నావేళ నేవేళనైనను
బ్రాపు దాపని యేను బ్రస్తుతింతు
నారాయణస్మృతి నామది నెప్పుడు
కట్టివేసియునుండు కరుణతోడ
వామన శ్రీధర వసుధపాలక నన్ను
కాచి రక్షించుమీ ఘనతమీఱ
గీ. నాకు నిష్టుఁడవని చాల నమ్ముకొంటి
నీవు కాపాడకున్న నింకెవరు దిక్కు
నీకు భక్తుఁడ మ్రొక్కెద నీరజాక్ష... 92
సీ. రామకీర్తనలెప్డు లాలించి వినువాఁడు
వైకుంఠపురమున వదలకుండు
కృష్ణనామం బెప్డు కీర్తించి వినువాఁడు
మధ్యమపురమందు మరగియుండు

మధుసూదనాయని మఱువక దలఁచిన
మర్మకర్మంబులు మాయమౌను
గోవిందనామంబు కోరి నాదముజేయ
దోషపాపంబులు తొలఁగిపోవు
గీ. అచ్యుతానంత గోవింద హరి ముకుంద
పదవి నాకిమ్ము నిన్నునే బాయకుండు
పద్మలోచన నాతండ్రి పరమపురుష... 93
సీ. నీభక్తులగువారి నిఖిలలోకంబుల
నిజముగాఁ బ్రోతువు నీలవర్ణ
నీకీర్తి పొందుగా నీకు సేవలుజేయు
పరమపుణ్యులకెల్ల భవ్యపదము
కోరి నీకీర్తిని గొనియాడి కీర్తించు
మనుజుల కొదవు నీమందిరంబు
భక్తుఁడై యీరీతి భజనచేయఁగ నీవు
నుప్పొంగి యిచ్చెద వొప్పుతోడ
గీ. నిట్టిసేవలు గొనినీవు ఇహపరములు
నాదరంబున నాకిమ్ము మోదమూని
గట్టిగా నీవు నన్నుఁ జేపట్టవయ్యా... 94
సీ. యోగమార్గంబున నెగసెద నంటినా
యోగంబువగలు నాయొద్దలేవు
గగనమార్గంబునఁ గదలెదనంటినా
కవచభూషణ మేది కమలనయన

ఆత్మమార్గంబున నెగసెదనంటినా
యాత్మనమ్మినబంధు వరయలేదు
అభ్రమార్గంబున నరిగెదనంటినా
యశ్వవాహనములు నావిగావు
గీ. నీదుదయ యది నాయందు నిలిచియున్న
నఖిలలోకంబులగును నాకల్పమిపుడు
కుతుకమున నన్ను బ్రోవుము కువలయేశ... 95
సీ. చిరకాలమున నేను స్థిరమనియుంటినా
జన్మకర్మంబులు జెప్పనేల
శ్రీకృష్ణనామంబు స్థిరమనియుంటినా
భయనివారణమౌను పరమపురుష
మదహరమిమ్ము నాహృదయంబులో నిల్పఁ
గరుణతోఁ గాతువు కమలనయన
మురహార నీకు నే ముకుళితహస్తుఁడై
మ్రొక్కి సేవింపఁగ మోక్షపదవి
గీ. సన్నుతించెద నిన్ను కౌసల్యతనయ
చిత్తగింపుము నాయన్న శ్రీనివాస
శరణుఁజొచ్చితి నీకును శరణు శరణు... 96
సీ. కైవల్యపదమును ఘనమని యంటినా
కైవల్యమది మిముఁ గన్నచోటు
బ్రహ్మలోకంబాదిపదమనియంటినా
బ్రహ్మాదులును నిన్నె ప్రస్తుతింత్రు

ఇంద్రలోకమె నాకు నిష్టంబటంటినా
అష్టదిక్పతులు మిమ్మాశ్రయింత్రు
పదవి పదవిగాదు పరమాత్మ నీపాద
కమలపదవి యదియ కంసహరణ
గీ. ఇట్టిపదవులు నాకేల యినకులేశ
కష్టపెట్టక యేవేళ కరుణజూడు
నిష్ఠతో నన్నుఁగావుము నీలవర్ణ... 97
సీ. కమలనాభుఁడ నిన్ను కన్నులఁజూచిన
సంభవించు ఫలమ్ము స్వామినాథ
జలజలోచన నిన్ను శరణనివేఁడిన
చేపట్టి రక్షించు శేషశయన
పరమాత్మ పరమేశ పద్మలోచన నిన్ను
గొనియాడ నేఁజాల గోరినాను
నారాయణ ముకుంద నరహరి నిన్నునే
నెప్పుడు సేవింతు నీలవర్ణ
గీ. యిటకు రావయ్య నాతండ్రి యినకులేశ
తడవుజేయక నన్నేలు ధర్మనిపుణ
నిలువకను వేగ రావయ్య నీరజాక్ష... 98
సీ. ధర్మంబు దలఁచిన దనకును జయమిచ్చు
కర్మంబు దలఁచిన కాదు జయము
శాంతంబు నుంచిన శాశ్వతపదమొందు
శత్రుత్వమున మహాచేటు నొందు

కుటిలత్వమునను దుష్కృతమొందు మనుజుఁడు
కుటిలత్వమే చేటు కువలయేశ
బద్ధులైనటువంటి బంధులగూడిన
తనవెంట నొకరైన తర్లి రారు
గీ. ఇట్టివారలు నాకేల యినకులేశ
కరుణ నాపయి గట్టిగాఁ గలుగఁజేసి
పరమపదమిచ్చి నన్నుఁ జేపట్టవయ్య... 99
సీ. ఆవేళ యమునిచే నాయాసపడలేక
నీవేళనే మిమ్ము నెలవుతోడ
నాతల్లిదండ్రని నమ్మి నీపాదము
లపట్టి సేవించెద పద్మనాభ
శ్రీరామ శ్రీరామ శ్రీరామ యని మిమ్ము
స్మరణచేసెదనయ్య చక్రపాణి
కోదండ కోదండ కోదండరాముని
కొలిచి సేవించెదఁ గోర్కెదీఱ
గీ. పద్మసంభవముఖనంతపరమపురుష
నన్నుగాచియు రక్షించు నయముతోడ
కరుణతోడుత ననుజూడు కమలనయన
రామతారక దశరథరాజతనయ. 100

శ్రీరామతారకశతకము సంపూర్ణము.

---

**N. B.**—ఈశతకపీఠికయందు 99-పద్యములున్నవని పొరపాటున ముద్రితమయినది.

# పీఠిక.

ఈ రామరాఘవశతకమును పల్లి పార్వతీశము గారు రచించిరి. ఈయన నివాసస్థానము గుంటూరు జిల్లా పల్నాడుతాలూకాలోని గుత్తికొండ యనుగ్రామము. వీరి దారపుత్త్రాదులు గుత్తికొండలోనే యున్నారు. 1908-వ సం॥ న నేను దాళపత్త్రగ్రంథాన్వేషణప్రయత్నములో నున్నతఱిఁ బార్వతీశము గారి కుమారులు వారింట నున్న గ్రంథముల నాకొసఁగిరి. వానిలో నీశతకముకూడ నుండెను. పార్వతీశముగారితండ్రి పేరు నరసింహాముగారు. నరసింహాముగారుకూడఁ బద్యరచన చేయుచుండినట్లు కన్పట్టుచున్నది. శబ్దాలంకారములకొఱకుఁ బాటుపడినస్థలములఁ దప్పఁ దక్కినచోటులనీశతకమునదోషము లంతగా లేవు. అందందు వ్యాకరణవిరుద్ధప్రయోగములు కన్పట్టుచునే యున్నవి. గ్రంథ మొక్కటి రచింపవలెనను సంకల్పముచేతమాత్రమే ప్రేరేపింపఁబడినవారు వ్రాసినగ్రంథము లనేకములు మనకుఁ గలవు. పార్వతీశముగారు శతకము వ్రాసిన కాలమునఁ బద్యరచనయందలి వేలము వెఱ్ఱి యిప్పుడున్నంత లేదు.

యాచనకుఁ బద్యరచనయే యప్పటికినిప్పటికిఁ బర మసాధనముగా నున్నది. కాకునూరి అప్పయ్యలాక్షణికుల వారికతమున మా పల్నాటిసీమయే పద్యరచనామార్గమును విశాలపఱచెను. తిట్టుపద్దెము లల్లి వ్యాపింపఁజేయుదురనుభయముకవిబిరుదధారులయె డఁ బూర్వకాలమునుండి వచ్చుచున్నది. ఈభయ మువలన నేమి, పద్యరూపస్తోత్రాపేక్ష నేమి, యాచించినప్పుడు వైదికావధానులకు, (వేదమును వల్లించు నవధానులు) శాస్త్రులకు,సోమయాజులకుఁ,బాకయాజులకు నిచ్చినదానికంటె జను లిప్పటికిఁ గవీశ్వరబిరుదధారులకే యెక్కువగానిచ్చుచున్నారు. కవీశ్వర బిరుదమును ధరించిన యాచకులు వేలకువేలు గడించితి మని విఱ్ఱవీగుటయు సంభవించుచున్నది. ఈ యాచకులవలనఁ గవిశబ్దమునకు గౌరవము పోయిన దని చెప్పవచ్చును. ఈయాచకులు ఘనమైన కవిశబ్దమును బాడుసేయుచుండఁగా దానిని గమనింపక వారికి నూఱాలు లిచ్చు నిప్పటిప్రజల యజ్ఞానమునుగూర్చి మిక్కిలి చింతింపవలసియున్నది. కవీశ్వరబిరుదమును ధరించి చేసినయాచనయే మహాగౌరవకర మని తలంచి యాత్మస్తుతులు గావించికొనుచు, మాకంటె ఘనులు లేరని చెప్పుకొనుచు గర్వపర్వతశృంగము నధిష్ఠించి యుండునజ్ఞులకు నట్టివారి

కిచ్చుప్రజలకుఁ బైపచ్చు లన్వయించును. విద్వాంసులు, శాస్త్రజ్ఞులు, సత్కవులు సంతతవాఙ్మయపరిశ్రమము చేయుచుందురు. వారు రాజులయొక్కయుఁ బ్రజలయొక్కయు నాదరణమును బొందుట యవసరంబైననగును. ప్రజలు భరింపకపోవుదురుగాక! రాజులాదరింపకపోవుదురు గాక! ఉదరపూరణార్థము స్వేదకణంబులొలుక శరీరమును గష్టపెట్టవలసి యున్నను, నపారదారిద్ర్యంబునఁ గడగండ్ల నందుచున్నను నాత్మగౌరవంబు, స్వాతంత్ర్యంబు వదలక యుత్తమమార్గమునఁ బ్రవర్తించిన బమ్మెరపోతరాజు నెయ్యది కడుపు చల్లగాఁ గనెనో యా యాంధ్రదేశమునకు జయము. పార్వతీశముగారో వారితండ్రి నరసింహముగారో కొందఱఁబొగడుచుఁ గొందఱఁదెగడుచు వ్రాసినపద్యములు కొన్ని తాళపత్రముల మీఁదఁ గాన్పించినవి. ఆపద్యముల నుదాహరించుచున్నాను.

క. ఉత్తముల కీయ నేర్చిన
యుత్తములను నడుగనేల యుత్తలపడమా
కిత్తఱిని వేడ నేటికిఁ
జిత్తము మీ రెఱుఁగరయ్య చింతితఫలదా. 1

క. విత్తేశ్వరాంశసంభవ
విత్తాఢ్యుండైన శ్రోత్రవేంకటనరసా
యుత్తమలోకము కేగెను
జిత్తము రంజిల్ల మోక్షచింతారతుఁడై. 2

క. అంతట మంత్రాగ్నిక్రియ
సాంతముగా నిత్యకర్మసంస్కారచయం
బెంతందుశాస్త్రధర్మం
బెంతయుఁ జేసితివి నీవ యందఱు సుతులే. 3

శా. ఈరీతిన్ బితృయజ్ఞమిలలో నేవర్తకుల్ చేసిరీ
దారిం బ్రాధిమమీఱ షోడశమహాదానాది గోదానముల్
సారోదారతనూతనాంబర జలస్థాలీలతో నిచ్చితౌ
వీరాగ్రేసర క్రొత్తబస్వయసుధీ విఖ్యాతభాగ్యోన్నతీ! 4

క. అడుగక యిచ్చెదు దాతల
నడుగుదురా క్రొత్తబస్వయంతటివాఁడై
నడుపక నడచెడిదానము
కడువడి సత్కవులఁ దన్పు గాదే భూమిన్. 5

ఈ పద్యములలోని "క్రొత్త" వారు గుత్తికొండలోను, దానికి సమీపమున నున్న జూలకంటిలోను నున్నవారు. వీరు వైశ్యులు.

క. అలఁగుచు రేపల్లెంగల
బలవంతులచుట్టు నిన్ను బలిద్రిప్పుచు మీ
పొలిమేరయొద్దఁ బెట్టెద
వెలయఁగ పువ్వాడ మొండివేంకటరెడ్డీ! 1

క. భూసురులు నర్థవాదులు
భాసురు లవనీశులంత భావింపంగా
శ్రీసహితు లెల్లవైశ్యులు
వాసిగ రేపల్లెఁ బొగడవశమే మాకున్. 2

క. ఇలలోఁదాతల చెన్నుఁగ
ఫల మే మిఁక నిన్నుఁ జూడఁ బొల్పడితిని నా
బల మెఱుఁగ వేమి చెప్పను
వెలయఁగ పువ్వాడ మొండి వేంకటరెడ్డీ!

క. బలిముఖుకైవడి నినుఁ గొని
చలమున నూరూరఁ బాత చెప్పతకలచే
నలగఁగఁ గొట్టుచుఁ ద్రిప్పెద
వెలయఁగ పువ్వాడ మొండి వేంకటరెడ్డీ!

ఈపద్యములలోని "వేంకటరెడ్డి" యనువారు రెడ్డికులజులనుంతిభ్రా కలుగవచ్చును గాని వైశ్యులే యని యెఱుంగనగును. ఈరీతి దూషణపద్యముల కుఁగాని భూషణపద్యములకుఁ గాని విలువ యేమాత్ర ముండునో వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. వీనిని జల్పములలోఁ జేర్పవచ్చును. పార్వతీశముగారు సంస్కృతముకూడఁ గొంత చదివినట్లు కాన్పించుచున్నది. వీరు సంస్కృతభాషలో రామలింగాష్టకము, రామచంద్రాష్టకము నని రెండష్టకములు వ్రాసిరి. వీరు స్మార్తులు. వీరి శివభక్తిని విష్ణుభక్తినిఁ దులయందిడి తూప విష్ణుభక్తివైపునకే ములు సూపును. ఈ రీతి శివభక్తి, విష్ణుభక్తి యొక్కరియందుండుట మన మతచరిత్ర నెఱుఁగనివారికి విచిత్రముగా నుండును. అద్వైతమతవ్యాప్తిచేఁ గలిగిన ఫలమిది. పార్వతీశముగారు స్వగ్రామాభిమానసూచకముగా

గుత్తికొండలో నివసించు రామలింగమును భజించుచున్నా నని చెప్పికొనినాఁడు. వారియష్టకముల దిగువ నుదాహరించుచున్నాను.

### రామచంద్రాష్టకము.

శ్లో. శ్రీజానకీశం రవికోటిరూపం
హేమాంబరం భక్తజనాళిపోషం,
మోక్షప్రదం దానవదర్పభంగం
వందామహే శ్రీరఘురామచంద్రం.

2. పంకేరుహాక్షం దురితౌఘనాశం
కామప్రదం రత్నకిరీటభాసం,
కోదండపాణిం మునియాగరక్షం
వందామహే శ్రీరఘురామచంద్రం.

3. సాకేతవాసం గిరిజేశమిత్రం
వల్మీకంశకం కౌస్తుభసద్విభూషం,
సురేంద్రసంపూజితపాదపద్మం
వందామహే శ్రీరఘురామచంద్రం.

4. జీమూతగాత్రం దశకంఠలుంఠం
గ్రైవేయసద్భూషణరాజితాంగం,
కల్యాణదం వానరబృందవంద్యం
వందామహే శ్రీరఘురామచంద్రం.

5. కుందేందుహాసం గహనేవిహారం
తార్క్ష్యధ్వజం కాయజకోటిభాసం,
శ్రీకంఠకోదండహరం శుభాంగం
వందామహే శ్రీరఘురామచంద్రం.

6. మారీచగర్వోపహారం మునీశం
మున్యంగనాశాపవిమోచనంచ,
పాపౌఘతూలాగ్నినిభాత్మరూపం
వందామహే శ్రీరఘురామచంద్రం.

7. వేదాంతవేద్యం ఖరదూషణఘ్నం
శాఖామృగేంద్రేష్టఫలప్రదానం,
కారుణ్యసింధుం కమలాయతాక్షం
వందామహే శ్రీరఘురామచంద్రం.

8. నాగేంద్రతల్పం పితృవాక్యపాలం
మార్తాండవంశార్ణవశీతభానుం,
ధాత్రీసుతామానసకంజమిత్రం
వందామహే శ్రీరఘురామచంద్రం.

9. శ్రీపల్లివంశాబ్ధిసుధాకరేణ
శ్రీపార్వతీశాఖ్యకవీశ్వరేణ,
రామాష్టకం యఃపఠతే మనుష్యః
కృతం సమోక్షం లభతే హి సత్యం.

## రామలింగాష్టకము.

1. గౌరీనాథ మనంగదర్పహరణం శ్రీకంఠమిందూల్లస
న్మాళిం చంద్రదివాకరాగ్నినయనం నాగేంద్రభూషోజ్వలం,
సారంగాంచితపాణిపద్మ మనఘం దేవౌఘసంపూజితం
శ్రీ*గుచ్ఛాద్రిపురాధివాసమనిశం శ్రీరామలింగంభజే.
2. గంగాశుభ్రతరంగ చంచలజటాజూటత్రిశూలాన్వితం
నాగేంద్రాజినసంవిశత్కటితటం నాగోజ్వలత్కుండలం,

* గుచ్ఛాద్రి = గుత్తికొండ.

కారుణ్యాంచితలోచనం పురహరం కందర్పకోటిప్రభం
శ్రీగుచ్ఛాద్రిపురాధివాసమనిశం శ్రీరామలింగంభజే.

3. గౌరీమానససారసోష్ణకిరణం రుద్రాక్షమాలాధరం
శ్రీనారాయణచిత్తపద్మనిలయం పద్మాసనాద్యర్చితం,
సంసారాబ్ధిపతజ్జనోరుతరణిం సంగీతలోలం శివం
శ్రీగుచ్ఛాద్రిపురాధివాసమనిశం శ్రీరామలింగంభజే.

4. సంధ్యాకాలవిలాసనృత్యచతురం భక్తేష్టకామప్రదం
నందీశాదిగణేంద్రబృందవినుతం నాకేశసంపూజితం,
లక్ష్మీనాథదృగబ్జపూజితపదం యక్షేశ్వరాభ్యర్చితం
శ్రీగుచ్ఛాద్రిపురాధివాసమనిశం శ్రీరామలింగంభజే.

5. శ్రీమద్భక్తజనాళిరక్షణపరం భస్మోజ్జ్వలద్విగ్రహం
కైలాసాధిపమప్రమేయమభవం సోమంసురేంద్రార్చితం,
శార్దూలాజినధారిణం క్రతుహరం వేదాంతవేద్యంవిభుం
శ్రీగుచ్ఛాద్రిపురాధివాసమనిశం శ్రీరామలింగంభజే.

6. గౌరీభూషితవామభాగమసురప్రధ్వంసినంభాసితం
శౌరేర్దత్తసుదర్శనం భవహరం ముక్తిప్రదం శంకరం,
కంజాతాక్షశరంపయోధిశరధిం జ్యాభూతసర్వాధిపం
శ్రీగుచ్ఛాద్రిపురాధివాసమనిశం శ్రీరామలింగంభజే.

7. సూర్యాగ్నీందురసాసదాగతినభోం బ్వాత్మానిరూపానిమాన్
ధృత్వాయోసతతం విరాజతిముదా తందేవ వంద్యం సదా,
కోదండీకృతకాంచనాద్రి వృషరాడ్వాహోదిరూఢం భవం
శ్రీగుచ్ఛాద్రిపురాధివాసమనిశం శ్రీరామలింగం భజే.

8. వ్యాసాత్రిప్రముఖర్షిచిత్తమధువిట్సుంసేవ్యపాదాంబుజం
కుందేందూజ్జ్వలమందహాసలహరీ రాజన్ముఖాబ్జం హరం,

భక్తామంగళ శైలభేదన మహాదంభోళిధారావహం
శ్రీగుచ్ఛాద్రిపురాధివాసమనిశం శ్రీరామలింగంభజే.
9. శ్రీమత్పల్లికులార్ణవేందువిలసచ్ఛ్రీనారసింహాహ్వయ
త్పుత్రేణేహతుపార్వతీశకవినాప్రోక్తం శివస్యాష్టకం,
శ్రీగుచ్ఛాద్రినివాసినోభవహరం శ్రీరామలింగస్యవై
యేభక్తాస్సతతం పఠంతిమనుజాస్తేయాంతి మోక్షంధ్రువం.

వీరి నీరచన కెయ్యది పురికొల్పెనో యది విచార్యము. ఘనభావములు గాని, భక్తవరులహృదయసీమలయందుఁ బ్రతిఫలించు దివ్యతేజస్సుయొక్క ఛాయగాని, కవితాజ్వాలనముయొక్క వేడిమిగాని, దృశ్యప్రపంచయవనికాంతర్గత లీలాదర్శనవిలాసంబుగాని శతకంబున వెదకవలసి యున్నది. ఆనందాశ్రువులట్టహాసములు, చాంచల్యము, సంస్తంభనము, పార్వతీశముగారి కవస్థాభేదము కలిగించినట్లు తోఁపదు. పురాణగాథల నుల్లేఖించువిశేషణములు, సంబోధనములు మొదలగువానితోఁ బద్యములను వీరు నింపిరి. "విరచించుశక్తి పుట్టని పురుషునిచదువులు ప్రకాశములుగావు." అని కాకునూరి అప్పయ్యలాక్షణికులవారు చెప్పినవాక్యములను వీరు దృఢముగా మనస్సునం దుంచుకొనియుండురు. చుట్టును గొండలచేతను నడవులచేతను గృష్ణానదిచేతను నావరింపఁబడి తక్కినదేశమునుండి వేఱైయున్న మాపల్నాటిసీమలోఁ బద్యరచనచేఁ బ్రజలయాదరమునుగాని

గౌరవమునుగాని పొందలేనికాలమునం దీద్రుశకృషి సల్పినందుకు పార్వతీశముగారినిఁ గొనియాడఁదగు ను. పార్వతీశముగారిశైలి ధారాళముగా నున్నది. వీరు శబ్దాలంకారప్రియులు. యమకమును దఱచుగ వాడుదురు. పద్య మెట్లురచించినఁ జదువుట కింపుగా నుండునో వీరికిఁ దెలియును. వీరిరచనయందు దఱ చు గానట్టుండదు. †పార్వతీశముగారి కుమారులు వేంకటనారాయణగారును, హనుమయ్యగారును, నాకుఁ దాళపత్రగ్రంథము లొసఁగినప్పు డీశతకము నచ్చువేయించెదరాయని యడిగిరి గాని వేయించెద నని చెప్పఁజాలక పోయితిని. తాళపత్రగ్రంథము లి చ్చువారంద ఱిట్లే యడుగుదురు. అచ్చువేయింతు మని యెవరికని చెప్పఁగలము? ఔదార్యముతో న చ్చొత్తించిన శ్రీయుతులు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశా స్త్రులు గారికిని, నీవిషయమున శ్రమపడిన శ్రీచుజుం దారురామారావుపంతులుగారికిని పార్వతీశముగారి కుటుంబపక్షమునఁ గృతజ్ఞతను దెల్పుచున్నాను.

| | |
|---|---|
| 52. ఆఫీసు వేంకటాచలమొదలివీధి,<br>తిరువల్లిక్కేణి, చెన్నపురి.<br>18—9—13. | అక్కిరాజు<br>ఉమాకాంతం. |

---

† ఈకవి యేబదిసంవత్సరములక్రిందనీశతకము రచించి యుండును.

599

శ్రీ ర స్తు.

పల్లి పార్వతీశకృత

# శ్రీ రామరాఘవశతకము.

---

ఉ. శ్రీమహిజాకుచ స్తబక సీమవిలి ప్తపటీరకుంకుమో
ద్దామ! మృగీమదాగురుయుతస్ఫుటగంధవిశేష
వాసిత, స్థేమభుజాంతరస్థితవిచిత్రమణీమయ హార
వల్లికా,స్తోమ! గుణాభిరామ! పటుదోర్బల విక్ర
మరామ రాఘవా. 1

ఉ. భానుకులాబ్ధిసోమ! జితభార్గవరామ దయాభిరా
మ!సజ్జానుపరీత బాహుధృతచాపవిముక్తశరాలి
గర్వియు,ద్దానవనాథయూథ మదఖండన భీమ!
సమస్తయోగి సన్మానిత దివ్యనామ! రిపుమర్దన
విక్రమరామ... 2

ఉ. శ్రీధర కాళిదాసులను జిత్తమునం దిడి సన్ను
తించి శ్రీ, నాథకవీంద్రముఖ్యులకు నమ్రుడనై
నుతియించి భక్తినా,మోదక చంపకోత్పల స
మున్నతమౌ శతకం బొనర్చెద, న్నాధులు మె
చ్చ వినెదను సత్కృప గైకొను రామ... 3

చ. దశరథరాట్కుమార! భవతాపనిరాకరణప్రచా
ర! సత్కుశికతనూజ బోధిత సుగోప్యతరోజ్జ్వల
మంత్రవార! శ్రీపశుపతికార్ముకాస్ఫటనభాసుర
బాహుయుగప్రసార! దుర్వశదశకంఠదోర్బల
నివార! దయాకరరామ... 4

ఉ. శ్రీరఘువీర! భక్తజనచిత్తసరోజవిహార! దీన
మందార! విరోధిదానవవితానవిదూర! మనోజ
సుందరాకార! నీలనీరదవికాసశరీర! విపక్ష
యూథకాంతారకుఠార! దుర్జనవిదార! గుణా
కరరామ... 5

ఉ. రామ! విరోధిరాక్షసవిరామ! విరాజితనీలకంధర
శ్యామ! కృపాభిరామ! కలుషవ్రజమోచనామ!
సద్గుణస్తోమ! మహీలలామ! రిపుసూదనకామ!
దశాస్యఖండనోద్దామ! సరోజమిత్ర సమధామ!
పరాక్రమధామ... 6

చ. జలరుహపత్రనేత్ర! శివప్రశాసన సుందరవేత్ర! హా
టకోత్కలనకటిప్రసూత్ర! ఖరదైత్యమహావన
వీతిహోత్ర! దుష్కలుషలతాలవిత్ర! సుర
సంఘహృదంబుజమిత్ర! మేచకోజ్జ్వల ఘనగా
త్ర! యోగివనచైత్ర! జనస్తుతరామ... 7

చ. అసురమదప్రభేద! యమరేంద్రసమర్చితపాద! భ

క్త హృద్విసజవినోద! దుష్టరిపువీర శ్రుతామిత చాపనాద! రాక్షసపతిచిత్తఖేద! రవిజాత విభీషణ సుప్రసాద! తాపసజనహృద్విమోద! నిజ భక్త ఫలప్రద! రామ... 8

ఉ. రామ! కకుత్థ్సవంశజలరాశిసముజ్జ్వలసోమ! నీరద, శ్యామ! త్రిలోకధామ! త్రిదశ ద్విషదీశ వినాశనక్రమోద్దామ! నిజాంఘ్రిభక్త జనతావనకామ! కృపాభిరామ! సుత్రామమణిప్రభాధగిత ధామ! సురోత్తమ రామ... 9

ఉ. సుందరజానకీ హృదయశుభ్రసరోరుహపద్మినీశ! సద్వందితసత్పరిదేశ! బలవద్రిపునాశ! వినీల వారిభృద్బృందసకాశ! నిర్దళితభీకరదుష్కృత జన్మపాశ! రాకేందుయశఃప్రకాశ! దనుజేంద్ర గజాంకుశ! రామ... 10

చ. వనజదళాయతాక్ష! భవబంధవిమోచనదీక్ష! ఘోరదుర్జనతతిశిక్ష! బాహుబలశౌర్య నిశాట విపక్ష భండనార్జునభుజపంచకద్విశతసూదనభార్గవరామగర్వశిక్షాసనకృతిదక్ష! దీనమనుజవ్రజ రక్షక! రామ... 11

ఉ. మండితభోగిరాట్శయన! మర్దితపాపవితాన! చండకోదండకళాప్రధాన! రిపుదారణశౌర్యవిరాజ

మాన! దో,ర్దండభరావనీన! ఖగరాజసమాహిత
యాన! పూతమా,ర్తాండకులీన! భక్తజనతావన
పావన! రామ. 12

చ. అతులితభక్తపోష! పరమార్థవిశేష! మణీమయ
ప్రభా, వితతవిభూష! సర్వకపివీరదయాపరితో
ష! నామవా,రితసకలప్రదోష! శబరీలలనామృ
తదాభిలాష! వా,క్పతిహృదయాబ్జపూష! రిపు
భంజనపౌరుష! రామ... 13

చ. అతులితభాగధేయ! జలజాప్తతనూజసహాయ!
భక్తసం,తతవరదాయ! దీనజనదానవిధేయ! సు
వర్ణకుండల,ద్యుతి సముదాయ! మేచకపయో
ధరకాయ! కబంధదైత్యసం,హృత సదుపాయ!
తాపససుహృత్ఫలదప్రియ! రామ... 14

చ. పవనతనూజరక్షణ! భవవ్రజశిక్షణ! దీనపోషణా!
ప్రవిమలకుంతలాభరణ! పద్మదళేక్షణ! సత్యభాష
ణా! రవికులభూషణా! త్రిదశరాట్ హృదయాం
బుజపూషణా! మునీ, ట్సవనవిఘాతరాక్షసవిదా
రణకారణ! రామ... 15

ఉ. అండజరాట్తురంగ! దనుజాధిపదర్పవిభంగ! మో
గి హృ,త్కాండజభృంగ! వానరవితానలసత్క
రుణాంతరంగ! కో,దండశరప్రసంగ! దురితాట

విపావకవిస్ఫులింగ! మా,ర్తాండజమానసాంబుజ
పతంగ! భుజాంగద రామ... 16

ఉ. నారదగానలోల! మునినాథసమాజమనోనుకూ
ల! దు,ర్వారబిడౌజనందనవిఫాల! నిరంతర ధర్మ
శీల! శృం,గారసువర్ణ చేల! మణికాంచనకుండల
కాంతిజాల! వి,స్తారదయాలవాల! రిపుసంఘ
దవానల రామ... 17

ఉ. అంబుజనేత్ర నీదుచరణాబ్జయుగంబులు నాదు
మానసా,బ్జంబున నిల్పి సాధుజన సమ్మతిగా రచి
యించు పద్యకా,వ్యంబునఁ దప్పులుండిన భవత్కృ
పచేతఁ దొలంగిపోవె పం,కాంబువు చిల్లవిత్తున
నవామలమైనటు రామ... 18

ఉ. అండజవాహనుండు కనకాంబరభూషితుఁ డవ్య
యుండు వే,దండవరప్రదాయుఁ డరితండదవా
నలుఁ డద్రిజేశకో,దండవిఖండనుండు నగు దైవ
ము నీవని నమ్మియుంటి బ్ర,హ్మాండ సహస్రనా
యక! హారాబ్జజ సన్నుత! రామ... 19

ఉ. శ్రీమహనీయమూ_ర్తికి, విశేషవచః పరిపూ_ర్తికి,
స్మహా, ద్ధామదయానువ_ర్తికి, సుదంచితకీ_ర్తికి,
రామమూ_ర్తికి,న్వేరు సాటిలేదనుచు వేడుక
ఘంటికమ్రోఁతలొప్పనీ, నామముదిక్కులవ్వినఁగ
నంగ నొనర్చెద రామ.... 20

ఉ. క్రక్కున గాలకింకరనికాయము డాయఁగ నం
తలోన మున్నిక్కిలి వాతపైత్యములు మించఁగ
నప్పుడు నీకు దలంపఁగా, నెకొనదాత్మ మీస్మర
ణ నే నొనరించెద నిప్పుడే మది,న్మక్కువతోడఁ
బ్రోవు మిఁక నారదవందిత రామ... 21

ఉ. కుక్షి నజాండపంక్తు లొనఁగూర్చి జనంబులఁ
బ్రోదిసేయఁగా, దక్షుఁడవీవ ప్రోచుటకుఁ దండ్రివి
నీతనయుండ నన్ను సం,రక్షణ చేసి జన్మజలరాశి
తరింపఁగఁ జేయుదంచు నే,దీక్షవహించినాఁడఁ గడ
తేరఁగఁ జేయుము రామ.... 22

చ. బలమదగర్వభావమున బాహుయుగోజ్జ్వలదు
ష్టకర్ముఁడై, జలనిధిడాఁగియున్న శ్రుతిచౌర్యవినీ
తుని రాక్షసేంద్రుని,జెలఁగివధించి వేదములు చే
కొని బ్రహ్మకు మత్స్యమూర్తివై,వెలయఁగనిచ్చి
ప్రోచితివి వేడుకమీఱఁగ రామ... 23

చ. మహితసుధాబ్ధి భాండముగ, మందరశైలము మం
థనంబుగా,నహి తరిత్రాడుగాఁగొని సురాసురసం
ఘము వార్ధిఁదర్వ ని,మ్మహిచలియింప దిక్కరులు
మానుగ క్షితివహింపఁ గూర్మమై, విహితముగా
ధరాధరము వేడుకనెత్తవె రామ.... 24

చ. ప్రబలమదాతిరేకమున బాహుయుగోద్ధతి పెం

పుమీఁఱఁగ, న్విబుధవరేణ్యుఁబట్టి పరివేసనచే
నలయించి క్రూరత, న్నిబిడధరాతలంబు కడు
నేర్పునఁజుట్టిన హేమనేత్రునిన్, సబలతఘో
ణివై తునిమి సంభ్రమమొందవె రామ.... 25

చ. శుంభదనర్గళప్రబలశోభిత వీరనృసింహమూర్తివై
స్తంభమునందున న్వెడలి దారుణవిక్రమబాహు
శక్తి ను, జృంభణచే మదాన్వితకుచేష్టుని దుష్టు
నిఁ బుత్రఘాతుకు, స్తంభనమొప్పఁ ద్రుంచి సుతు
కోర్కు లొసంగినరామ... 26

ఉ. పాదయుగంబు భూగగనభాగముల న్బ్రసరింపఁ
జేసి స, మ్మోదమున న్బలీంద్రుని నమోఘుచము
త్కృతితో నణంచి దే,వాదిమునీంద్రులెల్లఁ గొ
నియాడఁగ ధారుణి వజ్రికిచ్చి సం, పాదితదివ్య
కీర్తివగు వామనమూర్తివి రామ... 27

ఉ. వీరభుజప్రతాపపృథివీశుల నిర్వది యొక్కమారు
నే,పారఁగఁద్రుంచి పార్థివజనావళి రక్తముచేఁ బి
తృక్రియల్, సార మొనర్పఁజేసి త్రిదశవ్రజ
మెన్నఁగ విప్రకోటికిన్, ధారుణిధారవోసితివి
తథ్యము భార్గవరామ... 28

చ. తరణికులంబునన్ దశరథక్షితిభర్తకుఁబుట్టి జాన
కి, న్బరిణయమొంది కాననివాసముచేసి విరాధ

దైత్య సం, హారణమొనర్చి వానరసహాయము
గైకొని పం_క్తికంఠుని, స్థరమునఁ బట్టిత్రుంచితివి
తోయజలోచన రామ... 29

చ. వెలువక నా ప్రబలంబుఁడొగి వెన్నుననిన్ను ధరించి
యాడఁగా,నరుగఁగవానిమాయఁగని హ_స్తతలం
బునఁ దద్దురాత్ముని, న్నిరముఁబగిల్చినావు కురు
సింహునిగర్వమణంగ నాఁగటఁ, గరిపురమెత్తు
సీరివి జగన్నుతదైవమ రామ... 30

చ. యదుకులదుగ్ధసాగరసుధాకరుఁడై దగుకృష్ణ
మూ_ర్తివై,ముదమున లోకబాధకుల మూర్ఖబక
ప్రముఖాసురాదుల, న్గదనమున న్వధించి శిశు
ఘాతుకదుష్టునిఁ గంసుఁద్రుంచి పెం, పొదవఁగ
న్నుగ్రసేనునకు నుర్వినొసంగిన రామ... 31

చ. త్రిపురములం దహింపఁగ సతీశునికస్త్రమ వౌచు
నంతపైఁ, ద్రిపురసతు ల్పతివ్రతల్ గొనఁగఁ దేజు
న రావిని యావరించి త, ద్విపులసతీవ్రతంబు వి
డిపింపఁగ నీవిటుబుద్ధరూపుదా, ల్చిపుడిల నెన్న
శౌర్యమతి నీవె మురాంతక రామ... 32

చ. ధరణినిఁ గల్కిరూపమును దాల్చిజగంబుల దుష్ట
వర్గసం, కరమనుజాళిఁజూచి తురగంబును నెక్కి
దురంతసంభము, ష్కరుల హరించి బాహుబల

శౌర్యసముజ్జ్వలదుగ్రశక్తివి, స్ఫురణవహించి స
జ్జనులఁ బ్రోతువు నీవిఁక రామ... 33

చ. పరమదయాంబురాశినినుఁ బల్కుదు మామకమా
నసంబునన్, నిరతము సన్నుతించెదను నిత్యము
నన్గృపఁజూచి ప్రోవుమీ, శరణని వేఁడితి న్విమల
సారసనాభ సురేంద్రసేవితా, తరణిశశాంక
లోచన శతారధరస్తుత రామ... 34

ఉ. సూరిజనాళిపాల! మణిశోభితకుండలకాంతిజాల!
యక్రూరమనోనుకూల! శరకుందసితాజ్జయశో
విశాల! బృం,దారక హృద్విలోల! విబుధద్విష
దీశవిఫాల! పాపసం, చారవిపక్షకాల! మురసా
క్ష్యఘునినాలరామ... 35

ఉ.తల్లివితండ్రివీవ!పరతత్త్వము నీవ!సఖుండవీవ!నా,
తొల్లిగురుండవీవ! హతదోషుఁడవీవ! పరుండ
వీవ! సం, ఫుల్లసరోజనేత్ర! పరిపూర్ణదయాం
బుధి వీవ! మేదినీ, వల్లభదైవమీవ! యపవర్గశు
భప్రదరామ... 36

ఉ. పూరిశరంబుగావిడువ భూరిభయంబున మూఁడు
లోకముల్, చేరి చరింప రక్షకుఁడు చిక్కక
యున్నఁ గలంగి త్రాతగాఁ, గోరినకాక దానవుని
కోర్కు లొసంగితివయ్య నీదు దు, ర్వారమ
హత్త్వ మెన్నఁగ సురాళికశక్యము రామ... 37

ఉ. పొంచి రఘూద్వహుండు ధనువు న్గుణరావమొ
నర్చి లక్ష్యము, న్గాంచి మహోగ్రదివ్యవిశిఖం
బున భూస్థలిఁ గూల వాలిభం, జించి పతంగపుత్ర
కునిఁ జేకొని రాజ్య మొసంగి వానిక, భ్యంచిత
లీలఁ గామిత వరాళినొసంగవె రామ... 38

చ. కడువడితోడ మీపనులఁ గాంతుజనింప సమీ
హింతేచ్ఛచే, నుడుగక వాలమం దిడి మహో
ర్జితసైకతజాల మంబుధి, న్విడువక వేయున
య్యుడుత వీపు పయిం దొరలాడఁ జేతితోఁ,
దడయక దువ్వి బ్రోచితివి దైత్యవిభంజనరామ.

ఉ. వాచవిఁగొన్న తియ్యని నవాయతపక్వఫలంబు
లాత్మకుఁ, నీచము గాఁ దలంపకయ నిస్తులలీల
భుజించి ప్రీతిచే, గాచఁ దలంచి యిష్ట శుభకా
మఫలంబు లొసంగి వేడ్కతోఁ, గాచవె సత్కృ
పఁ శబరి కామిని నీవిల రామ... 40

ఉ. శ్రీకర పుణ్యమూర్తి వని చిత్తమునందు మునీంద్రు
లెల్ల నీ, రాకను గోరియుండి మదిరంజిలుచుఁ
వినతాంతరంగులై, చేకొనఁ బూర్ణశీతకరుఁ
జేరు చకోరనికాయమట్ల నీ, ప్రాకట సత్కృ
పోన్నతికిఁ బొల్పడియుండరె రామ... 41

ఉ. నక్రమవక్రవిక్రమమునం జలమందుఁ బదంబుపట్టి

ని,ర్వక్రతతోఁ బెనంగఁగను వారణరా జతిభీత
చిత్తుఁడై, చక్రిహరి రమేశ నను సత్కృప
సేయు మఁటన్న నక్రముఁ, జక్రముచే హరించి
గజసత్తముఁ బ్రోచినరామ... 42

ఉ. లేఁగల గోపబాలకుల లీల విరించి హరింప వే
డ్కచే, బాగుగ బాలురఁ బశుల బ్రహ్మల సృష్టి
యొనర్ప క్షితిలోఁ, దూఁగఁగ ధాత మ్రొక్కిన
విదోషునిఁజేసితి వట్టి సత్కృప, నేఁగమె నాపయిం
బఱపి వేమఱుప్రోవుము రామ... 43

ఉ. గోవుల గోపబాలకుల గోపికలఁ వెసఁజుట్టి
ముట్టుచుఁ, గావురు రీతిచేఁ బొదివి కారుపా
గల్ గుమికూడ భీతులై, గావుము కృష్ణకృష్ణ
యనగమ్యదవాగ్ని హరించి సత్కృపం, బ్రోవవె
మున్ను వారల నిరూఢిగ సంభ్రమ రామ...

ఉ. అండలఁ జేరకుండ భుజగాధిపు బైఁ బవళించి వెం
టరా,కుండ ఖగేంద్రవాహనముగూడి వసించెడి
పట్టు చూడరా, కుండఁ బయోధిమధ్యమునఁ
గూర్మివసించితి వింక నెట్లు నీదండకుఁ జేరుటొ
ప్పు నీక దైత్యవిభంజనరామ... 45

చ. పరమదయార్ద్రమూర్తివని ప్రస్తుతిచేయఁగఁ
బల్కవేమయో, సరసిజనేత్ర! మీచరణ సారస

భక్తుని నార్తచిత్తునిఁ, గరుణ యొకింత లేక యి
ట్టుఁ గావకయున్నను జూచి నిన్ను ని,ర్ధరణిఁ గృ
పామయుండ వని దల్తురె భక్తులు రామ... 46

ఉ. వేదచతుష్టయంబునను విశ్రుతమైన భవత్ప్రతా
పము, న్వాదన చేయఁజాల మిము వాసిగ నమ్మితి
నయ్య దాసులఁ, వేదన సేయ నేల దయ వేడుక
పుట్టదె యింక నేమొకో, యాదర మొప్పఁ బ్రోచు
టకు నర్హత లేదొకో రామ... 47

ఉ. దాసుఁడ నంటి మీకథ లుదారత నేను దలంచు
చుంటి నేఁ, గాసుకుగవ్వకైనఁ గొఱగాని మను
ష్యుఁడ సంతతంబు నే, వేసట లేక నిన్ను మొఱవె
ట్టుచు వేఁడిన రావదేమయా, భాసురచిద్విలాస
గతిఁ బాటిల నీవిఁక రామ... 48

ఉ. సారథివై సదాప్రియ విశాలుఁడవై హితబాం
ధవుండవై, తారకమూర్తివై పరమధన్యుఁడవై
కరుణారసుండవై, భూరిగుణాబ్ధివైనను విముక్తి
నిఁ జేయుమఁటన్నఁ బార్థునిం, పూరఁగఁ బ్రోచి
తీవె పురుషోత్తమ నీవిఁక రామ... 49

ఉ. ఎంతని యెంతు నిన్ను మఱియెంతని దూరుదు
సాధువృత్తిచే, నెంతని విన్నవింతు నిఁక నెంతకు
నిన్నినుతిప్రసంగమే, నెంతగఁ జేసినఁ మనస దేల

కరంగదదేమి భారమో, శాంతదయాసముద్ర
జలజాతవిలోచన రామ... 50

చ. పతితుఁడఁ బాపమానసుఁడ భక్తివిహీనుఁడఁ
బాపకర్ముఁడ, న్మతిరహితుండ లాలసుఁడ మానవి
దూరుఁడమత్తచిత్తుఁడ,న్వితతమతప్రదూషకుఁడ
విశ్రుత సజ్జన సంశకుండ దుష్కృతుఁడను నన్ను
సత్కృపను శీఘ్రిము ప్రోవవె రామ.... 51

చ. నలినదళాయతాక్ష!రవినందనవాయుతనూజరక్ష!
సత్కలిత విశాలవక్ష ! వినుతాఖిల దానవనాథ
శిక్ష! దుష్కలుషవినాశదక్ష ! బలశౌర్యవిరాధ
విపక్ష! యోగిరాట్సులలితకల్పవృక్ష! ఘనసద్గుణ
లక్షణరామ.... 52

ఉ. శ్రీరఘువంశతోయనిధి శీతమయూఖుఁడు సేవ
కామరభూరుహంబుఁ డద్రిజాదయితచాప విఖం
డనుఁ డప్రమేయుఁడుఖ్, సారసనాభుఁడే కృపను
సారెకుఁ బ్రోచునంటంచు మీాపదాం, భోరుహా
ముల్ మదిం దలంతు భూమిసుతావర రామ.

ఉ. శారదనీరదేభరిపుశర్వసుపర్వ గజాశ్వభారతీ,
తారతుషారహీరకలధౌతమహీధరనాకవాహినీ,
పూరమరాళ దేవవృషపుంగవకామగవీసుధాబ్ధి
మం,దారఫణీంద్ర శుంభదవదాత యశస్కర
రామ... 54

చ. మనవి వినంగరాదె పరమార్థవిశేషముచూప
రాదె నీ,మనమున నిల్పరాదె సుకుమారసుల
క్ష్యము చూపరాదె నా,వినయము చూడరాదఁ
టవె వీనులకు న్వినవింపురాదె యో,వనజదళా
యతాక్ష నను వారక ప్రోవవె రామ... 55

ఉ. యవ్వనవేళలందున మదాంధుఁడనై కుజనోరు
సంగతిన్,నవ్వులఁజేరి దుర్విషయ తత్పరతం గడు
దుష్టబుద్ధిచే, నవ్వుచు రౌరవాదుల ఘనంబుగఁ
గూలెదు దుర్మనీషినై, క్రొవ్వుచు నీపదంబు మ
దిఁగోరకయుంటిని రామ.... 56

చ. నిరతము నీపదాబ్జములు నిక్కముగా మదిలోన
నిల్పెదన్, పరమదయాసముద్ర నను పాలనసే
యఁగ నీవె సుమ్ము భా,సురగతినాదు నేరములు
శ్రోత్రపథంబునఁబెట్టి కిప్పుడే,ధరధరధీర! పోషిత
మదావళ నాయక రామ... 57

ఉ. దానవవైరులందఱును దైత్యులకై త్రిదివంబుఁ
బాసి యో, దీనశరణ్యమూర్తియని దీనత నిన్గొ
నియాడ వారికిం, పూర మహాదరంబున సముజ్జ్వ
లమోదముతోడ దైత్యరా,ట్సేనలఁజంపి దైవము
ని సిద్ధులఁబ్రోచిన రామ... 58

ఉ. నే భవదాశ్రయుండ ఘననిర్మలదాతవు నీవె యం

చు ని, న్నే భజియింతునయ్య మఱియేగతికైన
ను సాక్షి నీవయో, శోభనసంపద న్మిగులఁ జొన్ప
డఁ జేయను నీవె గావునన్, లాభమొసంగనమ్మి
తిని లంపట దీర్పుము రామ... 59

చ. తనయులఁ బెంచు తల్లివలెఁ దాలిమిగల్గిన తండ్రి
కైవడిన్, ఘనముగ దీనసంఘములఁ గాచు నృపా
లకురీతి నీవు న, న్ననవరతంబు దాసుఁ డని యం
చిత భక్తి విలాసవైఖరి, న్మనమున సంఘటించి
దయమానుగఁ బ్రోవవె రామ... 60

ఉ. ఏనిరుపాధికుండ నని యెంతయు వేఁడినఁబ్రోవ వం
తటం, బూనికతోడ నన్నుఁ బరిపూర్ణదయారస
దృష్టిఁజూడవే, మానితనీతిసాంద్ర! యసమాన
పరాక్రమ! భక్తసన్నుతా, ధీనయశౌర్యధుర్య! జ
గతీతనయేశ్వర రామ... 61

ఉ. చూచితి గౌతమీ నదినిఁ జూచితి భద్రనగాధి
రాజ ము, న్జూచితి జానకీసతినిఁ జూచితి వాయు
తనూజముఖ్యులం, జూచితి నిన్ను లక్ష్మణునిఁ జూ
చితి శత్రునిషూదనాదులం, జూచితి పూర్ణభావ
మున నూటిగ నిన్నును రామ... 62

ఉ. కామముగోరి సంతతవికారమున న్బడి క్రోధయు
క్తులై, వేమఱు లోభమున్విడక వెంటనె మోహా
మదాతిమత్తులై, యేమర కిన్న రాధములు హే

చ్చగుమత్సరభావలోలులై, నీమహిఁగందరట్లు
గుట నేను భజింతును రామ... 63

ఉ. పూసల సూత్రముండు గతిఁబూని జగంబున నీదు
రూపముల్, దాసులకబ్బుఁగాక మఱితావకలీల
లుచెప్ప శక్యమా, వాసిగ నీపదంబుఁ గనువారికిఁ
జింతన వేఱలేదయా, రోసితి యీకళేబరము
రోంపినిఁ ద్రోయకు రామ... 64

ఉ. అండజగర్భజాదిబహుళాంగములన్నియునీటిపైఁ
గడుం,దండిగబుద్బుదాకృతులుదాల్చిన నచ్చుఁద
లంచి సూక్ష్మమై, యుండుటగాంచు దెల్విఁగ
నుసుత్తములెవ్వరో వారె నీవయా,పండితులైన
వారలిటు ప్రస్తుతిసల్పరె రామ... 65

ఉ. దీనదయాలవాల! భవదీపితభంజనశీల! యార్త
స, మ్మానప్రమోదలీల! మునిమానసనృత్యవి
నోదఖేల! దు,ర్మానవరాడ్విఘాల! గజరాజహృద
బ్జసదానుకూల! ప్రాచీనమునీంద్రసంచయవిశేష
సుపాలనరామ... 66

ఉ. ఘోషజనానుమోద! ముచుకుందముఖార్చిత
పాద! భక్తిసం, తోషవచోవినోద! రిపుదోర్బ
లశౌర్యవిభేద! సత్యసం, భాషణవాద! దుష్టశి
శుపాలవిఖండనచక్రనాద! దు, ర్దోషఖరాసుర
ప్రముఖదుష్టనిషూదన రామ... 67

చ. అతిదురవస్థలంబడి సదార్తుఁడనై మొఱవెట్టుచు
న్న మీ, మతికఱఁగంగబోవదిది మంచిగుణంబె?
భవత్కృపారసా, మృతజలబిందుసేచనము మి
క్కిలి దీనుఁడ నైన నాపయిఁ, సతతముగల్గఁజే
యుమిఁక సాధుజనావనరామ... 68

ఉ. అన్యసుఖోపభోగములకాశలనొందుచు ముందు
గానకే, ధన్యుఁడనంచు దుర్విషయతత్పరతంగడు
హీనబుద్ధినై, యన్యమతాభిలాషకుల యాశ్రయ
మొంది పశుప్రవృత్తిచే, మాన్యభవన్మహామహి
మ మర్త్యుఁ డెఱుంగఁడు రామ... 69

ఉ. పావనమౌ భవత్కథలఁ బాల్పడి నే వినలేదు
ప్రీతిచే, భావములోన మీ చరణపద్మయుగం
బులు గొల్వలేదు సం, భావనచేయలేదు నిను
స్వాంతమునం దతినిష్ఠభక్తిచే, సేవయొనర్పలే
దు ననుఁ జేకొని గావుము రామ... 70

ఉ. కామసుఖోపభోగములఁ గాముకులై యిహ
సౌఖ్యసంగులై, పామరచిత్తులై భవముఁబాయ
నుపాయము గానలేకయు, న్వేమఱుమోహవా
ర్ధిఁబడి వేదనలం బరితాపయుక్తులౌ, సోమరిపో
తులేగతినిఁ జూతురు నిన్నుల రామ... 71

ఉ. శ్రీమహనీయచిత్తసరసీరుహసారసమిత్ర! జానకీ,
రామధరాధినాథ! రవికోటిసమానవిరాజమాన!

సు, త్రామసనందనాదినుత! దైత్యవిలుంఠనబాణ
తూణ! సం, గ్రామమహోగ్రదివ్యమణి కంకణ
భూషణ రామ... 72

ఉ. నీపదభక్తిగల్గి కడునిర్మలులై నరకాదియాతన, ల్దీపి
తయుక్తిచే నణఁచి ధీయుతులై విలసిల్లువార లే,
తాపములొందరీవు భవతారకమూర్తివి నిన్నుఁ
గొల్తుఁ జి, ద్రూపభవత్పదాబ్జములు రూఢిగఁజూ
పవె రామ... 73

ఉ. నారదశౌనకాబ్జజసనందన మానసపద్మలోల డిం,
డీరశశాంకపారద పటీరసితాబ్జయశోవిశాల! దు,
ర్వారమృగాసుర ప్రముఖ వర్గవిఫాల! కుచేలర
క్షణా,పారకృపాలవాల! పరిపంథిదవానల! రామ.

చ. సనకసనందనాద్యమరసన్నుత! భాస్కర వంశజాత!
కాం, చననవరత్నసంఘటితచారువిభూషణభూషి
తా! ప్రభం, జనసుతభానుజార్జిత! నిశాచరసం
హృత! నిర్జరేంద్రనం, దన! జితఘోరపాతకవితా
ననివారిత! రామ... 75

చ. చిలువనశించెఁగానమునఁ జిక్కె మదేభము మైన
సంబుకు, న్బొలుపుగ మీనువాచవికిఁ బోయియ
ణంగెఁ గృశానుదీప్తికిం, బొలసెనుసిల్గితావికినిఁ
బోయిచెడె న్భ్రమరంబుగాననీ, ఖలగుణపంచకం
బులను గడ్చుటశక్యమె రామ... 76

ఉ. వంచనసేయనేల! యనివారితసత్కృపగావవేల! న,న్నించుకచూడవేల! మదినెంచెద నీకథలెల్లఁ జాల! నీ,వంచనచిత్తమేల! ననువాసిగఁ జూడవి వాదమేల! మి,మ్మెంచగ నేనుచాల మది నెంచుచునుంటిని రామ... 77

చ. సతతముమీపదాబ్జముల సన్నిధిగోరుచు సంప్ర మోదులై,వితతసమస్తదోషముల వృత్తినణంచి యకల్మషాత్ములై, హితమగురామమంత్రమును నిష్టమున న్బఠియించువాఁడనే, యతులితభక్తి నిన్నుఁ గొనియాడరె యుర్విని రామ... 78

ఉ. ఎంతనిదూరువాఁడ నిఁకనెంతకు నే వినుతించువాఁడ మీ,కెంతనిదెల్పువాఁడ నిపుడెంతకు యాచనసేయువాఁడ నే, నెంతనియెంచువాఁడ మఱియెంతగ నే మొఱవెట్టువాఁడ నా, చింత భవన్మనంబున వసింపఁగఁ జేయుము రామ....79

చ. ముదమలరంగ సద్గురువిబోధనచేఁ బరిపూర్ణచిత్తులై,వదలక నీదునామరసపానమున స్మదితాంతరంగులై, సమలభక్తిచే సతతశాంతితిరస్కృతఖేదమోదులై,చెదరనిబుద్ధిభక్తు లిల సేవయొనర్తురు రామ... 80

ఉ. దారసుతాళిరక్షణ కుదారమహీశులవద్దఁ జేరి వేసారక మాటిమాటికిని సంస్తుతిచేసిన పాపసం

ఘము, ల్పారఁగఁదోఁల నిన్నొగి నుపాసనచేసెద
సంతసంబునన్, సారదయాప్తిఁ గైకొనుచు సద్గతి
నీఁగదె రామ... 81

చ. జలధరదేహ నామనవి శ్రావ్యముగా వినకున్న భా
వము, న్దెలిసి మనంబులోనఁ గడుదీనత నొందుచు
న్నున్న నాయెడ, న్మెలఁగుటకై నిజంబుగ నిమీ
లితనేత్రుఁడనౌచు నెమ్మదిం, దలఁచుచు నున్న
నాతలఁపుఁ దప్పక దీర్పుము రామ... 82

చ అనవరతంబు మీమహితు లాత్మగతంబున నిల్పి
గాదె స, న్మునివరులెల్ల యోగపరిపూర్ణసమాధి
వినిశ్చలాత్ములై, మనమున సన్నుతించుచుఁ బ్ర
మాద పరిభ్రమ లేమిలేక యే, మునుఁగుచును
న్వినోదముల మోదమునొందరె రామ... 83

ఉ. మోహరసాబ్ధిలోఁబడి ప్రమోదమున న్విషయా
తురంబున, న్సాహసధుర్యులై సతులసంగతులం
బడి తాపయుక్తులై, దాహము దీఱ నారిసుర
తంబులనే రుచిగాఁ దలంచి సం, మోహనిబద్ధులై
చెడిరి మూర్ఖులు భూస్థలి రామ... 84

ఉ శ్రీకరభక్తచిత్త సరసీరుహ బంధురచంచరీక సు,
శ్లోక సురారివారక వసుంధరనాయక! రావణాంత
కా, ప్రాకటనిర్జరప్రముఖపాలక! కాంచనకుండల
ప్రభా, నీకఫలప్రదాయక! వినిర్జితపాతక రామ.

చ. తలఁచెద నీదుమంత్రము సదా_ర్తినివృ_త్తికినిష్టసిద్ధి
కై, కొలిచెద జానకీరమణ కోరికదీర్చు ప్రసన్న
దృష్టికై, నిలిచెద నాత్మనిశ్చలత నీరజలోచన
మోక్షకామినై, పిలిచెద నిన్ను యోగిజనబృంద
ము గూడెద రామ... 86

ఉ. అంగజసుందరాంగ విహగాధిపదివ్యతురంగ సా
ధుస, త్సంగ! ఫణాయతాంబుధినిషంగ! మదత్రి
దశాహితాబ్జమా, తంగ! మునిప్రసంగ! దురిత
వ్రజగాఢతమఃపతంగ! సా, రంగ! హృదబ్జ భృం
గ! సుహిరణ్యకురంగద! రామ... 87

చ. జలచరశంఖచక్రహలచాపగజాంకుశ వక్రచారు
రో, జ్జ్వలహయపద్మ భృంగకులిశధ్వజ కల్పల
తాకిరీటరే, ఖలఁ జెలువొందు మీచరణ కంజ
పరాగము సోఁకినంతనే, శిలరుచిరాంగనామణి
గఁ జెన్ను వహింపదె రామ... 88

చ. జలదశరీరభాస మునిసంచయచి_త్తనిశాంతవాస
మం, జులదరహాస రత్నమయశోభితకుండల సద్వి
కాస యు, జ్జ్వలతరపీతవాస నవచంపకపుష్పస
మాననాస స, ల్లలితవిలాస రాసభబలాసురనా
శక రామ... 89

చ. భవహరమైన మీమహిమ భావగతంబున నిల్చి
కీ_ర్తనల్, కవివరులుఁ నుతింప విని కల్మషఘో

రతమార్కమూర్తి వై, ప్రవిమలమా భవత్ప
దముఁ బ్రాపుగఁ జేరెద నన్నుఁబ్రోవుమీ, శివకర
భక్తపాలన విశేషయశోజ్వల రామ... 90

ఉ. నిన్ననిశంబునుం బొగడ నేరని నోరొకపాడుబొం
దఁగా, నెన్నదగుం దలంచుటకు నిత్యముగాని
కళేబరంబు పెం, పెన్నగఁ గొల్మితిత్తియన నెన్నఁ
బడుణ్ నినుఁజూడనట్టి యా, కన్నులు కుడ్యరం
ధ్రములుగావఁటె గన్గొన రామ... 91

చ. రయమున నీదుపూజను గరంబుగఁజేయని చేతు
లేల స, న్నయముగ నిన్నుఁగోరని మనంబది
యేల వినోదలీలల, న్నియతిగ నిన్ను నెంచని
మనీషయదేల దలంప నన్నియుణ్, నియతము
గావు భక్తులను నెమ్మది కెక్కవు రామ... 92

ఉ. కారణజీవకోటులకుఁ గాయములో వెలి మధ్య
మందు నిం, డారగనుండు దైవమని హర్షమునం
దగ నీదునామముల్, ధీరులకే నుతింపనగు దివ్య
తరాకృతివైన నిన్ను వే, మాఱుగ శాస్త్రజాల
ములు మానుగఁబల్కవె రామ... 93

ఉ. నీపదపద్మరేణువుల నేరుపహల్య యెఱుంగుఁగాని
నీ, తాపభయానకంబు లొాగి దాసుల కెన్నఁడు
పెట్టరాదు నీ, ప్రాపునఁజేరి నిన్నెపుడు ప్రస్తుతి

చేయుచునున్న యట్టినా, యాపదలెల్లఁ ద్రోలు
టకు నర్హముగాదఁటె రామ... 94

ఉ. నీపదపద్మరేణువులనేరు పహల్యయెఱుంగుఁగాని
నీ,రూపము రావణానుజుఁ డెఱుంగునుగాని
భవత్ప్రభావ మ, గ్గోపతి నారదుండెఱుఁగు
క్రూరుఁడ నేఁ దెలియంగఁజాల నా, తాపము
లెల్లఁ దీర్చుటకు దాతవు నీవిఁక రామ... 95

ఉ. ఇష్టముతోడ మిమ్ము భజియింపఁగ నింతపరాక
దేల నా, యిష్టముదీర్ప మీమది కభీష్టముగాదె
భరించువారలే, కష్టముగాఁ దలంపనిఁక గావఁగ
నేరిఁక నిట్టికష్టముల్, నష్టమొనర్చి ప్రోవుమిఁక
నన్నుఁ బ్రసన్నత రామ... 96

చ. తనయుఁడవై దయారసతఁదారకమంత్రమునాకొ
సంగవే, యనవిని దేవహూతికి సమంచితమంత్ర
రహస్య మంతయున్, మనమున నిండఁజెప్ప కడు
మానితమోక్ష మొసంగినట్లనా, మనమునఁ గో
ర్కెదీర్చి నను మన్ననచేయవె రామ... 97

చ. నినుమదిఁ గోరినమ్మినను నేరము లెంచిన నేమిచే
యువాఁ, డను గృప నన్ను వేడుకను డాయఁగఁ
రావె యవస్థలన్నియు, న్మనుకొని మీకుఁ
దేటపడ ముందుగ నేఁ దగవిన్నవించితిన్, గనుఁ
గొని కావకున్న ననుఁ గావఁగ నెవ్వరు రామ.

చ. దారవని నిన్ను నేఁగొలిచి దోసముఁ బాసితి
నింక నీవు నా, మొర వినవేల మాధవ! సము
జ్జ్వలభూరికృపారసంబుచే, నరయవదేల ఘోర
దురితాంబుధియందు మునుంగఁజాల నీ, మఱుఁ
గునఁ జేరినాఁడ మటుమాయలఁ బెట్టకు రామ.

ఉ. నారదగాన లీన! ఖగనాయకయానవిభాసమాన!
విస్తారమహోగ్రదుష్కృత వితానవిదారణస
న్నిధాన బృం,దారకనాథవహ్ని హరిదశ్వసు
తాస్రపజీవనాధిరా, ణ్మారుతరాజరాజ శివనారద
రక్షణ రామ... 100

చ. పరమదయాసముద్ర భవబంధవిమోచన బాణ
తూణ వి, స్ఫురదరవిందనేత్ర సురపూజిత
కంఠలసద్విభూషణో, త్కరదశకంఠలుంఠ మగు
తావకకీర్తిలతాంగికంబురు, ట్సరములుగాఁగ
నాకవితసారె కొసంగెద రామ... 101

ఉ. శ్రీయుతకాశ్యపాన్వయ సరిద్వర శీతకరుండు
పల్లివం, శీయుఁ డనంగ నొప్పు నరసింహకవీంద్రు
న కాత్మజుండనే, నోయతులప్రభావ లసదుత్పల
మాలలు నీకొసంగెదఁ, బాయక పార్వతీశుఁ
డను భక్తుఁడఁ బ్రోవుము రామ... 102

శ్రీరామరాఘవశతకము సంపూర్ణము.

---

# పీఠిక.

ఈరామప్రభుశతకము వ్రాసినకవి కాశ్యపగోత్రుఁడనియు కామేశ్వరాఖ్యుఁడనియు నిందలి మూఁడవ పద్యమువలనఁ దెలియుచున్నది. ఇందలిపద్యములు మనోహరమగుశైలిలో ధారాశుద్ధిగలిగి కేవల భక్తి రసోద్దీపకములుగా నలరారుచున్నవి. ఇతరపద్యానుకరణము లీశతకమునఁ గొలఁదిగాఁ గలవు. కవి తానువయోఽతిరేకంబునఁ గామాంధతచే వర్తించితిననియు జీవితమంతయు రాజసేవచే గడిపితిననియు బాల్యమున నార్జించిన విద్యావివేకాదికములను బరమార్థచింతనమున కుపయోగింపనైతినని పశ్చాత్తాపము నొందుచుఁ బలవించుచుఁ బద్యములు వ్రాసినటుల నాయాతావులఁ గలపద్యములు బోధించుచున్నవి.

శ్రీమన్నారాయణుని లీలావిశేషంబుల మానవులు పెక్కువిధంబుల వర్ణించుట సహజంబు. అందు నెక్కువఁగ శతకరూపముగ లోకంబున భక్తివర్ణనం బగపడుచున్నది. ఎందఱెన్నివిధంబులఁ గొల్చినను బరమేశ్వరుండు సర్వాంతర్యామియేగాన సముండయి యందఱఁ బ్రోచుచుండు.

ధారాశుద్ధియుఁ బరితాపవిధము జూడ నీగ్రంథము కవికిఁ దుదిపాత్తమనియే తోఁచును. పలుతావుల వ్యాకరణదోషములు గానవచ్చుచున్నవి. కేవల భక్తిపారవశ్యమునఁ బశ్చాత్తాప మొందుటఁజేగూడ

ఛందోవ్యాకరణాదినిర్బంధశృంఖలలకు లోనుగావ లెనా యని కవి స్వతంత్రించినటుల నిందలివ్యాకరణదోషములు తెలుపుచున్నవి. మొదటినుండి కడమ వఱకీశతకము కవికి దుదిగ్రంథమనియే తెలుపుచున్నది. ఈకవి యౌవనమునగోపాలలీలాసుధాలహరి యనుప్రబంధము మూఁడాశ్వాసములుగ వ్రాసెను. ఈతనియింటిపేరు ప్రయాగవారనియు, వైదికబ్రాహ్మణుఁడనియు, సర్వేశ్వరపుత్త్రుఁడనియు నాప్రబంధమునఁ గలదు. గోపాలలీలాసుధాలహరి కేవలశృంగారరసముతోఁ దులతూఁగుచున్నది. గోపాలలీలాసుధాలహరి రామతీర్థస్వామి కంకితము గావింపఁబడుటవలనను కవివంశావతారాదికమువలనను ఇతఁడు విశాఖపట్టణమండలమునకుఁ జెందినవాఁడని యూహచేయ వీలుకలుగుచున్నది. ఈశతకలిఖితప్రతిమాడుగులలోఁ జిక్కుటయుఁ గవి విశాఖపట్టణముమండలమువాఁడనుట కొకతార్కాణము. ఈకవి యిప్పటికి నూటయిఱువదిసంవత్సరముల క్రిందనున్నటులఁ జెప్పుచున్నారు.

ఈశతకము వ్రాతప్రతి మాకంపిన విశాఖపట్ణము జిల్లా మాడుగులవాస్తవ్యులు శ్రీయుత బీ. సీ. వై. నారాయణశర్మగారు వందనీయులు.

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీ ర స్తు.

ప్రయాగ కామేశ్వరకవికృత

# శ్రీ రా మ ప్ర భు శ త క ము.

---

శా. శ్రీమత్తారకనామ రామ జయలక్ష్మీధామ నీలాం
బుద, శ్యామా వైరివిరామ రూపలలితశ్యామా
వళీకామ సం, గ్రామోద్దామ రచింతు వృత్తశత
కగ్రంథంబు నీ పేర ని, ష్కామాసక్తిని సావ
ధానమతి నాకర్ణింపు రామప్రభో. 1

శా. నానామౌనిజనార్చనీయ మగు నీనామంబు
సద్భక్తి స, న్మానోదారసలక్షణాంచితలసన్మత్తేభ
శార్దూలవృ, త్తానీకస్థితసూత్ర సూచితసువర్ణా
లంకృతప్రాప్తి సం, ధానాస్మద్వచనాళి హారగత
రత్నంబయ్యె రామప్రభో. 2

శా. శ్రీమత్కాశ్యపగోత్రసంభవుఁడ నుర్వీదేవవం
శ్యుండ ని, ష్కామాసక్తుఁడ సత్కవిప్రియ
మతిం గామేశ్వరాభిఖ్యుఁడన్, బ్రేమ న్నీశ్లోక
వృత్తసత్కృతి సమర్పింతు న్వచోదోషముల్,
స్వామీ సత్కృపచే క్షమింపు హరి నీలశ్యామ
రామప్రభో. 3

మ. తరుణీలాలసుఁడైన లోభమదనూత్సర్యాదిమో
హక్రియా, పరుఁడైనఁ ఖలుఁడైన దీనివినిన్
బాపౌఘవిద్వేషియై, పరమార్థైకవిశేషయుక్తి
మదినాపాదించి సుజ్ఞానత, త్పరుఁడౌ నిక్కము
నీకృపామహిమచేత న్మించి రామప్రభో. 4

మ. నరుఁడై పుట్టినవానికెల్లను భవన్నామంబు పాపా
ర్ణవో, త్తరణంబై ధరణిం జెలంగఁగ ననంత
వ్యాప్తి నీనామసం, స్మరణం బెన్నఁడుఁ జేయ
లేని నరజన్మం బేమిజన్మం బయా, పరికింప న్పశు
వైన మేలు కృతసద్భావంబు రామప్రభో. 5

శా. సంతాపోటముగాదె యంతయును సంసా
రంబుఁ జింతింప లో, సంతా దుర్మలినాకులంబె
కద మే సంతా మహారోగభీ, సంతాపాన్వితమే
కదా జగము నశ్యంబేకదా దీనికై, యెంతో
వ్యాప్తులఁ బొర్లనేమిటి కయా యీజీవి రామ
ప్రభో. 6

మ. తనువు న్నమ్మగలేదు సంపదలపై తాత్పర్యముల్
లేదు దు, ర్జనసాంగత్యము గోరలేదు మది
సంసారంబుపై లేదు కాం, చనకాంతాదుల
ప్రేమ లే దితరవాంఛల్ లేదు నీపాదసే, వనమే

కోరుచు నుంటి నమ్ము మిఁక దైవం బాన రామ
ప్రభో. 7

శా. బంధువ్రాతము నమ్మలేదు సుతసంపత్ప్రీతియుఁ
లేదు సం, బంధంబుల్ మఱిఁ గోరలేదు మది
సంపర్కంబులుఁ లేవు నీ, సంధానం బది నెమ్మది
న్నిలిపితిఁ సందేహముఁ లేదయా, గ్రంథం
బుల్ పదివే లిఁకేల నవమేఘశ్యామ రామ
ప్రభో. 8

శా. చేరఁ రాని మనుష్యులం గొలిచితిఁ సేవించితి
న్నీచులఁ, గోరఁ రాని యభీష్టకామములఁ
బెక్కు ల్గోరితిఁ జాలు సం, సారవ్యాప్తులు
నీపదాంబురుహదాస్యం బాత్మఁ గైకొంటి న,
న్నేరీతిం దరిఁ జేర్చెదో గుణనిధీ యిన్నేల
రామప్రభో. 9

శా. స్త్రీలోలైకవిశేషమత్తులు ధరిత్రీపాలు రామిాఁద
వి, ద్యాలాలిత్యము లేక యున్నతఁటి తత్సాంగ
త్యముఁ గీడగుం, శీలంబూడ్చి దురాశ వారి
దినము ల్సేవించి సేవించి నే, జాలిం బొందితి
నిన్ను జెందితి దయాసంకల్ప రామ ప్రభో. 10

మ. కరిరాజుం గరుణించినా వెలమి గంగానందనుం
బ్రోచినా, వరవిందాతీని ద్రౌపదిఁ మనిచినా

వాధర్మరాజాదులం, బరమప్రీతులఁ జేసినావు
విదురు న్బాలించినా వింక న, న్గరుణం బ్రోవఁగ
దయ్యె మ్రొక్కెదను మేఘశ్యామ రామప్రభో.

మ. మునిదారం గరుణించినావు శబరి న్మోక్షంబుఁ
జెందించినా, వినజుఁ రాజుఁ జేసినావు ధరణిఁ
బృందారకస్వామివు, త్రుని జీవింపఁగ జేసినావు
పదభక్తు న్గుంభకర్ణానుజ, న్ముని లంకాధిపుఁ
జేసినావు దయ నన్నుఁ బ్రోవు రామప్రభో.

శా. ఏనాఁ డాపుత్రుఁడు పక్షిరాజు కవిరా జేనాఁటిచు
ట్టంబు లం, కానాథానుజుఁ డెన్ని నాళ్లు హితుఁ
డాకంఠీరవాఖ్యాత్మజుం, డేనాఁ డాత్మకిరాత నేఁ
డవనిలో నేనాటిచుట్టం బయా, నేనే యన్యుఁ
డనైతినా పరసతీనిష్కామ రామప్రభో. 13

శా. నేరంబు ల్పరికించకయ్య వినుమా నే నేమియు
న్బల్కనఁ, భారంబు న్మదినుంచకయ్య యిఁక నీ
పాదంబె దిక్కయ్య నీ,వారిం జేర్పఁగదయ్య బంధ
ములత్రోవం జెందనీకయ్య నఁ, గారుణ్యంబునఁ
బ్రోవవయ్య నవమేఘశ్యామ రామప్రభో. 14

శా. నీవే తల్లివి తండ్రివి న్గురుఁడవు న్నిర్ణేతవుఁ
ధాతవుఁ, దైవంబు న్పతియు న్సదాగతియు
నానాబంధుమిత్రాదులు, న్నీవే భాగ్యము భోగ్య

ము న్నిఖిలము న్నిత్యోత్సవవ్రాతముల్, భావిం
పఁ గ్ల మతివేత్తలేదు సతశుంభత్ప్రేమ రామ
ప్రభో. 15

శా. కాంతారత్నము సీతపై గుహునిపై కౌసల్యపై
నల్ల శా,కుంతాధీశునిపై సుమిత్రసుతుపై కుం
భశ్రవోభ్రాతపై, కంతుద్వేషివధూటిపై భరతు
పై కారుణ్యమున్నట్టి శ్రీ,కాంతా నాపయి ప్రేమ
నిల్పు మీఁక మేఘశ్యామ రామప్రభో. 16

శా. ఏమంత్రంబు జపించె పతీకవిరా జేతంత్రముం
జూచి తా, నేముఖ్యాగమ మభ్యసించెను గిరా
తేశుండు నేశాస్త్రముల్, ప్రేమ న్గెంచిత నేర్చె
ముక్తిపదవీశ్రీదంబు నీపాదసే, వామాత్రంబె
సమస్తజీవులకు దైవస్వామి రామప్రభో. 17

శా. వేదంబుల్ నిజమైన ముఖ్యముగ నీవే దైవమైన
న్భవ,త్పాదంబుల్ శుభదంబులైనను భవన్మం
త్రంబు పాపౌఘవి, చ్ఛేదంబైనను నీదునా
మము శుభశ్రీతారకంబైన మెం, దేదీ ముక్తికి
సందియంబు సకలోర్వీశేంద్ర రామప్రభో.

మ. సతులంచు న్సుతులంచు మాతలనుచుం బామా
తలంచు న్నిజా, శ్రితులంచుఁ హితులంచు
భ్రాతలనుచుఁ చెల్లెళ్లటంచుఁ కుల, స్థితు

లందుఁ జనకాదులందును మహిఁ జీవా
త్మకుఁ బంధసం, తతి సంపర్కము లెన్నిగూ
ర్చితి వయా కంజాక్ష రామప్రభో. 19

శా. రేతోబిందువు కాంతగర్భగతమై వృద్ధిఁ జరా
యుస్థితిఁ, జైతన్యంబు వహించి పాదముఖనా
సాహస్తముఖ్యాంగసం, పేతంబై తనుబాల్య
యౌవనజరావేషంబులం జెంది వి, ఖ్యాతిం
బొంది చరించు నీమహితమాయం గాదె రామ
ప్రభో 20

మ. ఉరుబీజంబు మహీగతంబయి పయోయోగం
బుచే నూకరా, కరరూపంబు వహించి పత్రఫల
శాఖాపుష్పసంశోభియై,తరువై నిల్చిఖగాదిజంతు
నివహాధారైకసంస్థాయియై,ధరణింబొల్చుట
నీమహామహిమచేతం గాదె రామప్రభో.. 21

మ. జననీగర్భమునందు గొన్ని దినముల్ సంతాప
మొందించి చ, య్యన జన్మింపఁగఁజేసి శైశవము
బాల్యంబుఁ వయోవృద్ధతా, దినదీనాకృతులం
ఘటించి నిజమౌ దేహంబులోఁ బ్రాణికిఁ, ఘన
వేషంబు లివెన్నిఁ గూర్చితి వయా కంజాక్ష
రామప్రభో. 22

శా. హేయోద్యోగకళా విలాసముల బోయెఁ

బాల్యభావం బరయో, ప్రాయం బెల్లను కామినీ
సురతదుర్వ్యాపారతఁ నిష్ఫలం, బాయెఁ
బోయెను కాయపాటవము మిథ్యామోహ
ముల్ హెచ్చె నే, యేయోగంబులుఁ జాలు
చాలు నిఁక నీవేదిక్కు రామప్రభో. 23

శా. ఆయుర్దాయములోన నర్ధము చనెఁ వ్యర్థం
బుగా నిద్రచే, బోయెఁ బాల్యముచేత కొంత
తరుణీభోగేచ్ఛచే యౌవన,ప్రాయం బెల్లను
వోయె దుర్భరజరాభారంబుచే వార్ధకం, బా
యాసప్రదమయ్యె సత్క్రియలు చేయంజాల
రామప్రభో. 24

మ. మదనద్వారవిలాససౌఖ్యములుప్రేమం జూచితిఁ
రోచితిఁ, మదిరాక్షీకుచపర్వతోపగతఁ మా
వాసముం జేసితిఁ, వదలెఁ మోహము నీత
నూభవుఁడె నానావ్యాప్తులం బెట్టె నె, మ్మది
నెవ్వారి భజింప నీవెగతి శ్రీరున్నామ రామ
ప్రభో. 25

మ. యువతీనాభిబిలంబు సత్కుచపదంబో నాతి
నూఁగారు నా, గవధూటీతిలకంబొ నెమ్మొగము
పొంకంబో సహస్రారమో, చవియౌ మోవిర
సంబు చెన్నగు సుధాసారంబొ కాంతామణిఁ,

గవయన్ యోగికి ముక్తికాంత యగునా
కాంక్షింప రామప్రభో. 26

మ. తరుణీపీనపయోధరోద్ధతులచేతన్ రాపడన్ పె
న్నురం, బు రతిశ్రాంతినిశాతబాణహతి నెమ్ముల్
గుండ పిండయ్యె సుం,దరులం జెందినసౌఖ్యమింతె
సరి మీఁదం గీడదే మున్నదో, దరిలే నాపద
బొందఁ జాల గతి మీఁదన్ నీవె రామప్రభో.

శా. నానాదుర్వ్యసనంబులం దిరుగుచు న్నాళీ
కపత్రేక్షణా, ధీవ్యాప్తులఁగాలమెల్లఁ గడచెం
దెన్ మేనువట్రిల్లె వృ,ద్ధానారీపతిదేవతా యనె
డుశాస్త్రంబన్న చందంబునన్, జ్ఞానం బిప్పుడు
గల్గె మువ్వున దయాసంకల్ప రామప్రభో. 28

శా. వేదాభ్యాసముచేసిశాస్త్రముల నుద్వేలంబుగా
నేర్చి దు,ర్వాదంబుల్ సఫలంబుఁ జేయుచు
నృపద్రవ్యంబులం గోరుచున్, గాదంచు న్నవు
నంచు ధిక్కరణముల్ గావించు విద్వాంసులం,
దేదీ భూతదయాళుతాసమత వాక్శాక
రామప్రభో. 26

మ. వ్యసనాసక్తి వధూటికాజనముపై వాగ్వృత్తి
విత్తంబుపై, పసగా నెమ్మెయి భక్తిచిహ్నములు
దోఁపన్ నోరుతోడేలు నె, న్నొసలున్ భక్తుఁ

డటన్న చందమున నెంతో కైతవాకారులై,
పాసఁగన్ గాలము బుచ్చు మాదృశులతప్పుల్
సైపు రామప్రభో. 30

శా. నానాయోనులయందు దూఱితిని నానాగర్భ
ముల్ జేరితిన్, నానావస్తువులన్ గ్రహించితిని
నానాదేశముల్ సూచితిన్, నానాజాతులఁ
జెందితిన్ విసికితిన్ నామీఁద కారుణ్యమున్,
రానిమ్మా యిఁకనైన గర్భగుహ దూరంజాల
రామప్రభో. 31

శా. నీమంత్రంబె జపించి నిన్నె మదిలో నిత్యంబు
భావించి నీ, నామంబే స్మరియించి నీపదములన్
సద్భక్తిఁ బూజించి ని, ష్కామాసక్తి భవత్క
థాశ్రవణమున్ గావించు ధన్యాత్ము లీ,
భూమిన్ బావనమూర్తు లాఘనులనే పూజింతు
రామప్రభో. 32

మ. హరుపైనైనను దైత్యసంహరునిపైనైనన్ సదా
భక్తిను, స్థిరవృత్తిన్ ఘటియించి తత్పదములన్
సేవించి సద్వృత్తిత, త్పరులై దూషణమాని
యీషణలపైఁ దప్పించి వర్తించు స, త్పురుష
శ్రేష్ఠుల నీగతిం దలఁచి నే పూజింతు రామ
ప్రభో. 33

మ. చలమా నాయువు యౌవనంబు మృగతృష్ణానీ
రపానీయకాం, తులు సంసారసుఖంబు లంగనల
సాంగత్యంబు లంతర్విషో, జ్జ్వలమృష్టాన్నము
లంబుబుద్బుదము లీచాంచల్యమా సంపదల్,
కలలోనైనను వీని నమ్మఁదగునా కంజాక్షు
రామప్రభో. 34

మ. ధనగర్వంబున కొందఱుం గవిహితవిద్యాగర్వులై
కొందఱుం, ఘనరాజోన్నతి కొందఱుం గుల
బలఖ్యాతిప్రభారూపయౌ, వనగర్వంబునకొంద
ఱుం నిను భజింపన్లేకమాధ్యంబునం, జననంబుల్
విఫలంబు చేయుదురు భాస్వద్ధామ రామప్రభో.

మ. ఉదయం బస్తమయంబటంచును మహోద్యో
గంబుచే వాసరం, బిదిమాసం బిదివత్సరంబనుచు
దుర్వృత్తిం బరిభ్రాంతులై, యిది రాత్రిందివమం
చుమూఢమతినింతే కాని కాలాహిచే, తుదినాయు
షుయమౌటకానరు మహోదోస్సార రామప్రభో.

మ. తమపూర్వుల్ మును జావఁగా వినిరొ లేదో
మృత్యు వెవ్వారికిం, యముఁ డెవ్వారికిఁ జుట్ట
మా తనువపాయాభావమా! దేహగే, హము
లుం శాశ్వతమా! నరాధములికేలా గొల్తు
రుర్వీశులం, సుమసామ్యంబగు లక్ష్మిఁగోరి తను
వుల్ శోషింప రామప్రభో. 37

శా. ఎందుంజూచిన కాయమెల్ల మలినంబే లోనిసా
రభ్య మే, మందుఁ దుస్సహరక్తమాంసమల
మూత్రాసహ్యామే దానితోఁ, బొందైనన్ సత
మా! గదాన్వితము త్రేపో నేఁడో పోనున్నదీ,
బొందిన్ నమ్మఁగరా దిఁకేటిదరిపై భూజంబు
రామప్రభో. 38

శా. ఎన్నాళ్లుందుదు రేమిచేయుదు రొకో యేసౌ
ఖ్యముల్ గాంతురో, నిన్నమొన్నను జచ్చువారిఁ
గనరో నిర్మోహముం జెంద ర, న్నన్నా మానవు
లెంతమూఢమతు లన్నా నిన్ను సేవింప రా, పన్న
త్రాణధురీణ! శాశ్వతమొకో! భాగ్యంబు రామ
ప్రభో. 39

శా. మందు ల్మాకులు వేల్పు వైద్యులు మణుల్ మం
త్రంబులున్ దంత్రముల్, బొంది న్నిల్పఁగఁ జా
లునా! యమునితోఁ బోరాడునా! ధాతవ్రా, తం
దప్పించునా యాయువొక్క క్షణమాత్రంబైన
యెక్కించునో, మందాత్ముల్ గనఁ జాల రీగతుల
శ్రీమన్నామ రామప్రభో. 40

మ. తనుగర్భంబున నున్నవాఁడు మలమూత్రస్వేన్నుఁ
డై శైశవం, బున సంతాపము నొందునాఁడు క
నుఁ గమ్ముల్ మూసి నిద్రించు వే, ళను నేపుణ్యుఁడు

ప్రోచినాఁడో యతఁ డేలాగుండిన న్నోచ్చి వఁడా,
మనుజుం డన్యుని జేరి వేఁడినను క్షేమంబొనె
రామప్రభో. 41

మ. నృపులం గొల్చుట జేరమాడుట మహీభృద్వా
సముల్ నీచసే, వ పరావాసము జ్ఞాతివైరము
మహావారాసిపై నేఁగుటల్, కపటత్వంబున వే
షధారియగుటల్ సంసారి కీకృత్యముల్, కృప
ణత్వంబున సేయునీతి యివి భుక్తింగోరి రామ
ప్రభో. 42

శా. ఏదేశంబున కేఁగిన న్నృపులఁ దా నెన్నాళ్లు
సేవించినన్, లేదింతైనఫలంబు పూర్వకృత మో
లిందప్ప దవ్వేళకున్, పాదాయాసము దూర
యానము మహీపాలాతిసేవాప్తి నా, నాదోషం
బు లపారసౌఖ్య మటఁ గానన్ రాదు రామ
ప్రభో. 43

మ. తనపూర్వార్జితమైన పాపములచేతం దుఃఖసం
తాపమా, ఘనపుణ్యంబులచేత భోగసుతభాగ్య
శ్రీమహాసౌఖ్యముల్, గను నింతే తన కెవ్వరున్
సుఖముదుఃఖంబైన సేయంగలే, రనయంబు న్నరు
నాశ్రయించుట వృథాయాసంబు రామప్రభో.

శా. సప్తద్వీపమహాధికారమున నాశాతృష్ణులై రే నృ

పుల్, సప్తార్చిర్ముఖనేతసర్వభువనేశత్వంబు దా
నాత్మలో, వ్యాప్తిం బొందుట మానెనే యితరు
ల నా్వత్రువ్వఁగా నేటికిఁక్, దృప్తిం బొందఁగరా
దు భోగసుఖవృద్ధిం గోరి రామప్రభో. 45

మ. కరుణం బ్రోవఁగ నేర్తురో శుభములం గావింపఁ
గా నేర్తురో, వరముల్ గూర్పఁగ నేర్తురో దురి
తము లార్పింపఁగా నేర్తురో, పురుషార్థంబు లొ
సంగ నేర్తురొ భవాంభోరాశి దాఁటింతురో, ధ
రణీపాలురఁ గొల్వనేల మది సంతాపింప రా
మప్రభో. 46

మ తనవారంచును దానటంచుఁ దనసత్వంబంచుఁ
దా శక్తుఁడం, చును దుర్మానత మానవుండు వి
హరించున్మోహవిభ్రాంతుఁడై, తనవారెవ్వరో దా
నెవండో తనసత్వం బెద్దియో శక్తినె, వ్వనిలోఁ
గానఁడు మూలకారణము దైవంబెన్న రామ
ప్రభో. 47

మ. ధనమెందైన నృపాగ్నిచోరులకు సంతానంబులం
జెందుఁ జెం, దును గాయంబు చితాగ్నియందుఁ
దిరమై దుష్కీర్తియుం గీర్తిమా, యనిదై నిల్చు
మహీతలంబునను ధర్మాధర్మముల్ వెంటనే, చను
దెంచుం జనుఁడెంతఁ జేసిన విశేషంబెంత రామ
ప్రభో. 48

మ. తనపూర్వార్జితపుణ్యపాపఫలముల్ తన్నొందు
నెన్నాళ్లకున్, దనకై వండిన వంటకంబుఁ దినకు
న్నంబోవదే వేళకున్, మనుజుల్ దుఃఖసుఖైక హే
తుగతిమర్మంబైన కర్మంబుఁ గ, న్గానఁగా లేదు మ
నీషతోఁ దెలిసి సన్నుంజెందు రామప్రభో 49

శా. ఏయేజన్మము లెత్తితో మునుపు నేయేజన్మముల్
పొందునో, యాయాకృత్యము లేమియుం దెలి
సెనా యాబాంధవస్నేహ మే, మాయెన్ దీనికి
నింతవింతవలెనా యాచందమేకాదయా, కా
యంబు ల్పరికించి చూచినఁ ద్రిలోకస్వామి
రామప్రభో. 50

శా. దాయాదు ల్ధనచోరులా ఖలులబాధల్ మాధు
రీఖడ్గముల్, మాయామోహినిదార దానిచప
లోన్మాదక్రియావారిద, చ్ఛాయ స్నేల్లవు సంకె
లల్ సుతులు పుష్పస్యూతపాశంబు లీ, యా
యాసంబుల వాఁడు నిన్ను నుతిఁ జేయన్ లేఁ
డు రామప్రభో. 51

శా. ఎన్నో జన్మము లెత్తియెత్తి కడగా న్లెన్నో ముసు
నొంది యె, న్నెన్నో నారకదుఃఖముల్ గుడిచి
తా నిన్నాళ్లకుం జీవలో, కౌన్నత్యాస్పదవిప్రదే
హకులవిద్యాయుక్తుఁడై జ్ఞానసం, పన్నత్వంబు
హింపకున్న నరజన్మం బేల రామప్రభో. 5

శా. నిన్నుం గొల్చిన భాగ్యసంపదలు రానీవేమి రా
నీ సమ, స్తౌన్నత్యంబులు గల్గనీ గలుగనీ హైన్యం
బు సంజ్ఞానసం, పన్నత్వంబు లభింపనీ జడమతి
ప్రాయంబు సిద్ధింపనీ, యెన్నైనా యని మాకు
సమ్మతమయా యిన్నేల రామప్రభో. 53

మ. మతిలో నాకొకయాసపుట్టె వినుమా మాయ
య్య విద్వజ్జనుల్, పతితవ్రాతము నీవు బ్రోతు
వనుచుఁ భాషింతు రెల్లప్పుడుఁ, శ్రుతివాక్యం
బులచేత ధర్మవిలసత్సూక్తుల్ నిజంబైనచో, గతి
మాకుంబరికింప నీవెకదలోకస్వామి రామప్రభో.

మ. కరముల్గల్గుటకుఁ ఫలంబు కడువేడ్క న్నిన్ను
బూజించుటే, చరణద్వంద్వఫలంబు తావకనివా
సంబుల్గనం బోవుటే, పురుషార్థంబులఁ జెందు వా
క్సరణి నీపుణ్యాభిధానస్తుతిఁ, వరలుఁ వీనులు
నీకథ ల్వినిన భావ్యంబౌచు రామప్రభో. 55

శా. పాషాణంబు భవత్పదాంబురుహసంపర్కంబుచే
శుద్ధమై, యోషారత్నము నీనె నీవిమలనామో
ద్దేశయుక్తిన్ మహా, దోషంబుల్ విడనాడి నాకు
భవుఁ డెంతో మానిమై మించఁడే, భాషావల్ల
భుఁ డైన నీమహిమ దెల్పఁ లేఁడు రామప్రభో.

శా. దానంబుల్ వ్రతహోమము ల్కాతువుల

ధర్మక్రియాతంత్రముల్, నానాతీర్థజలావగాహ
నములు స్నానాటికి స్నేయఁగాఁ, బోనానే భవ
ధీయనామము భవాంభోరాశికిన్ నావచం, దాన
న్గాఁ గనుపింప వార్షికపయోదశ్యామ రామ
ప్రభో. 57

శా. క్షీరంబు ల్గుడనీరముల్ మధువు లక్షీణామృతా
సారఖ, ర్జూరిగోస్తనసద్రసాలపనసేక్షుస్వాదు
మాధుర్యముల్, సారోదారము నీదునామసుధ
నాస్వాదించు నాజిహ్వకున్, క్షారంబై గనుపిం
చు నీలమణిమేఘశ్యామ రామప్రభో. 58

మ. గురుశుశ్రూష యొనర్చి వేదములు పెక్కుల్
నేర్చి దండాజినాం, బరముల్ గైకొని భైక్షము
ల్గొనుచుఁ బ్రేమం బ్రహ్మచర్యవ్రతం, బరుదారన్
ధరియించి నిత్యమును సాయంప్రాతరగ్నిక్రియా,
పరిచర్యం జరియింపలేదు జనియెన్ బ్రాహ్మ్యంబు
రామప్రభో. 59

మ. నిజకాంతాఋతుకాలసంగతుఁడనై నిత్యంబు స
త్పంచయ, జ్ఞజపాధ్యాపరహోమదైవపితృయ
జ్ఞస్మార్తకర్మక్రియా,వ్రజమున్ శ్రౌతవిధిం జరిం
పుచును గార్హస్థ్యంబు వేదక్రియా, భజనీయం
బుగ సేయలేదు జనియెన్ బ్రాహ్మ్యంబు రామ
ప్రభో. 60

మ. కులభారంబు కుమారుపై నిలిపి యగ్నుల్ గ్రాం
తుఁ గాంతారభూ, ములకుఁ ధర్మసతీసమేత
ముగ సమ్మోదంబుతో నేఁగి కా, నలఁ జాంద్రా
యణకృచ్ఛ్రితత్పరత వానప్రస్థదీక్షావిధిఁ, సలు
పఁ లేదు నిరర్థకంబుగఁ జనెఁ జన్మంబు రామ
ప్రభో. 61

మ. గతవిద్వేషహితక్రియాపరుఁడనై కాషాయదం
డంబు లా,యతరీతిఁ ధరియింపుచు న్బ్రణవసు
ధ్యానైకపారీణతఁ, వ్రతముల్సల్పుచు నీమణల్
విడివడఁ గ్రామైకరాత్రస్థితిఁ, యతినై యుం
డుట లేదు బ్రహ్మ మతిగమ్యం బయ్యె రామ
ప్రభో. 62

శా. నాసాగ్రంబున దృష్టినిల్పి జగమంతా బ్రహ్మసద్భా
వమై, భాసిల్లంగను సన్నవృత్తి సమతాభ్యాసం
బుఁ గావించి శ్రీ, వ్యాసాదిప్రముఖప్రణీతగతి
నాత్మారామతఁ హంసవ, ద్వ్యాసంగంబు వహిం
పలే దెచటికైవల్యంబు రామప్రభో. 63

ఆధారస్థితవాయుపూర్వగతిగా నంకించి రేచించి
...గానందఘనప్రకాశమహిమఁ బూరించి
... స, ర్వాధారంబులు మూసి నిశ్చలస

హస్రారామృతం బాని యో, గాధీనస్థితి నుండ
లేదు భవదైక్యం బెట్లు రామప్రభో. 64

మ. ధరణిం దీర్థము లెల్ల నీరములెకా దైవంబులె
ల్లం శిలాం, తరవృద్ధాపములేండా విమలసు
ధ్యానైకపారీణుండౌ, వరయోగీంద్రున కిన్నియేల
నిజభావం బందుపై సంతటం, తిరమై నిల్చిన
నిన్నుజూచుకొను చింతేకాక రామప్రభో.

మ. అణుమాత్రంబో మహత్తరంబో హృదయం బ
త్యంతమానో బహిర్గణనీయంబో దృగంతగోచ
రమొ యీతొవృత్తికిం దూరమో; గుణియో
నిర్గుణియో వికోశమొ లసత్కోశంబో నీరూప
ముం, గణుతింపం దరమారుఘురీనిలయవర్ణ్యం
బు రామప్రభో. 66

మ. యమునాసంగముం జూడనేటికి సుషుమ్నాసం
గముం జూచుచోం, గమలాసంగము గోరనేమి
టికి షట్కంబాప్తుండై యున్నచో, నమృతాంధ
త్వము గోరనేటికి సహస్రారామృతం బానుచోం,
దమినై యుండిన సన్మునీంద్రున కసాధ్యంబెద్ది
రామప్రభో.

మ. మతభేదంబులు సేయనేల యతికి
చంబు స, మ్మతిపయ్యం గడు సేరి

ల్పాత్సర్యశూన్యుండు నై, సతులం గోరఁగ నేల ము_క్తితరుణీసౌఖ్యంబుసర్వేషణా,యుతమై యుండఁగ మానిలోకసురలోకా రామ రామప్రభో.

మ. వసుధాతల్ప మనల్పసౌఖ్యకరమై స్వాధీనమై యుండ న, భ్యసనాయాసము తూలికామృదుల తల్పం బేల బాహూపధా, ససుఖాసంగము చెంత నిల్పను బ్రధానం బేలపుణ్యాంగనా, వసతిక్ భిక్షలుగల్గ నేల నృపసేవావృత్తి రామప్రభో. 69

మ. సముఁడై భూతదయాళుతాగుణవిశేషంబున్న చో బంధుబృం,దము లేలా దమమున్న మిత్రబహుమానం బేల సుజ్ఞానికిన్, శమమున్నన్ నృపభోగభాగ్యసుఖవాచావర్తనం బేల సం,యమియైనన్ ధనమేల మానిజనదైవాధీశ రామప్రభో.

మ. సరిదోఘంబులు లేవె నీరములు "భిక్షాందేహి మే" యన్న భూ, సురపుణ్యాంగన లన్నమివ్వ రె తరుస్తోమంబులం ధామవా, సరసామోదము గల్గదే వసుమతీశయ్యాసుఖం బొప్పదే, వరము ల్గూర్చఁగ నీవు నేల నృపసేవావృత్తి రామప్రభో. 71

శా. అంతాసమ్మతమే జగన్నటన మాత్మారాముఁడౌ యోగికిన్, చింతాశూన్యము ద్వేషవర్జము వ

ధూనిర్మోహముఁ శాంత మ, త్యంతాహ్లాదము
సంతతాగమశిఖాంతాలోపనభ్యాంతరం, బింతే
నిత్యము నీపదాంబురుహచింతే వృత్తి రామ
ప్రభో. 72

శా. ఆచార్యుండయి పీగవచ్చు నయగారై శిష్యులం
గూర్చి మి, థ్యాచారంబులు చెప్పవచ్చు నుతి
సేయింపంగ వేదాంతముల్, వాచాలుండయి తె
ల్పవచ్చు నిగమవ్యాఖ్యార్థసంవేద్య నీ, ప్రాదు
ర్భ్యాదిమతత్త్వ మజ్ఞులకు లభ్యంబౌనె రామ
ప్రభో. 73

మ. జననవ్యాధినివారకంబు భవసంసారాబ్ధికిం దార
కం, బనఘశ్రీపదవీపదంబు నిగమవ్యాపారపారం
బు స, న్మునిదిష్టంబగు రామతారకము వీనుల్ చేరి
నర్తింపకఁ, జనులేలా యమకింకరార్భటికి సం
తాపింప రామప్రభో. 74

మ. కరు లశ్వంబులు కాంత లందలములుఁ గంధ
ప్రసూనంబు లం, బరముల్ రత్నవిభూషణం
బులు గృహప్రాకార మారామభా, స్వరశయ్యా
సనవస్తుజాలములు మోక్షం బివ్వఁగాఁజాలునా,
నరులయ్యో నినుగొల్వ రీభ్రమలలోనం జిక్కి
రామప్రభో. 75

శా. రాజన్నట్టిపదంబు ధర్మతనయుఁ రాముఁ హరి
శ్చంద్రునిఁ, భోజుం జేరె యశోదయానయక
ళాపుణ్యత్వమాయుక్తమై, తేజోహీనులు నేటి
రాజులు యశోధిరాజులీరాజులఁ,ధీజాడ్యంబున
గొల్వఁ గష్టఫల మింతే సుమ్ము రామప్రభో.

మ. కళ లశ్వత్థదళంబు లర్థములు మేఘుచ్ఛాయలుఁ
బ్రాణవృత్తులు విద్యుల్లత లెండమావు లిల
ఖద్యోతంబులుఁ బుద్బుదంబులు దంతావళ
కర్ణరీతులు నభగపుష్పంబు లుల్కారుచుల్, చల
సంపత్తుల నుబ్బువాఁడు నిను గొల్వఁ లేఁడు
రామప్రభో. 77

శా. ఆధివ్యాధులకౌషధంబు గ్రహపీడారణ్యదావం
బు చి, ద్బోధానందఘనప్రదీపికలికాపూర్ణికృత
స్నేహమో, హాధారాధరమారుతంబు భవదీ
యోదగ్రనామంబు జి, హ్వాధీనంబయి నిల్వ సం
శయ మిఁకేలా మాకు రామప్రభో. 78

మ. తరుణీబాహులతోగ్రపాశ వలయాంతర్వర్తినై
మోహదుస్తరవారాశి తరింపలేక తిరుగఁ దా
క్షిణ్యశీలుండవై, కరుణాలోకనరాశిగోచరలస
త్కళ్యాణసంధాయి నీ, చరణద్వీపము చేరితిఁ
సుఖనివాసంబయ్యె రామప్రభో. 79

శా. కాంతానాభికుచోరువక్త్రములు వేడ్కన్ జూ
చితిన్ రోసితిన్, కంతుప్రాజ్యవిలాసకేళి మదికె
క్కన్ గూడితిన్ బ్రేమమై, సంతాపం బొకయిం
త లేక కులటాసంయోగినై యోగినై, రంతుల్
మానితి నిన్ను జేరితి కృపన్ రక్షింపు రామప్రభో.

శా. రాజద్వారము నాశ్రయించి భటదుర్వారైక
హుంకారతిన్, తేజోభంగము జెంది కుంది మద
వృత్తిన్ మన్మథద్వారసే, వాజాడ్యంబున లోక
నిందఁ బరితాపం బందితిన్ జెందితిన్, జేజే శ్రీ
నృపసేవ చాలునిఁక లక్ష్మీధామ రామప్రభో.

శా. సంసారం బనుసాగరంబు దరిగాంచన్ శక్యమా
యేరికిన్, హింసాకృత్యములందుఁ జెప్పదరమా
యేనాఁటికిం గామముల్, సంసర్గంబున హెచ్చుఁ
గాని యొకలేశంబైన శాంతింప నీ, సంసారాం
బుధిదాఁట నావ విను నీసంసేవ రామప్రభో.

శా. నామాటల్ భవదీయసన్నుతులుగా నాచేయు
సంచారముల్, నీమాంగల్యతనుప్రదక్షిణముగా
నిద్రాసమాధిస్థితిం, గా మావల్లభ! భోజనాదివి
షయాభ్యాసంబు నీపూజగా, నేమేఁ జేసిన నీస
పర్య విధిగా నీక్షింపు రామప్రభో. 83

మ. ఉపవాసంబులు చేసినన్ దివసమధ్యోర్వీస్థలీవా

స్నులై, జపముల్జేసిన యాగవైదికమహాచారం
బులం జేసినన్, దపముల్జేసినఁ బూజఁజేసిన మహా
దానంబులం జేసినన్, విపరీతంబగు నీకొసంగని
క్రియావిఖ్యాతి రామప్రభో. 84

శా. నీకే సెంగిలిపెట్టఁజాలను దయన్ నీరొమ్ముపైఁ
దన్నఁగా, నా కాలాడదు వ్యత్యయంబు గను
నీనామంబుః జింతింపఁగా, నేకాగ్రస్థిరబుద్ధి
నిల్వ దకటా యేలాగు నీరూపమున్, నాకున్
గానఁగవచ్చు భక్తి యిసుమంతన్ లేక రామ
ప్రభో. 85

శా. శ్రౌతస్మార్తవిధానయజ్ఞమఖదీక్షావృత్తులేజాడవో,
జ్ఞాతృజ్ఞేయము లెట్టివో విమలమంత్రాచారపూ
జాతపః, ప్రాతస్స్నానవిధాన మేవిధమొ జీవ
బ్రహ్మ లేచందమో, యీతాత్పర్యము లేనె
యుంగనిఁక నీవే దిక్కు రామప్రభో. 86

శా. అన్నల్దమ్ములు నాలుబిడ్డలు ధనంబార్జింపుచున్నం
తకున్, దన్ను న్మన్ననఁ జేతు రెంతయును వృద్ధ
త్వంబునన్ ఖిన్నుఁడై, యున్న న్గన్నులఁ జూడ
రీవిఫలసంయోగంబులే సౌఖ్యముల్, దున్నల్
మానరుగాక మానవులు పొందుల్ కీడు రామ
ప్రభో. 87

మ పరకాంతారతిఁ గోరు నన్యధనముల్ ప్రాపింపఁగాఁ జూచు నా, క్కరి భాగ్యోన్నతికి న్విషాదపడి లెక్కల్ పెట్టు పైదోషముల్, మఱిదు ర్గా నొనరించు దోషముల నన్మత్తంబు నాచిత్తమే,వ్వరి మన్నింపదు దీనిగర్వ మకటా వారింపు రామప్రభో. 88

శా. వీడీవీడదు దుష్టసంతతి వధూవిస్రంభలీలారతుల్ కూడీకూడదు భక్తసాధుజనసద్గోష్ఠిం భవత్కీర్తనల్, పాడీపాడదు నాదుచిత్త మధికానిత్యంబు సత్యంబు తా, నాడీయాడదు దీని యుబ్బడపవయ్యా వేగ రామప్రభో. 89

మ. కొడు కేతప్పులు చేసినన్ బరులతోఁ గొట్లాటపైఁ దెచ్చినన్, చెడుజాడ న్విహరించిన న్జనకుఁ డాక్షేపింప కాపుత్రునిన్, కడులాలించి యభీష్టభోగముల వేడ్కల్ గూర్చి రక్షించుకై, వడి భక్తావళి నీవుప్రోతు వట దైవస్వామి రామప్రభో. 90

శా. పుత్రుల్ మోక్షదులన్నచో శుకమరుత్పుత్రాపగాపుత్రులే, పుత్రు ల్గాంచిరి యాగదీక్ష సుమనోభోగాస్పదం బన్నచో, పత్రీశుండు కిరాతుఁ డేముఖములం భావించి గావించిరో, సుత్రామా

ర్చిత నిన్నుఁగొల్చిన లభించుఁ ముక్తి రామ
ప్రభో. 91

మ. జననంబాదిగ నేనుజేసిన సుదుష్కర్మంబు లెన్న
య్య ప్రాక్తన జన్మార్జితకర్మసంఘము లసంఖ్యా
తంబు లీకర్మబంధన మెన్నాళ్లకు దీఱదెన్నఁడు
చిదానంబు సిద్ధించునీ, జననం బేవిధిఁ బోవు
బ్రోవఁగదవే సద్వంద్య రామప్రభో. 92

మ. ధనమందుం బ్రియజారకాంతలపయిం దారాత్మ
జశ్రేణిపై, ఘనగ్రీవాదులమీఁద గేహము
పయిఁ గాపేయమున్నట్లె పా, వనచారిత్ర
భవత్పదాబ్జములపై వాంఛాలతల్ గూర్పవే,
నినుసేవింపదు నామనం బకట! దీని న్బంచు
రామప్రభో. 93

మ. పరదోషంబుల నుద్ఘటించుతఱి జిహ్వాల్ రెండులే
కంతఁ బెం,పర నాత్మీయగుణంబులం బొగడుచో
వక్త్రంబులు న్వేయునా, పరకాంతావళిఁ జూచు
చో నయనముల్ భావింపఁగా రెండువే, లరయం
గానగు మూఢచిత్తుల కహల్యావంద్య రామ
ప్రభో. 94

మ. ధరణీరేణువులు న్తుషారగణము ల్తారాగణశ్రే
ణులుఁ, తరగల్ చిమ్మినబిందువు ల్తఱుచు

వానఁ వారిధారావళుల్, సరవిఁ సంఖ్య
యొనర్పవచ్చు మును నాజన్మంబు లెన్నయ్యె
నో, పరికింపం దరమా విధాతకయిన న్భావింప
రామప్రభో. 95

మ. కలపంబంతటఁ బూసినఁ సహజదౌర్గంధ్యంబు
త్రామానునా, చెలిమి న్ముాతపదంబు దెచ్చినను
దుశ్చేష్టల్ విడఁ జూచునా, మలభూయిష్ఠము
మేను దీని సుఖను ల్మాయామయాల్పస్థితుల్,
పలుగుఁజాడలు దీనియున్నగతి జెప్పఁ రోఁత
రామప్రభో. 96

మ. భరితగ్రాహజలాశయంబు తృణముఁ పైఁగప్పు
కూపంబు త,స్కరసంక్రాంతవనంబు లీనభుజగాగా
రంబు సింహాస్థకం, దర మంభోధివిహారిజీర్ణతరి
యంతర్గకీటభూజంబు దుర్భరసంసారము దీని
సౌఖ్యములు గోరఁ రాదు రామప్రభో.

మ. అవలోకించితి వేదశాస్త్రములు మంత్రామ్నా
యము ల్జూచితిఁ, వివరింపంబడె సాంఖ్యయో
గములు నన్వేషించితిఁ దంత్రముల్, లవమా
త్రంబును జ్ఞాన మబ్బ దిఁక నేలా యన్యథాచిం
తనల్, దివిజాధీశ్వరవంద్య నీస్మరణ మేదిక్కయ్యె
రామప్రభో. 98

మ. తనభావంబునఁ దన్నుఁ జూచుచు సమస్తప్రాణి
సంతానమం, దునఁ దన్నుం గనుఁగొంచు భూత
ములయందుం బ్రీతిఁ బెట్టించి ప్రాక్తనకర్మంబుల
కోర్చి భావిఫలముల్ దానంటకున్నట్టి ధన్యున
కంసస్థితి ముక్తికాంతయగు ధీరోదాత్త రామ
ప్రభో. 99

మ. వరుసం జేసినపాపము ల్దలఁపఁ ద్రోవన్ రాని
దుఃఖంబులో, మరణాయాసము దల్చుకొన్న
భరియింపన్ రాని సంతాపమో, నరకావాసదు
రంతఖేదములు విన్నన్ భీతిఁ బెట్టిల్లు నీ, పరితా
పంబు హరించు బంధువుఁడ వీవా కావె రామ
ప్రభో. 100

మ. దయ భూతంబులయందుఁ జిత్తము భవత్పాదా
బ్జయుగ్మంబుపై, భయ మంహశ్చరితంబులన్
వ్యసనముల్ బ్రహ్మైక్యవిజ్ఞానమం, దయశోవృత్తి
ననూయ సజ్జనసమూహాత్యంతసాంగత్యమున్,
దయచేయంగదవయ్య వార్షికపయోదశ్యామ
రామప్రభో. 101

మ. పదము ల్పూజయొనర్తునో కరములన్ భావించి
పూజింతునో, హృదయం బర్చయొనర్తునో
భుజయుగం బేవేళఁ బూజింతునో, వదనాలంకృతిఁ

జేతునో శిరము గ్రీవాపీఠిఁ బూజింతునో, సద
యాంతరంగకరణా సమర్చనవిశేషం బెంతు రామ
ప్రభో. 102

మ. తులసీకోమలదామ ముంచవలయుఁ దోరంత
ముఁ జూపుమా, విలసద్రత్నకిరీటముంచెద శి
రోవీథిఁ దయంజూపుమా,జలజాతంబులఁ బూ
జఁజేసెదఁ బదాబ్జాతంబులం జూపుమా,కలమా
న్నం బమృతోపహార మిదిగో కైకొమ్ము రామ
ప్రభో. 103

శా. మందారంబులొ కుందమాలికలొ శామంతీల
తాంతంబులో, యిందుశ్వేతదళారవిందకరవీ
రేందీవరశ్రేణులో,ఛందోవందిత పారిజాతతులసీ
చాంపేయదామంబులో, యిందేదీ ప్రియ
మిందిరారమణ నీ కేనిత్తు రామప్రభో. 104

మ. కలధౌతాంబర ముత్తరీయము లసద్గంధానులే
పంబు కో, మలమందారలతాంతమాలికలు
శ్రీమద్రత్నకేయూరమం, డలమంజీరకిరీటహా
రములు నానాసౌధశయ్యాసనో,జ్జ్వలభోగ్యం
బు లొసంగెదఁ గొనుము శశ్వత్ప్రేమ రామ
ప్రభో. 105

మ. చరణన్యాసవిలాసయోగ్యమగులాక్షారాగముం

జందనా, గురుకస్తూరమృగీమదాంజన లసద్గో
రోచనాకుంకుమా, దిరసామోదవిలేపనాభర
ణముఞ్ ధీచాతురిఞ్ సీతవ, న్నె రుచింపం
గయి సేతు చేతులలరఞ్ సీవెన్న రామప్రభో.

మ. తరుణార్కాంశునిభోత్తరీయపట మంతర్వస్త్రకౌ
శేయభా, సురకూర్పాసవిచిత్ర సత్కనకవాసో
వాసనావాససం, వరణంబుల్ పరిధేయభూష
ణము దేవా దేవి కర్పించెదఞ్, సరసాలోకను
ధారసోల్లహరి నాచాకింపు రామప్రభో. 107

శా. మందారాంబుజపారిజాతసుమశామంతీజపామం
జరీ, కుందేందీవరకేతకీవకులసద్గుచ్ఛప్రసూనావ
ళుల్, పొందొప్పఞ్ గచధార్యభూషణములఞ్
భూజాని గైసేసెదఞ్, వందారుప్రియ ప్రేమఁ
గైకొనుము సేవావృత్తి రామప్రభో. 108

మ. మణిమంజీర సువర్ణ కింకిణీరణన్మాణిక్యవన్మేఖలా,
గుణ రత్నాంచితకర్ణపూర మణిమత్కోటీరకే
యూర కం,కణహారాదిశరీరధార సదలంకారం
బులఞ్ భక్తపో, షణ సంవీతమొనర్చెదఞ్
గనుము శశ్వత్ప్రేమ రామప్రభో. 109

శా. దీనం దప్పులు గల్గినఞ్ బుధజనుల్ ధిక్కారము
ల్మాని బో, ధానందస్థితి సీకృతిఞ్ గరుణచే నంగీ

కృతిం జేసినన్, దానన్ సత్కృతిఁ గాంచి సర్వ
జనమాన్యంబౌను దుస్తారమున్, జానొందన్
నుతిగాంచి మించదె భువిన్ సర్వజ్ఞరామప్రభో.

శా. శ్రీరామప్రభునామనిహ్నుతము భూరిజ్ఞానశాం
తిక్షమా, వైరాగ్యప్రద మాత్మబోధకము
దుర్వ్యాపారవిచ్ఛేదవా, శ్సారోదారము నీకృ
తిం జదువ నాకర్ణించినన్ వ్రాసినన్, శ్రీరామ
ప్రభుఁ డిచ్చు నవ్యయపద శ్రీభోగసౌభాగ్య
ముల్. 111

శ్రీ రా మ ప్ర భు శ త క ము
సంపూర్ణము.

---

# పీ ఠి క.

ఈశతకమువ్రాసిన పావులూరిమల్లన రాజరాజన రేంద్రునికాలముననుండి పావులూరిగణితము వ్రాసిన మల్లనయే యని తొల్లి వ్రాసినవ్రాతలు ప్రమాదములని తోఁచుచున్నది. గణితశాస్త్రములోని

"పావులూరివిభుఁ డను
గార్గ్యగోత్రోద్భవుఁడన్"
"శివ్వనపుత్త్రుఁడ మల్లనాఖ్యుఁడన్"

అనుపద్యభాగములవలన గణితశాస్త్రము వ్రాసిన మల్లనకవి శివన్నపుత్త్రుఁ డనియు గార్గ్యగోత్రుఁ డనియుఁ దెలియుచున్నది. భద్రాద్రిరామశతకమువ్రాసినకవియో ఇందలి 102, 103, 104 పద్యములవలన వాసిష్ఠగోత్రుఁ డనియు రామమంత్రికుమారుఁ డనియుఁ దెలియుటవలన నిరువు రొకటిగా భావించుట నామసామ్యమువలనఁ గలిగినభ్రాంతియేగాని వేఱు గాదు.

భద్రాద్రిరామశతకమునందలి కవితాధార యంత ప్రౌఢముగా లేదు. ఇందలిపద్యములన్నియు మకార ప్రాసతో రచింపఁబడుట యొకవిశేషము. ఇటుల రచించుటకుఁ గారణము మకుటమంతయు నొకపాదము నాక్రమించుటయే యై యున్నది. ఇందలిపద్య

ములలో మనోహరములగు కల్పనములుగాని రమణీయములగు భావములుగాని లేవు. పురాణములకు సరిపోలు శ్రీరామునివిశేషణముల కూరుపుమాత్రము ప్రతిపద్యమున నిముడ్పఁబడియున్నది. శ్రీరామనామ చింతనాపరుల కీశతకము రామస్మరణము గావించుపట్టున మిగులనుపయోగకరముగా నుండును.

ఈకవి పావులూరినివాసినని చెప్పికొనినాఁడు. పావులూరులు పెక్కులుంటవలనఁ గవినివాసమగు † పావులూ రేదియో తెలిసికొనఁదగిన యాధారములు కానరావు. ఇంచలిపద్యములయందు రామనామము పెక్కుమాఱు లిముడ్పఁబడియుంటవలన నీశతకకర్త రామనామామృతపాన ప్రమత్తుఁడుగనుండి భక్తుల కీశతకరూపమున రామనామామృతమును బ్రసాదించెనేమో యని తోఁచెడిని.

కవి యీశతకమును మిగుల బాల్యావస్థలో వ్రాసినటులఁ బదప్రయోగలాఘవమునుబట్టి ధారాలోపమునుబట్టి యూహింపవచ్చును. శతకము సులభము సుబోధమునై యున్నది.

నందిగామ.
1-1-25.
ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు, శతావధానులు.

---

† వంగవోలు తాలుకా పావులూరు కవినివాసమని కొందఱందురు.

శ్రీ ర స్తు.

పావులూరి మల్లనకవిప్రణీత

# శ్రీభద్రాద్రిరామశతకము.

---

క. శ్రీమద్రఘువంశార్ణవ
సోమా శ్రీరామనామ సువ్రతకామా
కోమలదేహశ్యామా
శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 1

క. వామాంకమందు సీతా
భామయు సౌమిత్రి కుడిని భరతుఁడు గొల్వన్
సామీరితోడ నొప్పిన, శ్రీ... 2

క. స్వామీ నీదే భారము
పామరుఁడను బాతకుఁడను బతితుఁడ సీతా
రామా నీపదములె గతి, శ్రీ... 3

క. రామ ద్వయాక్షరమంత్రము
నామనమున నిల్వనిమ్ము నారాయణ హో
శ్రీమంతుఁడ స్మితవక్త్రుఁడ, శ్రీ... 4

క. ఏమయ రామబ్రహ్మమ
నీమహిమోక్తులను నెన్న నీశునితరమా
తామరసగర్భుతరమా, శ్రీ.... 5

క. రామా నీదయ రాదుగ
నామీఁదను నాదిదేవ నారదవినుతా
మోమైనఁ జూపవైతివి, శ్రీ... 6

క రామా దైవశిఖామణి
సామజరాడ్వరద సత్యసంధవ్రతుఁడా
యేమని పొగడుదు నిన్నుఁ, శ్రీ... 7

క. రామా నీస్మర ణెప్పుడు
నేమఱకఁ సర్వకాల మేర్పడఁ దలఁచే
నామనవి చిత్తగింపుము, శ్రీ... 8

క. రామ యభిరామ రాఘవ
తామరసదళాయతాక్ష తాపసరక్షా
కామారిధనుర్ఖండన, శ్రీ... 9

క. రామా రఘుకులతిలకా
కామాదులఁ గడకుఁ జిమ్మి కడతేర్చెడి శ్రీ
స్వామి వని నిన్ను నమ్మితి, శ్రీ... 10

క. రామ యనువర్ణయుగ్మము
నేమముతోడను జపించునియతాత్ములకుఁ
గామితమోక్షము లిత్తువు, శ్రీ... 11

క. భీమప్రస్తుతనామా
హైమవతీజప్యనామ యచ్యుతరామా
కోమలమేఘశ్యామా, శ్రీ... 12

క. రామా రమణీయగుణ
స్తోమా సమరజితరామ సుందరరామా
భీమపరాక్రమ దివ్య, శ్రీ... 13

క. శ్రీమంతం బగుతారక
నామజపం బనిలసుతుఁడు నాగాంతకుఁడున్
వేమఱు నెదురుగఁ జేతురు, శ్రీ... 14

క. రామ యనుమంత్రరాజము
నా మాధుర్యము మృదుత్వమాయద్భుతమున్
ఏమహనీయుల కబ్బునొ, శ్రీ... 15

క. రామా యనునీనామము
ప్రేమన్ బఠియించినట్టి ప్రీతాత్ములకున్
శ్రీమత్పదగతి యిత్తువు, శ్రీ... 16

క. రామా కల్యాణాంచిత
ధామా శ్రీరంగధామ దశరథరామా
భూమిసుతాధిప రామా, శ్రీ... 17

క. రామ యహల్యాశాపవి
రామా వైకుంఠధామ రవిపుత్రబల
స్తోమ రణరంగభీమా, శ్రీ... 18

క. శ్రీమ జ్జితవిద్యుద్ఘణ
ఘామా దుర్మదవిరామ తాపసరామా
హేమహరిణమును ద్రుంచిన, శ్రీ... 19

క. రామా కల్యాణప్రద
నామా కోదండరామ నవ్యభుజంగో
ద్దామ దశకంఠలుంఠన, శ్రీ... 20

క. రామా రక్షక మ్రొక్కెద
రామా నన్నేలుకొను రాజకుమారా
శ్రీమహనీయ దయానిధి, శ్రీ... 21

క. రామా నీదగునామము
సామప్రియ శివునిపత్ని సరవిఁ జపముఁగా
గామితమతి నొనరించెను, శ్రీ... 22

క. రామా యెల్లప్పుడు మీ
రామతో నావెంట నంటి రమ్మా విలస
త్ప్రేమను మోక్షం బిమ్మా, శ్రీ... 23

క. రామయ్య రామ సీతా
రామా పట్టాభిరామ రాఘవరామా
శ్రీమృత్యుంజయపూజిత, శ్రీ... 24

క. శ్రీమహిత రామభద్రా
కామితకరుణాసముద్ర కార్ముకహస్తా
హేమశరాసన వందిత, శ్రీ... 25

క. రామ శ్రీమదయోధ్యా
రామా రాజీవనాభ రవికులసోమా
హేమమణికాంచిదామా, శ్రీ... 26

క. రామా రాజాధిరాజ
శ్రీమణినూపురపదాబ్జ శ్రీరవితేజా
వామన వరకుశశయనా, శ్రీ... 27

క. రామ జగదేకవీరా
శ్రీమదయోధ్యావిహార శివజపితగుణా
సామోద సార్వభౌమా, శ్రీ... 28

క. రామా రాతిరి వేకువ
జామున నినుఁ బ్రస్తుతింతు జన్మఫలముకై
రామా రాక్షసనిగ్రహ, శ్రీ... 29

క. రామా నను విడనాడకు
రామా నను( గన్నతండ్రి రఘుకులముఖ్యా
రామా నను రక్షింపుము, శ్రీ... 30

క. రామా రవిసుతపాలక
రామా భక్తాంతరంగ రమ్యశుభాంగా
చామరఛత్రాలంకృత, శ్రీ... 31

క. రామా రాజకులాగ్రణి
రామా నాచక్కనయ్య రఘునాథయ్యా
రామా నాప్రియదైవము, శ్రీ... 32

క. రామాభరతాగ్రజ నీ
నామము నాజిహ్వయందు నటియించుత శ్రీ
రామ రాజ్యాభిరామా, శ్రీ... 33

క. రామా సకలామరనుత
ధీమణి శ్రీరామదేవ దివిజస్తుత్యా
నామొఱ మది నాలింపుము, శ్రీ... 34

క. రామా రాజానన రఘు
రామా నాతోడునీడ రారా రామా
శ్రీమహితసింధుబంధన, శ్రీ... 35

క. రామా దశరథనందన
రామా రాజీవనేత్ర రాఘవ రామా
శ్రీమించునీచరిత్రలు, శ్రీ... 36

క. రామా పరమదయాకర
రామా రాకేందుముఖవిలాసోద్భాస
చ్ఛ్రీమకరాబ్జశ్రీపద, శ్రీ... 37

క. రామా సీతావల్లభ
రామా దాశరథి వాసరాధిపభాసా
శ్రీముఖచంద్రచకోరా, శ్రీ... 38

క. రామా మీఁతిరువడిఘులు
చామంతిసుపుష్పములను చంపకములచేఁ
గామించి పూజఁ జేసెద, శ్రీ... 39

క. రామా దాసజనార్చిత
రామా రంజితపదాబ్జరతి నాకిమ్మా
శ్రీమహిళామానసహర, శ్రీ... 40

క. రామా పవనజవాహన
రామా లోకాభిరామ రాజవరేణ్యా
శ్రీమాధవ శ్రీరామా, శ్రీ... 41

క. రామ రాజేంద్ర రాఘవ
రామా నాగారితురగ రాక్షసభంగా
శ్రీమత్ఫణీంద్రశయనా, శ్రీ... 42

క. రామా త్రిభువనరక్షక
రామా దీనజనబంధు రఘుకులసింధూ
స్వామి దయాపరమూర్తీ, శ్రీ... 43

క. రామా నాయిలు వేలుప
రామా హరి రామ ఘోరరావణహరణా
రామ సాకేతరామా, శ్రీ... 44

క. రామా శ్రీజగతీధవ
యేమిర శ్రీరామచంద్ర యిల నీవాఁడన్
నీమీఁదితలఁపు నిమ్మా, శ్రీ... 45

క. రామా కరుణాంభోనిధి
రామాత్మారామ లోకరక్షణ రామా
రామ కౌసల్యానందన, శ్రీ... 46

క. రామా రఘునందన శ్రీ
దామోదర తార్క్ష్యవాహ తాటకహరణా
రామ ఖరదూషణాంతక, శ్రీ... 47

క. రామా శాశ్వతబాంధవ
రామా నను గన్నతండ్రి రామనృపాలా
రామ నాపెన్నిధానము, శ్రీ... 48

క. రామా నను మన్నింపఁగ
రామా నీకన్నఁ బ్రోచురా జిఁక నేఁడీ
రామా రాజలలామా, శ్రీ... 49

క. రామా యిదిగో సమయము
రామా రక్షించు నన్ను రామ దయాళూ
రామార్తదీనపోషక, శ్రీ... 50

క. రామా సుందరమందిర
శ్యామాంగా హేమవర్ణ చక్రాసిధరా
కోమలగురుపదయుగళా, శ్రీ... 51

క. రామ గోవింద విష్ణూ
వామన పరవాసుదేవ వసుధారమణా
కామశతకోటిరూపా, శ్రీ... 52

క. భీమభయంకరబాణ
స్తోమా సాకేతవాస సూనృతవాక్యో
ద్దామా నిను నెంచెద విను, శ్రీ... 53

క. నీమహిమ లెన్ని పురుషులు
ఈమని వి త్తంబు లడుగ నియవేమి హరీ
నే ముఖ్యుఁ డౌట యెట్లను, శ్రీ... 54

క. రామా నాస్వాంతములో
నేమముగా నిరత మేను నిన్నర్చింతున్
హేమకుసుమములచేతను, శ్రీ... 55

క. రామా వాలిని గూల్చిన
రామా సుగ్రీవరక్ష రాజేంద్రనుతా
ప్రేమను వందన మిదిగో, శ్రీ... 56

క. రామా కరుణాంభోనిధి
రామా శ్రీపుండరీక రాజితచరణా
రామాంజలి నేఁ జేసెద, శ్రీ... 57

క. రామా రావణుతమ్ముని
రామా లంకాధిపతిగ రమ్యతఁ జేయన్
సామర్థ్యము నీకేతగు, శ్రీ... 58

క. భూమిజవర పురుషోత్తమ
నామది నెడ బాయకుండు నలినదళాక్షా
వేమఱు వినుతించెద నిను, శ్రీ... 59

క. రామా విశ్వామిత్రుని
కామితయజ్ఞంబు ఘనతఁ గాచిన దేవా
నీమహిమ లెన్న శక్యమ, శ్రీ... 60

క. కోమలవర్ణము గలిగిన
భూమిజఁ గైకొనినభూరిభుజబలసాంద్రా
శ్యామలకోమలకరపద, శ్రీ... 61

క. రామ శ్రీరంగనాయక
యీామహిలోపలను గోర్కు లింపున నిచ్చే
రాముఁడని కోరి వేఁడితి, శ్రీ.... 62

క. కోమలశ్యామలతులసీ
దామము ధరియించినట్టిదశరథసుత శ్రీ
రామ మదాత్మారామా, శ్రీ... 63

క. శ్రీమన్మంగళవిగ్రహ
నీమంగళవర్ణనీయవిచయము మదిలో
నేముందుగ సేవించెద, శ్రీ... 64

క. కామితఫలదుఁడ వంచును
నే మిమ్ముల నాశ్రయించి నిరుపమభక్తిన్
నామోచ్చారణఁ జేసెద, శ్రీ... 65

క. రామా నీదయచేతను
రామా నీపాదభక్తి రంజిలుచుండున్
రామా ననుఁ బోషించుము, శ్రీ... 66

క. స్వామీ నీవే ప్రభుఁడవు
స్వామీ నీనామజపము సర్వసుపర్వుల్
వేమఱు సన్నుతిఁ జేతురు, శ్రీ... 67

క. రామా నాకలుషంబులు
నామోచ్చారణముచేత నాశము నొందుఁ
నామనమునఁ జింతించెద, శ్రీ... 68

క. రామా త్రిభువనపూజిత
రామా నీపాదపద్మరజమును మదిలో
రామా యెపుడు స్మరించెద, శ్రీ... 69

క. రామ విమలాత్మ సీతా
భామానవమదన కదనభంజితదైత్య
స్తోమ ఘనశ్యామా యో, శ్రీ... 70

క. రామా నినుఁ గొనియాడెద
నీమృదుపదములును మోము నీమస్తకముఁ
దామరలఁ గేరు కరములు, శ్రీ... 71

క. రామ కపురంపుహారతి
నామక్కువ పళ్లెరమున నంచితభక్తిఁ
నే మీకిచ్చెదఁ గైకొను, శ్రీ... 72

క. రామేంద్ర నీలనీరద
శ్యామా గుణరుచిరరామ చంపకనాసా
ఆమోదకర విహారా, శ్రీ... 73

క. రాముఁడు తండ్రియు సీతా
రామయు తల్లియని మదిని బ్రస్తుతిఁ జేతుఁ
నామనవి వినుము రామా, శ్రీ... 74

క. శ్రీమత్పరమేశ్వరకరు
ణామధురస యురగలోకనాయక కృష్ణా
ప్రేమను నిను నమ్మితిరా, శ్రీ... 75

క. శ్రీమత్పరమదయానిధి
శ్రీమత్పంకేరుహాక్ష శ్రీయుతవక్షా
శ్రీమానినీమనోహర, శ్రీ... 76

క. శ్రీమధురాపురి వెలసిన
శ్రీమృదుశ్రీపాదములను జెన్నలరంగా
నామనమున సేవించెద, శ్రీ... 77

క. భీమనకులధర్మార్జున
స్తోమము పరిపాలనమున సొంపువహించెఁ
సామివనిఁ బ్రస్తుతించెద, శ్రీ... 78

క. శ్రీమధుసూదన ధర్మ
శ్రీమద్వసుదేవతనయ శ్రీకర కృష్ణా
యేమిర యిఁక ననుఁ బ్రోవర, శ్రీ... 79

క. శ్రీమురళీధర హేలా
శ్రీమద్గోపాల భక్తసేవితశీలా
శ్రీమునిరా డర్చితపద, శ్రీ... 80

క. సోమకుఁడు వార్ధిలోపల
ధీమతితో నుండువానిఁ ద్రెంచి శ్రుతుల నా
తామరసగర్భు కొసఁగవె, శ్రీ... 81

క. ప్రేమతొ నమృతము దరచఁగ
నీమంబుగ కమఠరూపు నీవెత్తవె యా
భీమమహీధ్రముకొఱకై, శ్రీ... 82

క. కామమున హిరణ్యాక్షుం
డామహిఁగొని వెళ్లినప్పు డాతని ద్రుంపన్
బ్రేమ వరాహమ వైతివి, శ్రీ... 83

క. భీమబలోద్ధతి విజయ
స్తోమా నరసింహరూప సురవైరిబలో
ద్దామా జయవిక్రమ నయ, శ్రీ... 84

క. వామనరూపముతోఁడుత
భూమంతయు నేలుచున్న భూరిబలీంద్రున్
నీమాయచేతఁ ద్రొక్కవె, శ్రీ... 85

క. ప్రేమ ముయ్యేఁడు మాఱులు
భూమిం జరియించి రాజపుత్రుల ద్రుంచా
భూమి బుధకోటి కిచ్చిన, శ్రీ... 86

క. భూమిజను పంక్తికంఠుఁడు
ప్రేమం గొనిపోవ నతనిపృథుతరశిరముల్
భీమముగఁ ద్రుంచి మించిన, శ్రీ... 87

క. భూమిజనసస్యవృద్ధికి
నేమముతో హలము వట్టి నేతలఁ బ్రోచే
యామహిమ నీకెతగునయ, శ్రీ... 88

క. నీమహిమ లెన్న శక్యమె
యేమహిలోఁ ద్రిపురవిజయులై తగుస్త్రీలన్
గామితులఁ జేసి వెలసిన, శ్రీ... 89

క. భూమీంద్రులెన్న జగముం
ధీమతిఁ బాలించి యవనధీరులఁ జంపన్
గామముతో డుత వెలసిన, శ్రీ... 90

క. శ్రీమందిర వరరమణా
కామితకమనీయ గరుడగమన మురారీ
నే మీకు మ్రొక్కెద నయో, శ్రీ... 91

క. రామ నవమోహనాంగా
రామా సీతాంతరంగ రమ్యశుభాంగా
రామ భవవర్గభంగా, శ్రీ... 92

క. రామానుజ నన్నేలిన
స్వామీ శ్రీకృష్ణదేవ సదమలనామా
రామా జనకామ జయ, శ్రీ... 93

క. రామా కస్తురిరంగా
శ్యామ శరశ్చంద్ర గాంగ శుభ్రయశశ్శ్రీ
కామా నను గరుణింపుము, శ్రీ... 94

క. రామ మిము సన్నుతించెద
నామానసవీధియందు నగధర కృష్ణా
దామోదర యని సతతము, శ్రీ... 95

క. రామ కరుణాలవాలా
శ్యామలరుచిజాల భక్తజనయోగీంద్రా
ద్యామరసన్మునిపాలా, శ్రీ.... 96

క. రామ సామ్రాజ్యధుర్యా
ధీమహిత సుమేరుధైర్య దితిజావార్యా
స్తోమామరగణవర్యా, శ్రీ... 97

క. రామునికన్నను రెండవ
సామియు లేఁడనుచు నీవె సర్వం బనుచున్
వేమాఱు విన్నవించెద, శ్రీ... 98

క. రాముఁడునువినా దైవము
భూమిన్ లేఁడనుచు మదిని బొందుగ నేనీ
నామామృతంబుఁ గ్రోలెద, శ్రీ... 99

క. శ్రీమదయోధ్యానాయక
కోమలనీలాభ్రదేహ గోధ్వజవినుతా
శ్రీమారుతసుతు నేలిన, శ్రీ... 100

క. రామ వరపావులూరి
స్వామివి నీవనుచు నమ్మి శతకము భక్తిన్
ప్రేమ రచియించితిని గొను, శ్రీ... 101

క. శ్రీమహితపావులూరి సు
ధాముఁడు రామన్న మంత్రితనయుఁడుఁ గవిసు
త్రాముఁడ మల్లనసచివుఁడ, శ్రీ... 102

క. సోమార్కనేత్ర విను నే
సీమహి వాసిష్ఠగోత్రహిమకరుఁడను సు
శ్రీమీఱ నిన్నుఁ గొల్చెద, శ్రీ... 103

క. స్వామీ ధర బాపమకుఁ
రామనకుం బుత్త్రకుఁడను రమణీయగుణో
ద్దాముఁడ నాపస్తంబుఁడ, శ్రీ... 104

క. ఈమహిలో నీశతకం
బేమనుజుఁడు వ్రాయుఁ జదువు నీప్సితఫలముఁ
బ్రేమ నొసంగుము దయచే
శ్రీమద్భద్రాద్రిధామ శ్రీరఘురామా. 105

భద్రాద్రిరామశతకము

సంపూర్ణము.

# పీఠిక

మారుతిశతకము భక్తిరసప్రధానమై ఆంజనేయుని బలపరాక్రమస్థైర్యాదికములను గొనియాడుచున్నది. అప్పకవీయమునం దుదాహరింపఁబడిన మరున్నందనశతకమునకు నీమారుతిశతకమునకు సంబంధములేదు. మరున్నందనశతకమునుండి తీసి యుదాహరింపఁబడిన యప్పకవీయములోని పద్య మిది-

శా. "కోపాటోపము కుప్పిగంతులు భవ
త్కుంఠీభవచ్చౌర్యరే
ఖాపాండిత్యమయారె నీకును నమ
స్కారంబు లంకాపురీ
పాపగ్రంథికులాంగనా కుచతటీ
పైరావతగ్రాహ్యబా
హాపాటచ్చరరామదాస తవదా
సోహం మరున్నందనా."

ప్రకృతశతకము మారుతిని సంబోధించున దగుటచేతను ఉదాహృతశతకము మరున్నందనుని సంబోధించునదగుటచేతను రెండు నొకటే యనుప్రవాదము విశ్వాసపాత్రముగ లేదు.

ఈమారుతిశతకమును రచించినకవి కొటికలపూడి కోదండరామయ్య. ఇతఁడు జ్యోతిశ్శాస్త్రపారంగతుఁ

డు. ఈశతకమునఁ గవి తనగోత్రము తండ్రిపేరు చెప్పకొనకపోవుటవలనఁ గవినిగూర్చిన విశేషాంశములు గురుతింప వీలుకలుగుటలేదు. కొటికలపూడి వారిలో నందవరీకులు వైదికులు గలరు. రెండుకుటుంబములయందును బూర్వికవులు కలరుగాని మారుతిశతకకర్త గోత్రము చెప్పకొనకపోవుటచే నేశాఖీయుఁడో నిర్ణయింప వీలులేకపోయినది. ఈశతకము వ్రాసిన కోదండరామకవి ఉభయభాషలలో మంచిపండితుఁడును నిరర్గళకవితాధారగలవాఁడనియు శతకమును బఠించినవా రెఱుంగఁగలరు.

మారుతిశతకము మృదుమధురధారతో నుండుటచేఁ బఠనీయముగా నున్నది. ఆంజనేయుని దివ్యలీల లుత్ప్రేక్షించుచు రామాయణమునకు సంబంధించినచర్యలను వర్ణించుచు వాలాద్యవయవములను గొండాడుచు నొక్కొక్కపద్య మొక్కొక్కనూతనభావముతో నలంకరించి కవి మనోహరముగా శతకము రచించియున్నాఁడు. క్రొత్తపోకడలతో నిండియున్న యీశతకము పఠనీయమైయున్నది.

నందిగామ.
1-1-25.

ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు, శతావధానులు.

శ్రీ ర స్తు.

కొటికలపూడి కోదండరామకవిప్రణీత

# మారుతిశతకము.

---

శా. శ్రీమద్రామకథాసుధారసము లేప్రేమం బ్రవర్తిం
చుఁ ద,ద్భూమిఁ హర్షపయఃపరీతనయనంబుల్
కంటకాంచత్తను, శ్రీమీఱఁ దృఢభక్తితోడ
శిరముఁ జేదోయి జోడించి నా, నామహాసీం
ద్రులు మెచ్చ నిల్చి తగు నిఁ వర్ణించెదఁ
మారుతీ! 1

శా. కంజాప్తాన్వయదుగ్ధవారినిధి రాకాచంద్రు సద్వా
క్యముల్, కంజాక్షీమణి యైనసీతకును దత్కాం
తా మతల్లివచః, పుంజంబుల్ రఘుభర్తకుఁ
దెలుపుచుఁ బుత్త్రాకృతిఁ వారిచెం,తం జెల్వారఁ
జరించి మించిననినుఁ ధ్యానించెదఁ మారుతీ!

శా. సీతారాముల కగ్రనందనుఁడు కిష్కింధాపుర
స్వామికిఁ, జేతశ్శుద్ధికరుండు లక్ష్మణునకుఁ
జీవానుసంధాత దు,ర్దైతేయాళికి దండపాణి
యపవర్గశ్రీకి నాథుం డనా, భాతిఁ భాసిలుభ
వ్యభవ్యు నిను సంభావించెదఁ మారుతీ! 3

శా. రామస్వామి నినుఁ స్వకీయపరివారంబందు
నగ్రేసరుం, గా మన్నించుటఁగాదె ముందు భవ
దాఖ్యం బల్కి సీతాసతిఁ, సౌమిత్రిఁ భరతా
దులఁ బిదప నెన్నంజొత్తు రుర్వీజను, ల్నీమా
హాత్మ్యముఁ దెల్పుపాటినరు లేరీ భూస్థలిఁ
మారుతీ. 4

శా. పారావారము గోష్పదంబు మశకప్రాయు ల్నిశా
టుల్ హిమా, నీరూపంబులు వాలవహ్నిశిఖ
లున్నిద్రాలి దివ్యాస్త్రముల్, పూరేకుల్ జయ
లక్ష్మి భార్య సమరంబుల్ కేళు లర్కాన్వయా,
ధారుఁ గొల్చుట కృత్యమై తగు నినుఁ
ధ్యానించెదఁ మారుతీ! 5

శా. శైలోన్మూలనలోహపాశము రణోత్సాహిద్విష
త్ప్రాణివా, తూలవ్యాళము భానునందనచమూ
దుర్గంబు ధూమ్రాక్షకం, తాలోలాయస చండవా
గురుదశాస్యాంచత్పురీదాహకో, త్తాలాలాత మ
సంగభాసిలు భవద్వాలం బహో మారుతీ! 6

శా. భీమాకారభుజంగరాజవపురాభీలంబు దుర్దాంత
సంగ్రామత్స్ఫూరితశౌర్యమూలము హతాక్షప్రాణ
వాతూల ముద్దామశ్రీయుత పంక్తికంఠపురసద్మ
ప్రేషితాగ్నిచ్ఛటా, దామోద్దీప్తదిగంతరాళము
భవద్వాలం బహో మారుతీ! 7

మ. సరసీజాప్తకులావతంసుని యశస్సమ్యక్సుధాపూ
రమం,బరభాగంబున దిక్తటంబులను శుంభద్వృ
త్తితోఁ బూయ ని,ర్ఝురసంఘంబులు గూర్చుకూ
ర్చకరణిన్ రాజిల్లుయుష్మన్మహా, గరభృత్సన్ని
భవాల మెంచి పొగడంగా శక్యమే మారుతీ!

మ. జలజాతాప్తకుమారసైన్యపటలీ జాతార్భటీ
కోటిచేఁ, జలితం బైన సతారకాగ్రహవిరాజ
ద్వ్యోమభాగంబు భూ, స్థలిమీఁదం బడకుండ
రాఘవుఁడు సంస్థాపించు మేలైనబం, గరుకంబం
బన నీదువాల మమరున్ గాఢవ్రతీ మారుతీ!

శా. గాఢపవోపమానశరకోటుల రావణముఖ్య
దైత్యులన్, గాఢగతిన్ వధించి తగఁ గంజ
హితాన్వయుమ్రోల వానరుల్, ప్రౌఢిమ నిల్వఁ
బో గెలుపుగాటగతిన్ భవదీయవాల మా,రూ
ఢవియత్పథం బగుచు రూఢి వెలుంగుఁగదయ్య
మారుతీ! 10

శా. లంకావల్లభుతోడ రాముఁడు రణారంభంబుఁ
గావించుచోఁ, బొంకంబొప్పఁగ నీవు వాహనమ
వై పొల్పారి తవ్వేళ ని, శ్శంకన్ నీదగువాల
శుభ్రపటలీచంచత్పటోపేతతా, క్ష్యాంకం బౌచు
వెలింగె నిన్బొగడ శక్యం బెరికా మారుతీ! 11

శా. శ్రీరామాంఘ్రిసరోజభక్తిభరితున్ సీతాంగనా
స్తుత్యసం, చారున్ రావణసైన్యదావదహనున్
సౌవర్ణధాత్రీధరా, కారున్ భానుతనూజమం
త్రివరు లంకాపట్టణధ్వంసకున్, వీరున్ నిన్ను
భజింతు నన్ను దయతో వీక్షింపుమీ మారుతీ!

శా. వ్యాళాధీశ్వర భోగసన్నిభ లసద్వాలాగ్రబద్ధా
సురీ, చేలగ్రాసవివర్ధమాన ఘనరోచిష్కేశ నిర్ద
గ్ధలం, కాలంకారుని జంబుమాలిముఖదైత్యగ్రా
వవజ్రాయుధున్, ఫాలాక్షస్తుతు నిన్నుఁ గొల్చె
ద ననున్ బాలింపుమా మారుతీ! 18

శా. మైనాకాచలతుంగభంగచయ సమ్మర్దోత్థితాంభో
నిధి, ధ్వానగ్రాసవివృద్ధకంఠనినదధ్వస్తాఖిలక్రవ్యా
భు, క్సేనాకర్ణుని హేమవర్ణుని దమక్షేమక్షమా
కీర్ణ సీ,తానాథాశ్రమపూర్ణు నిన్నుఁ గొలుతున్
ధన్యాకృతీ మారుతీ! 14

మ. కటిసూత్రంబును జన్నిదంబు జడలున్ గౌశేయ
కౌపీనముల్, పటుశృంగారపలాశదండములు
సారంగాజినంబుల్ శిఖో, ద్భటదర్భాంకురము
ప్తియున్ భసితలేపం బెంతయున్ భాసిలన్,
వటురూపంబున రామునిన్ గనిననిన్వర్ణించెదన్
మారుతీ! 15

మ. అపశబ్దంబు నిరర్థకంబు విపులం బన్యాయ
మాక్రోశ మ,వ్యపదేశం బనిమిత్త మత్యధిరవం
బస్పష్ట మప్రాప్తకా, ర్యపరం బైననికృష్టవాక్కు
భవదాలాపంబునఁ లేమి ని, ష్కపటస్ఫూర్తి
నుతించెనిఁ జనకజాకాంతుండహో మారుతీ!

మ. హితముఁ సత్యము సాధువాక్యవినుతం బిష్టం
బు విస్పష్ట మం,చితకంఠస్వర మల్పవర్ణ,మఖిలశ్రే
యస్కరం బర్థవి, స్మృతముఁ బ్రస్తుతకార్య
కారి యగుచుఁ శోభిల్లు నీవాక్యసం, తతికిఁ
రాముఁడు సంతసించెను భళీ! ధర్మాకృతీ!
మారుతీ! 17

మ. తపనాకారఘనద్యుతీ! నగధృతీ! దైతేయకాలా
కృతీ!, జపహోమాధిస్ఫృతీ! బృహస్పతిమతీ!
సంతుష్టసీతాసతీ!, కపిరాజాప్తనుతీ! మహాగుణ
తతీ! కాకుత్స్థసేవారతీ!, విపులానందయుతీ!
ప్రభంజనగతీ! విశ్వోన్నతీ! మారుతీ! 18

మ. అవితాశేషకపీంద్రసైన్యవితతీ! హర్యక్షతుల్యా
కృతీ!, దివిజవ్రాతకృతస్తుతీ! మహదనాదిబ్రహ్మచ
ర్యవ్రతీ!, జవనిర్ధూతసదాగతీ! దివసకృత్సంప్రా
ప్తసర్వస్మృతీ!, స్తవనీయాహవహర్షితామరపతీ!
శాంతిక్షితీ! మారుతీ! 19

ఉ. సత్యము దానముఀ దపము శౌచము శాంతము
రామభ_క్తి సాం, గత్యము బ్రహ్మచర్యము సుఖ
స్థితి మార్దవ మార్జవంబుఁ బాం, డిత్యము శ్రద్ధ
నీతి దయ ధీరత ధర్మముఁ బుణ్యకర్మముల్, నిత్య
ము నీకడఀ నిలుచు నిన్ను నుతింపఁ దరంబె
మారుతీ! 20

చ. విరతి వివేకముఀ సమత వేదసమాదరణంబు
యోగముఀ, కరుణ దమంబు మైత్రి మురఘుస్మ
రుపూజన మార్జవంబుపా, యరుచియకామ మో
రిమి మితాశన మాదిగ స_త్త్వధర్మముల్, నిరత
ము నిన్నుఁ గొల్చుటను నీకు సమానులు లేరు
మారుతీ! 21

మ. విలసత్స్థైర్యము విక్రమక్రమము ప్రావీణ్యంబు
గాంభీర్య ము, జ్జ్వలశౌర్యంబు జవంబు నీతి
ప్రతిభాసాంగత్యదాక్షిణ్యముల్, బలముఀ
ధైర్యము సాహసంబు విజయోపాయంబు నీయం
దు నిర్మలవృ_త్తిఀ వసియించె నిన్నుఁ బొగడఀ,
మాశక్యమే మారుతీ! 22

మ. పరుషత్వంబు మదంబు నా_స్తికత దంభం బీర్ష్య
మోహంబు మ,త్సర మన్యాయము కామలోభ
ములు దౌర్జన్యంబు రోషంబు ద,ర్పరుజల్ భీతి

దురాశ నిర్దయ వివాదం బార్తి జాడ్యంబు
ము, ష్కరత న్నీభటునైనఁ జెందవు నిను
గాంతించునే మారుతీ! 23

చ. విపులతపోధనుండవు పవిత్రచరిత్రుఁడ వాహవ
క్రియా, నిపుణుఁడ వబ్జనాభపదనీరజభక్తియు
తుండ వాగమాం, తపటురహస్యవేదివి దృఢ
వ్రతశాలివి బ్రహ్మచర్యవి, ఘ్నపతివి మృత్యు
శూన్యుఁడవు గర్వవిహీనుఁడ వీవు మారుతీ! 24

మ. గణనాతీతము లైనసద్గుణతతుల్ కంజాతమిత్రా
న్వయా, గ్రణియందుం బలె నీకడన్ గలుగు
టన్ రాముఁ బలెన్ నిన్నిచ, ఁణు లర్చించి
యనిష్టవర్జనము లిష్టప్రాప్తులం బొంది యు, ల్బ
ణసౌఖ్యంబులఁ బండియుండెదరు భూభాగంబు
నన్ మారుతీ! 25

శా. శ్రౌతస్మార్తపురాణ పాశుపతదీక్షాపాంచరాత్రా
గమ, ద్వైతాద్వైతకథాశ్రుతిస్మృతులు వార్తా
దండనీతిత్రయీ, జ్యోతిర్దర్శనసాంఖ్యయోగ
†వచసోయుక్న్యాయశాస్త్రాదులున్, సీతానాథు
దయన్ భవద్రసన రంజిల్లుంగదా! మారుతీ! 26

శా. క్రూరాకారచమూవృత ప్రచురరక్షోరాజధానీ

† సువచోయుఙ్న్యాయ.

మహా,వీరంబందు నిశాటశోణితఝరావిక్షీర
ముల్ వేల్చు దు,ర్వారాగ్నేయశిఖల్ సృజించి
సమ రారంభప్రవర్గ్యక్రియన్, శ్రీరామేశ్వరుం
దృప్తుఁజేసితివి కర్మిష్ఠాగ్రణీ! మారుతీ! 27

శా. అత్యౌదృప్రభుగంగరక్తసమిథాజ్యాదుల్ ప్రతా
పాగ్నిలోఁ, బ్రక్షేపం బొనరించి రావణపురప్రా
గ్వంశశాలాదులన్, దక్షత్వంబునఁ గాల్చి వేల్పు
లఁ బ్రమోదస్వాంతులం జేసి వి, శ్వక్షేమం బొ
నరించునీక్రతువు మెచ్చన్ శక్యమే మారుతీ!

చ. గరుడునికంటె మారుతముకంటెఁ దటిల్లతకంటె ని
ర్జరే, శ్వరుభిదురంబుకంటె హరిచక్రముకంటె
శరంబుకంటె భా, స్కరుహరికంటెఁ గృష్ణవృగి
కంటె విమానముకంటె జారసుం, దరిచలదృష్టి
కంటె బలితంబు భవజ్జవ మెన్న మారుతీ! 29

మ. జలధిధ్వానము భేరికాధ్వనులు గర్జానాదముల్
ఝల్లరీ, విలసద్రావము వజ్రపాతభవగంభీరస్వనం
బుల్ జగ, త్ప్రళయారంభవిజృంభమాణపురజి
ద్భవాట్టహాసార్భటుల్, బలిమిన్ నీవు రణం
బులోఁ గొలుపుబొబ్బం బోలునే మారుతీ! 30

మ. హిమవంతంబు మహేంద్రమున్ మలయమున్
హేమాద్రియుం జక్రవా, ళముఁ గైలాసము

మందరంబును మొదల్ గాఁ గల్గుశైలేంద్రముల్,
సమరాభీలవిజృంభమాణవిపులోత్సాహప్రవృద్ధ
శ్రీని, క్రమదేవోపమతావకాంగముల నెంచం
బోలునే మారుతీ! 31

మ. భుజగాధీశ్వర భోగిభోగనిభముల్ భూభాగ
ధౌరేయదిగ్గజతుండప్రతిమానముల్ దనుజదు
ర్గద్వారబద్ధాదర, వ్రజస్ఫూర్త్యార్గళరూపముల్ దివి
జసాలప్రాజ్యశాఖాభముల్, త్రిజగత్సంస్తుత్యము
లైననీభుజములర్థిన్ గొల్చెదన్ మారుతీ! 32

శా. మేరూన్మూలనయోగ్యశక్తియుతముల్ మిత్రాత్మ
జస్తుత్యముల్, వైరాన్వీతనిశాటకోటిదళనావా
ర్యంబు లార్తార్తిసం, హారోదారము లుజ్జ్వల
త్కనకభూషాంతస్థరత్నప్రభా, పూరాపూర్ణము
లైననీకరములన్ భూషించెదన్ మారుతీ! 33

మ. ఘనకాఠిన్యసమేతముల్ జలజరాగచ్ఛాయముల్
సాయకా, సనచక్రాంబుజశంఖమత్స్యముఖ
భాస్వత్సౌమ్యరేఖావళుల్, వనజాప్తాన్వయపా
దపద్మయుగసేవాజాతవైదగ్ధ్యముల్, జనసంస్తు
త్యము లైననీదుకరముల్ వర్ణించెదన్ మారుతీ!

ఉ. రావణువక్షముం బొడిచి రాక్షసులన్ వధియిం
చుదార్ఢ్యమున్, శ్రీవరుఁ డైనరాముపదసేవ యొ

నర్చెడిమార్దవంబు భ, క్తావళిదైన్యదుఃఖముల
నన్నిటిఁ బాపెడిభూరిశక్తియుఁ, దావకపాణిప
ద్మముల దట్టములై వసియించె మారుతీ! 35

మ. చటులధ్వానము భీషణాననముఁ జంచద్భూరివా
లంబు వి, స్ఫుటదంష్ట్రాంకురముల్ మహోగ్ర
నఖముల్ సూక్ష్మావలగ్నంబు ను, ద్భటశౌర్యం
బు మనోజవం బతులసత్త్వం బొప్పుచున్నట్టిమ,
ర్కటసింహా న్నిను విన్న భీతిలుఁ జుమీ! రక్ష
స్తతు ల్మారుతీ! 36

మ. తనకుఁ శక్రుఁ డుపాయనం బొసఁగుముక్తాహార
మారాముఁ డి, చ్చెను సీతాసతి కాసతీతిలకమి
చ్చె న్నీకు నీవప్పు డా, ఘనహారంబు ధరించి దే
వతటినీకల్లోలసందీప్తకాం, చనశైలంబువలెఁ వె
లింగితివి భాస్వద్భారతీ! మారుతీ! 37

మ. మణిహారంబులు రత్నకుండలములుఁ మాణిక్య
కోటీరకం, కణముల్ కాంచనమేఖలల్ జలజరా
గస్ఫారమంజీరముల్, ప్రణుతాశేషవిభూషణా
వళులు దీప్యచ్చేలముల్ రాఘవా, గ్రణిచేఁ గై
కొని తాల్చుని న్ననుఁగొనఁ గాంతుంచెదఁ
మారుతీ! 38

చ. కనకముకంటె మానికముకంటె హులుతాశనుకంటె

బాలసూ, ర్యనిరుచికంటెఁ బల్లవసరోరుహహల్ల
కపంక్తికంటె భూ, తనయునికంటె సాంధ్యజలదం
బులకంటెను శోణకాంతులఁ, దనరెడినీముఖా
బ్జము గనఁ మది వేడుకపుట్టె మారుతీ! 39

ఉ. మండితరత్నకుండలసమంచితగండయుగంబు బా
లమా, ర్తాండనిభారుణచ్ఛవియుతంబు విలోలవి
శాలనేత్ర మా, ఖండలరత్నరాజదలకంబు సు
ధాంశునిభంబుఁ జంద్రికా, పాండురమందహాసి
మయి భాసిలు నీవదనంబు మారుతీ! 40

మ. కమలాప్తాన్వయమంత్రరాజపద దీక్షాస్పందదూ
ర్ధ్వాధరో, ష్ఠము నాసాగ్రగతావలోకనము సం
ధ్యాకాలపంకేరుహా, క్రమయుక్తార్థనిమీలితాక్షి
యుగ మారమ్యస్మితాంకూర ము, త్తమతేజం బ
గునీముఖంబు సరి పద్మం బెట్లగుఁ మారుతీ! 41

మ. భరితక్రోధవిఘూర్ణమానన యనాబ్జాతంబు భీభత్స
రౌ, ద్రరసాకీర్ణము వజ్రివజ్రనిభదంష్ట్రాదుర్ని రీ
క్ష్యంబు దు, ర్ధరనిర్హ్రాదభయంకరం బగుభవద్వ
క్త్రంబు వీక్షించి సం, గరభూభాగముఁ బాసి
పర్వెదు రహో క్రవ్యాశనుల్ మారుతీ! 42

చ. అనిలునకుం గుమారుఁడ వహర్పతిసూతికిఁ బెద్ద
మంత్రి వం, జనకుఁ దనూభవుండవు నిశాచరవీరు

ల కంతకుండ వ, ర్జునునకుఁ గేతనస్థుఁడవు సూర్య
కులాగ్రణికిన్ భటుండవై, తనరెడినీకు వందన
ముదంచితభక్తినొనర్తు మారుతీ! 43

చ. భ్రమణము సేయువేళ మురభంజనుచక్రమురీతి
నభ్రభా, గమునకు నెత్తువేళ లయకాలునిదండ
ముమాడ్కి నంసదే, శమున ధరించువేళ విలసజ్జ
లధీశుని పాశమట్లు నీ, విమలినవాల మొప్పుఁ బ్ర
తివీరభయంకర మౌచు మారుతీ! 44

మ. దనుజశ్రేణికిఁ గర్ణ†శల్యములు సీతాదేవికిన్ జా
టువా, క్యనిరూఢుల్ రఘుభర్తకున్ విజయవా
ద్యధ్వానము ల్కేశవా, హిని కాహ్వానరవంబు
లర్కజునకున్ హేలాస్పదంబుల్ భవ, ఘ్నసాం
గ్రామికసింహనాదము లహో ధన్యాకృతీ!
మారుతీ! 45

శా. మైనాకాచలవర్యశీర్షమునకున్ మాణిక్యకోటీర
మై, నానామునిహృదంబుజాతములకున్ మా
ర్తాండబాలాతపం, బై నిర్నిద్రసరోజహల్లకనిభం
బై సౌమ్యరేఖావళీ, స్థానంబై తగు నీదుపాద
ములకున్ దండంబులో మారుతీ! 46

ఉ. పాపములం దొలంచు బహుబంధము లూడ్చును

† మంత్రములు.

రామభక్తికిన్, బ్రాపగు దైన్యదుఃఖములఁ బాపు
సమగ్రసమస్తసంపదల్, చేపడునట్లు సేయు రణ
సీమ జయంబు లొసంగుఁ దావక, శ్రీపదపద్మసేవ
యిఁకఁ జెప్పెడిదేమిటివీర! మారుతీ! 47

మ. కలనం దావకముష్టిఘాత మఖిలక్రవ్యాశిరాణ్మ
స్తకా,వళికిం బైఁబడువజ్రపాత మిఁక నీవాలంబు
దైత్యాంగక, స్థలులం జుట్టిన కాలపాశము భవ
త్సందర్శనంబు ల్సురా, రులకున్ యామ్యభటప్ర
దర్శనములై రూఢిన్ దగున్ మారుతీ! 48

మ. యమసంబంధిగుణప్రవృత్తి నియమవ్యాపార
ముల్ బ్రాణసం, యమనం బక్షనిరోధమానసగ
తుల్ న్యాసాధ్వముల్ ధారణ, క్రమముల్
భూరిసమాధినిష్ఠయును నంగంబుల్ దగం గల్గు
యో, గము భాగంబుగఁ గొన్న నిన్నుఁ గని లో
కం బెన్న దే మారుతీ! 49

శా. ద్రోణాద్రీంద్రమహౌషధుల్ పెరటిమందుల్
భూరిలంకాపుర, క్షోణీచక్రము హోమకుండ
ము దినేశుం డోజఘాత్రీధ్రముల్, పాణిం బూ
వినపుష్పగుచ్ఛములు శ్రీరాముండు జంభారిపా,
షాణస్యూతకిరీట మైననిను మెచ్చన్ శక్యమే
మారుతీ! 50

మ సరసీజాప్తవిభావిభాసితనవాబ్జశ్రీలకుం దావులై, యరవిందాంకుశశంఖచక్రముఖరేఖానేక దీప్తంబులై, దురితవ్రాతమదేభమర్దనచణస్తుత్యర్హసింహాంబులై, తరుణప్రాయము లైననీచరణముల్ ధ్యానించెదన్ మారుతీ! 51

మ. పటుభూమీరుహా †కంకపత్రములు శుంభద్బాహుశాఖాగతుల్, కుటిలాకుంచితపాదచాపము నఖక్రూరాసిపుత్త్రుల్ సము, ద్భటదంష్ట్రోగ్రకుఠారముల్ పదతలప్రాసంబు లొప్పన్ విశం, కటవృత్తిన్ రణభూమిఁ ద్రుంచితివిగా క్రవ్యాదులన్ మారుతీ! 52

ఉ. పాణితలోరుతాడనము బ్రాహ్మ్యశరంబుగఁ దన్నుటన్ జగ, త్ప్రాణిశిలీముఖంబులుగ దంతనిక్రుంతన మెంచ హావ్యభు, గ్బాణము గాఁగ ముష్టిహతి పాశుపతాస్త్రము గాఁగ దానవ, శ్రేణుల యుద్ధభూమి జముఁజేర్చి వెలింగితి వీవు మారుతీ!

ఉ. మౌక్తికతుల్యకల్యనఖమండలముల్ తరుణారుణాంగుళీ, యుక్తము లూర్మికాగతసమున్నతరత్న మరీచిజాలసం, యుక్తము లబ్జరాగమణిసంయుతనూపురనాదవంతముల్, రక్తరుచు ల్భవ్వదంఘ్రులు తిరం బగుభక్తి భజింతు మారుతీ. 54

† గార్ధ్రపక్షములు.

చ. తరువులకెల్లఁ బల్లవవితానములౌచు మహేంద్ర
ముఖ్యభూ, ధరములకెల్ల ధాతుసముదాయము
లౌచు దశాస్యప్రోలికిన్, సురుచిరవహ్ని కీల
లగుచున్ దగుతావకపాదదీధితుల్, మఱువక
మన్మనోగతతమం బణఁగించును గాక మారుతీ!

ఉ. బంధుర మైనభీతిఁ గొని పర్వతకందరడాఁగు త
జ్జగ, ద్బంధుకుమారవర్యునకు భానుకులాగ్రణి
బాంధవంబు వే, సంధిలఁ గూర్చి వాలిని విసం
జ్ఞునిగాఁ బొడిపించి మించి కి,ష్కింధకు రాజుఁ
జేసితివి కీర్తిఘనుండవు నీవు మారుతీ! 56

చ. అడవులఁ గొండలం దిరిగి యాకులుఁ గాయలుఁ
గోసి తించు నే, ర్పడ నదులం గొలంకుల జలం
బులు గ్రోలుచు నున్నక్రోఁతులం, జడులను భాను
జుండు గొని చక్కఁగఁ ద్రిప్పుచుఁ గార్యసిద్ధు
లం, బడయుట చూడ నీదుప్రతిభామహిమం
బునఁ గాదె మారుతీ! 57

శా. సౌమిత్రిప్రబలప్రతాపశిఖచేఁ జాకుండ సుగ్రీ
వునిన్, గామాంధున్ రఘునాథుపాదముల
వేడ్కన్ వ్రాలఁగాఁ జేసి త,త్ప్రేమాధిక్యము
చేతఁ బ్రాణసహితున్ శ్రీమంతుఁ గావింపవే,
నీమంత్రిత్వము వర్ణనీయము గదా నిత్యోన్నతీ!
మారుతీ! 58

శా. నీవాక్కుండవు తక్క భానుఁ డయినన్ దేవే
ద్యుఁ డైనన్ వ:హా, దేవుం డైనను బ్రహ్మదేవుఁ
డయినన్ దేవేశ్వరుం డైన సం, భావింపంబడు
రామముద్రిక ధరింపంజాలరా దాట నీ, ప్రాపి
ణ్యాదులు విశ్వతోధికము లై భాసిల్లు
నో మారుతీ! 59

శా. లంకాపట్టణదుర్గపాలనసముల్లాసాన్వితన్ గీక
సాలంకారాన్విత నీలతుందిలశరీరప్రోజ్జ్వలన్
లంకిణిన్, శంకాతంకము లేక ముష్టిహతిచే
శాసించి కార్యార్థి వై, పొంకం బొప్పఁగ లంకఁ
జొచ్చిననినున్ భూషించెదన్ మారుతీ! 60

మ జలధిప్రేరితుఁ డై హిమాద్రిసుతుఁ డుత్సాహం
బుతో వచ్చి నీ, జలజాతప్రతిమానపాదములు
శీర్షంబందుఁ గోటీరముల్, బలె భక్తిన్ ధరి
యించి తత్క్షణమె జంభద్వేషికిన్ మాన్యుఁ
డై, యలరెన్ నీభజనంబు రామభజనం బట్లే
కదా మారుతీ! 61

మ. గగనాధ్వంబున వార్ధిమీఁదఁ జనుజాగ్రద్గండ
భేరుండవై, త్వగణాదిత్యవిమానసంఘముల ఛా
యం బట్టి భక్షించుచో, యగుణగ్రాహిణి
యైనసింహికను వజ్రాంచన్నఖశ్రేణిచే, జగ

మెన్నఁగ వధియించునీబలము మెచ్చఁగ శక్యమే
మారుతీ! 62

శా. క్షోణీచక్రము దిర్దిరం దిరుగ నాస్ఫోటించి
రాముఁగ జగ, త్ప్రాణుఁగ సన్నుతి చేసి భూరి
తనువర్ధాకుంచితం బై తగఁగ, బాణిద్వంద్వము
సాచి భూధరముపైఁ బాదంబులం బూని
గీ, ర్వాణాధ్వంబున వార్ధిపై కెగయు నిన్
వర్ణించెదఁగ మారుతీ! 63

మ. స్వతనూత్పాదిత మౌట రావణుపురస్థానంబుఁ
జూడఁగ వియ, ద్గతితో మేరువు దక్షిణాశకుఁ
జనంగాఁబోలు నంచుఁగ సుర, ప్రతతుల్ చూడ
నిజాంగపింగళరుచిభ్రాజద్ఘనాళీకృతో, త్థితరఘుం
పాచయ మొప్ప దాఁటితి వహో! యామ్యాం
బుధిఁగ మారుతీ! 64

ఉ. కాంచనపక్షముల్బలె స్వకాయరుచిస్థగితాభ్రకో
టిరా, జించఁగఁబాదసంగతఫణిప్రభువైఖరిఁబుచ్ఛ
మొప్పఁగాఁ, జంచువు లట్లసాచినభుజంబులు
మీఱఁగ వైనతేయున, ట్లంచితశక్తితోడ లవ
ణాంబుధి దాఁటితి వౌర మారుతీ! 65

శా. రంగద్భంగతురంగముల్ ఘనరథగ్రామంబు జీ
మూతమా, తంగంబు ల్మకరోగ్రవీరతతి రత్న

స్వర్ణముల్ గల్గుటన్, వింగిన్ ముట్టి యెదుర్చు
సింధువిభునిన్ నీకంటె నన్యుండు దాఁటంగా
శక్తుఁడు లేఁడటంచు నిను వేడ్కన్ మెచ్చెదన్
మారుతీ! 66

ఉ. రావణుపేరు చెప్పిన సురప్రభుఁ డైన వడంకు
దుష్టస, త్త్వావిలగర్భ మైనలవణాంబుధిఁ జూచిన
భీతిపుట్టు నీ, వావనరాశి దాఁటి దనుజాధిపు గే
హముఁ జొచ్చి జానకీ, దేవిని గాంచి వచ్చుట
ముదిం దలపోసితి నిట్టిసాహసం, బీవిధ మైనధై
ర్యము మహిం గలదే యొరునందు మారుతీ!

శా. ఫాలాక్షాద్భుతచాపఖండనకలాప్రౌఢిన్ విజృంభిం
చు నీ, తాలోలారుణపాణిపద్మమున నిత్యం బుం
డి భాస్వన్మయూ, ఖాళిం గేరెడివజ్రకాంతుల న
మూల్యం బైన శ్రీముద్రికన్, గేలం బట్టిన రాము
భక్తుని నినున్ గీర్తించెదన్ మారుతీ! 68

ఉ. రావణు నిష్కుటంబున ధరాతనయం దగఁ జూచి
రామగో, త్రావరుఁ డానవా లొసఁగురత్నమ
యోర్మిక భక్తినిచ్చి యా, దేవుని మంజువాక్య
ములఁ దెల్పి తదంబుజనేత్రచేత మే, ల్దీవన లొం
దినాఁడ విది దివ్యులకైనఁ దరంబె మారుతీ! 69

చ. అతులితరామముద్రిక ధరాత్మజకిచ్చి తదీయమా

లిసం, గతరమణీయరత్నముఁ జిరంబగు భక్తిని
గొంచు రాఘవ, క్షితిపతి కింపుతో నొసఁగు కీశ
వరుం డితఁడంచు దేవతల్, నుతు లొనరింప నొ
ప్పితి వనూనచరిత్రుఁడ వీవు మారుతీ! 70

ఉ. స్యందనవాజిదంతిభటసంగసమేతు వినీలభూమి
భృ, త్తుందిలదేహు సింహనిభదోర్బలు శక్రము
ఖాఖిలామరా, క్రందనకారి దివ్యశరగర్వితు నక్షు
కు నొక్కగ్రుద్దుచే, మ్రందఁగఁ జేసినాఁడ వతిమా
నము లావకశక్తి మారుతీ! 71

ఉ. రావణుమంత్రిపుత్త్రుల పరాక్రమసింహుల భూ
రిగర్వరో, షావిలచిత్తులన్ సమవయస్కుల
ఘోరచమూసమేతులన్, బావకతుల్యశస్త్రయా
తపాణుల నేడ్వుర నాహవస్థలిన్, దేవత లెన్న
వాలనిహతిన్ వధియించితి వీర మారుతీ! 72

ఉ. జంభవిరోధికిన్ హృదయశల్యము రావణుపీటి
కిన్ జయ, స్తంభము దైత్యవాహిని కుదంచితదు
ర్గము సంగరక్రియా, రంభమునన్ మృగేంద్ర
మన రాజిలుచున్న నరాంతకున్ సమి, త్కుంభినిఁ
గూలఁజేసితివి ఘోరపదాహతి నోర! మారుతీ!

చ. అశనిసమానసాయకు దవానిలసన్నిభసైన్యసం
యుతున్, బ్రశమితదేవతాస్త్రయుఁ బ్రభంజనవే

గు నృసింహవిక్రముఁ, దశముఖనందనుఁ
విపులధైర్యవినిర్జితమందరాచలుఁ, ద్రిశిరుని
నొంటి గ్రుద్దున వధించితి వౌర!మహాత్మ మారుతీ!

ఉ. రావణు నెమ్మనంబునఁ దిరంబుగ నున్న జయాశ
బ్రుంగ సు, గ్రీవనలాంగదద్వివిదకేసరిముఖ్యకపు
ల్పెలంగ దే, వావళు లెల్లఁ బొంగ దివిజారిబ
లంబు కలంగ సొంపఱ, యావని నయ్యకంపనుఁ
బదాహతిఁ గూల్చితి వౌర! మారుతీ! 75

శా. శంభుఁ జంభరింపుఁ జయించి శమనుఁ శా
సించి యక్షేశు సం, రంభం బూడ్చి జలేశపావక
మరుత్క్రవ్యాదచంద్రార్కులఁ, శుంభద్వృత్తి
జయించి మించినదశాస్యుఁ ఘోరయుద్ధక్రి
యా, రంభం బందుఁ గఠోరముష్టిహతి మూర్ఛం
బుచ్చితౌ మారుతీ! 76

శా. క్షోణీనాథుల గెల్చి యక్షతతులం జూర్ణంబు గా
వించి గీ, ర్వాణవ్రాతము నొంచి కింపురుషులఁ
వారించి విద్యాధర, శ్రేణిం బాఱఁగఁ దోలి భో
గివరులఁ శిక్షించి దైత్యాళికిఁ, బ్రాణం బైనని
కుంభునిఁ రణములో వ్రచ్చించితౌ మారుతీ!

మ. జలధుల్ రొంపి యొనర్ప శీతకరభాస్వద్బింబ
ముల్ మ్రింగ భూ, తల మాకాశముఁ గేలఁ బట్టి

కడిమిన్ దాళంబు వాయింపఁ గొం, డలు
పాదంబుల గుండ సేయఁ గను నుద్యత్తేజు ధూ
మ్రాక్షునిన్, గలనన్ ద్రుంచిననీకు మ్రొక్కితి
ననున్ గావన్ వలెన్ మారుతీ! 78

మ. మయునిన్ శంబరు నింద్రజిత్తునముచిన్ మారీచు
వైరోచనున్, రయమొప్పన్ గెలుచుంగఁజాలు
మహానారాశిన్ మహామాసివే, పయుతున్ ధీరు
ని గాలనేమిఁ గని వజ్రక్రూరవాలాహతిన్,లయ
మున్ జేసిననీకు మ్రొక్కెద ననున్ రక్షింపుమీ
మారుతీ! 79

మ. అనలాధానము సోమమున్ జయన బార్హస్పత్య
ముల్ వైశ్రవం, బను సౌత్రామణి రాజసూయ
సవనంబున్ బౌండరీకంబు నా, గనివాసంబుఁ దు
రంగమేధము మొదల్గాఁ గల్గుయజ్ఞంబు లె, ల్ల
ను నీసేవకు సాటిగా వని బుధుల్ వాక్రుత్తు రో
మారుతీ! 80

శా. గంగన్ గౌతమి నర్మదన్ జలనిధిన్ గావేరిఁ జర్మ
ణ్వతిన్, దుంగన్ భద్రను గండకిన్ సరయువున్
దోషాపహన్ శోణభ,ద్రం గాళిందిని గృష్ణవేత్ర
వతి శిప్రన్ ముస్గుకంటన్ భవ, న్మాంగళ్యాన్విత
పాదసేవ బుధసంభావ్యం బగున్ మారుతీ! 81

మ. సుమదానంబు సువర్ణదానమును వాసోదాన
మున్ రౌప్యదా, నము గోదానము గేహదాన
మును గన్యాదానమున్ ధాన్యదా, నము భూ
దానము రత్నదాన మవిదానం బాదిగాఁగల్గుదా,
నములన్ జేరుఫలంబు నిన్ గొలిచినంతన్ వచ్చు
నో మారుతీ! 82

మ పటువేగంబును వజ్రసారనఖముల్ భర్మప్రభా
దేహ ము,ద్భటశౌర్యంబు ‡ముకుందపాదయుగ
సేవాభారమున్ జాలఁ గ,ల్గుటకున్ నీసరి గాన
భక్తులకు మేల్గూర్పంగఁ బక్షీంద్రుఁ డౌ,నట
నిన్ బోలఁ డటంచుఁ జూచెదను మద్భావంబునన్
మారుతీ! 83

మ. ప్రణవోపేతనమఃపదంబు మొదల న్పైపైచతు
ర్థ్యంతప, ద్గుణవన్నామకవాయునందను లోగిన్
గూర్పన్ ద్రివేదర్తుసం,గణనన్ వర్ణము లొప్పు
మంత్రమగుచున్ గన్పట్టు దానిన్ విచ, క్షణు
లెల్లన్ జపియించి కోరెదరు నీకారుణ్య మో
మారుతీ! 84

మ. ఘనసేనాచరణోత్థితోరురజ మాకాశంబునన్ నిం
డఁ దూ,ర్యనినాదంబుల దిక్తటంబు లదరన్ రాజ

‡ ముకుందుజాటనుటవియస్సంభారమున్.

ద్రథారూఢుఁ డై, ధనురాద్యాయుధపాణి యై
సమరగోత్రం జేరుతజ్జంబు మా,లిని లీలన్ వధి
యించు నిన్నుఁ బొగడన్ లే రెవ్వరున్ మారుతీ!

మ. కరిసింహాదులు నీరుఁ ద్రావుటకునై కాసారమున్
జేరుచో, గరిమం బట్టి వధింపుచుండెడిమహా
గ్రగ్రాహిణిన్ వజ్రబం,ధురదృష్ట్యన్న ఖకోటి చేతమ
దశార్ధూలంబు లేడిం బలెన్,స్థిరశక్తిన్ విదళించి
మించు నిను నర్థిం గొల్చెదన్ మారుతీ! 86

మ. మురజిద్బ్రహ్మముఁ దాఁకి సంగరములో ము
క్కాఁకలం దీఱి ని,ర్జరసేనం బలుమాఱులాలమ
లఁబాఱందోలి శార్దూలదు,ర్ధరతేజుం డగుమాల్య
వంతు ననిలో లాంగూలవిక్షేపవి,స్ఫురణన్ వారి
ధివైచి నాగభవనంబున్ జేర్చితౌ మారుతీ! 87

శా. ఖర్వాఖర్వచమూసమేతు లయి వేగన్ జిత్రసే
నాదిగం,ధర్వుల్దోర్గిణవగంబుసన్నిధినినున్ దాఁకం
గ వారందఱిన్,గర్వం బొప్పఁగ వాలతాడనము
లన్ బాహాప్రహారంబులన్,బర్వంజేసి జయంబుఁ
గొన్ననిను సంభావించెదన్ మారుతీ! 88

చ. సమరములో నిశాచరుఁడు జంపుతఱిన్ లయరు
ద్రుపోలికన్,గ్రమమున వేదము ల్చదువుకాలము
నన్ బరమేష్ఠికైవడిన్,శమయుతు లైనభక్తులకు

సంపద లిచ్చెడివేళ జానకీ,రమణునివై ఖరిఁ జగతి
రాజిలునిన్ను భజింతు మారుతీ! 89

ఉ. ధైర్యముచేత మేరుగిరి దానముచేత ఘనాఘనం
బు గాం,భీర్యముచేత వారినిధి భీషణతేజము
చేత సూర్యుఁడుఁ, స్థైర్యముచేత భూమిసతి ధ
ర్మముచేత జముండు నుజ్జ్వల, చౌర్యముచేత
సింహమును సామ్యమువత్తురు నీకు మారుతీ!90

ఉ. వాలము గల్గుమేరుగిరి వాక్కులఁ బల్కెడిమత్త
దంతి యా,భీలము దాల్చు సింహము విచిత్ర
గతిఁ రణమాచరించుశా,ర్దూలము క్రోఁతిరూపు
గొనురుద్రుఁ డితండని వేల్పు లెన్నఁగా,వాలము
లో వెలింగి దనుజావళిఁ ద్రుంచితి వీవు మారుతీ!

శా. నీకుఁ మామకమంత్ర మిచ్చెదను దీనిఁ నిత్య
ముఁ బల్కుచోఁ, గాకుత్థ్సాన్వయమంత్రరా
జముగతిఁ గళ్యాణసంధాత వై, శోకంబు ల్దొ
లఁగించు స్వర్గ మిడునంచుం జెప్పి స్వప్నంబులో,
నా కామంత్ర మొసంగునిన్ను మదిలోనం గొ
ల్చెదఁ మారుతీ! 92

మ. కదళీభూరుహషండమండితవనిం గళ్యాణగేహం
బులోఁ,ద్రిదశాధీశ్వరరత్నసంఘటితవేదిఁ నిల్చి
సీతాధిపుఁ, హృదయాబ్జంబున నుంచి సంయ

మిచయం బెన్నంగఁ బూజించి తత్పదభక్తిఁ
దగునీకు మ్రొక్కెద నను బాలింపుమీ మా
రుతీ! 93

శా. లీలానిర్జితమన్మథుండ వగువర్ణిశ్రేష్ఠు విన్నెన్నుబో
కాలుంబిడ్డలు గేహముం గలిగి హేమాశ్
సమస్తావనీపాలవ్రాతము నాశ్రయించుజనులన్
బల్కింప నేమంచు నే, నాలోచించి వచించినాఁ
డ నిది నీ వాలింపుమీ మారుతీ! 94

మ. మును దాక్షాయణి కైకొనెన్ బిదప జీమూతా
త్మజన్ బెండ్లియాడెను గంగాసతి దారతిం గల
సెఁగంతే కాలుఁ డవ్వేల్పు కాముని నిర్జించుటదె
ట్టిదో తెలియ దామూఢాంగజున్ బ్రహ్మచర్యని
రూఢిం దగునీవు గెల్చుట యథార్థంబౌఁ జుమీ
మారుతీ! 95

ఉ. కావు నపుంసకుండవును గావు జడుండవు వృద్ధ
దేహివిం గావు గదార్త లెవ్వియును గల్గవు భామ
లలోన నుండిసర్వావసరంబులుం గనుచు నస్ఖలితం
బగు బ్రహ్మచర్యసంసేవన మెట్లుసల్పితి విచిత్రము
నీచరితంబు మారుతీ! 96

చ. పలుక వసత్యవాక్యములు పావనమూర్తివి బ్రహ్మ
చర్యనిర్దళితమనోభవుండవు నితాంతదయామతి

వాశ్రితావనో,జ్జ్వలఘనశక్తిశాలివి ప్రసన్నము
ఖాంబురుహుండ వైనని౯,దలఁచినుతించినాఁడఁ
బ్రమదంబునఁ గావుము నన్ను మారుతీ! 97

ఉ. దండము చండముష్టిహతిఖండితదానవచక్రవర్తి
కి౯, దండము వేదచోదితవిధానసమర్చితరామ
మూర్తికి౯,దండము భానుసూనుసముదంచితసై
న్యచయాగ్రవర్తికి౯,దండము భర్జితాశ్రితజనప్ర
కరార్తికి నీకు మారుతీ! 98

చ. అరినివహంబుచేతను గదార్తులచేతను లేమిచేతఁ
దస్కరతతిచేతఁ బన్నగపిశాచగణంబులచేతదుర్జ
నో,త్కరములచేతనేఁటియధికారులచేతను గల్గు
బాధల౯, గురుతుగఁ బాపి బ్రోవు మిదె కోరి
భజించితి నిన్ను మారుతీ! 99

చ. జయజయ హేమకూటనిభసన్నిభదేహ నిశాట
వాహినీ,చయఘనగంధవాహ జవసత్వజితాంబుజ
బంధువాహ దు,ర్ణయయుతరావణాసురపురస్థగి
తోజ్జ్వలహవ్యవాహ ని,ర్భయభరితోహ రామ
పదభక్తిసమంచితగేహ మారుతీ! 100

శా. సీతాభర్తకు మన్మనీషితములన్ జిత్తంబులో
జాలి సం,జాతం బయ్యెడురీతిఁ దెల్పుచుఁ దదా
జ్ఞ౯ ముందుగాఁ బొంది కం,జాతస్ఫీతతదీయపా

దయఁగలీసద్భక్తియుఁ ముక్తియుఁ, బ్రీతిఁ
గూర్పఁగదయ్య నీశరణ మర్థిఁ బొందితిఁ
మారుతీ! 101

మ. హరిపాదాంబుజభక్తిసంయుతుఁడ దీప్యజ్జ్యోతి
షామ్నాయ్యవి,ద్గురుఁడఁ గొట్కలపూఁడివంశభ
వుఁడఁ గోదండరామాఖ్యుఁడఁ,విరతిజ్ఞానయు
తుండ నన్నుఁ గరుణఁ వీక్షించి తాపత్రయ,స్ఫు
రణంబుల్ తొలఁగించి బ్రోవు మరుణాంభోజ
ద్యుతీ మారుతీ! 102

మారుతీశతకము సంపూర్ణము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1926

702

# ఆంధ్ర గ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అచ్చతెనుఁగురామాయణము, శుద్ధప్రతి ... | 1 | 4 |
| ఆధ్యాత్మరామాయణము, క్రొత్తకూర్పు ... | 1 | 8 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము ... | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తిఅబ్బయామాత్యప్రణీతము | 0 | 8 |
| అప్పకవీయము, శ్రీగిడుగురామమూర్తి పంతులుగారి విమర్శతో నున్నది ... | 2 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతము) | 0 | 4 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాకితములమీఁద చక్కఁగ మరల ముద్రించియున్నారము. | 3 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము ... | 0 | 2 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగ నున్నది ... | 6 | 0 |
| శ్రీమదాంధ్రభారతము-పద్యకావ్యము:— | | |
| 7 సంపుటముల ప్రతి ... | 15 | 12 |
| 3 సంపుటములప్రతి ... | 15 | 0 |
| ఆది, సభాపర్వములుగల సంపుటము ... | 2 | 4 |
| ఆరణ్యపర్వము ,, ... | 2 | 4 |
| విరాటోద్యోగపర్వములుం ,, ... | 2 | 4 |
| భీష్మద్రోణపర్వములుగల సంపుటము ... | 2 | 4 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు,, ... | 2 | 4 |
| శాంతిపర్వము ,, ... | 2 | 4 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుగలసంపుటము | 2 | 4 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము ... | 6 | 8 |
| యుద్ధపంచకము ,, ... | 4 | 4 |
| శాంతిసప్తకము ,, ... | 4 | 4 |
| ఆదిపర్వము, మాత్రము పెద్దచ్చు, చిన్నసైజు | 1 | 8 |
| ఆనందరంగరాట్ఛందము, కాలికోబైండు ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము, అట్టబైండు ... | 0 | 12 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము | 0 | 12 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక ... | 0 | 8 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము చక్కనికూర్పు ... | 2 | 0 |
| కవికర్ణరసాయనము, (మాంధాతచరిత్ర) ... | 1 | 8 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితములు ... | 2 | 4 |
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు ... | 1 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | 0 | 4 |
| కృష్ణరాయవిజయము, కుమారధూర్జటికృతము | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు | | |
| గణికాగుణప్రవర్తనతారావళి ... | 0 | 2 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యము, కవనముమిక్కిలి సొంపు; పీఠిక అతివిపులము ... | 7 | 8 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు, ప్రథమభాగము | 1 | 4 |
| డిటో రెండవభాగము, సాధారణప్రతి | 1 | 6 |

704

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| గరుడాచలము, యక్షగానము, పెద్దచ్చు ... | 0 | 2 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము ... | 1 | 2 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు | 1 | 0 |
| తారాశశాంకవిజయము, చక్కనికూర్పు ... | 0 | 12 |
| తెనుఁగుసమస్యలు ... | 0 | 2 |
| దశకుమారచరిత్రము, పద్యకావ్యము, కేతనకవికృతము | 1 | 8 |
| దశావతారచరిత్ర, నూతనముద్రితము ... | 2 | 0 |
| దసరాపద్యములు ... | 0 | 2 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 0 | 10 |
| *నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు ... | 0 | 6 |
| నలచరిత్ర, ద్విపద ... | 0 | 14 |
| నిర్వచనోత్తరరామాయణము, సాధారణప్రతి | 0 | 12 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము | 0 | 4 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగడ, క్రొత్తకూర్పు | 1 | 0 |
| పంచతంత్రము, నారాయణకవికృతము ... | 0 | 12 |
| డిటో వేంకటనాథరాజకవికృతము | 1 | 4 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు ... | 0 | 10 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు క్రొత్తకూర్పు | 0 | 8 |
| బసవపురాణము, పిడుపర్తిసోమనాథప్రణీతము | 2 | 4 |
| బిల్హణీయము, చక్కనికూర్పు ... | 0 | 8 |
| భాస్కరరామాయణము, చక్కని క్రొత్తకూర్పు | 4 | 0 |
| భోజరాజీయము, అనంతామాత్యకృతము ... | 1 | 4 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA125B113 |
| పుస్తకం పేరు | శతకసంపుటము |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 713 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | vi, viii, 52, 56 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Vedavath |
| పేజీలు విడదీసినది | Vedavath |
| స్కాన్ చేసినది | Pratyusha |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |

BLANKS; 98, 126, 130, 156, 182, 214, 268, 288, 428, 432, 588